# శ్రీ వాసుదేవ కథాసుధ

మూడవ భాగము

ఉద్యోగ కాండము, శ్రీ భగవద్గీతా కాండము



రచయిత : బ్రహ్మవిద్యాచార్య పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

# శ్రీ వాసుదేవ కథాసుధ

## మూడవ భాగము

## ఉద్యోగ కాండము, శ్రీ భగవద్గీతా కాండము



"ఇతడు నిందితమైన కర్మను పాపమును ఎప్పుడును చేయడు.
పురుషోత్తముడైన యచ్యుతుడు ధర్మము నుండి తొలగడు."

శ్లో || న త్వయం నిందితం కర్మ కుర్యాత్ పాపం కథంచన || 22

శ్లో || న చ ధర్మా దపక్రమేత్ అచ్యుతః పురుషోత్తమః || 23

ఉద్యోగపర్వణి - అధ్యాయః - 130


రచయిత :

బ్రహ్మవిద్యాచార్య పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

నెల్లూరు.



బహుధాన్య, ఆశ్వయుజ తృతీయ
23-09-98

మూల్యము
రూ.75/-లు

ప్రథమ ప్రకాశనము - బహుధాన్య, ఆశ్వయుజ శుద్ధ తృతీయ 23-09-1998

ప్రతులు : 750

## ప్రకాశకుడు

**పోలూరి హనుమజ్జానకీరామ శర్మ,** B A , (Hons )

16/1216, పొగతోట, నెల్లూరు - 524 001.

## ప్రతులు దొరుకుచోట్లు

1 శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామి వారు
శ్రీ సత్యానందాశ్రమము
ఇనమడుగు, నెల్లూరు జిల్లా - 524 137




2. శ్రీ బొమ్మిశెట్టి ఎల్లమందయ్య, B A ,
ఎల్లమందయ్య హాస్టల్, ఏ సి నగరు,
నెల్లూరు - 524 002

3 శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్స్
ప్లాట్ నెం. 97 & 98 C,
Western Hills, Opp KPHB, Kukatpalli (P O )
HYDERABAD - 500 072

4. నవోదయ బుక్ హౌస్
ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా, కాచీగూడ,
హైదరాబాదు - 500 027.
ఫోన్ : 4652387.

ముద్రణము

**శ్రీవెన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

16/1064, పొగతోట, నెల్లూరు - 524 001 ఫోన్ 336709



# శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి

దత్తపీఠాధీశ్వరులు

శ్రీ సత్యానందాశ్రమము

ఇనమడుగు, నెల్లూరు జిల్లా - 524 137.

## అమోఘాశీః పరంపర

ఓం నమో భగవతే శ్రీ సత్యానందాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

బ్రహ్మ విద్యా సంప్రదాయ ప్రవర్తకులు బ్రహ్మశ్రీ పోలూరి హనుమజ్జానకీరామ శర్మ గారు కృష్ణో విగ్రహవాన్ ధర్మః అని అఖండ ప్రజానీకమునకు భేరీ మ్రోయించుటకే శ్రీమన్మహాభారత, శ్రీమద్భాగవత, హరివంశ, విష్ణుపురాణములలోని విషయములను క్షుణ్ణముగా పరిశీలించి శ్రీ వాసుదేవ కథాసుధ యనుపేర బృహత్ రచన చేసియున్నారు అందు వ్యాసకాండము, హాస్తినకాండము, అనుగ్రహకాండము, మహాకావ్యకాండములతో గూడిన ప్రథమ భాగము, మధుర ద్వారకా కాండములతో ద్వితీయ భాగమును ముద్రింపబడి పాఠకలోకమునకు అందింపబడినవి. ఇప్పుడు ఉద్యోగ, భగవద్గీతా కాండములతో యీ తృతీయ భాగము శ్రీ వేదవ్యాస భగవానుని పరిపూర్ణ కరుణాకటాక్షముచే, సద్గురు భగవాన్ శ్రీ సత్యానంద మహర్షులవారి అనంతశీః ప్రభావమున వెల్వెడుచున్నదని తెలుసుకొని ఉబ్బిగంతులు వైచుచున్నాను. శ్రీ శర్మ గారీ గ్రంథమూలమున యావదాంధ్రలోకమునకు ఎన్నియో నిగూఢములైన విషయములను అందించుచున్నారు పాఠక మహాశయులు దీనిని పఠించి, గ్రహించి సందేహములను నివృత్తి చేసికొని ధర్మములను అనుష్ఠించి వేదమాత అనుగ్రహమునకు పాత్రులగుదురు గాక !

మిగిలిన చతుర్థ భాగము కూడా త్వరలో ప్రచురితమగునట్లు అనుగ్రహింప శ్రీవాసుదేవ పరబ్రహ్మమును భక్తితో ప్రార్థించుచున్నాను. ఈ బృహత్ గ్రంథ రచయిత యగు శ్రీ పోలూరి హనుమజ్జానకీరామ శర్మ దంపతులకు మా అనంత ఆశీస్సులు సదా శ్రీరామ రక్షయై యుండును గాక !

శ్రీ బ్రహ్మానందతీర్థ స్వామి

# కృతజ్ఞత



ఈ గ్రంథము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు
ఆర్షధర్మ తత్త్వ గ్రంథముల ప్రచురణము కొఱకు ఇచ్చు
ఆర్థిక సాహాయ్యపథకము క్రింద చేసిన
ఆర్థిక సాహాయ్యముతో ప్రకటింపబడినది.

# తొలిపలుకులు

1 20-1-1958 నుండి 6-2-1958 వఱకు నెల్లూరు వర్ధమాన సమాజము వారి యాజమాన్యమున బ్రహ్మశ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తి గారు B.A , B.L , నెల్లూరులో మహాభారతోపన్యాసములను పదునెనిమిది మంది వక్తల చేత చెప్పించి నిర్వహించినారు తుది దినమున నేను శ్రీకృష్ణునిపై ఉపన్యసించితిని అది ఉపన్యాసకుల నందఱను సమ్మానించు సభ కూడ అయినది అందువలన శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి గారి యధ్యక్షతయందు ఆ మహాసభ పురమందిరమున మహోత్సవముగా జరిగినది సమ్మాన కార్యక్రమమునకు ముందు నేను శ్రీకృష్ణునిగూర్చి గంటకు పైగా ప్రసంగించితిని. వేదికపై నున్న యితర పాత్రల యుపన్యాసకులు కాక, సామాజికులలో పండితులు కవులు అనేకులు ఆ యుపన్యాసమును అభినందించిరి శ్రీరామచంద్రారెడ్డి గారు మాత్రము నన్ను అభినందించుచు, "దుర్యోధనాదులతో యుద్ధప్రసక్తి లేదు , నిండు సభలో ఇంటికోడలైన ద్రౌపదిని పరిభవించినవారు ఎవరికైనను ఏ విధముగా నైనను వధ్యులే" అని శ్రీకృష్ణుని యభిప్రాయముగా ఉద్ఘాటించుట తగునా అని సందేహించిరి. అప్పుడు వారికి సమాధానము చెప్పుటకు నాకు అవకాశము కలుగ లేదు సభ ముగియుచుండగనే వారు వెడలిపోయిరి అప్పటినుండి శ్రీకృష్ణుని ప్రసంగములు ప్రవర్తన విశేషములు అన్నియు సర్వధా ధర్మబద్ధములే అని, భగవంతునకు తప్పులు చేయవలసిన యావశ్యకత లేదని నిరూపింపవలయు నను పట్టుదల నాలో అధిక మయ్యెను

2. విదురుడు కాని భీష్ముడు కాని శ్రీకృష్ణుని వలన ఎప్పుడును ఏ ఉపకారమును పొంద లేదు. వారు ఆయనకు మిత్రులుగా మధురలో గాని ద్వారకలో గాని ఎప్పుడు ఉండలేదు వారు హస్తినాపురమునందే యుండి బాల్యమునుండి శ్రీకృష్ణుని చర్యలను వర్తనవిధానములను పర్యాటకులైన జనులవలన వినుచు తటస్థులుగా ఆయన వృత్తాంతములను విమర్శించుచు గ్రహించుచున్నవారు కావున వీరియభిప్రాయములను మనము ప్రమాణముగా గ్రహింపవచ్చును.

విదురుడు ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పినాడు. "ఇతడు నిందితమైన కర్మను, పాపమును, ఎప్పుడును చేయడు పురుషోత్తముడైన యచ్యుతుడు ధర్మమునుండి తొలగడు

శ్లో|| న త్వయం నిందితం కర్మ కుర్యాత్ పాపం కథంచన || 22

శ్లో|| న చ ధర్మా దపక్రమే దచ్యుతః పురుషోత్తమః || 23

ఉద్యోగపర్వణి - అధ్యాయః - 130

శ్రీకృష్ణునియొక్క పరమధార్మికత్వమును దృఢముగా నమ్మియుండుట చేతనే భీష్ముడు రాజసూయసభలో, వ్యాసభగవానుని కూడ గణింపక, సభయందు అగ్రపూజను శ్రీకృష్ణునకే ఇమ్మని ధర్మరాజునకు దృఢముగ బోధించెను అజన్మ బ్రహ్మచారి, పరమనైష్ఠికుడును అయిన ఆయన, ధర్మరాజుకంటె చిన్నవాడైన శ్రీకృష్ణునకు భక్తితో నమస్కరించుట గమనింప దగియున్నది శ్రీకృష్ణునియందు కొంచె మైనను అధర్మ మున్నచో పరమ పౌరుషశాలియైన భీష్ముడు ఆయనకు తలవంచునా ? కావున శ్రీకృష్ణునియందు దోష మున్నదని యనుకొనుట మనకు దోషమును కలిగించును ఆయన ధర్మమూర్తి. ఆ విషయమును నిరూపించుటకే ఈ గ్రంథము ఉద్దేశింపబడినది

4. తరువాత అప్పటి యుపన్యాసకులు అనేకులు తమ యుపన్యాస విషయములను పెంపొందించి, ద్రోణుడు, కర్ణుడు, విజయుడు మొదలుగా గ్రంథములను ప్రకటించిరి నేను శ్రీకృష్ణుని చరిత్రమును భాగవత హరివంశ విష్ణు పురాణ ములందు కూడ పరిశీలించి సమగ్రమైన గ్రంథమునుగా రూపొందింపవలయు నని ఆలోచించుచు కాలక్షేపము చేయుచుంటిని

5 లేగుంటపాడులో అఖండానందాశ్రమమున (ప్రస్తుతము శ్రీ రమణాశ్రమము) శ్రీ శివకామేశ్వరీ మహాయజ్ఞము జరిగినప్పుడు నా శిష్యుడు చి|| విరజానందస్వామి అభ్యర్థింపగా 7-4-1986 నుండి 14-4-1986 వఱకు శ్రీకృష్ణుని చరిత్రసుధను భాగవతము ననుసరించి ఎనిమిది కలశములుగా ఉపన్యసించితిని. తుది దినమున సత్కారసందర్భమున శ్రీ విద్యాపీఠాధిపతి (హైదరాబాదు) శ్రీ విద్యానందస్వామివారు ఆ ఉపన్యాసములను గ్రంథముగా ప్రకటింపవలయు నని రూ.101/-లు, అధ్యక్షులైన ఓగేటి అచ్యుతరామశాస్త్రి గారి చేత నాకు అందించి విరాళములకు శ్రీకారము చుట్టిరి.

6. ఇనమడుగులోని శ్రీ సత్యానందాశ్రమమునకు అప్పుడు ఉపాధ్యక్షులుగా నుండిన (ఇప్పుడు అధ్యక్షులు) శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద తీర్థస్వామి వారు ప్రతిదినము వచ్చి ఉపన్యాసములను వినుచు, కాసెట్టును (Cassette) కూడ తయారు చేయించి అప్పుడప్పుడు వినుచు ఎంతో సంతోషించుచుండిరి. శ్రీస్వామివారు చిరకాలముగా నా కృషిని అభినందించుచు ప్రోత్సహించుచు నుండిరి.

7. తరువాత గ్రంధరచనమును ఆరంభించితిని అప్పుడు అనుకొనకుండ 1-3-1989 తేది చి॥ A. శ్రీనివాసులు (శ్రీరామచంద్ర బుక్ డిపో, కర్నూలు) వచ్చి కాగితముల ఖర్చు కొఱకు ఉంచు డను రూ 1,000/-లు ఇచ్చెను అది భగవత్ప్రేరణకు నిదర్శనముగా తోచెను

8. ఈ గ్రంథమును పండ్రెండు కాండములుగా విభజించితిని వ్యాస, హాస్తిన, అనుగ్రహ, మహాకావ్యము లను నాలుగు కాండములు మొదటిభాగముగా, మథురా ద్వారకా కాండములు రెండవదిగా, ఉద్యోగ విజయ కాండములు మూడవదిగా, ధర్మ తత్త్వ అశ్వమేధ సాత్త్వత కాండములు నాల్గవదిగా ఏర్పఱచితిని మహాభారతాదులయందు శ్రీకృష్ణచరిత్రమును మన కందించినవాడు వ్యాసభగవానుడు. ఆయన చెప్పకున్నచో మనకు శ్రీకృష్ణుని చరిత్రము ఇంత విపులముగా తెలియుటకు అవకాశము లేదు. కావున ఆ మహర్షి ఋణమును తీర్చుకొనుటకై ఆయన చరిత్రమునే మొదటి కాండమునుగా రచించితిని కారణాంతరములచే మొదటి భాగమునకు ముందుగా రెండవ భాగమును 9-9-1996 తేది సుగృహీతనామధేయులు వేదమూర్తులు నైన బ్రహ్మశ్రీ A S విశ్వనాధశ్రౌతి మహోదయుల యధ్యక్షతయందు శ్రీ బ్రహ్మానంద తీర్థస్వామివారు శ్రీ గీతా మందిరమున ఆవిష్కరించిరి. శ్రీ K S. రామానుజాచార్యుల వారు ఉపన్యసించిరి

9 22-5-1997 తేది ఆంధ్రసభలోని శ్రీ దుగ్గిశెట్టి సుబ్రహ్మణ్యముగారి కళ్యాణ మండపమున నేను రచించియుండిన శ్రీ నలచరిత్ర, శ్రీ రామాయణ చంపూ కావ్యములకు రచన సాఫల్యసిద్ధికొఱకు శ్రీ వేదపారాయణ శ్రీ రామాయణ పారాయణ పూర్వకముగ శ్రీ సీతారామ కళ్యాణ పట్టాభిషేక మహోత్సవములను జరిపితిమి అప్పుడు శ్రీ హనుమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నులతో పాటు శ్రీ నలచరిత్ర శ్రీరామాయణ చంపూకావ్య గ్రంథమును, శ్రీ వాసుదేవ కథాసుధ ముద్రిత ప్రతులను ఉంచి పూజించితిమి పిదప సాయంకాలమున ఆ కళ్యాణ మండపముననే జరిగిన సభయందు అధ్యక్షులుగా ఉన్న శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారే శ్రీ వాసుదేవ కథాసుధ మొదటి భాగమును ఆవిష్కరించిరి. ప్రియశిష్యుడు చి॥ రామచంద్ర ప్రసాదు ప్రసంగించెను.

10. ఈ గ్రంధ ప్రతులను పెక్కురకు అందజేయుచు అభిమానులు, మిత్రులు, శిష్యులు విరాళములను స్వయముగా ఇచ్చుచు, ఇతరులవలన సేకరించుచు ఈ గ్రంథ ప్రకాశనమునకు అనేక విధముల దోహద మొనర్చిరి శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద తీర్థస్వామివారి కృషి మిగుల శ్లాఘ్యమైనది చి॥ బొమ్మిశెట్టి ఎల్లమందయ్య,

ప్రియశిష్యుడు, చి|| రామచంద్రప్రసాదు, చి|| బొమ్మిశెట్టి రాఘవయ్య, ప్రియబాంధవులు, చి|| పెయ్యేటి చంద్రశేఖర శర్మ, చి|| కారుమంచి వాసుదేవశర్మ, చి|| పరబ్రహ్మశర్మ, చి|| చతుర్వేదుల వేంకటకృష్ణ నరసింహమూర్తి, చి|| తలగడదీవి ప్రభాకరరావు, చి|| రామరాజు చెన్నకేశవరావు, చి|| సౌ|| హనుమత్ ప్రసన్న, అంతేవాసులు చి|| కలవకాల సుబ్బరామయ్య గారు, చి||సౌ|| మన్నేపల్లి గిరిజ, చి|| వేదం రాధాకృష్ణమూర్తి, చి|| మల్లవరపు ప్రభాకరరావు, చి|| వావిళ్ళ సదారామమూర్తి, చి|| పణతుల ఆంజనేయులు, అభిమానులు, శ్రీ పెయ్యేటి సీతారామయ్యగారు, శ్రీ గొర్తి ప్రభాకర దీక్షితులు గారు, శ్రీ గోనుగుంట బ్రహ్మయాచార్యులు, చి|| తలుపూరు రామ రమేశకుమార శర్మ మొదలగువారు మిగుల ప్రశంసార్హులై శ్రీ వాసుదేవుని కృపకు పాత్రులగుచున్నారు

11 ఈ గ్రంథమున వర్ణధర్మములు సహేతుకములని నిరూపించుటకు కొన్ని తావులలో ఆధునిక పరిణామ శాస్త్ర విషయములను (Evolution Theory) ప్రమాణములనుగా ఉదాహరించితిని. ఆ గ్రంథ భాగములను ప్రియశిష్యుడు చి|| సాంప్రతి నాగేంద్రనాథ దత్త మిగుల శ్రద్ధతో ప్రత్యేకముగా వ్రాసి యిచ్చినాడు ప్రియమిత్రుడు చి|| వేదం వేంకట రామన్, ప్రియశిష్యుడు చి|| మల్లవరపు సత్యనారాయణ మహాభారతాది సంస్కృత మూల గ్రంథములను ఇచ్చుచు సాయము చేసినారు

12 గ్రంథరచనము నెల్లూరులో సుఖముగా జరుగుటకు చి|| మల్లవరకు ప్రభాకరరావు, హరగోపాల్ నామమాత్రమైన యద్దెతో నాకు కలిగించిన గృహసౌకర్యము చాల దోహదమొనర్చినది.

13. భగవంతుడు చెప్పుట యను విషయము గీతలకన్నింటికిని సామాన్య విషయము. ఉద్ధవునకు భగవంతుడు చెప్పినది యుద్ధవగీత యైనట్లు, విజయునకు చెప్పిన గీత విజయగీత అనుట సార్థకమని తలంచుచున్నాను. శ్రీ శంకరాచార్యులవారికి పూర్వమే ఈ గీత నేకులచే బహువిధములుగా వ్యాఖ్యానింపబడియున్నది. అయినను ఇది పూర్వాపర విరోధములతో పరస్పర భేదములతో సామాన్యులచే గ్రహింపబడుచుండుటను చూచి శ్రీ శంకరాచార్యులవారు అర్థనిర్ధారణము కొఱకు దీనికి సంగ్రహముగా భాష్యమును రచించినారు. అందువలన ఇందలి విషయములను అనేక పర్యాయములు చదువుచు మననము చేయుచు గ్రహింపవలయు నని కోరుచున్నాను.

14. గ్రంధమున విభాగముల విషయమున విశేషవిషయములను గమనింపగోరుచున్నాను. సుధ అనగా అమృతము దానిని సేవించుటకు కొన్ని కలశములలో నింపవలె. కొన్ని కలశముల సముదాయము ఒక కాండము. కలశమునుండి సుధను కమండలువులోనికి వంచుకొనవలెను దానినుండి అంతకంటె చిన్నవియైన గ్లాసులవంటి చమసములలో ఆ సుధను పోసికొని కొంచెము కొంచెముగా స్వీకరించవలె. యజ్ఞమునందు సోమభక్షణమునకు ఉపయోగించు చిన్న దారు పాత్రను చమస మందురు ఇట్టి వైదిక విషయములను వివరించుచుండిన పూజ్యులు, కీర్తిశేషులు బ్రహ్మశ్రీ A S విశ్వనాధ శ్రౌతుల వారికి ప్రణామముల నర్పించుచున్నాను.

15. అమోఘాశీస్సులను అనుగ్రహించిన శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద తీర్థస్వామివారికి అనేక ప్రణాముల గావించుచున్నాను

16 ప్రూఫులను శ్రద్ధతో చూచిన చి॥ మాచవోలు శివరామప్రసాదునకు, శ్రీ సురభి నరసింహాముగారికి, మొదటి భాగమునందు ద్వితీయ భాగమున కూడ ముఖ చిత్రములను అందముగా రచించిన చి॥ చిట్టా వెంకటేశ్వరరావునకు, గ్రంధములను భక్తిశ్రద్ధలతో ముద్రించిన శ్రీవెన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ యజమానులకు, వారి సిబ్బందికి శ్రీ వాసుదేవుడు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక!

నెల్లూరు — బుధవిధేయుడు

23-09-1998 — **పోలూరి హనుమజ్జానకీరామ శర్మ**

నెల్లూరు వర్ధమాన సమాజమువారు 20-1-1958 నుండి 6-2-1958 వఱకు
పదునెనిమిది దినములు శ్రీ మహాభారతము పై నుపన్యాసముల
కార్యక్రమములు నిర్వహించిరి

## సభాప్రారంభకులు : శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి గారు

| తేది | ఉపన్యాస విషయము | ఉపన్యాసకులు |
|---|---|---|
| 20-1-58 | కృష్ణద్వైపాయనుడు | బ్రహ్మశ్రీ విశ్వనాధ శ్రౌతులుగారు |
| 21-1-58 | ధృతరాష్ట్రుడు | శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్యగారు |
| 22-1-58 | ద్రోణుడు | శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు |
| 23-1-58 | భీముడు | శ్రీ కె అనంతరామశాస్త్రిగారు |
| 24-1-58 | అశ్వత్థామ | శ్రీ సంగం జానకిరామయ్యగారు |
| 25-1-58 | భీష్ముడు | శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు |
| 26-1-58 | కర్ణుడు | శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి గారు |
| 27-1-58 | ద్రౌపది | శ్రీ జి సి.వి రమణరావు గారు |
| 28-1-58 | ధర్మరాజు | శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్యగారు |
| 29-1-58 | అర్జునుడు | శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు |
| 30-1-58 | సుయోధనుడు | శ్రీ పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రి గారు |
| 31-1-58 | శల్యుడు | శ్రీ అ అచ్చన్న శాస్త్రి గారు |
| 1-2-58 | అభిమన్యుడు | శ్రీ చదలవాడ జయరామశాస్త్రి గారు |
| 2-2-58 | విదురుడు | శ్రీ ఓరుగంటి వేంకట కృష్ణయ్యగారు |
| 3-2-58 | సంజయుడు | శ్రీ యం మల్లికార్జునముగారు |
| 4-2-58 | కుంతి, గాంధారి | శ్రీ ఏ. నాగభూషణరావు గారు |
| 5-2-58 | శకుని | శ్రీ బి. మృత్యుంజయముగారు |
| 6-2-58 | శ్రీకృష్ణుడు | ప్రో. హనుమజ్జానకీరామశర్మగారు |

గమనిక పై విషయము మా మిత్రులు బ్రహ్మశ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించి 1966 ఏప్రిల్ నెలలో ప్రకటించిన "విజయుడు" అను గ్రంధముయొక్క ఉపోద్ఘాతమునందు పొందుపఱచిన శ్రీ మహాభారతోపన్యాసముల కార్యక్రమముల నుండి గ్రహింపబడినది

# MAGNIFICIENCE OF MACLEANS CLUB

I am very much thankful to the Secretary, The Nellore Reading Room and Macleans Libary (Club) and also to the committee members for granting financial aid of Rs 5000/- to me for promoting the studies and Research work in our ancient history and classics

I invoke the blessings of Lord Sri Vasudeva on the following committee members

| | |
|---|---|
| Sri Konduru Dayakara Reddy | President |
| Sri Metta Chandrasekhara Reddy | Secretary |
| Sri Palagani Sudhakara Reddy | Treasurer |
| Sri C Sudheer Reddy | Executive Committee Member |
| Sri Menakuru Seetharami Reddy | " |
| Sri P Dinakara Reddy | " |
| Sri V Lakshmaiah | " |
| Sri M Kodanda Rami Reddy | " |
| Sri M V Krishnaiah | " |
| Sri M Ramachandra Prasad | " |
| Sri P V Raghava Reddy | " |

# THANKS TO SEVA SAMITHI

My thanks are due to my desciple and founder Secretary of Sri Ramakrishna Seva Samithi, Kasukhelavari Agraharam, Nellore Chi. S V. Narasimha Rao, and to the members of the Samithi for their dynamic help in bringing out the book "SRI VASUDEVA KATHA SUDHA - PART III"

I invoke the blessings of LORD SRI VASUDEVA on all of them.

*P.H. JANAKIRAMA SARMA*

2. This is to thank "THE NELLORE CLUB - NELLORE" for its magnanimousness in donating Rs 3,000/- for the publication of my book "Sri Vasudeva Katha Sudha - Part III and the President, Secretary and the Executive Members.

| | |
|---|---|
| Sri R. Narayana Reddy | President |
| Sri Ch Ramanaiah | Vice-President |
| Sri P Phani Prasanna Reddy | Hon. Secretary |
| Sri G. Ramesh Reddy | E.C. Member |
| Sri A. Mahesh Kumara Reddy | E.C. Member |
| Sri V. Pavana Kumar | E C. Member |
| Sri V. Nagendra | E.C Member |
| Sri Dr C R. Reddy | E C Member |
| Sri Dr G Sathyanath | E C. Member |
| Sri Sk. Mahaboob Basha | E C. Member |
| Sri P Jayarama Krishna | E C. Member |

This is to thank the below mentioned donors also

1. Sri Bandi Ramaswamy Reddy - Rs 1,000/-
   Nirmala Coffee Works, Trunk Road, Nellore.
2. Sri R. Sudhakara Reddy, Civil Contractor - Rs 1,000/-
   Nellore.

# శ్రీ వాసుదేవ కథాసుధ

## తృతీయ భాగము

# విషయసూచిక

# విజయకాండము

# భగవన్నుతి

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥

శ్లో॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః॥

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మో ద్విబాహు రపరో హరిః।
అఫాలలోచన శ్శంభు ర్భగవాన్ బాదరాయణః॥

శ్లో॥ కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్॥

శ్లో॥ వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్॥

శ్లో॥ అతసీపుష్పసంకాశం హారనూపుర శోభితమ్।
రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుమ్॥

శ్లో॥ మందారగంధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్।
బర్హిపింఛావచూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్॥

శ్లో॥ శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితమ్।
శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్॥

శ్లో॥ ఏకం శాస్త్రం దేవకీపుత్త్రగీత
మేకో దేవో దేవకీపుత్త్ర ఏవ।
ఏకో మంత్రో దేవకీపుత్త్రనామ
కర్మాప్యేకం దేవకీపుత్త్రసేవా॥

# శ్రీవాసుదేవ కథాసుధ

# ఉద్యోగ కాండము

## I. సంజయదౌత్య కలశము

## 1. సంజయొద్యోగ కమండలువు

### (1) సంజయ ప్రసంగ చమసము

ద్రుపదుని పురోహితుడు పాండవపక్షమున హస్తినాపురమునకు పోయి పాండవులకు దుర్యోధనాదులు గావించిన యపరాధముల నుగ్గడించి వారికి అర్ధరాజ్యమును ఈయవలయు నని యుద్ఘాటించెను. ఆరాయబారమునకు దుర్యోధనాదులు క్రుద్ధు లగుచుండగా భీష్ముడు ఆ రాయబారమునకు సమాధానమొసంగుటకు తాము రాయబారిని పంపుదు మని చెప్పి ఆ పురోహితుని ఉపప్లావ్యమునకు పంపించెను.

దృతరాష్ట్రుడు పాండవులకు రాజ్యభాగ మీయకుండ ధర్మజుడు శాంతించునట్లుగా వారికి నచ్చజెప్పు మని సంజయుని రాయబారినిగా ధర్మజుని యొద్దకు పంపెను

సంజయుడు ఉపప్లావ్యమునకు వచ్చి కుశల ప్రశ్నలైన తరువాత విరాట ద్రుపద కృష్ణాది పరివృతుడై పేరోలగమందున్న ధర్మరాజుతో ధృతరాష్ట్రుని యభిమతమును చెప్పి తనయభిప్రాయమును ఇట్లు వ్యక్తీకరించెను. "యుధిష్ఠిరా ! పాండవులు ధర్మనిత్యులను కీర్తి లోకమున ప్రసిద్ధమై యున్నది. మీ వర్తనము కూడ అట్లే కన్పించుచున్నది. జీవితము అనిత్యమని చూచుచున్న నీవు బంధు వినాశమునకు పాల్పడుట తగదు. దుర్యోధనాదులు దుష్టులై మీకు రాజ్యభాగము నీయకున్నచో ఆ పాపముచేత వారే నశింతురు కాని అజాతశత్రుడవైన నీవు యుద్ధము చేసి రక్తసిక్తమైన రాజ్యమును సంపాదించుకొనుటకంటె అంధక వృష్ణుల దేశమునందు భిక్షాన్నమును పొందుట యైనను మేలే. అల్పకాల భోగ్యమైన జీవితముకొఱకు పాపము నాచరింపకుము అది నీ యశస్సునకు తగదు. ధర్మహీనముగ ఈ భూమి నంతను సంపాదించుకొన్నను పాపబుద్ధి గలవాడు నశించును నీవు వేదముల నధ్యయన మొనర్చి బ్రహ్మచర్యము నవలంబించి యజ్ఞములు చేసి బ్రాహ్మణులకు దానములను గావించి ధర్మము కొఱకు పెక్కు సంవత్సరములు సుఖదూరుడవై వనములలో కష్టములను సహించి తుదకు ఇప్పుడు ద్వేషముతో బంధుజన వధమునకు పాల్పడకుము భీష్మద్రోణాది

సంహారపూర్వకమై పాపానుబంధమైన యుద్ధమును నీవంటివాడు ఎట్లు అభిలషించును? నాకు జూడ రాజ్యభోగములకంటె క్షమయే నీకు శ్రేయస్కరము. బంధువుల నందఱను చంపి సంపాదించుకొన్న రాజ్యమువలన నేమి సుఖము కలుగును? సాగరాంతమైన భూమిని సంపాదించుకొన్నను జరామృత్యువులను తప్పించుకొనగలవా ? ఇతరుల బుద్ధి ననుసరించి అయుక్తమును గావించి స్వర్గమార్గమునకు దూరుడవు కాకుము"

శ్లో|| న చే ద్భాగం కురవో ఽ న్యత్ర యుద్ధాత్
ప్రయచ్ఛేరన్ తుభ్య మజాతశత్రో |
భైక్షచర్యా మంధకవృష్ణిరాజ్యే
శ్రేయో మన్యే న తు యుద్ధేన రాజ్యమ్ || 2

శ్లో|| అల్పకాలం జీవితం య న్మనుష్యే
మహాస్రావం నిత్యదుఃఖం చలం చ
భూయశ్చ త ద్వయసో నానురూపం
తస్మాత్ పాపం పాండవ మా కృథా స్త్వమ్ || 3

శ్లో|| పాపానుబంధం కోను తం కామయేత
క్షమైవ తే జ్యాయసీ నోత భోగాః |
యత్ర భీష్మ శ్శాంతనవో హత స్స్యాత్
యత్ర ద్రోణ స్సహపుత్రో హత స్స్యాత్ || 24

శ్లో|| లబ్ధ్వాఽపీమాం పృథివీం సాగరాన్తాం
జరామృత్యూ నైవ హి త్వం ప్రజహ్యాః |
ప్రియాప్రియే సుఖదుఃఖే చ రాజన్
ఏవం విద్వాన్ నైవ యుద్ధం కురు త్వమ్ || 26

శ్రీ మహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 27

## (ii) యుధిష్ఠిరాభి భాషణ చమసము

యుధిష్ఠిరుడు ఇట్లనెను. "సంజయా ! నీవు చెప్పినది నిజమే. సందేహము లేదు కాని నేను చేయుచున్నది ధర్మమో అధర్మమో నిశ్చయించిన పిదప నాది యధర్మ మగునో నిందింపుము. జీవనము జరుగనప్పుడు సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మల యనుష్ఠాన నిర్వహణముకొఱకు ఆపదయందు అన్యధర్మమును అవలంబించుట శాస్త్రవిహితమై అవశ్యకమగును. కాని ఆపద గడచిన తరువాత మరల స్వధర్మమునే అవలంబింపవలె. ఆపద లేనప్పుడు కూడ అన్యధర్మమును అవలంబించువాడు, ఆపదయందు అట్లు

చేయక కర్మానుష్ఠానదూరు డగు వాడును నింద్యు డగును. మేము ఆపదయందు ఏకచక్రపురమున బ్రాహ్మణవృత్తియైన భిక్షాచర్యమును అవలంబించినను, ఆపదలేని యీ పరిస్థితి యందు క్షత్త్రియులమైన మాకు భిక్షాచర్యము యుక్తము కాదు ఒక్కొక్కప్పుడు ధర్మము అధర్మరూపముతో కన్పించుచుండును, అట్లే అధర్మము ధర్మరూపముతో భ్రమను కలిగించుచుండును. అట్టి యెడల విద్వాంసులు చక్కగా విచారించి ధర్మాధర్మములను శాస్త్రము ననుసరించి గ్రహించుచుందురు. మా పితరులు పితామహులు ఇంకను పూర్వులు యజ్ఞశీలురైనవారు ఏ మార్గము నవలంబించిరో ఆ మార్గమునే ఆస్తికుడునైన నేను కూడ అవలంబించుచున్నాను. ఈ భూమియొక్క ఐశ్వర్యమును గాని స్వర్గాధిపత్యమును గాని బ్రహ్మలోకమునైనను, సంజయా, అధర్మపద్ధతియందు నేను అభిలషింపను.

దుర్యోధనాదులు సామమార్గమున రాజ్యభాగమును ఈయకున్నచో నేను వారితో యుద్ధము చెసినచో స్వధర్మహీనుడను నింద్యుడను అగుదు నేమో ధర్మేశ్వరుడైన యీ కృష్ణుడు చెప్పును గాక ! సామము యుద్ధము అను రెండు పక్షములలో ఏది దర్మరూపమున సార్థకమో ఈత డెఱుంగును. సంజయా ! ఈవాసుదేవుడు ధర్మతత్త్వార్థ కోవిదుడు, నీతిమంతుడు బ్రాహ్మణోపాసకుడు ; మనీషి మహాబలశాలులైన భోజాంధక వృష్ణికుకుర సృంజయాది వీరులు రాజన్యులు ఈతనిని ఉపాసించుచు ఈతని యనుశాసనమున శత్రువులను నిగ్రహించుచు ఇంద్రసమానులై యున్నారు. విద్వాంసుడైన యీ కృష్ణుడు కార్యాకార్య నిశ్చయజ్ఞు డని యెఱుంగుము. నేను ఈతని వచనమును అతిక్రమింపను"

శ్లో॥ ధర్మేశ్వరః కుశలో నీతిమాం
శ్చాప్యుపాసితా బ్రాహ్మణానాం మనీషీ।
నానావిధాంశ్చైవ మహాబలాంశ్చ
రాజన్యభోజాననుశాస్తి కృష్ణః ॥ 9

శ్లో॥ యది హ్యహం విసృజన్ సామ గర్హ్యో
నియుద్ధ్యమానో యది జహ్యాం స్వధర్మమ్।
మహాయశాః కేశవ స్తద్బ్రవీతు
వాసుదేవ స్తూభయో రర్థకామః ॥ 10

శ్లో॥ శైనేయోఽయం చేదయ శ్చాంధకా శ్చ
వార్ష్ణేయ భోజాః కుకురాః సృంజయా శ్చ।
ఉపాసీనా వాసుదేవస్య బుద్ధిం
నిగృహ్య శత్రూన్ సుహృదో నందయంతి ॥ 11

శ్లో॥ ఈదృశో౽యం కేశవ స్తాత విద్వాన్
విద్ధి హ్యేనం కర్మణాం నిశ్చయజ్ఞమ్ |
ప్రియ శ్చ నః సాధుతమ శ్చ కృష్ణో |
నాతిక్రమే వచనం కేశవస్య ॥ 14

శ్రీమహాబారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 28

ధర్మజుని యీ ప్రసంగమువలన ఆనాడు మహితాత్ములైన రాజన్యులు పెద్దలు శ్రీకృష్ణునియొక్క ధర్మజ్ఞత్వమును ధార్మికత్వమును ధర్మాత్మత్వమును ఎంత మహనీయముగా భావించుచున్నారో స్పష్టమగుచున్నది. ఆయన జీవితమునందు అధర్మకృత్యములుగా శిశుపాలాదులకు, నేటి వారికి కొందఱకును, కన్పించుచున్న సంఘటనము లన్నియు ఆభాసములే గాని అధర్మములు కావని, యథార్థముగా ధర్మకార్యములే యని, వారు గ్రహించుచున్నా రని వ్యక్తమగుచున్నది.

## (iii) శ్రీకృష్ణ సమాధాన చమసము

ధర్మరాజు ధర్మనిర్ణయమ్ము గావింపుమని తన్ను కోరిన తరువాత శ్రీకృష్ణుడు సంజయునితో ఇట్లనెను. "సంజయా! ఈ పాండవులకు క్షేమము ప్రియము ఐశ్వర్యమును కోరుచున్నాను. అట్లే బహుపుత్త్రకుడైన ధృతరాష్ట్రుని యభ్యుదయమును కూడ అభిలషించుచున్నాను. పాండవులతో, "మీరు శాంతింపుడు" అనుటకంటె భిన్నముగా నేను ఏమియు చెప్పకుండ వలయుననియే కోరుచున్నాను ధర్మరాజు కూడ శాంతినే ప్రియముగా చెప్పుచున్నాడు నేను ఆమాటను మన్నించుచున్నాను. ధర్మరాజు ఎంత దుష్కరముగా నైనను శమమునే అవలంచి యుండగా, పుత్త్ర సహితుడై ధృతరాష్ట్రుడు రాజ్యవిషయమున లోభమునే అవలంబించుచున్నాడు. మఱి యింక కలహ మెట్లు కలుగకుండును ? సంజయా! నీవు నా వలన గాని యుధిష్ఠిరునివలన గాని సంభవించిన ధర్మవ్యతిక్రమ మేమైన ఎఱుంగుదు వేమో చెప్పుము కుటుంబమునందు పూర్వాచారము ననుసరించి వర్తించుచు స్వధర్మమును నిర్వహింపవలయు నని యుత్సాహపడుచున్న ధర్మజునియందు నీవెట్లు ధర్మలోప మున్న దని చెప్పుచున్నావు? ఇంద్రాది దేవతలు మహర్షులు ధర్మకర్మానుష్ఠానములవల్లనే ఉత్తమపదవులలో విరాజిల్లుచున్నారు విప్రక్షత్త్రియాదులకు అభ్యుదయ నిశ్శ్రేయసప్రదములుగా విహితములై యున్న ధర్మముల విభాగముల నెఱింగియు నీవు ఎందులకు ధర్మజునకు అధర్మమును బోధించుచు దుర్యోధనాదులకొఱకు శ్రమపడుచున్నావు ? వారిని వధింపకుండ రాజ్యమును పొందుటకు వీరికేదైన ఉపాయము లభించినచో వీరు పుణ్యవంతులే యగుదురు . వారు గావించిన యపరాధములకు ప్రతీకార మొనర్చుటకై పరుగులు వారుచున్న భీమసేనుని ఎట్లైనను పట్టి నిలిపి వీరు శాంతినే అవలంబింతురు.

శ్లో|| ఏతే మదా న్మృత్యువశాభిపన్నాః
సమానీతా దార్తరాష్ట్రేణ మూఢాః |
ఇదం పునః కర్మ పాపీయ ఏవ
సభామధ్యే పశ్య వృత్తం కురూణామ్ || 36

శ్లో|| కార్పణ్యా దేవ సహితా స్త్రత్రభూపాః
నాశక్నువన్ ప్రతివక్తుం సభాయామ్ |
ఏకః క్షత్తా ధర్మ్య మర్థం బ్రువాణో
దర్మబుద్ధ్యా ప్రత్యువా చాల్పబుద్ధిమ్ || 40

శ్లో|| గాంధారరాజః శకుని ర్నికృత్యా
య దబ్రవీత్ ద్యూతకాలే స పార్థమ్ |
పరాజితో నందనః కిం త వాస్తి
కృష్ణయా త్వం వైదీవ్య యాజ్ఞసేన్యా|| 46

(నీలకంఠీయ నందనః ఆనందయితా కనిష్ఠభ్రాతా |)

శ్లో|| జానాసి త్వం సంజయ సర్వ మేతత్
ద్యూతే వాక్యం గర్హ్య మేవం యథోక్తమ్ |
స్వయం త్వహం ప్రార్థయే తత్ర గన్తుం
సమాధాతుం కార్యమేత ద్విపన్నమ్ || 47

శ్రీ మహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః 29

శకుని ద్యూతమునందు యుదిష్ఠిరునితో, "నందనుడు (నందనః) పరాజితుడైనాడు, నీ కింక ఏ మున్నది ? పాంచాలిని పణముగా పెట్టి ఆడుము" అన్నట్లు శ్రీకృష్ణుడుద్ఘాటించినాడు శకుని ఈ విధముగా అనుట యుధిష్ఠిరుడు తన్ను కూడ పణముగా పెట్టుకొని ఓడిపోయిన తరువాత జరిగినది. చివరకు పరాజితుడైన వాడు ధర్మరాజే ఈ సందర్భమున నందన శబ్దము ఉపయోగింపబడినది. నందన శబ్దమునకు పుత్రుడు రూఢ్యర్థము. యౌగికముగా ఆ శబ్దమునకు, సంతోషమును కలిగించువాడు (నందయతి ఇతి నందనః) అనునర్థ మేర్పడును ఈయర్థము ననుసరించి నీలకంఠాచార్యుడు, 'ఆనందమును కలిగించునట్టి కనిష్ఠభ్రాత నందనుడు' అని వ్యాఖ్యానించి తప్పుగ నందను డనగా సహదేవు డని చెప్పెను. కాని సహదేవుడు పణమై ఓడింపబడినప్పుడు శకుని ఈ మాట అనలేదు. ధర్మరాజు సహదేవుని తరువాత అర్జునుని భీముని క్రమముగా పణముగా పెట్టెను. అందువలన సహదేవుడు పణమైన తరువాత, "ఇంక నీకేమున్నది?" అని శకుని ధర్మజుని అడుగుటకు అవకాశము లేదు. ధర్మరాజు తన్ను పణముగా పెట్టుకొని ఓడిపోయిన తరువాతనే శకుని ద్రౌపదిని పణముగా సూచించుచు అట్లు

అనెను అందువలన నందన శబ్దముచేత ధర్మజునే గ్రహించుట యుక్తము. ఎవనికైనను తానే తనకు అత్యంతము ఆనందమును కలిగించువాడు ప్రియుడు అగును. ఎవనికైనను తనకొఱకే సర్వము ప్రియ మగుచున్నది, "ఆత్మన స్తు కామాయ సర్వం ప్రియం భవతి" అని శ్రుతి కూడ చెప్పుచున్నది. కావున నందనుడనగా ధర్మరా జనియే గ్రహించుట సమంజసము

ఈ సందర్భమున శకుని మోసముతో (నికృత్యా) పాంచాలిని పణముగా పెట్టుమని ధర్మరాజుతో అన్నాడని శ్రీకృష్ణుడు ఉద్ఘాటించుట గమనింపదగియున్నది ఇద్దఱు ఒకయాటను ఆడునప్పుడు వారు స్వతంత్రులుగా నున్నంతవఱకే ఆట జరుగును. వారిలో ఒకరు ఓడిపోయినంతనే ఆట ముగియును. ధర్మరాజు తన్ను పణముగా పెట్టుకొని ఓడిపోయినంతనే, ఆడుటకు కర్త లోపించి పోవుటచే, ఆట ముగిసినది. పణముగా గెలుచుకొనబడిన మణిహారాదికమైన వస్తుజాతము ఎట్టిదో ధర్మరాజు కూడ అట్టివాడే అయ్యెను. ఆ వస్తువులను కర్తలనుగా భావించి వానితో ఆడబూనుకొనుట ఎంత అసమంజసమో ఇదియు అట్టిదే. శకుని ఆట ముగిసిన దని ప్రకటింపక "ఆడుము" అని ధర్మరాజును ప్రోత్సహించుట అన్యాయము. గెలుచుటకు ధర్మరాజునకు శక్తి లే దని తనవంచనమును ఆయన గ్రహింపలే డని పూర్తిగా నిశ్చయించుకొని, కేవలము ద్రౌపదిని పణముగా హరించుటకొఱకే శకుని ధర్మరాజునకు ఆశ కల్పించి అవకాశమిచ్చెను. కర్త ఓడినంతనే ఆట ముగియుట ప్రసిద్ధమైన పద్ధతి. తరువాత జరుగునట్టి, ఆట అక్రమము **(foul game)** అందువల్లనే ద్రౌపదీ ఈ విషయమునే సభలో సూటిగా ప్రశ్నించుచు, "ధర్మరాజు ముందు నన్ను పణముగా పెట్టి తరువాత తన్ను పణుగా పెట్టుకొనినాడా ? లేక తన్ను ముందు పణముగా పెట్టుకొని తరువాత నన్ను పణముగా పెట్టినాడా ? చెప్పుడు" అని యుద్ఘోషించినది. ఆ ప్రశ్నకు సమాధానము చెప్పుటకు దుర్యోధనునకు బయపడి భీష్మాదు లెవ్వరును పూనుకొనలేదు. కావున ఆట ముగిసినప్పటికిని శకుని వంచనముతోనే ద్రౌపదివిషయమును పైకి తెచ్చెనని శ్రీకృష్ణుడు ఉద్ఘాటించినాడు.

ఈ సందర్భమున మఱియొక విషయము కూడ గుర్తింపదగియున్నది. వైశంపాయనుడు ద్యూతవృత్తాంతమును జనమేజయునకు చెప్పినప్పుడు, యుధిష్ఠిరుడు పణము పెట్టుచున్నప్పుడు, "ఇట్లు విని శకుని నిశ్చయముకలవాడై నికృతిని (వంచనమును) చక్కగా ఆశ్రయించి 'గెలుచుకొంటిని' అని యుధిష్ఠిరునితో పలికెను" అని ఉద్ఘాటించినాడు. ఈ వాక్యమును వైశంపాయనుడు పదునాల్గు పర్యాయములు చెప్పినాడు.

వైశంపాయన ఉవాచ .

**శ్లో॥ ఏవం శ్రుత్వా వ్యవసితో నికృతిం సముపాశ్రితః ।**
**జిత మిత్యేవ శకునిః యుధిష్ఠిర మభాషత ॥** 7

**శ్రీమహాభారతే - సభాపర్వణి - అధ్యాయః - 61**

పదునాలుగు పర్యాయములు వైశంపాయనుడు ఈ వాక్యమును చెప్పినట్లుగా వ్యాసభగవానుడు రచించెననగా ఆ జూదమును మొదటి నుండి తుదివఱకు శకుని వంచనముతోనే ఆడెననుట స్పష్టము. అట్లు కాక వైశంపాయన వ్యాసభట్టారకుల కంటె అధికముగా తెలిసినట్లు శకునియందు దుర్యోధనునియందు దోషము లేదని ఎవరైనను తలంచుచో అది వారి బుద్ధి దోషమే యగును. కాని యదార్థము కాదు

# 2 నివేదన కమండలువు

## (i) శ్రీకృష్ణ సందేశ కథన చమసము

శ్రీకృష్ణుడు తనయభిప్రాయమును చెప్పిన తరువాత సంజయుడు "ఇంక సెల వొసంగుడు" అని బయలుదేరెను. యుధిష్ఠిరుడు అతనికి సెల వొసంగుచు హస్తినయందు తనకు మాఱుగా పెద్దల కందఱకు నమస్కరించి ధృతరాష్ట్రుని సభలో దుర్యోధనునితో తుదిమాటగా ఇట్లు చెప్పుమనెను. "దుర్యోధనా ! పరద్రవ్యమునందు లోభమును వీడుము. ఉచిత రీతిని మా భాగమును మేము పొందవలె. ఈ విధముగా శాంతి, పరస్పర ప్రీతి కలుగును. శాంతిని కోరుచున్న మాకు రాజ్యమునందు కొంత భాగమైనను ఇమ్ము. అవిస్థలము, వృకస్థలము, మాకంది, వారణావతము, అయిదవది ఏదే నొకటి నీకు తోచినది ఇమ్ము. సోదరులకు మాకు అయిదుగురకు అయిదు గ్రామముల నొసంగుము."

తరువాత యుధిష్ఠిరుడు సంజయునితో ఇట్లనెను. "సంజయా! మాకు జ్ఞాతులతో శాంతి కలుగును గాక. కౌరవులు పాంచాలురు అక్షతులై చిఱునవ్వులతో కలిసియుండవలె నని కోరుచున్నాను. నేను శాంతికి యుద్ధమునకు, ధర్మమునకు అర్థమునకు మృదు వర్తనమునకు దారుణమైన చర్యకును సమర్థుడనుగానే యున్నాను. మేమందఱము ప్రసన్న చిత్తులమై శాంతిని పొందుదుము గాక!"

శ్లో॥ అథోచితం స్వకం భాగం లభేమహి పరంతప |
నివర్తయ పరద్రవ్యాత్ బుద్ధిం గృద్ధాం నరర్షభ ॥ 17

శ్లో॥ శాంతి రేవం భవే ద్రాజన్ ప్రీతిశ్చైవ పరస్పరమ్ |
రాజ్యైకదేశ మపి నః ప్రయచ్ఛ శమ మిచ్ఛతామ్ ॥ 18

శ్లో॥ అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్ |
అవసానం భవ త్వత్ర కించి దేకం చ పంచమమ్॥ 19

శ్లో॥ భ్రాతౄణాం దేహి పంచానాం పంచ గ్రామాన్ సుయోధన |
శాంతి ర్నో ఽస్తు మహాప్రాజ్ఞ జ్ఞాతిభి స్సహ సంజయ ॥ 20

శ్లో॥ అక్షతాన్ కురుపాంచాలాన్ పశ్యేయ మితి కామయే
సం ఃమనస స్తాత శామ్యామ భరతర్షభ॥ 22

శ్లో॥ అలమేవ శమా యాస్మి తథా యుద్ధాయ సంజయ।
ధర్మార్థయో రలం చాహం మృదవే దారుణాయ చ॥ 23

శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి - అధ్యాయః - 31

సంజయుడు ఉపప్లావ్యము నుండి తిరిగి వచ్చి హస్తినాపురమున దృతరాష్ట్రుని కొలువులో పాండవుల వాక్యములను వినిపించెను "వాసుదేవ ధనంజయులు ఏమైన సందేశమును చెప్పినారా ?" అని ధృతరాష్ట్రుడు అడిగెను.

సంజయుడిట్లు చెప్పెను. "నేను సెలవు తీసికొనుటకై అంతఃపురములో కృష్ణార్జునులను చూచితిని. వా రిరువురు రత్నచిత్రితమైన కాంచనమహాసనమున ఉపవిష్టులై యుండిరి. ఇరువురును రత్నాభరణ భూషితులై చందనలిప్తాంగులై మధ్వాసవ పానోల్లాస భాసురులై యుండిరి. శ్రీకృష్ణుడు శయనించి యుండెను. ఆయన పాదములు అర్జునుని యొడి యందుండెను. అర్జునుని చరణములు కాంచన పాదపీఠముపై నుండెను, ఆ పాదపీఠమునకు ఇరువైపుల ద్రౌపది సత్యభామయు నుండిరి ఇంద్ర విష్ణువుల వలె తేజరిల్లుచున్న వారిని చూచినంతనే నాకు మహాభయము కలిగెను." అయ్యో! భీష్మద్రోణులయాశ్రయమును కర్ణుని ప్రగల్భములను నమ్మి మన వారు వీరి పరాక్రమాతిశయమును గుర్తింపకున్నారే ! వీ రిద్దఱసాయమున ధర్మరాజుయొక్క సంకల్పము నెరవేరుటలో నంశయము లేదు" అని నాకు తోచినది.

అర్జునుడు నన్ను చూచి పాదపీఠముపై నుండి చరణములను తీసి "దానిపై కూర్చుండు" మని చెప్పెను. నేను దానిని స్పృశించి భూమియందే కూర్చుండి శిరమున అంజలిని గావించి సందేశమును చెప్పు డని ప్రార్థించితిని. అర్జునుడు హస్తముతో శ్రీ కృష్ణుని పాదమును స్పృశించి సందేశమును చెప్పు మనెను. శ్రీకృష్ణుడు ఇంద్రధ్వజము వలె లేచి కూర్చుండి సర్వాభరణవిరాజితు డగుచు మృదుపూర్వముగా దారుణమైన సందేశమును ఇట్లు చెప్పెను "బుద్ధిమంతుడైన యాధృతరాష్ట్రునకు భీష్మద్రోణాదులు వినుచుండగా మాయిరువురి వచనముగా పెద్దలకు నమస్కరించి ఇట్లు చెప్పుము. పిన్నల నందఱను కుశల మడిగితి మని చెప్పుము. మీ రందఱు ఇంక విప్రులకు దక్షిణ లొసంగి యజ్ఞములను చేయుచు పుత్త్రులతో భార్యలతో ఇష్టభోగములను అనుభవింపుడు, పాత్రులకు దానములను చేయుడు. ప్రియులకు ఇష్టములను సమకూర్పుడు ధర్మరాజ యుద్ధమున జయమును సంపాదించుటకై త్వరపడుచున్నాడు. ఎక్కువ విలంబము లేదు. ద్యూతసభలో దుర్యోధనాది కితవులచే అవమ్నురాలై ద్రౌపది, నాయందున్న యమితమైన విశ్వాసముతో "గోవిందా" అని దూరమందున్న నన్ను పేర్కొని ఆక్రోశించినది. ఆమె విషయమున నా ఋణము వడ్డీతో పెరిగిపోవుచున్నది.

నాతో కూడియున్న గాండీవహస్తుడైన యర్జునునితో మీకు వైరము కలిగినది. ఒకవే క్రుద్ధుడైనచో భూమియందలి సకల ప్రజలను దహింపగలడు. స్వర్గము నుండి దేవతలను క్రిందికి పడగొట్టగలడు. దేవాసురమనుష్యగంధర్వాదులలో ఆతనిని మార్కొనగలవాడు నా కెవ్వడు కన్పించుట లేదు. విరాటనగరమున ఆత డొక్కడే కౌరవుల నందఱను ఓడించి తఱిమినాడు కదా! ఆ నిదర్శనమే చాలును ఇతనియందున్న బలము వీర్యము తేజస్సు శీఘ్రత లఘుహస్తత ధైర్యము మఱియెవనియందు ను కానము"

ఈ సందేశమును విని ధృతరాష్ట్రుడు పాండవ కౌరవ బలాబలములను గూర్చి ఆలోచించి కౌరవులకు బలము తక్కువ యని నిశ్చయించుకొని వైరమును మానుకొమ్మని దుర్యోధనునకు హితమును బోధించెను.

శ్లో|| ఉభౌ మధ్వాసవక్షీబా వుభౌ చందనరూషితౌ |
స్రగ్విణౌ వరవస్త్రౌ తే దివ్యాభరణభూషితౌ || 5

శ్లో|| నైకరత్నవిచిత్రం తు కాంచనం మహ దాసనమ్ |
వివిధాస్తరణాకీర్ణం య త్రాసాతా మరిందమౌ || 6

శ్లో|| అర్జునోత్సంగగౌ పాదౌ కేశవ స్యోపలక్షయే |
అర్జునస్య చ కృష్ణాయాం సత్యాయాం చ మహాత్మనః || 7

శ్లో|| కాంచనం పాదపీఠం తు పార్థో మే ప్రాదిశ త్తదా |
త దహం పాణినా స్పృష్ట్వా తతో భూమా వుపావిశమ్ || 8

శ్రీ మహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 59

"శ్రీకృష్ణార్జునుల వంటి మహాపురుషులు మద్యపానము చేయవచ్చునా" అని కొందఱు సందేహింతురు. ఆ సందేహమునకు సమాధానముగా బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఇట్లు సమాధానము చెప్పియున్నారు. "ఈ విషయమై కొంచెము తెలుపవలసియున్నది. సుర యనబడున దొకటి. మద్య మనబడున దొకటి. అన్న వికారమైనది సుర. అది యేకవిధమే. పనస ఖర్జూర తాళనారికేళ ద్రాక్షాది జన్యమై మదకరమైనది మద్యము అది బహువిధము.... (P 411) ఇచ్చట మద్య మనేకవిధ మనియు, బ్రాహ్మణుని గూర్చియే, మద్యపానము శాస్త్రకారులచే నిషేదింపబడినదనియు, క్షత్రియ వైశ్యులకు నిషేదము లేనందున చేసినను తప్పు లేదనియు బృహద్విష్ణు బృహద్యాజ్ఞవల్క్య, వేదవ్యాస వచనము లట్లు చెప్పుచున్న వనియు ప్రతిపాదింపబడినది.... వా రప్పుడు త్రాగి మత్తులై యున్న యెడల వారియొద్దకు సంజయమునకు ప్రవేశము కాని, సంజయునితో వారి ప్రసంగము కాని యసంభవము

కనుక "క్లీబ్ర మదే" "మదీహార్గైపనయోః" అను దాత్వర్ధములను బట్టి యాశ్లోకములోని "మధ్వాసవక్షీబౌ" అను పదమునకు మధ్వాసవమును పరిగ్రహించి హెచ్చరికగా నున్నారనియే భావము

మొత్తము మీద శాస్త్రములో మద్యపాన నిషేధము క్షత్రియులకు లేదు కనుకనే తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ' అని యుపదేశించిన శ్రీకృష్ణుడును, ఉపదేశింపబడిన అర్జునుడును యథోచిత మధుపరిగ్రహమును చేసినట్లు వ్యాసమహర్షి చెప్పెనని సారాంశము". P - 413 - మహాభారత తత్త్వకథనము.

ఉపప్లావ్యము విరాటనగర సమీపమున నొక గ్రామము ఉత్తరా వివాహము కొఱకు విరాటుడు పాండవులకు వారి బంధువులకు ఆ గ్రామ సమీపమున తాత్కాలికముగా విడుదులు ఏర్పాటు చేసెను. అర్జునునియందలి స్నేహవిశేషముచేత సుభద్రా సంబంధముచేత శ్రీకృష్ణుడు అర్జునుని విడిదియందే బసచేసెను. తాత్కాలికములైన యా విడుదులయందే కాంచన మహాసనములు కాంచనపాదపీఠము లున్న వన్నచో నాటి భారతదేశ సంపద ఎంత యజ్జ్వలముగా నున్నదో యూహింపవచ్చును. 1914 లో జరిగిన ప్రథమ ప్రపంచ మహా సంగ్రామమువఱకు మనదేశమున సంపన్నుల యిండ్లలో బంగారు వస్తువులు పుష్కలముగానే యుండెను. విదేశీయులు దాడులలో ఎంతో సంపదను దోచుకొని పోయిన తరువాత కూడ "స్వర్గస్థు డయ్యె విస్సనమంత్రి మఱి హేమపాత్రాన్న మెవ్వని పంక్తి గలదు" అని శ్రీనాథుడు చెప్పినట్లుగా, ఇటీవలవఱకు సంపన్నుల యిండ్లలో భోజన పాత్రలు పానపాత్రలు బంగారువిగానే యుండెడివి.

సంపదయొక్క ఔన్నత్యముతో పాటు వినయవిధేయతల యొక్క ఉన్నతి కూడ ఎట్లుండినదో పై సందర్భమున వ్యక్తమగుచున్నది శ్రీకృష్ణుని పాదములు ఉద్ధవుని యొడియం దున్న వనగా శ్రీకృష్ణుడు శయనించి యుండె నని అర్జునుడు ఆయనకు పాదసంవాహనము చేయుచుండె నని గ్రహింపవలసియున్నది. అనగా వారు కూర్చుండినది పెద్ద మంచమువంటి విశాలమైన యాసన మన్నమాట. అర్జునుడు శ్రీకృష్ణునికంటె సుమారు మూడేండ్లు మాత్రమే చిన్నవాడు. అయినను శ్రీకృష్ణుని పెద్దఱికమును గ్రహించి అర్జునుడు ఆయనకు పాదసంవాహనము చేయుచుండెను. ద్రౌపదీ సత్యభామలు రాణులయ్యును అర్జునుని పాదపీఠమునకు ఇరువైపుల నేలపైననే కూర్చుండిరి. అందువలన సంజయుడు వారికంటె ఎత్తుగా కూర్చుండక పాదపీఠమును చేతితో స్పృశించి రాణులతోపాటు నేలపైననే కూర్చుండెను దీనినిబట్టి పెద్దలయెడ పిన్నలు ఆత్మాభిమానమును (Dignity) పాటించుచు వినయముతో ఎట్లు వర్తించుచుండిరో గ్రహింపవలసియున్నది.

# (II) శ్రీకృష్ణ మహిమాను వర్ణన చమసము

సంజయుడు శ్రీకృష్ణునియొక్క ధర్మరాజాదులయొక్క వచనములను సభలో చెప్పెను. ధృతరాష్ట్ర దుర్యోధనాదులు ఆవాక్యములను అభినందింపక మౌనముతో నుండిరి. ఇంక వినవలసినది ఏమియు లేదని రాజు లందఱును వెడలిపోయిరి దుర్యోధనాదులు మాత్రము కొద్దిమంది యుండిరి. అప్పుడు ధృతరాష్ట్రుడు తమకు ఎట్లు జయము కలుగునా అని ఆలోచించుచు సంజయునితో ఇట్లనెను. "సంజయా! రెండు పక్షముల బలాబలములను నీ వెఱుంగుదువు. యుద్ధము సంభవించినచో ఎవరు మిగిలియుందురో చెప్పుము " సంజయుడు, ``మహారాజ ! నీకు ఏకాంతమునందు విశేషించి చెప్పగలిగిన దేమియును లేదు. అయ్యా! నీయందు అసూయ ప్రవేశించుచున్నది. మీ తండ్రిని వ్యాసుని గాంధారిని పిలిపింపుము వా రైనచో నీ యందున్న యసూయను తొలగింపగలరు. వారి సన్నిధియందు శ్రీ కృష్ణార్జునుల నిశ్చయమును వినిపింతును".

ధృతరాష్ట్రుడు స్మరించినంతనే వ్యాసమహర్షి వచ్చెను. విదురుడు గాంధారిని తీసికొని వచ్చెను. ధృతరాష్ట్ర సంజయుల యభిప్రాయములను తెలిసికొని వ్యాసభగవాను డిట్లనెను. "సంజయా! ధృతరాష్ట్రుడు అడుగుచున్నాడు కదా! శ్రీకృష్ణార్జునులగూర్చి నీకు తెలిసినదంతయు యథాతథముగ చెప్పుము"

సంజయు డిట్లు చెప్పెను. "శ్రీకృష్ణార్జునులు విశ్వభావనులు. వారు లోకహితమునకై జన్మించిన వారు , కాని సామాన్యులవలె కేవల ప్రారబ్ధవశమున స్వార్ధపరాయణులై సంభవించిన వారు కాదు. శ్రీకృష్ణుడు చక్రమును ప్రయోగించునప్పుడు ఆయన మాయచే అది ఆయన ఎంత పెద్దది కావలయు నని సంకల్పించునో అంత పెద్దదియై శత్రుసంహారము కావించును. ఆయన కౌరవులయందు అపహ్నవముతో యథార్థమును కప్పిపుచ్చి వర్తించును. అది పాండవులకు కూడ సమ్మతమే. తేజః పుంజముగా బాసించుచున్న శ్రీకృష్ణుని సమస్తజగత్తుతో పోల్చినను ఆయనయొక్క సారమును అసారమును గ్రహించుట సులభము కాదు నీవు పాండవులనుగూర్చి మాటిమాటికి బలాబలములను గూర్చి అడుగుచున్నావు సంగ్రహముగా చెప్పెదను వినుము. సమస్త జగత్తును ఒకవైపున నుంచి శ్రీకృష్ణుని మఱియక వైపున నుంచి తూచినచో ఆయనయే అధికమైన సారము కలవాడగును ఆయన నరకాదులైన ఘోరరాక్షసుల నెందఱను సంహరించెనో నీవెఱుంగుదువు. ఆయన సంకల్ప మాత్రముననే ఈ జగత్తును భస్మ మొనరింపగలడు ఈ జగత్తులోని శక్తినంతను సమీకరించినను అది ఆయనను ఏమియు చేయజాలదు. సత్యము, ఆర్జవము (straight forwardness) ధర్మము ఎచ్చట నుండునో అచ్చట వాసుదేవు డుండును. ఏ పక్షమున గోవిందు డుండునో ఆ పక్షముననే జయము సంభవించును. ఆయన పాండవులను

మిషగా చేసి అధర్మనిరతులైన నీ పుత్త్రులను దగ్ధ మొనరింప దలంచుచున్నాడు. మాస సంవత్సరాద్యాత్మకమైన కాలచక్రమును, సృష్టి స్థితి లయ రూపమైన జగచ్చక్రమును, కృతత్రేతాది రూపమైన యుగచక్రమును అయన తన సాన్నిధ్యమాత్రముననే నడపుచున్నాడు. ఆ మహాయోగి సృష్టిస్థితి లయములకు ఈశ్వరు డయ్యును, పంటకొఱకు కృషిచేయు సామాన్యుడైన కృషీవలుని వలె, విహితములైన కర్మలను చేయుచున్నాడు. ఆయన యొక్క సామాన్యమనుజుని వర్తనమును చూచి ఆయన కూడ మనవంటి వాడే యని లోకులు మోహితు లగుచున్నారు. సర్వవిధముల ఆయననే శరణము పొందినవారు మాత్రము ఆమాయను దాటుచున్నారు".

"సంజయా! ఆ వాసుదేవుని నీవు సర్వలోక మహేశ్వరునిగా ఎట్లెఱింగితివి ? నా కేల తెలియుట లేదు ?" అని ధృతరాష్ట్రు డడిగెను. సంజయుడిట్లు చెప్పెను. "అయ్యా! విద్యాహీనుడు తమోధ్వస్తుడు కేశవుని స్వరూపము నెఱుంగలేడు. నీకు విద్య లేదు. నాకు విద్యయందు లోపము లేదు. నేను పుత్త్రకళాత్రాది రూపమై మాయికమైన సంసారమును సేవించుట లేదు ; భగవంతునకు ఫల మర్పింపకుండ నేను ఏ ధర్మమును ఆచరింపను కామక్రోధాది రహితమై నిర్మలమైన మనస్సుతో శాస్త్రము ననుసరించి శ్రీకృష్ణుని స్వరూపమును గ్రహించుచున్నాను".

గాంధారీధృతరాష్ట్రులు ఆప్తుడైన సంజయుని వాక్యము ననుసరించి శ్రీకృష్ణుని శరణుపొందు మని దుర్యోధనునకు బోధించిరి. " అర్జునునియందు సఖ్యమును ప్రకటించుచు భగవంతుడైన దేవకీపుత్త్రుడు లోకములను సంహరించు నేని, నే నిప్పుడు ఆయనను చేరను" అని దుర్యోధనుడు వారి యుపదేశమును తిరస్కరించెను.

వ్యాసు డిట్లనెను. "పుత్త్రా! నీకు సంజయుడు దూతయగుట వలన నీవు కృష్ణునకు ప్రియుడ వగుచున్నావు. సనాతనుడు పరమపురుషుడు నైన శ్రీకృష్ణుని ఈతడు చక్కగా ఎఱింగియున్నాడు. నీవు ఈతనివలన తత్త్వమును చక్కగా వినుచు గ్రహించుచున్నచో ఇతడు నీకు శ్రేయస్సును మోక్షమును సైతము కలిగింప గలడు". ధృతరాష్ట్రుడు సంతసించి సంజయుని సంబోధించి "ఏ మార్గముచేత నేను శ్రీకృష్ణుని చేరి ఉత్తమమైన సిద్ధిని పొందగలనో ఆ పద్ధతిని నాకు చెప్పుము" అనెను. సంజయుడు అందులకు ఇంద్రియని గ్రహమే మార్గమని, శ్రీకృష్ణుని నామములయొక్క నిర్వచనముల వివరించుచు కృష్ణుని తత్త్వము‌ను బోధించెను.

శ్లో|| అర్జునో వాసుదేవ శ్చ దన్వినౌ పరమార్చి తౌ|
కామా దన్యత్ర సంభూతౌ సర్వభావాయ సమ్మితౌ || 1

<u>నీలకంఠాయ</u> · కామా దితి ; కామపూర్వకం కర్మ ఉచ్యతే ! అకర్మజం తయోః జన్మ, లోకాను గ్రహార్థం సూర్యవత్ ఆవిర్భావ మాత్ర మిత్యర్థః | సర్వభావాయ బ్రహ్మభావాయ సంమితౌ తుల్యౌ ఉభౌ ఆపి సాక్షాత్ బ్రహ్మరూపౌ ఇత్యర్థః |

శ్లో॥ వ్యామాంతరం సమాస్థాయ యదా ముక్తం మనస్వినః |
చక్రం తత్ వాసుదేవస్య మాయయా వర్తతే విభో ॥ 2

<u>నీలకంఠీయమ్</u> : వ్యామాంతరం ప్రసారితయోః హస్తయోః యావాన్ విస్తారః పంచహస్తమితః తావత్ అంతరం మధ్య ప్రమాణం యస్య తత్ వ్యామాంతరం | యధా ముక్తం, యదా యధా రూపం యావత్ప్రమాణం చింతితం తావత్ప్రమాణం భూత్వా యత్ ముక్తం భవతి, మాయయా దుర్లక్ష్య రూపేణ ఇత్యర్థః |

శ్లో॥ సాపహ్నవం కౌరవేషు పాండవానాం సుసమ్మతమ్ |
సారాసారబలం జ్ఞాతుం తేజః పుంజావభాసితమ్ ॥ 3

<u>నీలకంఠీయ</u> సాపహ్నవం ససంహారమ్ | అత ఏవ పాండవానాం సుసమ్మతమ్ |

ఏకతో వా జగత్ కృత్స్న మేకతో వా జనార్దనః |
సారతో జగతః కృత్స్నా దతిరిక్తో జనార్దనః ॥ 7

శ్లో॥ భస్మ కుర్యా జ్జగ దిదం మనసైవ జనార్దనః |
న తు కృత్స్నం జగత్ శక్తం భస్మకర్తుం జనార్దనమ్ ॥ 8

శ్లో॥ యత స్సత్యం యతో ధర్మో యతో హ్రీ రార్జవం యతః |
తతో భవతి గోవిందో యతః కృష్ణ స్తతో జయః ॥ 9

శ్లో॥ ఈశ న్నపి మహాయోగీ సర్వస్య జగతో హరిః |
కర్మా ణ్యారభతే కర్తుం కీనాశ ఇవ వర్ధనః ॥ 14

<u>నీలకంఠీయ</u> . ఈశ న్నపి ఈశానో ఽపి, శపో ఽలుక్ పరస్మై పదం చ ఆరమ్ | కీనాశః కర్షకః వర్ధనః ధాన్యాది వృద్ధికృత్, య ద్వా కీనాశో యమః, వర్ధనః దేహాదేః ఛేత్తా |

తేన వంచయతే లోకాన్ మాయాయోగేన కేశవః |
యే త మేవ ప్రపద్యంతే న తే ముహ్యంతి మానవాః ॥ 15

<u>నీలకంఠీయ</u> · తే నరా న ముహ్యంతి |

శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి అధ్యాయః - 68

చక్రము మాయచే వర్తించు ననగా కృష్ణుని సంకల్పము ననుసరించి అది ఇతరులకు గోచరము కాని విదమున అనేక రూపములతో శత్రువులను సంహరించు నన్నమాట.

శ్రీకృష్ణుడు కౌరవులయిందు అపహ్నవముతో వర్తించు నని, అది పాండవులకు సుసమ్మత మని సంజయు డనుట గమనింప దగియున్నది అపహ్నవ మనగా సంహార మని నీలకంఠాచార్యుడు వ్యాఖ్యానించెను కాని అపహ్నవ మనగా ఒక విషయమును లేక వస్తువును కప్పియుంచుట అనునర్థము ప్రసిద్ధముగా నున్నది ఇదియే ఇచ్చట ఉచిత మని తోచుచున్నది ఈ యర్థమే సంజయుని వాక్యములలో 14, 15 శ్లోకములలో వివరింపబడినది. శ్రీకృష్ణుడు పరమేశ్వరు డయ్యును ఈశ్వరుని వలె వ్యవహరింపక సాధారణ మనుష్యులవలె కార్యసిద్ధికై ప్రయత్నములు చేయుచు హర్షవిషాదములను ప్రకటించుచు తన యీశ్వరత్వము బయల్పడకుండ, ఇతరులకు గోచరము కాకుండునట్లు వర్తించుచుండెను. అదియే అపహ్నవము యుద్ధము చేయనని ఆయన ప్రకటించుట ఇట్టిదే. ఆయన ఇట్లనుట వలన, ఇంక ఆయనవలన తమకు ఎట్టి భయము లేదని కౌరవులు తలంచుటకు అవకాశము కలిగినది. ఈ విధముగా కౌరవులు వంచితులైరి సూక్ష్మముగ విచారించినచో ఆయన యుద్ధమున పాల్గొనక పోయినను పాండవులకు ఎప్పటికప్పుడు జయోపాయములను చెప్పుచు కౌరవ వినాశమును సాధింపగల డనుట స్పష్టము ఈకారణముచేతనే సంజయవిదుర భీష్మాదులు, శ్రీకృష్ణుడు యుద్ధము చేయడన్నంత మాత్రమున ఆయన వలన ఎట్టి భయము కలుగదని తలంపలేదు.

పాండవులకు కూడ ఈ పద్ధతి సమ్మతముగానే యుండెను. ఆయన ఈశ్వరత్వమును వహించి క్షణములో కౌరవులను నశింపజేయుట వారికి ఇష్టము కాదు, అట్లయినచో వారి పరాక్రమము ప్రకాశింపదు అప్పుడు శ్రీకృష్ణుని దయాదాక్షిణ్యములపై రాజ్యమును సంపాదించుకొన్నట్లగును అది వారి యశస్సునకు భంజకము

# II. శ్రీకృష్ణోద్యోగ కలశము

## (1) యుధిష్ఠిరాభ్యర్థన చమసము

సంజయుడు వెడలిపోయిన తరువాత ధర్మరాజు శ్రీకృష్ణునితో ఇట్లనెను. "వాసుదేవ! మిత్రులు తోడ్పడవలసిన కాలము సంప్రాప్తమైనది. మమ్ము ఆపదల నుండి తరింపజేయుటకు నీవు తప్ప నా కెవ్వడును కన్పించుట లేదు నిన్ను ఆశ్రయించి నిర్భయులమై, వ్యర్థమైన దర్పముతోనున్న దుర్యోధనుని మా భాగము కొఱకు అడుగదలచుచున్నాము. యాదవులను ఎట్లు రక్షించుచున్నావో అట్లే మమ్ము కూడ కాపాడుము"

"ఇదే సిద్ధముగా నున్నా నయ్యా! నీవు ఏమి చెప్పదలచుచున్నావో చెప్పుము, అది యంతయు చేయుదును" అని శ్రీకృష్ణ పలికెను.

ధర్మజుడిట్లనెను "సపుత్రుడైన ధృతరాష్ట్రుని యొక్క అభిప్రాయమును సంజయుని మాటలలో సమగ్రముగ వింటివి. రాజు ఏ విషయమును ఎట్లు చెప్పునో అట్లే దూత చెప్పును. తనకిచ్చిన సందేశమునకు భిన్నముగా చెప్పినచో దూత వధ్యుడగును. లుబ్ధుడై పాపబుద్ధితో మా పెదతండ్రి మాకు రాజ్యమీయకుండ మమ్ము శాంతింపజేయుటకు యత్నించుచున్నాడని సంజయుని వచనమున స్పష్టమైనది. జూదమునందు కావించుకొన్న యొడంబడిక యందు ఆయన నిలిచియుండుననను విశ్వాసముతో మేము ఎంతో శ్రమపడి అరణ్యాజ్ఞాతవాసములను నిర్వర్తించితిమి. ఈ సమయమునందు తుదకు తల్లిని పుత్రులను కూడ చక్కగా చూడజాలకుంటిమి. ఇంతకంటెను దుఃఖమేమున్నది?

మహావీరులైన మత్స్య పాంచాలాది నరపాలురను నిన్ను అండగా పొందియుండియు దాయాదుల లోభము ననుసరించి కలహమును వారించుటకై నేను మా యైదుగురికి కనీసము అయిదు గ్రామములైన ఇండు అని వారిని కోరుచున్నాను. అవిస్థలము, వృకస్థలము మాకంది, వారణావతము అను గ్రామములతో పాటు అయిదవది ఏదైన వారికి తోచిన దానిని ఇమ్మనుము. వారు ఏవేని అయిదు నగరములో గ్రామములో మాకొసంగినచో మేము అయిదుగురము ఎట్లో ఆహారము లేనివారము కాకుండ జీవింపగలము. మాకొఱకు భరతవంశీయులు నశింపకుందురు గాక! అంతమాత్రము కూడ ఆధ్యార్తరాష్ట్రుడు ఈయకున్నచో అంతకంటె కష్టమేమున్నది?

పూలు పండ్లు లేని చెట్టు నుండి పక్షులు వెడలిపోవునట్లు దనహీనుని గృహము నుండి బంధువులు మిత్రులు బ్రాహ్మణులు వెడలిపోవుదురు. అట్టి దుర్గతి మరణముతో సమానము. లోకమున ధనవంతులే సజీవులు, నిర్ధనులు మృతులే. నిర్ధనత్వముకంటె మరణము మేలు. శ్రీమంతుడే చక్కగా ధర్మములు ననుష్ఠించి పితృదేవతలను దేవతలను సంతోషపెట్టగలడు. రాజ్యపరిభ్రష్టులమై మేము పొందిన దుర్గతిని నీవు ప్రత్యక్షముగా చూచుచునే యుంటివి. ఏ న్యాయము చేతనైనను మేము సంపదను వదలుకొనుట కుదరదు. మా సంపదకొఱకై మేము పోరాడుచు మరణమును పొందినను మేలే.

మాధవా! మేము వారును ప్రశాంతులమై ఐశ్వర్యమును అనుభవించుటయే శ్రేష్ఠమైన మొదటి పద్ధతి. మేము వారిని సంహరించి రాజ్యమును పొందుట రౌద్రకర్మకు పరాకాష్ఠ. బంధువులు కానివారు అనార్యులును అయిన శత్రువులతోడి వ్యవహారమున కూడ వారిని వధింపకుండ కార్యమును సాధించుకొనుటయే మేలు. అట్టియెడల బంధుమిత్రాచార్యాదులను సంహరించి రాజ్యమును సంపాదించుకొనుట పాపిష్ఠము. కాని మనము క్షత్రియులము కదా! యుద్ధము ఎంత ఘోరకర్మమైనను క్షత్రియులకు స్వధర్మము. ఇతరమైన వృత్తివారికి విగర్హితము, అధర్మము. యుద్ధమునందు ఎవరు జయింతురో ఎవరు ఓడుదురో, ఎవరు నశింతురో, ఎవరు బ్రతికియుందురో సందేహగ్రస్తమే. జయించినను శత్రుశేషమున్నచో విజేతలు, సర్పము దాగియున్న యింటి

యందు వలె, నిశ్చింతగా నిద్రింపలేరు. వైరము వైరము చేత ఎప్పుడును శమింపదు. మనము నిశ్చింతగా నుండవలయునని పట్టుదలతో వెదకి వెదకి శత్రుశేషమును నిర్మూలించుట అమితనృశంసకర్మ. ఇంత ఘోరకర్మ ఎందులకని రాజ్యమును వదలుకొని ప్రశాంతముగ నుండవచ్చు ననుకొనుటయు సాధ్యముకాదు. మనము వైరమును వదలుకొన్నను మన శత్రువులు ప్రశాంతు లగుదురని చెప్పజాలము. వారు శత్రుశేషమును నిర్మూలించుకో వలయు నను తలంపుతో రాజ్యహీనతచేత దుర్గతియందున్న మనలను వారు ఎట్లైనను సంహరింపవచ్చును కావున రాజ్యమును వదలుకొను తలంపు కుదరదు , కులక్షయము కూడ ఇష్టము కాదు. ఈ పరిస్థితియందు వారికి ప్రణతి గావించి శాంతిని సాధించుకొనుటయే మేలైన పద్ధతి మహారాజు వృద్ధుడు మాకు తండ్రియునైన ధృతరాష్ట్రునకు మేము ప్రణమిల్లి ప్రార్థించుట సమంజసమే. అయినను పుత్రవశుడైయున్న యాయన మా ప్రార్థనమును మన్నింపక పోవచ్చు. అప్పుడు ఆ మిషముకొఱకు కుక్కలకు వలె మనుష్యులకును పోరాటము తప్పదు బలవంతులు జయించి ఆస్తుల ననుభవింతురు. ఇప్పుడు మేము ఏమి చెయదగునో చెప్పుము. అర్థమునుండి ధర్మమునుండి మేము హీనులము కాకుండ ఎట్లు వర్తింపవలయునో నిశ్చయింపుము. మాకు ప్రియుడు సర్మకర్మపల వివేకము కలిగి కార్యమును నిశ్చయింపగలగిన వాఁడు నీవు తప్ప మఱియొక డెవడున్నాడు ?"

శ్రీకృష్ణుడిట్లనెను. "మహారాజా ! మీ యిరువురియొక్క ప్రయోజనముకొఱకు కురుసభకు పోవుదును. మీ ప్రయోజనము భంగపడకుండ నే నక్కడ శాంతిని సాధింపగలిగినచో మహాపుణ్యమును సంపాదించినవాడ నగుదును. కౌరవ పాండవు లను రెండు పక్షములలో చేరియున్న రాజులను, మృత్యుపాశములనుండి తప్పించినవాడ నగుదును

ధర్మజు డిట్లనెను. "కృష్ణా! నీవు వారియొద్దకు పోవలయు ననుట నా నిశ్చయము కాదు నీవు ఎంత చక్కగా చెప్పినను ఆ దుర్యోధనుడు నీమాట వినడు. అక్కడ చేరియున్న క్షత్రియ వీర సముదాయ మంతయు వానివశమం దున్నది. నీవు వారిమద్యకు పోవుట నాకు ఇష్టము కాదు నీకు ద్రోహము జరుగుటకు అవకాశ మున్నపద్ధతిలో నాకు ఐశ్వర్యమే కాక దేవేంద్రత్వము సంభవించినను అది నాకు ప్రీతిని కలిగింపదు, ఇంక నేను సుఖపడుటయే సంభవింపదు"

శ్రీకృష్ణ డనెను "అయ్యా! ఆ దుర్యోధనుని పాపబుద్ధిని నే నెఱుంగుదును. వా రందఱు కూడి సన్నద్ధులైనను, సింహము నెదుట నక్కలవలె, నా ముందు నిలువ లేరు. అక్కడ వారు నాయెడ అనుచితముగా వర్తించినచో వారి నందఱను నిర్ధహింతును. అది యట్లుండ నిప్పు దుర్యోధనుడు నా మాటను వినకున్నను నేను అక్కడికి పోవుట వ్యర్థము కాదు. ఒకప్పుడు మన ప్రయోజనము సిద్ధింపవచ్చును. లేక సకల పార్థివుల దృష్టిలో మనము అపరాధులము కాకుండుట యైన సంభవించును."

యుధిష్ఠిరు డనెను. "కృష్ణా ! నీకు ఆ పద్ధతి రుచించునని అట్లే చేయుము. నీవు కృతార్థుడవై క్షేమముగా తిరిగి రావలయునని కోరుచున్నాను వారు మేము మంచి మనస్సులతో కూడి యుండునట్లుగా అక్కడ శాంతిని కలిగింపుము. నీవు అర్జుననకు ప్రియసఖుడవు . సోదర సమానుడవు . నాకు ప్రియుడవు. మా యందు నీకు గల సౌహార్దము నిర్విశంకము నీకు స్వస్తియగును గాక! పోయి రమ్ము. మమ్ము ఎఱుగుదువు. ప్రతిపక్షుల నెఱుంగుదువు. సందేశార్థములలో నీకు తెలియనిది లేదు. వచన చతురత్వము నందు నీకు సాటి ఎవడును లేడు. ఇంక నీకు నేను చెప్పవలసినది ఏ మున్నది ? నచ్చజెప్పియో బెదిరించియో మాకు ఏది హితమో అది దుర్యోధనునకు బోధింపుము"

| | | |
|---|---|---|
| శ్లో\|\| | ఉభయో రేవ వా మర్థే యాస్యామి కురుసంసదమ్ \|\| | 79 |
| శ్లో\|\| | శమం తత్ర లభేయం చే ద్యుష్మ దర్థ మహాపయన్ \|<br>పుణ్యం మే సుమహ ద్రాజన్ చరితం స్యా న్మహాఫలమ్ \|\| | 80 |
| శ్లో\|\| | మోచయేయం మృత్యుపాశాత్ సంరబ్ధాన్ కురుసృంజయాన్ \|<br>పాండవాన్ ధార్త రాష్ట్రాం శ్చ సర్వాం చ పృథివీ మిమామ్ \|\| | 81 |
| శ్లో\|\| | జానా మ్యేతాం మహారాజ ధార్తరాష్ట్రస్య పాపతామ్ \|<br>అవాచ్యా స్తు భవిష్యామః సర్వలోక మహీక్షితామ్ \|\| | 85 |
| శ్లో\|\| | న చాపి మమ పర్యాప్తాః సహితాః సర్వపార్థివాః \|<br>క్రుద్ధస్య సంయుగే స్థాతుం సింహ స్యే వేతరే మృగాః\|\| | 86 |
| శ్లో\|\| | అథచేత్ తే ప్రవర్తేత మయి కించి దసాంప్రతమ్ \|<br>నిర్దహేయం కురూన్ సర్వా నితి మే ధీయతే మతిః \|\| | 87 |
| శ్లో\|\| | న జాతు గమనం పార్థ భవే త్తత్ర నిరర్థకమ్ \|<br>అర్థప్రాప్తిః కదాచిత్ స్యా దంతతో వా వ్యవాచ్యతా \|\| | 88 |

శ్రీ మహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 72

## బాలప్రియ

పాండవుల ధర్మ పక్షమునందు ఎంత సానుభూతి యున్నను, లోకధర్మము ననుసరించి జనవినాశమును తప్పించుటకై శ్రీకృష్ణుడు సంధి ప్రయత్నము చే పూనుకొనె ననుట స్పష్టము. కర్తవ్య నిర్వహణమున ఆపదను సైతము ఆయన లెక్క చేయడు. ఉపేక్ష కలుగుట కవకాశ మున్నను ఎవడును ధర్మ నిర్వహణమును ఉపేక్షింప రాదు.

# (ii) ప్రబోధ చమసము

దర్మజునియభ్యర్థనము నందు వ్యక్తమైన శాంతిపరత్వమును దైన్యమును ఉద్దేశించి శ్రీకృష్ణుడు ఇట్లు ఉదాటించెను. " మహారాజా ! సంజయునివలన దార్తరాష్ట్రల యభిప్రాయము నీయభిమతము చక్కదా తెలిసినవి నీ బుద్ధి దర్మాశ్రయము. వారిది వైరాశ్రయము. యుద్ధము లేకుండ ఏ కొంచెము లభించినను నీవు సంతోషింతువు కాని నైష్ఠిక బ్రహ్మచర్యము భిక్షావృత్తి క్షత్రియునకు విహితములు కావు. యుద్ధమున జయించుటయో వధమును పొందుటయో క్షత్రియునకు సనాతనమైన ధర్మము. క్షత్రియుడు దైన్యమును పొందుట తగదు. విక్రమించి శత్రువులను జయింపుము. ఆధార్తరాష్ట్రలు అమిత లుబ్ధులు ; చిరకాలముగా బంధువులతో బలమును పెంపొందించు కొనుచున్నారు. భీష్మద్రోణకృపాదులతో వారు తమ్ము అధికబలవంతులనుగా తలంచుచున్నారు. వారు నీతో సమానత్వమును పాటింపరు. నీవు వారితో మెత్తదనముతో వ్యవహరించుటకు ప్రయత్నించినచో వారు నీరాజ్యమును హరించుట నిశ్చయము. నీవు ప్రకటించుచున్న దైన్యమువలన వారు నీయందు జాలిని పొంది కాని ధర్మదృష్టితో కాని నీకు రాజ్యము నొసంగరు.

దాంతుడవు ధర్మశీలుడవు పెద్దలయందు భక్తిగలవాఁడవును అయిన నిన్ను భీష్మద్రోణాది మహాజన సమక్షమున, జూదమునందు వంచించి కౌపీనమాత్రమే కలవారినిగా చేసి ఆ దుర్యోధనుడు కొంచెము కూడ లజ్జించుట లేదు. అట్టివారియందు నీ వేల స్నేహమును చూపవలె ? ఆ పాపాత్ములు సకలలోకమునకు వధ్యులు , నీకు తప్పక వధ్యులని చెప్పవలసిన దేమున్నది ? ఇప్పటికి పాండవులకు సొంతమన్నది ఏమియును లేకుండ పోయినది ; ఇంక గోత్రనామములు కూడ మిగులక పోవచ్చును. ఈ పరిస్థితియందు ఆ దుర్యోధనాదులు నాచేత నిధనమును పొందుటయు తప్పదు. భీష్మద్రోణాదులు చూచుచుండగా దురాత్ముడైన దుశ్శాసనుడు ద్రౌపదిని నిండు సభలోనికి జుట్టుపట్టుకొని లాగుకొని వచ్చి, "ఇదిగో గోవు ! గోవు" అని అనేక పర్యాయములనెను. నీచేత వారింపబడి భీమాదులైన యీ మహావీరు లందఱు చూచుచు నూరకుండిరి. మీరు వనములకు బయలుదేరునపుడు వారు మిమ్ము పరిహాసించుచు తమ్ము తాము శ్లాఘించుకొనుచుండిరి. అప్పుడు సభయందున్నవా రందఱు అశ్రుకంఠులై దుఃఖించుచు దుర్యోధనుని గర్హించిరి. కులీనుడైనవానికి జననింద వధతో సమానము. అట్టి నిందకంటె మరణమే చాల మేలు. లోకనిందితుడైన యీ దుర్యోధనుడు మృతప్రాయుడు. వేళ్ళు తెగిన వృక్షము పాదులో ఊరక నిలచియున్నట్లు ఆదుర్యోధనుడు జీవించుచున్నాడు. వానిని పడగొట్టుటకు పెద్ద శ్రమ అక్కఱ లేదు. ఆ దురాత్ముడు సర్పమువలె ఎల్లవారికి వధ్యుడు, నీకేల కాడు ? వానిని వధించుటకు సంశయింపకుము.

అయినను నీవు తండ్రికి పితామహునకు ప్రణమిల్లి ప్రార్థించుట నాకు ఇష్టమే. కాఁబట్టి నేను అక్కడికి పోయి దుర్యోధనుని దౌష్ట్యమునుగూర్చి ఇంకను

సంశయించుచున్నవా రున్నచో అట్టివారి సందేహముల నన్నింటిని ఛేదింతును రాజసభామధ్యమున నీయందున్న గుణములను కీర్తించి దుర్యోధనాదులు కావించిన యపరాధములను ఉద్ఘాటింతును ధర్మార్థయుక్తముగా నేను చెప్పుమాటలను విని రాజు లందఱు నిన్ను ధర్మాత్మునిగా సత్యపరునిగా దుర్యోధనుని లోభపరాయణునిగా గ్రహింతురు పౌరజానపదులయందు కూడ దుర్యోధనాదుల దురాత్మత్వమును ప్రకట మొనరింతును. శాంతిని కోరుచు తండ్రికి తాతకు ప్రణమిల్లి ప్రార్థించుటవలన నీకు ఏమియు అధర్మము కలుగదు. రాజులు మహాజనులు, సంధికి అంగీకరింపని ధృతరాష్ట్రుని వాని పుత్రులనే నిందింతురు. ఎట్లైనను నీ ప్రయోజనము భంగపడకుండ అక్కడ శాంతికొఱకే యత్నించుచు వారి ప్రవృత్తిని, యుద్ధప్రయత్నములను పరిశీలించి విజయోపాయముల నన్వేషించుచు తిరిగివత్తును.

నాకు జూడ యుద్ధము తప్పదనియే తోచుచున్నది. మృగములు పక్షులు ఘోరముగ శబ్దములు చేయుచున్నవి. నిశాముఖములయందు ఏనుగులు గుఱ్ఱములు మొదలగునవి భయంకర రూపములతో కన్పించుచున్నవి అగ్నిహోత్రు డనేక వర్ణములతో భీకరముగా ప్రజ్వలించుచున్నాడు. దుర్యోధనుడు బ్రతికియుండగా నీకు రాజ్యము రాదు. సంగ్రామమునకు కావలసిన సన్నాహములను సమగ్రముగా గావింపుము

శ్లో|| తవ ధర్మాశ్రితా బుద్ధిః తేషాం వైరాశ్రయా మతిః |
యదయుద్ధేన లభ్యేత తత్తే బహుమతం భవేత్ || 2

శ్లో|| న చైవం నైష్ఠికం కర్మ క్షత్త్రియస్య విశాంపతే |
ఆహు రాశ్రమిణ స్సర్వే న భైక్షం క్షత్త్రియ శ్చరేత్ || 3

శ్లో|| జయో వధో వా సంగ్రామే ధాత్రా దిష్ట స్సనాతనః |
స్వధర్మః క్షత్త్రియ స్యైష కార్పణ్యం న ప్రశస్యతే || 4

శ్లో|| న హి కార్పణ్య మాస్థాయ శక్యా వృత్తి ర్యుధిష్ఠిర |
విక్రమస్వ మహాబాహో జహి శత్రూన్ పరంతప || 5

శ్లో|| తథైవ నిహతో రాజన్ యథైవ నిరపత్రపః |
నిందిత శ్చ మహారాజ పృథివ్యాం సర్వరాజభిః || 25

శ్లో|| వధ్య స్సర్ప ఇవానార్యః సర్వలోకస్య దుర్మతిః |
జహ్యేనం త్వ మమిత్రఘ్న మా రాజన్ విచికిత్సిథాః || 27

శ్రీ మహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 73

## (iii) ప్రచోదన చమసము -

ధర్మజుని దైన్యమును శ్రీకృష్ణుడు విమర్శించుట భీమునకు నచ్చ లేదు. భీముని దృష్టిలో అన్న పరమపూజ్యుడు. ఆయనను కొంచెముగా నైన ఇతరు లాక్షేపించుట భీముడు సహింప లేకపోయెను. అందువలన అతడు కృష్ణునకు ఇట్లు సమాధానము చెప్పెను. "కృష్ణా ! కౌరవులకు మాకు ఎట్లు శాంతి ఏర్పడునో అక్కడ అట్లే వారితో మాటాడుము ఆదుర్యోధనుని యుద్ధప్రసంగముతో భయపెట్ట వద్దు. అమిత దురభిమానము ఐశ్వర్యమదము కలవానితో సామవాక్యములతోనే ప్రసంగింపవలె, కాని ఉగ్రముగ మాటాడరాదు. దీర్ఘక్రోధుడు అదీర్ఘదర్శి వంచనప్రియుడు, సహజముగనే దొంగల చిత్తవృత్తి కలవాడును అయిన యాధార్తరాష్ట్రుడు చచ్చుటకైన సిద్ధపడును కాని రాజ్యభాగమునకు అంగీకరింపడు ; తనమతమును వదలడు. అతడు సుహృత్తులయందు కూడ విపరీతముగ వర్తించుచు వారి మాటలను మనస్సులను వికల మొనర్చును. అట్టివానియందు శమమును సాధించుట పరమదుష్కరము. హైహయాధీశ్వరుడైన ముదావర్తుడు మొదలుగా పదునెనిమిది మంది కులపాంసనులైన రాజులు వానితో చేరియున్నారు వా రందఱు దుర్యోధనుని క్రోధము నిమిత్తముగా భస్మము కానున్నారు కాబట్టి దర్మార్థసహితముగా హితముగా మృదువుగా మెల్లగా వాని చిత్తవృత్తిని అనుసరించుచు ప్రసంగింపుము. బెట్టిదముగా మాటాడవద్దు. ఎటైనను మా భరతవంశము నశింపకుండును గాక! అందులకు ఆవశ్యక మగుచో దుర్యోధనునకు క్రిందివారముగా చరించుచుండగలము. మేము వారితో ఉదాసీనవృత్తితో నైన ఉండగలుగునట్లుగా నీవు అచ్చట వ్యవహరింపుము. రాజ్యము కొఱకు కొట్టుకొని నశించినా రను నపప్రథ మాకురువంశమునకు కలుగకుండును గాక ! దుర్యోధనుడు శమించునట్లు సోదరులకు సౌభ్రాత్రము నిలిచియుండునట్లు చేయుడని భీష్మునితో సభాసదులతో చెప్పుము మహారాజు శాంతినే ప్రశంసించుచున్నాడు. అర్జునుడు కూడ యుద్ధమును కోరడు వానికి దయ ఎక్కువ"

ఈ మాటలను విని కృష్ణుడు నవ్వుచు నిట్లు పరిహాసించెను "భీమసేనా! ఇది ఏమి, ఇట్లు మాటాడుచున్నావు ? ఇది వఱకు నీవు క్రూరులైన ధార్తరాష్ట్రులను మర్దింపవలె నని యుద్ధమునే ప్రశంసించుచుంటివి ఇప్పుడు నీవు నిద్రించుచుంటివా ఏమి ? మేల్కొనియే యున్నావా ? పగలు రాత్రి ఎల్లప్పుడు వారిని ధిక్కరించుచునే యుంటివి , కాని ఒక్కనా డైనను నీవు వారిని అభినందింప లేదు. వారిమాట వచ్చినంతనే బొమముడిపాటుతో పండ్లు పటపట కొఱుకుచు నీవు కన్పించుచుందువు. `భగవంతుడైన భాస్కరుడు ఎట్లు గతి దప్పకుండ నిత్యము ఉదయించి అస్తమించుచున్నాడో, అంత నిశ్చితముగా నేను గదతో దుర్యోధనుని వధింతును, ఈ గదపై ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను' అని సోదరుల మధ్య ప్రతిజ్ఞ చేయుచు గదను స్పృశించుచుంటివి. అట్టి నీకు ఇప్పుడు శమమునందు బుద్ధి ఎట్లు నిలిచినది ? యుద్ధాభికాంక్షులకు పర్వదినమువలె

సంగ్రామము సంప్రాప్తమై యుండగా నిన్నే భీతి ఆవేశించినచో, భీమసేనా! ఇంక ఇతరుల చిత్తములు వైక్లబ్యమును పొందకుండునా? ఘోరములైన జనవినాశ శకునములను చూచి నీవు భీతుడవై ప్రశమమును కోరుచున్నావు. నీ మనస్సు భయకశ్మలముచే వికృతమైనది. నీహృదయము కంపించుచు నీయూరువులు స్తంభించిన ట్లున్నవి నీకు కలిగిన యీ బుద్ధి వికృతివలన, ప్రవాహమునందు తెప్పకు దూరమైన మనుష్యులవలె, పాండవులు ఆపత్సముద్రమున మునుగుచున్నారు. నీవు ఇట్లు మాటాడుట పర్వతము చలించినట్లుగా నాకు చాల ఆశ్చర్యమును కలిగించుచున్నది. వెనుకటి నీ ప్రగల్భములను వినుచు నీరూపమును చూచినవారు ఇప్పటి నీ యీ ప్రసంగమును దైన్యమును చూచినచో నీకు పిచ్చిపట్టిన దనియే తలంతురు. నీ వంశముయొక్క మహాత్త్వమును, నీవు ఇప్పటివఱకును గావించిన యద్భుతవీర సాహసకృత్యములను స్మరింపుము. విషాదము నొందకుము. వీరుడవై స్థైర్యమును పొందుము. ఈ దైన్యము నీకు తగదు. పరాక్రమముచేత క్షత్రియుడు దేనిని సంపాదింపడో దానిని అముభవింపడు".

చోదనము నొందిన మంచి జాతి గుఱ్ఱము పరుగునందుకొన్నట్లు బీముడు ఉత్తేజితుడై ఇట్లనెను. "నేను ఒక విషయమునుగూర్చి మాటాడుచుండగా నీవు దానిని మఱియొక విషయమునుగా తప్పించి మాటాడుచున్నావు. చిరకాలము నాతో కూడియుండిన నీవు నేను యుద్ధమున సత్యపరాక్రముడ నని ఎఱుంగవా ? ఇంతకాలము కలిసి మెలసి యున్నను నీకు నాస్వరూపమే తెలిసినట్లు లేదే ? నన్ను ఎఱింగినవా డెవ డైనను ఇట్టి తగని మాటలను మాటాడునా ? ఆత్మప్రశంస అనార్యులవని అయినను నీయపవాదమునకు సమాధానముగా నాపరాక్రమమును గూర్చి కొంచెముగా చెప్పెదను వినుము. నేను క్రుద్ధుడ నైనచో ఈ భూమ్యాకాశములను తాళములుగా చేసి వాయించగలను. హిమవంతుడు సముద్రుడు వజ్రహస్తుడు కలిసి సన్నద్ధులై వచ్చినను నాబాహువుల మధ్య చిక్కిన వానిని రక్షింపజాలరు. నా పరాక్రమము నీకు తెలియ దని తలంచుటకు ఎట్లు వీలగును ? నాచే జయింపబడిన రాజులను నీ వెఱుంగవా ? అప్పటి సంగతి పోనిమ్ము. ఇప్పుడు సంప్రాప్త మగుచున్న యుద్ధమున నాచే గూలెడు మత్తమాతంగములను మహావీరనికాయమును చూచినప్పుడైన నా పరాక్రమ మెట్టిదో ఎఱుంగగలవు. నా యూరువులు స్తంభించుట లేదు ; హృదయము కంపించుట లేదు సర్వలోకము సంక్రుద్ధమై నన్ను మార్కొన్నను నేను బయపడను మా బరతవంశమే నిర్మూలమే యగునేమో యని కృపతో ఆదుష్టులయెడ కొంచెము సౌహార్దమును తెచ్చుకొని మాటాడితిని".

శ్రీకృష్ణుడు మందహాసముతో మధురముగా నిట్లనెను. "భీమసేనా ! నీయందలి స్నేహముచేతనే గంభీరమైన నీ హృదయము నెఱుంగ గోరి ఇట్లంటిని , నిన్ను ఆక్షేపింపవలయు నని కాదు. నీ బలము పరాక్రమము మహత్త్వము నే నెఱుగక పోవుట యేమి ? నీవు గావించిన యద్భుత వీరసాహసకృత్యములను ఎట్లు మఱవగలము. నీవు నిన్ను గూర్చి చెప్పిన గుణములను నేను వేయిరెట్లుగా పెంచి గ్రహించుచున్నాను. నీవు

సర్వరాజాభిపూజితమైన చరితవంశమునకు భూషణము వంటివాడవే. అయినను నేను ఎందులకు ఇట్లు మాటాడితినో వినుము

దైవము కాని మానుషదర్మము కాని సందిగ్ధమైనపుడు జనులు దాని స్వరూపమును నిశ్చితముగా నెఱుంగగోరుచుందురు పురుషుని యర్థసిద్ధికి గాని వినాశమునకు కాని ఆ దర్మమే హేతు వగుటచే, అది సందేహ గ్రస్తముగ నున్నచో వానిపురుషకారమునకు ఫలము కూడ సందిగ్ధముగానే యుండును. దోషదర్శన నిపుణులైన పండితులు ఎంతో విచారించి మానుషధర్మమును నిశ్చయించి ప్రయత్నమును చక్కగా కావించినను, ఆకస్మికముగా, గాలియొక్క వేగము దాని ప్రసరణ మార్గము మాఱునట్లుగా, దైవధర్మము ప్రతికూల మైనచో, మానుషయత్నము విఫల మగును. ఒక్కొక్కప్పుడు దైవికముగా సంబవించు శీతోష్ణములు క్షుత్పిపాసలు మానుషప్రయత్నముచేత నివారించుకొన బడుచున్నవి. ప్రారబ్ధమునకు భిన్నముగా నున్న సంచితకర్మము దర్మానుష్ఠానము చేత ఆత్మజ్ఞానము చేతక్షయము నొందుచున్నది దైవ మెంత అనుకూలముగ నున్నను పురుష ప్రయత్నము లేక అది పలము నొసంగజాలదు కావున దైవదర్మమునకు అన్వయించునట్లుగా ప్రయత్నములు చేసినప్పుడే అవి ఫలించును. ఇట్లు తెలిసికొన్న వాడు ఎప్పటికప్పుడు తన కర్తవ్యమును నిశ్చయించుకొనుచు దానిని అనుష్ఠించుచు పలసిద్ధి కలుగనప్పుడు వ్యధనుగాని, కలిగినప్పుడు హర్షమును గాని పొందడు.

నేను రేపు కౌరవుల యొద్దకు పోయి శాంతిని కలిగించుటకే ప్రయత్నింతును. అది సిద్ధించెనచో నాకు గొప్ప యశస్సు, మీకు అర్థసిద్ధి, కౌరవులకు శ్రేయస్సు కలుగును వారు తమ పట్టుదలను వీడకున్నచో ఘోరమైన యుద్ధము తప్పదు. ఆ యుద్ధమున భార మంతయు నీపై నిలిచియుండును అర్జునుని యభిలాష ననుసరించి నేను అతనికి సారధ్యమును గావింతునే కాని యుదమున పాల్గొనను. అందువలన యుద్ధ బారమును ప్రదానముగా వహింపవలసిన నీవు దీనముగ మాటాడుచుండుటచే నీయందు తేజమును ఉద్దీపింపజేసితిని"

## (IV) అర్జునాదిప్రసంగ చమసము

శ్రీకృష్ణుడు భీముని సమాదానపఱచిన తరువాత అర్జునుడు ఇట్లనెను. "మాయన్న చెప్పవలసిన దంతయు చెప్పెను కాని నీ వాక్యములవలన దార్తరాష్ట్రులయందు శాంతిని సాదించుట దుష్కర మని స్పష్టమగుచున్నది చక్కగా ప్రయత్నించినచో కార్యము సపలము కావచ్చు పాండవులకు కౌరవులకు నీవు ప్రధమగణ్యుడవైన సుహృత్తువు. కావున మా రెండు పక్షములకు ఎట్లు సుఖము కలుగునో అట్లు వర్తింపుము. కౌరవులకు పాండవులకు హితమును సమకూర్చుట నీకు దుష్కరము కాదు. కావున నీవు అచ్చటికి పోవుట ఉచితమే. వారు శాంతికి అంగీకరింపకున్నచో అచ్చట నీకు ఏమి చేయుట ఉచిత

మని తోచునో అట్లే చేయుము. వారిని వధింపవలసి వచ్చినచో వధింపుము. ఆదురాత్ముడు దుర్యోధనుడు వధ్యుడు కా డనుటకు వీలు లేదు. ఏమైనను చక్కగా విచారించి మాకు ఏది హితమో దానిని నిశ్చయింపుము. నీవు మాకు గురుడవు "

శ్రీకృష్ణు డిట్లనెను "అర్జునా! నీవు చెప్పినట్లు నేను పాండవులకు కౌరవులకు క్షేమమునే సాధింపగోరుచున్నాను. శాంతి గాని యుద్ధము గాని నా ప్రయత్నముపైననే ఆధారపడియున్నది. అయినను దైవము అనుకూలింపనిచో మనము ఎంత ప్రయత్నించినను కార్యములు సిద్ధింపవు. కృషీవలుడు ఎంత శ్రద్ధగా భూమిని దున్ని సిద్ధ మొనర్చినను సరియైన సమయమునకు వర్షము కురియకున్నచో ఆ క్షేత్రమున పంటపండదు పైరు ఎండిపోవుట దైవము యొక్క కార్యము దైవ మానుషములైన కర్మలయొక్క సంయోగముచేతనే కార్యములు సిద్ధించు నని మహాత్ములు చెప్పినారు. నేను పురుష ప్రయత్నముగా ఎంత చేయదగునో, ఎంత చేయగలనో అంతయు చేయుదును. దైవమైనకార్యవిషయమున నే నేమియు చేయజాలను. దానిని మరలించుట నాకు శక్యము కాదు.

ఆ దుర్మాత్ముడైన దుర్యోధనుడు లోకముయొక్క పద్ధతిని ధర్మమును వీడి అకృత్యములను గావించియు లజ్జింపకున్నాడు. పాపిష్ఠమైన వాని బుద్ధికి సూతపుత్ర దుశ్శాసనాదులు దోహదమును గావించుచున్నారు. అతడు యుధిష్ఠిరుని యనుశాసనమును అంగీకరించు నని నేను తలంపను. వానిని సానుచరముగా వధించిననే తప్ప శాంతి సంభవింపదు. వాడు అనేకపర్యాయములు నీనుండి నన్ను దూరమొనర్చుటకు ప్రయత్నించెను ఆ ప్రయత్నములను నేను కొనసాగనీయ లేదు. వాని దుర్బుద్ధిని, ధర్మరాజునకు ప్రియమును గావింపవలయు నను నా నిశ్చయమును నీ వెఱుంగుదువు అయినను ఏమియు తెలియని వానివలె నేను యుద్ధమును అభిలషించుచున్నా నని ఏల శంకించుచున్నావు? వాక్కు చేత గాని వర్తనము చేత గాని ఎంతవఱకు సాధ్యమో అంతవఱకు శాంతిని సాధించుటకే యత్నింతును కాని ప్రత్యక్షములైయున్న పరిస్థితులనుబట్టి శాంతి సాధ్య మని తోచుట లేదు విరాటుని గోవులను దుర్యోధనుడు హరింపబూనినప్పుడు భీష్ముడు వానికి హితమును బోధింప లేదా? ఆయన చెప్పిన హితమును పెడచెవినిబెట్టి యుద్ధమున పలాయితుడైనను వానికి బుద్ధి మాఱ లేదు. ఏమైనను నాకు ధర్మరాజుయొక్క శాసనము కర్తవ్యము, ఆపాపాత్ముడు దుర్యోధనుడు ఏమి చేయబూనుకొనియున్నాడో తెలిసికొనుట కూడ ఆవశ్యకమే."

శ్లో॥ దైవే చ మానుషే చైవ సంయుక్తం లోకకారణమ్ ।
అహం హి తత్కరిష్యామి పరం పురుషకారతః ॥ 5

శ్లో॥ దైవం తు న మయా శక్యం కర్మ కర్తుం కథంచన ।
న హి దర్మం చ లోకం చ త్యక్త్వా చరతి దుర్మతిః ॥ 6

శ్లో|| జానాసి హి మహాబాహో త్వ మ ప్యన్య పరం మతమ్ |
ప్రియం చికీర్షమాణం చ ధర్మరాజస్య మా మపి || 15

శ్లో|| సంజానన్ తస్య చాత్మానం మమ చైవ పరం మతమ్ |
అజాన న్నివ మాం కస్మా దర్జు నాద్యాభిశంకసే || 16

శ్లో|| య త్తు వాచా మయా శక్యం కర్మణా వాపి పాండవ |
కరిష్యే త దహం పార్థ న త్వాశంసే శమం పరైః || 18

శ్లో|| సర్వథా తు మయా కార్యం ధర్మరాజస్య శాసనమ్ |
విబావ్యం తస్య భూయ శ్చ కర్మ పాపం దురాత్మనః || 2

శ్రీ మహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 79

నకులు డిట్లనెను "కృష్ణా ! ధర్మజ్ఞుడు వదాన్యుడును అయిన మాయన్న యభిప్రాయములను భీమార్జునుల వచనములను వింటివి. నీ యభిప్రాయమును కూడ అనేక పర్యాయములు చెప్పితివి. ఇది యంతయ్యు నిట్లుండగా నీవు అక్కడికి పోయిన తరువాత వారియభిప్రాయములను విని అప్పటికి ఏది యుచితముగా తోచునో అట్లు చేయుము. ఇప్పు డిక్కడ మనము అనుకొనుచున్నట్లుగా వారియభిప్రాయములు ఉండకపోవచ్చును. అనేక నిమిత్తములవలన పురుషుల భావములు అనేకవిదముల మార్పు నొందుచుండును. మాకు కూడ వనములలో సంచరించుచున్నప్పుడు ఇప్పు డున్నట్లుగా రాజ్యమును గూర్చిన యభిలాష లేదు. మాకు అరణ్యాజ్ఞాతవాసములు పూర్తియైన వని తెలిసినంతనే మహావీరు లనేకులు మాకు సాయముగా వచ్చినారు. ఏడు అక్షౌహిణుల సైన్యము నమకూడినది. ద్రుపదదృష్టద్యుమ్నాది మహావీరులు సన్నద్ధులై యున్నా రని విన్నచో ఎవ డైనను వ్యథ నొందును. నీవు అక్కడికి పోయి వీరిని గూర్చి చెప్పి నంతనే ధర్మజుని కార్యము సఫలమగును. విదురభీష్మాదులు ధృతరాష్ట్రుని దుర్యోధనుని అనునయించి సందికి ఒప్పింపగలరు. కావున నీవు కురుసభామధ్యమున సాంత్వనపూర్వకముగా బయోత్తరముగా మాటాడి కార్యమును సాదింపుము."

సహదేవు డిట్లనెను "మహారాజు చెప్పినది పురాతనమైన దర్మము. కాని యుద్ధ మెట్లు సంబవించునో అట్లు వ్యవహరించుటయే ఇప్పుడు కర్తవ్యము. ఏకారణముచేత నైనను కౌరవులు శాంతిని కోరుట సంబవించి నప్పటికి నీవు వారితో యుద్ధము ఏర్పడునట్లే మాటాడుము. ఆనాడు సభలో పాంచాలిని దిక్కులేని దానినిగా చూచియుండిన నా యొక్క క్రోధము సుయోధనుని సంహరింపకుండ ఎట్లు తీఱును ? ధార్మికుడైన యీ మహారాజు, ఈయనను అనుసరించి భీమార్జునులు సంధికి సిద్ధపడినను, నేను మాత్రము ధర్మమును వీడి దుర్యోధనుని యుద్ధమునకు ఆహ్వానించి మార్కొందును "

ఆ మాటలతో సాత్యకి ఉద్రిక్తుడై ఇట్లు ఉద్ఘాటించెను. "బుద్ధిశాలియైన సహదేవుడు సత్యమును చెప్పినాడు. నా కోపము కూడ దుర్యోధనునివధచేతనే శాంతించును. కృష్ణా! అరణ్యమునందు నారచీరలను కృష్ణాజినములను ధరించి దుఃఖితులైయున్న వీరిని చూచినంతనే నీకు కూడ క్రోధ ముద్భవించినది కదా ! కావున శూరుడైన సహదేవుడు చెప్పిన మాటయే సకలయోధులకు సమ్మతమై యున్నది".

## (iv) ద్రౌపదీ పరిదేవన చమనము

సాత్యకి ఇట్లు పలికినంతనే యోధసముదాయమున అన్నివైపుల నుండి, "బాగు! బాగు!" అను నినాదములు భయంకరముగా సభలో ప్రతిధ్వనించెను.

ధర్మజుని సంధివచనములను విని, భీముడు శాంతించుటను చూచి ద్రౌపది ఖిన్నురాలై కన్నుల నీరు నిండుచుండగా సాత్యకి సహదేవుల వాక్యములను మన్నించుచు తన వ్యథను ఇట్లు ప్రకటించెను. "కృష్ణా! పాండవులు ఎట్లు వంచితులై దుఃఖములపాలైనారో నీ వెఱుంగుదువు. సంజయుని సందేశమును కూడ వింటివి. అయిదుగురకు అయిదూళ్ళు ఇచ్చిన చాలు నని ఈ మహారాజు చెప్పియున్నాడు. అట్లయినను ఆదుర్యోధనుడు అందులకైనను అంగీకరించు ననుట కల్ల. వాని విషయమున సామదానములు వ్యర్థములు. అట్టివారియెడ దండమును ప్రయోగించుటయే కర్తవ్యము. అతడు రాజ్యభాగము నొసంగకున్నచో సంధికి అంగీకరించుటయే తగదు. నీవు అచ్చటకు పోవుట కూడ యుక్తము కాదు. వానిని మార్గాని దండించుటకు మనవారందఱును సమర్థులే. వానిని దండించుట నీకు కూడ యశస్కరమే. అవమానములను-అపకారములను సహించుట బ్రాహ్మణులకు తగును, కాని క్షత్రియులకు తగదు. లోభపరాయణుడైన క్షత్రియుని వధించుట క్షత్రియునకు కర్తవ్యము. అవధ్యుడైన వానిని వధించుట ఎంత పాపమో, వధ్యుడైన వానిని వధింపకుండుట అంతే పాప మని ధర్మవేత్తలు చెప్పుదురు. పాండవులతో యాదవులతో కూడి నీకు పాప మెట్లు కలుగకుండునో అట్లు వర్తింపుము.

అన్నా ! నీయందలి విశ్వాసముచేత చెప్పినమాటనే మరల చెప్పుచున్నాను. ద్రుపదమహారాజునకు వేదిమధ్యమునుండి పుత్రికనుగా ఉద్భవించి మహారథుడైన ధృష్టద్యుమ్నునకు సోదరినై మహావీరులైన పాండవులకు పత్నినై నీకు ప్రియసఖినై నీవును పాండవులు జీవించియుండగానే కౌరవులకు దాసి నైతిని, ఆ దుశ్శాసనుడు జుట్టుపట్టుకొని సభలోనికి ఈడ్చి తెచ్చెను. ఇట్టి దుర్గతిని పొందిన స్త్రీ లోకములో ఎవతె యైన నుండునా? ఈ యైదుగురు నిష్క్రియులై చూచుచుండగా అప్పుడు నిన్ను గదా స్మరించితిని. భీష్మ ధృతరాష్ట్రులకు కోడలినైన నేను దాసిని గావింపబడితిని. ఇంకను ఆ దుర్యోధనుడు జీవించియున్నా డన్నచో ఈ భీమార్జునులపరాక్రమ మెందులకు? కృష్ణా! నాయందు నీకు జాలి యున్నచో నీకోప మంతయు ధార్తరాష్ట్రులయందు వినరుము".

ఇట్లు పలుకుచు కన్నీరు ప్రవించుచుండగా ఆమె కృష్ణునియొద్దకు వచ్చి నల్లని పెద్దత్రాచువలె నున్న కేశపాశమును ఎడమచేతిపై వైచుకొని ఇట్లనెను. "కృష్ణా! నీవక్కడ సంధిని గూర్చి ప్రసంగించునప్పుడు దుశ్శాసనుని చేత లాగబడిన యీ కేశపాశమును స్మరింపుము. ఈ భీమార్జునులు శాంతికాముకులై యుద్ధవిముఖులైనచో పుత్త్రులతో కూడ మా తండ్రిని, అభిమన్యుని పురస్కరించుకొని నా పుత్త్రులు నా యవమానమును తీర్చుటకై ఆ దురాత్ములను మార్కొనగలరు. ఈ వెంట్రుకలు పట్టి లాగిన యాదుశ్శాసనుని చేయి ఖండఖండములై మట్టి గొట్టుకొని నేలపై పడియుండగా చూడకున్నచో నా హృదయమునకు శాంతి ఎట్లు కలుగును? పదుమూడు సంవత్సరములు హృదయమున రగులుచున్న ఈ పరిభవాగ్ని ఎప్పటికి చల్లారునా యని ప్రతీక్షించుచుంటిని. ఇప్పుడు మహాబాహుడైన యీ భీమసేనుని ధర్మపన్నములు వినుచుండగా, కృష్ణా, నా హృదయము బ్రద్దలగుచున్నది"

ఇట్లు పలుకుచు పాంచాలి పెద్దగా రోదనము గావించెను. ఆమెను ఓదార్చుచు కృష్ణుడిట్లనెను. "అమ్మాయీ! దుఃఖింపకుము ఆ కౌరవస్త్రీలు విధవలై నిహతబాంధవలై ఏడ్చుచుండగా త్వరలోనే నీవు చూడగలవు ఆ ధార్తరాష్ట్రులు నామాటలను వినకున్నచో యుధిష్ఠిరుని నియోగమున భీమార్జునాదులచేత వారందఱను నేలగూలి కుక్కలకు నక్కలకు ఆహారమగునట్లు చేయదగిన దంతయు చేయుదును. హిమవంతుడు చలించినను భూమి వ్రక్కలైనను నామాట తప్పదు. శత్రువులను సంహరించి నీభర్తలు అచిరకాలముననే రాజ్యశ్రీ విరాజితులు కాగలరు. దుఃఖింపకుము"

ద్రౌపదీ పరిదేవనముచేత ప్రచోదితుడై కృష్ణుడు కౌరవులయెడ సామమార్గమును వీడునేమో యనుశంకచే కాబోలు అర్జునుడు మరల ఇట్లనెను. "కృష్ణా! ఉభయపక్షముల వారికి నీవు ఉత్తముడవైన సుహృత్తువు. రెండు పక్షముల వారికి క్షేమమును సమకూర్చుటకు నీవు సమర్థుడవు. క్రోధమయుడైన యాదుర్యోధనునితో శాంతికొఱకు ఏది ఎట్లు చెప్పదగునో ఆ విషయమును అట్లు నచ్చజెప్పుము నీవు ధర్మార్థయుక్తముగా హితముగా చెప్పినదానిని అతడు గ్రహింపకున్నచో దైవోపహతుడై నశించును."

## బాలప్రియ

సంధి గావించుటకై బయలుదేఱుచున్న కృష్ణుడు ద్రౌపదితో, "వారందఱను నేలగూలి కుక్కలకు నక్కలకు ఆహారమగునట్లు చేయదగిన దంతయు జేయుదును" అని ఎట్లు ప్రతిజ్ఞచేసి చెప్పగలిగెను ? ఇట్లు ప్రతిజ్ఞ చేసినవాడు సంధికి ప్రయత్నించునా? యుద్ధమును సమకూర్చునా ? పురుషప్రయత్నము వేఱు. దైవము వేఱు. **పురుషప్రయత్నమునకు భిన్నమైన పరిస్థితి యంతయు దైవముచేత సమకూర్పబడును. దైవముయొక్క ప్రాబల్యముచేతనే దుర్యోధనుడు రాజ్యలోభమునకు వశుడై యుద్ధమును నిశ్చయించియే పదునొకండక్షౌహిణుల సైన్యమును సమకూర్చుకొనెను. పాండవుల**

పక్షమున కూడ ఏడక్షౌహిణుల సైన్యము సన్నద్ధమై యుడెను. గో గ్రహణ సమయమున బీష్మద్రోణాదులు చెప్పినను దుర్యోధనుడు పాండవులయెడ వైరమును వీడకుండుట, దైవగతి యుద్ధమునకు అభిముఖముగానే యున్న దని స్పష్ట మగుచున్నది ప్రబలమైన యాదైవగతిని మనుష్యుల శాంతియత్నములు వారింప లే వని శ్రీకృష్ణుని యభిప్రాయము. గ్రహముల బలమును చూచి జోత్రిష్కుడు, "ఇది ఇట్లు తప్పక జరుగు"నని ఉద్ఘాటించుట ఎట్టిదో కృష్ణుడు ద్రౌపదితో యుద్ధము తప్ప దని చెప్పుటయు అట్టిదే కాని అంతమాత్రమున ఆయన సంధియత్నములను చక్కగా చేయదలంచుట లే దని గ్రహింపరాదు. దైవ మెట్లున్నను ఏ పరిస్థితియందైనను ధర్మమును నిశ్చయించుకొని దాని ననుష్ఠించుట ఎవరికైనను కర్తవ్యమే యగును బంధువులు విరోధులై తమలో తాము కలహించుకొని జనవినాశము సిద్ధమగుచున్నప్పుడు సమర్థుడైన వాడు దానిని వారించుటకు యత్నింపవలెను. ధర్మానుష్ఠానమున ఫలవిచారణముతో పనిలేదు. ఫలించినను ఫలింపకున్నను ఆపదయే, సంభవించుటకు అవకాశము ఉన్నను, దర్మమును అనుష్ఠింపక తప్పదు. ఈ ధర్మనిర్వహణము కొఱకే కృష్ణుడు, "ఉభయ పక్షసందానమునకై ప్రయత్నించుటకు, నేనే యుధిష్ఠిరుని ప్రార్థించి అచ్చటికి వత్తును" అని సంజయునితో చెప్పియుండెను. అట్లే ఆయన ధర్మరాజునకు భీమార్జునులకు మాట ఇచ్చి యుండెను. అందువలన ఆయన ద్రౌపదీవరిదేవనమునకు లోబడి కాని మఱే యే యితర కారణము చేత గాని సంధికి సకల విధముల ప్రయత్నింపక ధర్మరాజాదులను వంచించి ధర్మలోపమునకు పాల్పడు నని తలంపరాదు. ఆయన వాక్కుచేత వర్తనముచేత శాంతిసాధనకై చేయదగిన దంతయు చేయుటకే నిశ్చయించుకొనె ననుట స్పష్టము.

# 2. ప్రస్థాన కమండలువు

## (i) ప్రయాణ చమసము

కార్తికమాసమున రేవతీ నక్షత్రమునందు శ్రీకృష్ణుడు హాస్తినకు బయలుదేరెను. ప్రభాతమునందు పౌర్వాహ్ణికములైన కృత్యములను తీర్చి భాస్కరుని స్తుతించి పావకు నర్చించి ఋషభమయొక్క పృష్ఠమును స్పృశించి బ్రాహ్మణులకు నమస్కరించి అగ్నికి ప్రదక్షిణ మొనర్చి మంగళప్రదములైన పదార్థములను చూచుచు ఆయన చక్రగదాద్యాయుధములను రథమునం దుంచు మని సాత్యకితో చెప్పెను. అలంకృతమై సన్నద్ధమైన రథమునందు ఆయన ఎక్కి కూర్చుండి సాత్యకిని కూడ ఎక్కించుకొనెను. ఆయ నను సాగనంపుటకు ధర్మరాజాదులు బయలుదేఱిరి.

యుధిష్ఠిరుడు శ్రీకృష్ణునియొద్దకు పోయి కౌగిలించుకొని యిట్లనెను. "కృష్ణా! ఉపవాస తపశ్శీలయైన మాయమ్మను కుశల మడుగుము. పెండ్లియై మా యింటికి వచ్చినప్పటినుండియు ఆమె ఆరంభమున కొంచెము సుఖపడిన దేమో కాని, చిరకాలముగా ఎన్నో కష్టములను అనుభవించుచున్నది మేము అడవులకు

బయలుదేఱుచుండగా మావెనుక రోదన మొనర్చుచు పరువెత్తి వచ్చుచున్నయామెను జూచి వీడ్కొని వెడలిపోయితిమి. ఆమె నెప్పటికైనను నేను సుఖపెట్టగలనా? మాధవా! మాయందఱకు బదులుగా నీవు ఆమెకు నమస్కరింపుము. ధృతరాష్ట్రునకు భీష్మాదులైన కురువృద్ధులకు ద్రోణాదులైన గురువులకు మాకు మాఱుగా ప్రణమిల్లుము.

ధర్మరాజు వెనుకకు మరలిన తరువాత అర్జునుడు శ్రీకృష్ణునివెంట పోవుచు ఇట్లనెను. " పూర్వము మేము అర్ధరాజ్యమును పొందియుంటి మని రాజుల కందఱకును తెలియును. ఇప్పుడు దుర్యోధనుడు మమ్ము అవమానింపక సత్కారపూర్వకముగా దాని నొసంగునేని నాకు ప్రీతి కలుగును. లేకున్నచో ఆ దుర్యోధనుని వానికి అనుచరమైన సకలరాజసముదాయమును అంతమొందింతును." ఆమాట విని భీముడు హర్షపరవశుడై మహారవ మొనర్చెను. అచ్చట నున్న యోధు లందఱు ఆవేశముతో కంపింపజొచ్చిరి.

రాజు లందఱును వెడలిపోయిన తరువాత కృష్ణుని రథము వేగము నందుకొనెను. అట్లు పయనించుచు కృష్ణు డొకచోట మార్గమునకు ఇరువైపుల నిలిచియుండిన మహర్షులను చూచి రథము నుండి దిగి వారికి నమస్కరించి ఇట్లనెను. "పూజ్యులారా! లోకములందు ఎల్లరకు కుశలమే కదా! ధర్మము చక్కగా అనుష్ఠింపబడుచున్నదా ? బ్రాహ్మణులయొక్క శాసనమున మూడు వర్ణములవారు వర్తించుచున్నారా ? తమరు ఎచ్చటికి బయలుదేరినారు ? మీకు ఏమేని కార్యము కాంక్షలసియున్నదా ? నేను మీకు ఏమి చేయవలయునో చెప్పుడు". పరశురాముడు ఆయనను సమీపించి ఇట్లనెను. "దేవర్షులు రాజర్షులు బహుశ్రుతులైన బ్రాహ్మణులు హస్తినయందు సమావేశము కాబోవుచున్న రాజసముదాయమును, ఆ సభామధ్యమున నిన్ను చూచుచు అచ్చట ధర్మార్థసహితముగా నీవు చేయుప్రసంగమును భీష్మ ద్రోణవిదురాదుల వచనములను వినగోరుచున్నారు. మేము హస్తినకు వచ్చుచున్నాము. అచ్చోట నిన్ను చూడగలము. పోయిరమ్ము".

మహర్షులను వీడ్కొని శ్రీకృష్ణుడు మరల బయలుదేఱెను. ఆయనవెంట పదిమంది మహారథులు, అశ్వికులు వేయిమంది, పదాతులు వేయిమంది పోవుచుండిరి. పుష్కలమైన భోజ్యపదార్థములతో నూఱుమంది భృత్యులు చనుచుండిరి. వృకస్థలమునకు చేరునప్పటికి సంధ్యాకాలమయ్యెను. కృష్ణుడు రథమునుండి దిగి సంధ్యోపాసనము గావించెను. ఆరాత్రి ఆయన అచ్చట విడిది గావించెను. అగ్రామములోని బ్రాహ్మణులు వచ్చి తమయిండ్లకు రమ్మని ఆహ్వానించిరి. ఆయన వారి యిండ్లకు పోయి చూచి తిరిగి వచ్చి విడిదియందు వారితో కూడ భుజించి ఆరాత్రి సుఖముగా గడిపెను.

## (ii) స్వాగత చమనము

దూతలవలన శ్రీకృష్ణుడు వచ్చుచుండుటను విని ధృతరాష్ట్రుడు ఆయనకు మార్గమునందు సంపన్నములైన విడుదలను ఏర్పాటు చేయు డని భీష్మాదులతో

చెప్పెను. దుర్యోధనుడు వెంటనే ఆయాప్రదేశములలో రమణీయములైన నివాసములను వానియందు **ఉత్తమములైన** యన్నపాన భోజ్యాది సముదాయములను దావదాసీజనములను ఏర్పాటు చేసెను. వృకస్థలమునందు వాసుదేవుని నివాసము కొఱకు దుర్యోధనుడు బహురత్నపూర్ణమైన విడిది ఏర్పఱచెను. ఆ విడుదల వంక నైనను చూడక కృష్ణుడు హాస్తినకు బయలుదేఱెను.

హాస్తినయందు పూర్వదినముననే ధృతరాష్ట్రుడు విదురునితో శ్రీకృష్ణుని మనముగా సత్కరింపవలె నని ఆయనకు ఇష్టములైన వన్నియు ఈయవలయు నని చెప్పెను. విదురు డిట్లనెను. "నీ హృదయము నే నెఱుంగుదును. నీవు శ్రీకృష్ణుని ప్రలోభ పెట్టి పాండవుల నుండి విడదీయవలె నని కోరుచున్నావు. ఆయన మహాత్త్వము నీ వెఱుంగుదువు. నీవు ఏమి యొసంగినను ఆయనను అర్జునుని నుండి హరింపలేవు. పాండవులు కోరుచున్న యైదు గ్రామములనైన నీవిచ్చినచో ఆయన సంతోషించును. కాని ఇతరము ఏమి యిచ్చినను ఆయన సంతోషింపడు. పూర్ణకుంభము పాద ప్రక్షాళనము కుశలప్రశ్నము తప్ప ఆయన నీవలన ఏ పదార్థమును అంగీకరింపడు".

దుర్యధను డిట్లనెను. "శ్రీకృష్ణునకు రత్నాదికము నొసంగుట అనుచితము. మన మేమి యిచ్చినను ఆయన పాండవులను వీడడు. కావున రే పాయనను ఇచ్చట బంధించుటయే కర్తవ్యము. అప్పుడు పాండవులు యాదవులు మనకు విధేయు లగుదురు. అందులకు అపాయము లేని యుపాయమును చెప్పుడు".

ఆ మాటలకు ధృతరాష్ట్రుడు చింతించి, "ఇది యధర్మ" మని కుమారుని మందలించెను. భీష్ముడు క్రుద్ధుడై వెడలిపోయెను

శ్లో|| తా స్సభాః కేశవ స్సర్వాః రత్నాని వివిధాని చ |
అసమీక్ష్యైవ దాశార్హ ఉపాయాత్ కురుసద్మ తత్ || 18

అధ్యాయము - 85

శ్లో|| అన్య త్కుంభా దపాం పూర్ణాత్ అన్యత్ పాదావసేచనాత్ |
అన్య త్కుశల సంప్రశ్నాత్ నైవేక్ష్యతే జనార్దనః || 13

అధ్యాయము - 87

## (iii) బంధు దర్శన చమసము

మఱునాడు కృష్ణుడు బ్రాహ్మణుల యనుమతిని పొంది వృకస్థలము నుండి బయలుదేఱెను. ఆయనకు స్వాగతమును చెప్పుటకై దుర్యోధనుడు తప్ప తక్కిన దార్తరాష్ట్రులు ఎదురుగా నేగిరి. కృష్ణుడు భీష్మాదులచే పరివృతుడై హాస్తినయందు

ప్రవేశించెను ఆయన రాజప్రాసాదమున మూడు కక్ష్యలను దాటి ధృతరాష్ట్రుని చేరెను ఆయన చేరవచ్చు చుండగా ధృతరాష్ట్రాదులు లేచి నిలుచుండిరి. ఆయన వారిని మదుర వాక్కులతో కుశలమడిగి మన్నించెను. ధృతరాష్ట్రుడు ఆయనకు అసన మొసంగి అర్ఘ్యపాద్యాదులతో అర్చించెను. కురువృద్ధులు తమ యాతిధ్యమును స్వీకరింపు మని శ్రీకృష్ణుని కోరిరి ఆయన వారి మాటలను నవ్వులాటగా చేసి పరిహరించి ధృతరాష్ట్రుని యొద్ద సెలవు గైకొని వారితో కూడ విదురుని యింటికి పోయెను.

విదురుడు శ్రీకృష్ణునకు స్వాగతము పలికి అర్చించి "శ్రీకృష్ణా! నీ దర్శనమువలన నాకు గలిగిన సంప్రీతిని ఏమని చెప్పగలను ? దేహధారులకు అంతరాత్మవైన నీకే తెలియును" అని పలికెను పిదప విదురుడు తన యింట ఆతిథ్యమును స్వీకరింపు మని ప్రార్థించి పాండవుల కుశలమును గూర్చి యడిగెను. కృష్ణుడు పాండవుల క్షేమసమాచారములను చెప్పెను.

మధ్యాహ్న భోజనములైన తరువాత అపరాహ్ణమున శ్రీకృష్ణుడు విదురునితో కూడ కుంతి యొద్దకు పోయెను. ఆమె ఆయనను చూడగానే కుమారులను స్మరించుచు పెద్దగా రోదనము గావించెను. ఆమె దుఃఖించుచు ఇట్లనెను. "వంచనచే రాజ్యమును గోల్పోయి నా కొడుకులు అడవులకు పోవుచు సమూలముగా నా హృదయమును కూడ కొనిపోయిరి. దుఃఖమునకు అనర్హులైన నా పుత్రులు అడవులలో ఎట్లున్నా రయ్యా! ఇప్పు డా ఉపప్లవ్యమున ఎట్లున్నారో చెప్పుము. కృష్ణా! నాకు పుత్రులందఱకంటె ద్రౌపది ప్రియతమ. పుత్రలోకమును వీడి పతిలోకమునే వరించుచు ప్రియులైన పుత్రులను వదలి భర్తలనే ఆమె అనుసరించినది. అట్టి శీలముగల యామె సుఖమును పొందలే దన్నచో పుణ్యకర్మలచేత ఎవడును సుఖమును పొంద డనుట నిశ్చయము. రజస్వలయై ఏకవస్త్రయై యున్న యామెను దురాత్ముడైన దుశ్శాసనుడు భీష్మద్రోణకృపాదులచే అధిష్ఠితమైన సభకు ఈడ్చుకొని వచ్చుటను చూచితిని. అంతకంటె దుఃఖతరమైన దే మున్నది ? అప్పు డామెను చూచుచు ఊరకుండిన యుధిష్ఠిరుడు కాని, భీమార్జునులు కాని, నకుల సహదేవులు కాని ఆమెకంటె నాకు ప్రియులు కారు. అప్పుడు విదురు డొక్కడే పూజ్యవర్తను డైనాడు.

దుర్యోధనుని వంచనముచేత నా పుత్రులు కష్టములపాలై పదునాల్గవ యేడు జరుగుచున్నది. దుఃఖానుభవము చేత పాపము నశించి పుణ్యఫలముచే సుఖము లభించు నన్నచో వారికిప్పుడు తప్పక సుఖము లభింపవలె. నాకు పాండవులయందు ధార్తరాష్ట్రులయందును సమదృష్టియే, కాని భేదబుద్ధి ఎప్పుడును లేదు. ఈ సత్యప్రభావము చేత ఈ సంగ్రామమునందు విజయవిరాజితులైన పుత్రులతో కూడ జయలక్ష్మీ శోభితుడ వైన నిన్ను చూడగలను.

నాయీదుర్గతికి ఎవరి నేమందును ? దుర్యోధనుని నిందించినచో నేమి లాభము? నా తండ్రినే నిందింపవలసియున్నది. కందుకములతో ఆడుకొనుచున్న బాలికను నన్ను

మీ తాత దనమును వలె కుంతిభోజునకు దానము చేసినాడు. కృష్ణా! నేను తండ్రిచే వంచింపబడి యీ యింటికి వచ్చి శ్వశురులచే కూడ వంచింపబడితిని దుఃఖము తప్ప నా జీవితమునకు ఫల మేమున్నది ? అర్జునుడు జన్మించినప్పుడు ఆరాత్రి, అశరీరమైన వాక్కు యిట్లు వినిపించెను. "నీ పుత్రుడు పృథివిని జయింపగలడు, వీని కీర్తి దేవలోకమునకు ప్రాకగలదు. మహాయుద్ధమున కౌరవులను సంహరించి రాజ్యమును సంపాదింపగలడు. భ్రాతృసహితుడై కౌంతేయుడు మూడు అశ్వమేధములను గావించును". ఇప్పటికది పలింప లేదని నేనా వాక్కును నిందించుట లేదు. ధర్మమునకు నమస్కరించుచున్నాను. ప్రజలను ధర్మము ధరించుచున్నది. ఆ యశరీరవాణి పలికినది దర్మ మగు నేని నీవు దాని నంతయు సంపాదింపగలవు

యుధిష్ఠిరునితో, "మీయమ్మ పరాశ్రయమున దీనురాలై బ్రతుకుచుండుట నీకు పెద్ద అప్రతిష్ఠయగుటయే కాదు ధర్మలోపము కూడ అగును" అని చెప్పుము. "క్షత్రియస్త్రీ పుత్రులను ఎందులకు పొందునో అ ప్రయోజనమును సాధింపవలసిన కాలము వచ్చినది" అని భీమార్జునులకు, "జీవితముకంటె క్షత్రియునకు విక్రమార్జితములైన భోగములే ప్రీతిని కలిగించు" నని నకులసహదేవులకు నామాటగా చెప్పుము.

భీమార్జునులు నీవు బలరాముడును జీవించి యుండగానే నే నిట్టి కష్టములను సహింపవలసి వచ్చుచున్నది గదా".

ఇట్లు చెప్పుచు దుఃఖించుచున్న కుంతిని కృష్ణుడు ఇట్లు ఓదార్చెను. "అత్తా ! నీవంటి స్త్రీ లోకములో ఎవరున్నారు ? శూరునకు పుత్రికవుగా మహాకులమున జన్మించి భరతవంశమునకు చేరి వీరపత్నివి వీరమాతవును ఐతివి. మహాప్రాజ్ఞురాలవైన నీవు సుఖదుఃఖములను సమముగా సహింపవలె. నీకొడుకులు గ్రామ్యసుఖములను వీడి నిద్రాలసత్వములను హర్షక్రోదములను క్షుత్పిపాసలను ఎండను చలిని నిర్జించి వీరసుఖప్రియులై యున్నారు. మహోత్సాహులు మహాబలశాలులైన వారు స్వల్పలాభముతో సంతోషింపరు. ధీరులు దేనియందైనను పరాకాష్ఠను సాధించి యందే రమింతురు , కాని సామాన్యులవలె అల్పవిషయములయందు ఆసక్తి నొందరు. పాండవులు పాంచాలియు నీకు ప్రణమిల్లి కుశల మడుగు మన్నారు. వారు కుశలముగ నున్నారు. సిద్ధార్థులై ప్రాభవోపేతులైన పుత్రులను త్వరలోనే నీవు చూడగలవు".

ఆ మాటలచేత ఆమె ఆశ్వాసనమును పొంది అజ్ఞానజన్యమైన శోకమును వీడి ఇట్లనెను. "కృష్ణా! నీ సత్యముయొక్క జన్మముయొక్క ప్రభావమును నే నెఱుంగుదును. ధర్మమునకు లోపము కలుగకుడ వంచనము లేకుండ నా పుత్రులకు ఏది ఎట్లు ఉచిత మగు నని నీవు తలంతువో వారికి అట్లు బోధించి అప్రకారముగా వర్తింపజేయుము మిత్రుల ధర్మము వ్యవస్థిత మగునట్లు చేయుటయందు బుద్ధియందు విక్రమమునందు నీవే సమర్థుడవు. నీవే మాకులమునకు రక్షకుడవు. సత్యము ధర్మము మహితమైన తపస్సు నీస్వరూపమై యున్నవి. నీవు పరబ్రహ్మవు. నీయందు సర్వము ప్రతిష్ఠితమై

యున్నది నీవు ఎట్లు చెప్పితివో అది యట్టే సత్యముగా జరుగును"

శ్లో॥ ప్రాత రుత్థాయ కృష్ణ స్తు కృతవాన్ సర్వ మాహ్నికమ్।
బ్రాహ్మణై రభ్యనుజ్ఞాతః ప్రయయౌ నగరం ప్రతి॥ 1

శ్లో॥ ధార్తరాష్ట్రా స్త మాయాన్తం ప్రత్యుజ్జగ్ముః స్వలంకృతాః।
దుర్యోధనా దృతే సర్వే భీష్మద్రోణకృపాదయః॥ 3

శ్లో॥ అభ్యాగచ్ఛతి దాశార్హే ప్రజ్ఞాచక్షు ర్నరాధిపః।
సహైవ ద్రోణభీష్మాభ్యా ముదతిష్ఠన్ మహాయశాః॥ 13

శ్లో॥ కృతాతిథ్య స్తు గోవిందః సర్వాన్ పరిహసన్ కురూన్।
ఆస్తే సాంబందికం కుర్వన్ కురుభిః పరివారితః॥ 20

**నీలకంఠీయ** పరిహసన్ నర్మ కుర్వన్। సాంబందికం ధనంజయాది సంబంధ హేతుకం వ్యవహారమ్।

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 89

శ్లో॥ సర్వైః పుత్త్రైః ప్రియతరా ద్రౌపదీ మే జనార్దన।
కులీనా రూపసంపన్నా సర్వైః స్సముదితా గుణైః॥ 43

శ్లో॥ పుత్త్రలోకాత్ పతిలోకం వృణ్వానా సత్యవాదినీ।
ప్రియాన్ పుత్త్రాన్ పరిత్యజ్య పాండవా ననురుధ్యతే॥ 44

శ్లో॥ న ప్రియో మమ కృష్ణాయాః బీభత్సు ర్న యుధిష్ఠిరః।
భీమసేనో యమౌ వాపి య దపశ్యం సభాగతామ్॥ 49

శ్లో॥ తస్యాం సంసది సర్వేషాం క్షత్తారం పూజయా మ్యహమ్।
వృత్తేన హి భవ త్యార్యో న ధనేన న విద్యయా॥ 53

శ్లో॥ న మే విశేషో జా త్వాసీత్ ధార్తరాష్ట్రేషు పాండవైః।
తేన సత్యేన కృష్ణ త్వాం హతామిత్రం శ్రియావృతమ్।
అస్మా ద్విముక్తం సంగ్రామాత్ పశ్యేయం పాండవై స్సహ॥ 61

శ్లో॥ వ్యవస్థాయాం చ మిత్త్రేషు బుద్ధి విక్రమయో స్తథా।
త్వ మేవ నః కులే ధర్మః త్వం సత్యం త్వం తపో మహత్॥ 103

**శ్లో॥ త్వం త్రాతా త్వం మహద్బ్రహ్మ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్।**
**యథై వాత్థ తథై వైత త్త్వయి సత్యం భవిష్యతి॥** 104

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 90

## (iv) ఆతిథ్య నిరాకరణ చమసము

శ్రీకృష్ణుడు కుంతియింటినుండి దుర్యోధనుని భవనమునకు పోయెను. ఆయనను చూచినంతనే దుర్యోధనుడు అమాత్యులతో కూడ లేచి నిలుచుండి గౌరవించెను. శ్రీకృష్ణునకు ఆసనము అర్ఘ్యపాద్యాదుల నొసంగిన తరువాత దుర్యోధనుడు తన యింట భోజనమునకు ఉండు మనెను. ఆమాటను కృష్ణుడు అభినందింప లేదు. అప్పుడు దుర్యోధనుడు కర్ణునితో సంప్రదించి కురువృద్ధులు రాజసముదాయము వినుచుండగా కృష్ణునితో మృదువుగా శాఠ్యగర్భితముగా ఇట్లనెను. "కృష్ణా! నీకొఱకు సమకూర్పబడిన నివాసములను అన్నపానశయనాదులను నీవు ఏల గ్రహింపలేదు ? నీవు రెండు పక్షముల వారికి సాహాయ్య మొసంగుచు హితమును కోరుచునే యున్నావు. నీవు మాకు సంబంధివి , ధృతరాష్ట్రునకు ప్రియుడవు. నీవు సకలవిధముల ధర్మముయొక్క అర్థముయొక్క తత్త్వము నెఱుంగుదువు. నీయీవర్తనమునకు కారణ మేమో ఎఱుంగగోరుచున్నాను"

శ్రీకృష్ణుడు చేయి పైకెత్తి మేఘగంభీర నిస్వనముతో ఇట్లనెను. "సుయోధనా! దూతలు కృతార్థులైనతరువాత భుజింతురు, పూజను గ్రహింతురు. నేను దౌత్యమున కృతార్థుడనైన పిమ్మట నీవు అమాత్యసహితముగా నన్ను అర్చింపగలవు".

దుర్యోధనుడు ఇట్లనెను. "నీవు మాయందు అనుచితమైన రీతిని చూపుట యుక్తముగా లేదు. నీవు కృతార్థుడవైన నేమి, కాకున్న నేమి ? మేము నిన్ను పూజింప ప్రయత్నించుచున్నాము. అది మాకు సాధ్య మగుట లేదు. మేము ప్రీతితో నొసంగుచున్న మా పూజను నీవు అంగీకరింపకుండుటకు హేతు వేమో తెలియుట లేదు. నీతో మాకు వైరము లేదు , యుద్ధము లేదు. ఈ విషయము నెఱింగియు నీ విట్లు మాటాడుట సమంజసముగా లేదు".

శ్రీకృష్ణుడు దుర్యోధనుని అమాత్యులను సభలోని వారిని కలయ జూచి పెద్దగా నవ్వుచు ఇట్లనెను. "సుయోధనా! కామమువలన గాని సంరంభమున గాని, ద్వేషమువలన గాని, ఏదేని ప్రయోజనముకొఱకు గాని, హేతువాదమువలన గాని, లోభమువలన గాని నేను ఎప్పుడును ధర్మమును వీడను. ఇతరులయిండ్లయందు సంప్రీతివలన గాని ఆపదయందు గాని భుజింపవలసియుండును. నీకు మాయందు సంప్రీతి లేదు. మాకు ఇప్పుడు ఆపద లేదు. నీవు పుట్టినప్పటి నుండియు పాండవులను ద్వేషించుచున్నావు. నీకు ప్రియులు అనువర్తులు గుణవంతులు నైన పాండవులను నిర్హేతుకముగా ద్వేషించుట అయుక్తము. వారు ధర్మమునందు స్థిరముగా నున్నారు. వారియందు ఎవడు ఏ దోషమును చూపగలడు ? ఎవడు వారిని ద్వేషించుచున్నాడో వాడు నన్ను ద్వేషించుచున్నాడు. ఎవడు వారిని అనుసరించుచున్నాడో వాడు నన్ను అనుసరించును. ధర్మవర్తనులైన వారితో నేను ఏకాత్మత్వమును పొందియుంటి నని

యెఱుంగుము. కామక్రోధములకు వశుడై అజ్ఞానమువలన గుణవంతుని ద్వేషించుచు విరోధమును పూనువానిని పురుషాధము డందురు ఇతరులయందలి కళ్యాణ గుణములను గుర్తింపలేని యజితాత్ముడు చిరకాలము సంపదలను నిలుపుకొనలేడు. తనకు ఇష్టులు కాని వారియందు కూడ గుణములను గుర్తించి వారిని తనకు వశ్యులనుగా చేసికొనువాడు చిరకాలము సంపద్యశోవిరాజితు డగును

దుష్టమైన గూఢమైన అభిప్రాయము కలిగిన వారి యీ అన్న మంతయు భోక్తవ్యము కాదు. ఒక్క విదురుని యన్నమే భుజింపదగిన దని తలంచుచున్నాను"

శ్లో॥ ఉదతిష్ఠత్ సహామాత్యః పూజయన్ మధుసూదనమ్ |
సమేత్య ధార్తరాష్ట్రేణ సహామాత్యేన కేశవః ॥ 7

శ్లో॥ రాజభి స్తత్ర వార్ష్ణేయః సమాగచ్ఛత్ యథా వయః | 8

శ్లో॥ ఉపాసాంచక్రిరే సర్వే కురవో రాజభి స్సహ |
తతో దుర్యోధనో రాజా వార్ష్ణేయం జయతాం వరమ్ ॥ 11

శ్లో॥ న్యమంత్రయత్ భోజనేన నాభ్యనంద చ్చ కేశవః |
తతో దుర్యోధనః కృష్ణ మబ్రవీత్ కురునందన ॥ 12

శ్లో॥ మృదుపూర్వం శఠోదర్కం కర్ణ మాభాష్య కౌరవః |
కస్మా దన్నాని పానాని వాసాంసి శయనాని చ ॥ 13

శ్లో॥ త్వదర్థ ముపనీతాని నాగ్రహీ స్త్వం జనార్దన |
ఉభయో శ్చ దదత్ సాహ్య ముభయో శ్చ హితే రతః ॥ 14

శ్లో॥ సంబంధీ దయిత శ్చాసి ధృతరాష్ట్రస్య మాధవ |
త్వం హి గోవింద ధర్మార్థౌ వేత్థ తత్త్వేన సర్వశః |
తత్ర కారణ మన్విచ్ఛామి శ్రోతుం చక్రగదాధర ॥ 15

శ్లో॥ కృతార్థా భుంజతే దూతాః పూజాం గృహ్ణన్తి చైవ హి |
కృతార్థం మాం సహామాత్యం సమర్చిష్యసి భారత ॥ 18

శ్లో॥ ఏవ ముక్తః ప్రత్యువాచ ధార్తరాష్ట్రో జనార్దనమ్ |
న యుక్తం భవ తాస్మాసు, ప్రతిపత్తు మసాంప్రతమ్ ॥ 19

శ్లో॥ కృతార్థం వాఽకృతార్థం చ త్వాం వయం మధుసూదన |
యతామ హే పూజయితుం దాశార్హ న చ శక్నుమః ॥ 20

శ్లో|| న చ త త్కారణం విద్మో యస్మి న్నో మధుసూదన |
పూజాం కృతాం ప్రీయమాణైః నా మంస్థాః పురుషోత్తమ | 21

శ్లో|| వైరం నో నాస్తి భవతా గోవింద న చ విగ్రహః |
న భవాన్ ప్రసమీక్ష్యైతత్ నేదృశం వక్తు మర్హసి || 22

శ్లో|| ఏవ ముక్తః ప్రత్యువాచ ధార్తరాష్ట్రం జనార్దనః |
అభివీక్ష్య సహామాత్యం దాశార్హః ప్రహస న్నివ || 23

శ్లో|| నాహం కామా న్న సంరంభా న్న ద్వేషా న్నార్థకారణాత్ |
న హేతువాదా ల్లోభా ద్వా ధర్మం జహ్యాం కథంచన || 24

శ్లో|| సంప్రీతిభోజ్యా న్యన్నాని ఆపద్భోజ్యాని వా పునః |
న చ సంప్రీయసే రాజన్ న చై వాపద్గతా వయమ్ || 25

శ్లో|| అకస్మా ద్ద్వేష్టి వై రాజన్ జన్మ ప్రభృతి పాండవాన్ |
ప్రియానువర్తినో భ్రాతౄన్ సర్వై స్సముదితాన్ గుణైః || 26

శ్లో|| అకస్మా చ్చైవ పార్థానాం ద్వేషణం నోపపద్యతే |
ధర్మే స్థితాః పాండవేయాః క స్తాన్ కిం వక్తు మర్హతి || 27

శ్లో|| య స్తాన్ ద్వేష్టి స మాం ద్వేష్టి య స్తా నను స మా మను |
ఐకాత్మ్యం మాం గతం విద్ధి పాండవై ర్ధర్మ చారిభిః || 28

శ్లో|| సర్వ మేత న్న భోక్తవ్య మన్నం దుష్టాభిసంహితమ్ |
క్షత్తు రేకస్య భోక్తవ్య మితి మే ధీయతే మతిః || 32

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 91

## బాలప్రియ

దుర్యోధనుడు ఇంటికి వచ్చిన బంధువును భోజనమునకు ఉండు మని కోరుట సమంజసమే. దూతగా వచ్చిన కృష్ణుడు కార్యము ఫలింపక ముందు అందులకు అంగీకరింపక పోవుట కూడ ఉచితమే. కాని అప్పుడు దుర్యోధనుడు కర్ణునితో సంప్రదించి మృదువుగా శార్యగర్భితముగా కురువృద్ధులు రాజసముదాయము వినుచుండగా ఆవిషయమును కృష్ణునితో తర్కించుట గమనింపదగియున్నది. దుర్యోధనుడు కర్ణునితో సంప్రదించె (అభాష్య) ననగా ముందే వారిద్దఱు కృష్ణుని నిండుసభలో ఈ విషయమున ప్రశ్నించి దోషినిగా నిరూపింపవలయు నని ఆలోచించుకొని యున్నా రన్నమాట. దుర్యోధనుడు ఈ విషయమును

అడిగినంతమాత్రమున అతని ప్రసంగము శార్యగర్భిత (శార్యోదర్క) మగునా? అతడు కేవలము కారణము తెలిసికోవలయు ననుతలంపుతో అడిగినచో ఆ ప్రసంగము శార్యగర్భితము కాదు. అతడు కారణమును తెలిసికొనుటకొఱకు గాక కృష్ణుని రాజసమక్షమున ధర్మహీనునిగా నిరూపించుటకే ఆ ప్రసంగము నారంభించెను. అందువలన అది శార్యగర్భిత మగుచున్నది

దుర్యోధనుని శఠత్వమును వెల్లడి చేయుటకే శ్రీకృష్ణుడు అక్కడ నున్నవారి నందఱను కలయజూచి నవ్వుచు మొగమోటమి లేకుండ సమాధానము చెప్పెను. అట్లు మొగమోటమి లేకుండ మాటాడుట కూడ అందఱకు సులభము కాదు. మఱియొకడైనచో ఏవో మాటలను చెప్పి విషయమును తప్పించియుండెడివాడు. కాని కృష్ణుడు అతనియింట భుజింపక పోవుటలో గల దర్మమును నిష్కృష్టముగా నిరూపించుచు తాను ధర్మము వీడి వర్తించుట లేదని స్పష్ట మొనరించెను.

"కామక్రోధాదులవలన నేను ఎప్పుడును ధర్మమును వీడను" అని శ్రీకృష్ణుడు చెప్పుట గమనింప దగియున్నది. ఇది ఆత్మప్రశంస కాదా ? కాదు. ఇతరులు తన్ను ధర్మహీనునిగా సభలో నిరూపింప దలచుకొన్నప్పుడు ఎవడైనను తనధర్మప్రవృత్తిని ప్రకటించుట ఆత్మప్రశంస కాదు. ఈవాక్యమువలన శ్రీకృష్ణుడు ధర్మమును ఎప్పుడును ఉల్లంఘింప లేదని, ఆయన వర్తనమున ఇతరులు యక్రమచర్యలుగా బావించునట్టివి అన్నియు ఆభాసములే కాని యధార్థముగా అధర్మములు కావని గ్రహింపవలసియున్నది "నేను ఎప్పుడును దర్మమును వీడను" అని చెప్పుట కూడ, వర్తించుట ఎట్లున్నను, సామాన్యులకు సాద్యము కాదు బీష్మద్రోణాదులు కూడ ఇట్లు తమ ధార్మికత్వమును ఉద్ఘాటింప గలుగుట అసంభవము. ద్రౌపదీ పరిభవమును చూచి సహించుచు దుర్యోదనుని ఆనాడు నివారించుటకు పూనుకొననివారు ఆ యదర్మమున బాగస్వాములే యైరి. పెద్దలను నిండుసబలో నిందించుట అధర్మము కావున శ్రీకృష్ణుడు ఈ విషయమును స్పష్టముగా పేర్కొనలేదు కాని, "దుష్టమైన యభిసంది కలిగిన వారి యీయన్న మంతయు భోక్తవ్యము కాదు , ఒక్క విదురుని యన్నమే భోక్తవ్యము" అను వాక్యముచేత సూచించినాడు ఆయన "నీయన్నము" అని దుర్యోధనుని యన్నమును మాత్రమే నిషేధింపలేదు "ఈయన్న మంతయు" అని చెప్పుచు ఆయన భీష్మద్రోణాదుల యన్నము కూడ నిషిద్ధమే యని స్ఫురింపజేసెను విదురుని యన్నము మాత్రమే భుజింప దగినది అను మాటవలన ఈ నిషేదమును వ్యక్త మొనరించెను.

దుష్టాబిసంహితమైన యీ యన్నమంతయు బుజింపరానిది అని అన్నప్పుడు ఇచ్చట దుష్టమైన యభిసంది ఏది ? వారు ఆయనను ప్రీతివచనములతో మర్యాదపూర్వకముగానె ఆహ్వానించుచున్నారు గదా! అభినంధి అనగా ప్రకటము కాని యుద్దేశము. దుర్యోధనుడు దుష్టుడు. వానిచర్యలు దుష్టములు. వాడు ఇంటికోడలిని సభకు తెప్పించి పరిబవించుట అత్యంతము దుష్టము. దానిని వారించుటకు నమర్థులై

యుండియు భీష్మద్రోణాదులు చూచుచు ఊరకుండుట అధర్మము. వాని చర్యవలె వారియుపేక్ష కూడ దుష్టమే. అంతే కాదు. అంత దుష్టుడైన దుర్యోధనుని వారు శిక్షింపలేకున్నను, వానిని విడిచిపెట్టి యుండవలసినది. వృద్ధులైన భీష్మద్రోణులు వానప్రస్థము నవలంబించి వనములకు పోయినచో వారిని ఎవరును అడ్డగింపలేరు. అట్లు చేయక దుర్యోధనుడు పాండవుల విషయమున ఎన్ని యక్రమములను చేయుచున్నను, అప్పుడప్పుడు మాటమాత్రముగ ధృతరాష్ట్రునివలె మందలించుచున్నారే కాని వానిని విడిచిపెట్టలేదు. విరాటుని గోవులను హరించుటకు కూడ దుర్యోధనుని వెంట వారు పోయియుండుటవలన, "దుర్యోధనుడు ఎంత దుష్టుడైనను వానిపక్షముననే మేము ఉందుము" అని వారియభిసంధి వ్యక్తమైనది. దుష్టునకు అండగా ఉండవలయు నను నభిసంధి దుష్టము. అట్టి యభిసంధి కలిగినవారి యన్నము కూడ దుష్టమే.

"కామక్రోధాదులవలన నే నెప్పుడును ధర్మమును వీడను" అని శ్రీకృష్ణు డనుటవలన వ్యవహారమునందు జ్ఞాని ఎట్లు వర్తించు ననువిషయము కూడ వ్యక్త మగుచున్నది. లోకులు ఏయేకారణముల చేత ధర్మమును వీడుదురో ఆకారణములను ఆయన పేర్కొనెను. ఆత్మజ్ఞానము లేనివారికి తమదేహము, కుటుంబము, మిత్రులు, శత్రువులు, కష్టములు, సుఖములు మొదలుగా జగద్వ్యవహారము అంతయు సత్యముగానే తోచుచుండును. అందువలన వారు కష్టము కలిగినప్పుడో, లేక కలుగునని భయము తోచినప్పుడో, పరులసంపదపై ప్రలోభము కలిగినప్పుడో ధర్మమును లెక్కపెట్టక అధర్మమునకు పాల్పడుచుందురు. ధర్మమునకు అధర్మమునకు సాధారణముగా వెంటనే ఫలము కలుగదు. అందువలన ప్రస్తుతము కలుగుచున్న సుఖమునకే ఆశపడుచు, ఎప్పుడో కలుగునన్న పాపఫలమును లెక్కపెట్టరు. కాని జ్ఞాని యిట్లు తలంచుటకు అవకాశము లేదు. "జ్ఞాని యనగా ఆత్మయనియే నా నిశ్చయము" (జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్) అని శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా జ్ఞాని ఆత్మస్వరూపుడే. ఆత్మస్వరూపుడైన జ్ఞాని తనకంటె అన్యముగా జగత్తు ఉన్నదని తలంపడు. విద్యారణ్యస్వామివారు తత్త్వవేత్తను గూర్చి ఇట్లు చెప్పిరి. "జ్ఞానామృతముచేత తృప్తుడై కృతకృత్యుడైన యోగికి కర్తవ్య మేదియు నుండదు; ఉండినచో అట్టివాడు తత్త్వవేత్త కాడు".

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్ కర్తవ్య; మస్తి చేత్ న స తత్త్వవిత్॥

ఇట్లయినచో తత్త్వవేత్తలు ఏకార్యములు చేయకుండ జడులవలె నుందురా ? శ్రీకృష్ణుడే కాదు విద్యారణ్యస్వామి వారు కూడ ఎన్నో కార్యములను నిర్వహించినారు కదా ! నిజమే. ఆ కార్యములు ఏవియు వారు సంకల్పించినవి కాదు. జ్ఞానము కలిగినంతనే ప్రారబ్ధము నశింపదు. అందువలన ప్రారబ్ధముచేత వచ్చిన శరీరము, దానికి సంబంధించిన వ్యవహారము నశింపదు. అందువలన తత్త్వవేత్తకు కూడ శరీరము ఉన్నంతవఱకు వ్యవహారము తప్పదు. అతడు అందఱవలెనే వ్యవహార

మొనర్చుచున్నను, ఈ జగత్తును స్వప్నప్రాయముగానే గ్రహించును గాని సత్యమునుగా తలంపడు అందువలన అతనికి ఏదియు కర్తవ్యముగా తోచదు. తనకు కర్తవ్యము ఏమియు లేనప్పటికి తత్త్వవేత్త ప్రారబ్ధవశమున ఏర్పడిన వ్యవహారమునందు ఏది ధర్మ మగునో దానినే ఆచరించును : అధర్మమును ఆచరింపడు. అధర్మమునకు పాల్పడుటకు హేతువులైన కామక్రోధాదులకు జ్ఞానియందు అవకాశ ముండదు. జగత్తు మిధ్యగా గోచరించుచున్నవానికి కామక్రోధములు ప్రలోభములు ఎట్లు కలుగును ? అవి కలిగిన వన్నచో అతనికి జగత్తు మిథ్యగా తోచుట లేదని, సత్య మను భ్రాంతి వదల లేదని గ్రహింపవలసియున్నది. బ్రహ్మజ్ఞునకు కర్తవ్యమే భాసింపదన్నచో అధర్మమునకు తావెక్కడిది ?

మఱి ధర్మజునకు మోక్షధర్మములను మహర్షుల సమక్షమున బోధించిన భీష్ముడు జ్ఞాని కాడా? ఆయన శాస్త్రజ్ఞాన సంపన్ను డనుటకు సందియము లేదు. కాని జగత్తు సత్య మను భ్రాంతి పూర్తిగా తొలగి పోయి అపరోక్షమైన యాత్మానుభూతి ఆయనకు సిద్ధించిన దనుటకు వీలు లేదు. కఠోపనిషత్తులో యముడు చెప్పినట్లుగా, "ఈ యాత్మ ప్రవచనముచేత లభ్యము కాదు ; మేధచేత గాని గొప్పవిజ్ఞానము చేత గాని లభ్యము కాదు" అని గ్రహింప వలసియున్నది.

"నాయ మ్మాత్మా ప్రవచనేన లభ్యో | న మేధయా న బహునా శ్రుతేన |

**ద్వితీయవల్లి - మంత్రము - 23**

శ్రీకృష్ణునివలె ఆయన జ్ఞానామృతముచేత సంతృప్తుడు, కృతకృత్యుడు కాకుండుట వలననే, శ్రీకృష్ణుని బహువిధముల భక్తితో స్తుతించెను.

## (v) విదురాతిథ్య చమసము

శ్రీకృష్ణు డక్కడనుండి బయలుదేఱి విదురుని యింటికే మరల వచ్చెను. భీష్మద్రోణకృపాదులు అచ్చటికి వచ్చి, "మా యిండ్లయందు ఉండుము" అని ఆయనను అభ్యర్థించిరి. ఆయన వారిని చూచి, "మీ రందఱును నన్ను అర్చించినట్లే మీరు పోవచ్చును" అనెను. విదురుడు నివేదించిన గుణవంతములైన పదార్థములతో ఆయన ముందుగా బ్రాహ్మణులకు సంతర్పణము చేసి ధనము లొసంగి పిదప భుజించెను.

ఆరాత్రి శ్రీకృష్ణుడు విశ్రమించి యుండగా విదురుడు ఆయనతో ఇట్లనెను "కృష్ణా! నీవు ఇక్కడికి వచ్చుట సరియైన పని కాదు. ఈ దుర్యోధనుడు ధర్మశాస్త్రమును పెద్దలయనుశాసనమును అతిక్రమించిన మూఢుడు. నీవు శ్రేయస్కరముగా చెప్పుమాటను గ్రహింపడు. భీష్మాదులు పాండవులను జయించి తనకు రాజ్యము నొసంగగలరని తలంచుచు వీడు శాంతికి ఉన్ముఖుడుగా లేడు. సేనాసముదాయములను సంపాదించుకొని వీడు తాను కృతార్థు డైనట్లే తలంచుచున్నాడు. కర్ణు డొక్కడే

పాండవులను జయింపగల డని వీడే కాక వీని సోదరులు కూడ తలంచుచున్నారు. సౌభ్రాత్రమును కోరుచున్న పాండవులకు ప్రతిఫలముగా తాము ఏమియు ఈయరాదనియే వీరు నిశ్చయించుకొని యున్నారు. చెవిటివారియొద్ద సంగీతమును ప్రవర్తింపజేసినట్లు వీరియొద్ద నీయుపదేశము నిరర్థకము. హస్త్యశ్వరథ సంకులమైన సేనా సముదాయమధ్యమున నిలిచి దుర్యోధనుడు పృథివి యంతయు తనచే జయింపబడినట్లే తలంచుచున్నాడు. ఈ రాజు లందఱు పూర్వము నీచే జయింపబడి నీ మీద వైరముతో వీనియొద్దకు చేరినారు. వీరందఱు పాపబుద్ధులు. వీరిమధ్య నీవు ప్రవేశించుట నాకు సమ్మతము కాదు. నీప్రభావమును మహత్త్వమును నేనెఱుంగుదును. అయినను నీయందున్న ప్రేమచేత ఇట్లు చెప్పుచున్నాను. నాకు పాండవులయందు ఎంత ప్రీతి యున్నదో అంతకంటెను అధికముగా నీయందు అనురాగమున్నది".

శ్రీకృష్ణుడు ఇట్లనెను. "విచక్షణుడు మహాప్రాజ్ఞుడైనవాడు ఎట్లు చెప్పునో అట్లు చెప్పితివి. నీవంటి వాడు నావంటి సుహృత్తునకు చెప్పవలసినదానిని ఉద్ఘాటించితివి. తల్లివలె తండ్రివలె నీవు ధర్మార్థయుక్తము తథ్యము నైన మాటను చెప్పితివి. సంప్రాప్తమైన యీ పరిస్థితియందు నీవు చెప్పినది సత్యమే యుక్తమే. నేనెందులకు వచ్చితినో చెప్పెదను శ్రద్ధగా వినుము.

దుర్యోధనుని దురాత్మత్వమును ఈ క్షత్రియులకు నాయందున్న వైరమును ఎఱింగియే నే నిచ్చటికి వచ్చితిని. హస్త్యశ్వరథ సమేతముగా పృథివి యందలి జనానీకమంతయు విధ్వస్త మగుటకు సిద్ధముగా నున్నప్పుడు దానిని మృత్యుపాశము నుండి రక్షించువాడు ఉత్తమ ధర్మమును నిర్వహించినవా డగును. ధర్మకార్యమునకై యత్నించుచు ఆ కార్యసిద్ధిని పొందలేనివాడు ఆ పుణ్యమును పొందు ననుటలో నాకు సందేహము లేదు. పాపమును మనస్సులో భావించుచు దానిని ఆచరించుటకు ఇష్టపడనివానికి ఆ పాపఫలము రాదని ధర్మవేత్తలు చెప్పుదురు కావున సంగ్రామమునందు నశింపనున్న కౌరవులకు సృంజయులకు ప్రశమమును కలిగించుటకై నేను వంచనము లేకుండ వర్తింతును. కర్ణదుర్యోధనులవలన కౌరవులయందు మహాఘోరమైన యీయాపద ఉద్భవించినది. అది తక్కినవారికిని సంక్రమించుచున్నది. ఆపదయందు క్లేశమును పొందుచున్న వానిని యథాశక్తిగా ఆదుకొనని మిత్రుడు "నృశంసు"డని పెద్దలు చెప్పుదురు. శక్తికొలది బలవంతముగానైన మిత్రుని జుట్టుపట్టుకొని ఆ కార్యము నుండి మరలింపవలె. అట్లు యత్నించినవాడు నిందను పొందడు. కావున ధర్మార్థసహితముగా నేను చెప్పుమాటను దుర్యోధనుడు వినవలె. ధార్తరాష్ట్రులకు పాండవులకే కాక సకలక్షత్రియులకు హితమును గోరుచు ఋజుమార్గమున ప్రయత్నింతును. నన్ను దుర్యోధనుడు శంకించినచో, శంకించును గాక! నాకు హృదయమునకు ప్రీతి ఆనృణ్యము కలుగును. "కృష్ణుడు సమర్థు డయ్యును యుద్ధమునకు సన్నద్ధులైన కౌరవులను పాండవులను వారింపలేదు" అని అధర్మిష్ఠులు,

మూఢులు, సుహృత్తులు కానివారు నన్ను గూర్చి అనుటకు అవకాశ ముండదు. రెండు పక్షముల వారియొక్క ప్రయోజనమును సాధించుటకే నేను వచ్చి యుండుటచే నాకు లోకమున నింద కలుగదు. దుర్యోధనుడు నా మాట వినకున్నచో దైవోపహతు డగును ఎట్లైనను నేను వీరికి సంధిని సాధింపగలిగినచో కౌరవులు మృత్యువునకు తప్పెదురు, నాకు పుణ్యము లభించును. వారు నామాటను విన్నచో నన్ను పూజించినట్లగును. అట్లు కాక వారు నాయెడ అనుచితముగా వర్తింపబూనుకొన్నచో, సింహమునకు ఎదురుగా ముక్కడి మృగములవలె, ఈరాజు లందఱును కూడి సన్నద్ధులై వచ్చినను, క్రుద్ధుడనైన నా యెదుట నిలువ లేరు".

వా రిద్దఱు అట్లు కొంతసేపు మాటాడిన తరువాత శ్రీకృష్ణుడు సుఖముగా శయనించెను.

శ్లో|| నిర్యాయ చ మహాబాహుః వాసుదేవో మహామనాః |
నివేశాయ యయౌ వేశ్మ విదురస్య మహాత్మనః || 34

శ్లో|| త మభ్యగచ్ఛ ద్ద్రోణ శ్చ కృపో భీష్మో ఽథ బాహ్లికః |
కురవ శ్చ మహాబాహుం విదురస్య గృహే స్థితమ్ || 35

త ఊచు ర్మాధవం వీరం కురవో మధుసూదనమ్ |
నివేదయామో వార్ష్ణేయ సరత్నాం స్తే గృహాన్ వయమ్ || 36

శ్లో|| తా నువాచ మహాతేజాః కౌరవాన్ మధుసూదనః |
సర్వే భవంతో గచ్ఛన్తు సర్వా మేఽపచితిః కృతా || 37

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 91

**<u>శ్రీ భగవా నువాచ</u>** :

శ్లో|| యథా బ్రూయా న్మహాప్రాజ్ఞో యథా బ్రూయా ద్విచక్షణః |
యథా వాచ్య స్త్వద్విధేన భవతా మద్విధ స్సుహృత్ || 1

శ్లో|| ధర్మార్థయుక్తం తథ్యం చ యథా త్వ య్యుపపద్యతే |
తథా వచన ముక్తోఽస్మి త్వ యైతత్ పితృమాతృవత్ || 2

శ్లో|| పర్యస్తాం పృథివీం సర్వాం సాశ్వాం సరథకుంజరామ్ |
యో మోచయేత్ మృత్యుపాశాత్ ప్రాప్నుయా ద్ధర్మ ముత్తమమ్ || 5

శ్లో|| ధర్మకార్యం యతన్ శక్త్యా నో చేత్ ప్రాప్నోతి మానవః |
ప్రాప్తో భవతి తత్పుణ్య మత్ర మే నాస్తి సంశయః || 6

శ్లో|| మనసా చింతయన్ పాపం కర్మణా నాతిరోచయన్ |
న ప్రాప్నోతి ఫలం తస్యే త్యేవం ధర్మవిదో విదుః || 7

శ్లో॥ సో౽హం యతిష్యే ప్రశమం క్షత్తః కర్తుం మమాయయా।
కురూణాం సృంజయానాం చ సంగ్రామే వినశిష్యతామ్।

శ్లో॥ వ్యసనే క్లిశ్యమానం హి యో మిత్రం నాభిపద్యతే।
అనర్థాయ యదాశక్తి త న్నృశంసం విదు ర్బుధాః॥ 10

శ్లో॥ ఆకేశగ్రహణా న్మిత్ర మకార్యాత్ సంనివర్తయన్।
అవాచ్యః కస్యచి ద్భవతి కృతయత్నో యదాబలమ్॥ 11

శ్లో॥ హితం హి ధార్త రాష్ట్రాణాం పాండవానాం తథైవ చ
పృథివ్యాం క్షత్రియాణాం చ యతిష్యే౽హం మమాయయా॥ 13

శ్లో॥ నబ్రూయు రధర్మిష్ఠా మూఢా హ్యసుహృద స్తథా।
శక్తో నావారయత్ కృష్ణః సంరబ్ధాన్ కురుపాండవాన్॥ 16

శ్లో॥ ఉభయోః సాదయ న్నర్థ మహ మాగత ఇత్యుత।
తత్ర యత్న మహం కృత్వా గచ్ఛేయం నృ ష్వవాచ్యతామ్॥ 17

శ్లో॥ అపి వాచం భాషమాణస్య కామ్యాం
ధర్మారామా మర్థవతీ మహింస్రామ్।
అవేక్షేరన్ దార్తరాష్ట్రాః శమార్థం
మాం చ ప్రాప్తం కురవః పూజయేయుః॥ 20

శ్లో॥ న చాపి పర్యాప్తాః సహితాః సర్వపార్థివాః।
క్రుద్ధస్య ప్రముఖే స్థాతుం సింహస్యే వేతరే మృగాః॥ 21

శ్రీమహాబారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 93

# III. శ్రీకృష్ణదౌత్య కలశము

## 1. ఉపదేశ కమండలువు

### (i) సభాప్రవేశ చమసము

విదురునియింట శ్రీకృష్ణుడు సుఖముగ నిద్రించి వందిమాగధగీతములతో శంఖదుందుభి నిర్ఘోషములతో మేల్కొని ప్రాతఃకాలకృత్యములను దీర్చి సూర్యోపస్థానము గావించుచుండెను. అప్పుడు దుర్యోధనుడు శకుని ఆయన యొద్దకు వచ్చి, ధృతరాష్ట్రుడు మొదలుగా కురువృద్ధులు సభకు వచ్చి ఆయనరాకను

ప్రతీక్షించుచున్నారని చెప్పిరి. శ్రీకృష్ణుడు వారి నిద్దఱను మధురముగా అభినందించి బ్రాహ్మణులకు గోవస్త్రహిరణ్యాదిదానములను గావించి అగ్నికి బ్రాహ్మణులకు ప్రదక్షిణము గావించి విదురునితో దారుకాధిష్ఠితమైన రథమున బయలుదేఱెను తమరథమున దుర్యోధనుడు శకుని ఆయనను అనుసరించిరి. రథగజాశ్వములపై యథోచితముగ సాత్యకి కృతవర్మ మొదలగువారు బయలుదేఱిరి.

సభాద్వారమునొద్ద శ్రీకృష్ణుడు రథమునుండి దిగి సాత్యకి విదురుడు పార్శ్వములందు నడచుచుండగా వారి హస్తములను గైకొని లోనికి పోయెను. ఆయనకు ముందు కర్ణదుర్యోధనులు, వెనుక కృతవర్మ మొదలుగా వృష్ణివీరులును నడచుచుండిరి. శ్రీకృష్ణుడు సమీపించుచుండగా భీష్మద్రోణులతో ధృతరాష్ట్రుడు లేచి నిలుచుండెను. రాజు లందఱు లేచి నిలుచుండిరి. ధృతరాష్ట్రుని శాసనమున శ్రీకృష్ణునకు సర్వతోభద్రమైన కాంచనాసనము సిద్ధమొనరింపబడెను.

శ్రీకృష్ణుడు రాజసముదాయ మధ్యమున నిలిచి అంతరిక్షమునందున్న ఋషులను చూచి భీష్మునితో, "ఈ రాజసమావేశమును చూచుటకై మహర్షులు వచ్చియున్నారు. వారిని ఆహ్వానించి అర్ఘ్యపాద్యాదులతో సత్కరింపుడు, వీరు కూర్చుండుటకు ముందు ఎవరును ఆసీను లగుటకు వీలులేదు, కావున ముందుగా వీరిని పూజింపుడు" అని చెప్పెను. సభాద్వారమును సమీపించుచున్న మహర్షులను చూచి భీష్ముడు త్వరపడుచు భటులచేత ఆసనములను తెప్పించి, మునీశ్వరులకు ఎదురుగా పోయి నమస్కరించుచు ఆహ్వానించెను. వారు కూర్చుండిన తరువాత రాజు లందఱును కూర్చుండిరి. దుశ్శాసనుడు సాత్యకికి, వివింశతి కృతవర్మకు ఆసనముల నొసంగిరి కృష్ణునకు సమీపమున కర్ణదుర్యోధనులు ఒకే యాసనమునందు కూర్చుండిరి. గాంధార పురుషాభిరక్షితుడై పుత్రునితో కూడ శకుని ఆసీను డయ్యెను. విదురుడు శ్రీకృష్ణుని యాసనమును స్పృశించి తెల్లనియజినము పఱచిన మణిపీఠమున కూర్చుండెను

## (ii) శ్రీకృష్ణప్రసంగ చమనము

అందఱు శ్రీకృష్ణుడు జూచుచు నిశ్శబ్దముగ నుండిరి. ఆయన వారి నందఱను కలయ జూచి మేఘగంభీరనిస్వనమున ధృతరాష్ట్రునితో ఇట్లనెను. "మహారాజా ! వీరులకు వినాశము సంభవింపకుండ కౌరవులకు పాండవులకు శమమును కలిగింపు మని నిన్ను యాచించుటకు వచ్చితిని. పార్థివేశ్వరా ! నీకు సర్వమును తెలియును. నీకు నిశ్శ్రేయసమునుగూర్చి చెప్పవలసినది లేదు. ఈనాడు సర్వరాజకులములందు మీ భరతవంశము మూర్ధన్యమై యున్నది. విద్యావిజ్ఞానములచేత ఉదారవర్తనము మొదలగు గుణములచేత మీకులము శ్రేష్ఠముగ నున్నది. కృప అనుకంప కారుణ్యము ఆనృశంస్యము ఆర్జవము క్షమ సత్యము కౌరవులయందు విశిష్టముగనున్నవి. ఇట్లు మీ వంశము విశిష్టమై యుండగా, నీవంటివాడు నిమిత్తముగా ఆ వంశమునందు

అనుచితమైన కార్యము సంభవించుట యుక్తము కాదు. నీవు కౌరవుల ప్రతిష్ఠను నిలుపుటలో శ్రేష్ఠుడవు. ధర్మమును అర్థమును త్రోసివేసి దుర్యోధనాదులైన నీకుమారులు లోభవశులు మర్యాదారహితులై అశిష్టులై తమ ముఖ్య బంధువులయందే గూఢముగ ప్రకటముగా కూడ నృశంసముగ వర్తించుచున్నారని నీ వెఱుంగుదువు. మీ కౌరవులయందే ఉత్పన్నమగుచున్న ఘోరమైన యీయాపదను ఉపేక్షించినచో ఇది పృథివినంతను నశింపజేయును. దీనిని ఉపశమింపజేయుట ప్రశాంతినికలిగించుట నీకు దుష్కరము కాదనియే నాయభిప్రాయము. ఈ శాంతి సాధనము ఇప్పుడు మనకిరువురకు అధీనమై యున్నది నీవు నీపుత్రులను నియమించినచో నేను పాండవులను నిలుపుదును వీరిహితమును కోరి నీవు బలవంతముగానైన వీరు నీయాజ్ఞకు లోబడునట్లు చేయవలె నీ హితమును పాండవుల హితమును కోరి ప్రయత్నించుచున్న నావలన పాండవులు నీయనుశాసనము ఎట్టిదో ఎఱుంగ గోరుచున్నారు.

మహారాజా ! పాండవులతో వైరము నిష్ఫలమని వారితో కూడియుండుట మహాఫలప్రదమని గుర్తించి అట్టి సంవిధానమును గావింపుము. నీవు స్వయముగా ధర్మమునుగూర్చి అర్థమునుగూర్చి ఆలోచించుకొని వానియందు నిలువుము. పాండవులు నీకు సహాయులు కాగలరు. నీవు ఎంత యత్నించినను లోకమున అట్టి సహాయులు నీ కెక్కడ లభింతురు. భీష్మాదులతో పాటు పాండవులు కూడ నీకు రక్షకులుగా నున్నచో నిన్ను చెనకుటకు సకలదేవసేనాసమేతుడైన మహేంద్రునకు కూడ సాధ్యము కాదు. ఇంక సామాన్యులైన రాజులను గూర్చి చెప్పవలసిన దేమున్నది ? ఎంత పెడబుద్ధి కలవాడైనను వారిని మార్కొనుటకు పూనుకొనునా ? ఇప్పుడు నీతో సమానులై యున్నవారు నిన్ను మించియున్నవారు కూడ వారితో సంధి చేసికొందురు. ఆ విధముగా నీకు పాండవులవలన లోకేశ్వరత్వము అజేయత్వమును సిద్ధించును , పుత్రపౌత్రులతో సుఖముగా జీవింపగలవు. వారితో కూడి నీవు ఇతరులను జయింపగలవు , వారిచే సంపాదింపబడిన భూమిని కూడ నీవే యనుభవింప గలవు. ఇది యంతయు నీకు స్వప్రయోజనమే.

అట్లు కాక యుద్ధమే సంభవించినచో మహావినాశము సంభవించును. ఉభయపక్షములవారికిని వినాశము కలుగు విధానమునందు ఏమి ధర్మమున్నదని తలంచుచున్నావు ? మహాపరాక్రమశాలులైన పాండవులచే నీకుమారులు నిహతులైనచో నీకు ఏమి సుఖము కలుగునో చెప్పుము. వీరును వారును శూరులై సన్నద్ధులై యుద్ధాభికాంక్షులై యున్నారు. అందఱను మహాభయమునుండి రక్షింపుము వీరును వారును సహాయులైన రాజులును క్రోధావేశవశులై ఒకరి నొకరు చంపుకొనుచు ప్రజల నందఱను నశింపజేయుదురు. అట్లు జరుగకుండ మనము చూడవలె. పార్థివేంద్రా! ఈ లోకమును రక్షింపుము. నీవు సమత్వమును పొందినచో చాలును ; అంతయు చక్కబడును ఇచ్చట అచ్చట చేరినవారందఱు సచ్చరిత్రులు ఆర్యులు వదాన్యులు. వీరందఱు నీసౌమనస్యమువలన వైరములను వీడి పరస్పరసమాగమమును పొంది వస్త్ర

భూషణాదులచే సత్కృతులై కలిసి భుజించి సంతోషముతో తమయిండ్లకు మరలిపోవుదురు గాక!

రాజేంద్రా! ఇప్పటివఱకును నీకు పాండవులయందు స్నేహము కలదు జీవితమున చరమభాగమున ప్రవేశించిన నీవు ఆస్నేహమునే అవలంబించి వారితో సంధిని గావింపుము. తండ్రిని కోల్పోయిన బిడ్డలను నీవే పెంచితివి వారికి కష్టములు వచ్చినప్పుడు ఆదుకోవలసినవాడవు కూడ నీవే. అట్లు చేసినచో నీకు దర్మము అర్థము నశింపకుండును.

మహారాజా! నీకు నమస్కరించి నిన్ను ప్రసన్నునిగా చేసికొని పాండవులు నీతో ఇట్లు చెప్పమనిరి "పెదనాన్నా నీయనుశాసనమున మేము అనుచరులతో కూడ దుఃఖముల ననుభవించుచు పండ్రెండు సంవత్సరములు అడవులలో, పదుమూడవ సంవత్సరము అజ్ఞాతముగా జనపదమునందు వర్తించితిమి. చేసికొన్న యొప్పందమునందు మా తండ్రి నిలిచియుండగలడను తలంపుతో మేము ఆ యొప్పందమును అతిక్రమింపకుండ వర్తించితిమి. ఆవిషయమును బ్రాహ్మణు లెఱుంగుదురు. కావున నీవును ఆయొప్పందమునందు నిలుపుము. ఒప్పందమువలన నిత్యము క్లేశములను పొందుచున్న మేము మారాజ్యభాగమును పొందుదుము గాక! దర్మమును అర్థమును చక్కగా ఎఱింగిన నీవు మమ్ము రక్షింపవలసియున్నది నీయందలి గౌరవముచేత మేము ఎన్నో కష్టములను సహించుచున్నాము. కావున నీవు మమ్ము తల్లివలె తండ్రివలె ఆదరింపుము. నీవు నీదర్మమునం దుండి మమ్ము సరియైన మార్గమునం దుంచుము"

నీకుమారులు ఈపరిషత్తులోని వారి నుద్దేశించి ఇట్లు చెప్పుమనిరి "ఆర్యులారా! ధర్మజ్ఞులైన సభాసదుల సమావేశమున అనుచితము సంభవించుట యుక్తము కాదు. అదర్మముచేత ధర్మము, అన్నృతముచేత సత్యము బంగపడుచున్నప్పుడు సభాసదులు చూచుచు ఊరకుండినచో హతు లగుదురు. దర్మమును ఎవరు రక్షింపరో వారిని ఆధర్మము, పొంగివచ్చిన ప్రవాహము తీరమునందున్న వృక్షములను వలె, కూల్చును"

మహారాజా! ఇంతకాలము దర్మమును బావించుచు కష్టములను మౌనముతో సహించియున్న పాండవులు ఇప్పుడు ధర్మబద్ధముగా న్యాయయుక్తముగ తమ రాజ్యభాగమును ఇమ్మని కోరుచున్నారు వారికి వారిరాజ్యము నిచ్చుటకంటె అన్యముగ నీవు చెప్పగలిగినదేమున్నది ? ఇక్కడ కూడియున్న మహీపాలురందఱు దర్మమును అర్థమును చక్కగా విచారించి నేను చెప్పుచున్నది సత్య మగునో కాదో ప్రకటింతురు గాక! మహాభాగా ! ఈక్షత్త్రియులను మృత్యుపాశము నుండి రక్షింపుము, కోపింపకుము , శాంతింపుము. పాండవులకు పైతృకమైన రాజ్యభాగమును యథోచితముగా నొసంగి పుత్త్రపౌత్త్రులతో సుఖముగా నుండుము. అజాతశత్రువును నీ వెఱుంగుదువు. అతడు దర్మమార్గమునందుండి నీయందు నీపుత్రులయందును ఎట్లు

వర్తించుచుండెనో కూడ నీ వెఱుంగుదువు. మీరు అతనిని వెడలగొట్టి తగులబెట్టుటకు ప్రయత్నించినను అతడు నిన్నే ఆశ్రయించుకొనియున్నాడు. నీవే నీకుమారులతో చేరి అతనిని ఇంద్రప్రస్థమునకు పంపి దూర మొనర్చుకొంటివి. అతడు అక్కడ నెలకొని పార్థివులను జయించి వారినందఱను నీకు లోబడునట్లు చేసెను. అతడు ఎప్పుడును నిన్ను అతిక్రమింప లేదు. ఇట్లుండిన యాధర్మరాజుయొక్క రాజ్యధనధాన్యాదికమును హరించుటకై శకుని పెద్దమోసమును చేసెను. ఆసభలో ద్రౌపదికి కలిగినదుర్గతిని చూచుచుండియు యుధిష్ఠిరుడు కుటుంబవ్యవస్థకు విధేయుడై గురుపూజాధర్మమున స్థిరుడై నీసమక్షమున క్షాత్రము నవలంబింప లేదు; చలింపలేదు.

అది యటుండ నిమ్ము. నేను నీకును వారికిని శ్రేయస్సును కోరుచున్నాను. నీవు అనర్థమును కలిగించు విధానమును సార్థకమైన దానినిగా, ప్రయోజనవంతమైన పద్ధతిని వినాశకరముగా తలంపకుము. ఈప్రజలు ధర్మమునుండి భ్రంశము నొంది అర్థమునుండి తొలగి, సుఖమునకు దూరులై నశింపకుందురు గాక! లోభమునకు వశులైయున్న నీ పుత్రులను నిగ్రహింపుము. పాండవులు నిన్ను సేవించుటకు సిద్ధముగా నున్నారు; అట్టి యవకాశము లభింపకున్నచో యుద్ధము చేయుటకు కూడ సిద్ధముగానే యున్నారు. ఇంక నీకు ఏది పథ్య మని తలంతువో దానిని నిశ్చయింపుము".

శ్లో॥ కురూణాం పాండవానాం చ శమ స్స్యా దితి భారత।
అప్రణాశేన వీరాణా మేత ద్యాచితు మాగతః॥ 3

శ్లో॥ కృపా౽నుకంపా కారుణ్య మానృశంస్యం చ భారత।
తథార్జవం క్షమా సత్యం కురు ష్వేత ద్విశిష్యతే॥ 6

<u>నీలకంఠీయ</u> : కృపా, పరస్య సుఖార్థే యత్నః। అనుకంపా, పరదుఃఖదర్శనేన త్రాసః। కారుణ్యం, పరదుఃఖప్రహాణార్థో యత్నః। ఆనృశంస్యం, పరదుఃఖాప్రదానమ్।

శ్లో॥ తస్మి న్నేవం విధే రాజన్ కులే మహతి తిష్ఠతి।
త్వన్ని మిత్తం విశేషేణ నేహ యుక్త మసాంప్రతమ్॥ 7

<u>నీలకంఠీయ</u> : అసాంప్రతమ్, కృపాదిభ్యో విపరీతమ్, పరస్య దుఃఖార్థో యత్నః, పరదుఃఖదర్శనే ఆహ్లాదః, పరస్య సుఖనాశార్థో యత్నః, పరస్య దుఃఖసంపాదనం, కౌటిల్యాదికం చ తచ్చ అయుక్తమ్।

శ్లో॥ త్వయ్యధీన శ్శమో రాజన్ మయి చైవ విశాంపతే।
పుత్రాన్ స్థాపయ కౌరవ్య స్థాపయిష్యా మ్యహం పరాన్॥ 3

శ్లో॥ లోక స్యేశ్వరతాం భూయః శత్రుభి శ్చా ప్యధృష్యతామ్।
ప్రాప్యసి త్వ మమిత్రఘ్న సహితః కురుపాండవైః॥ 22

శ్లో|| సంయుగే చైవ మహారాజ దృశ్యతే సుమహాన్ క్షయః |
క్షయే చోభయతో రాజన్ కం ధర్మ మనుపశ్యసి || 28

శ్లో|| త్రాహి రాజ న్నిమం లోకం న నశ్యేయు రిమాః ప్రజాః |
త్వయి ప్రకృతి మాపన్నే శేషః స్యాత్ కురునందన || 33

<u>నీలకంఠీయ</u> ప్రకృతిం, సత్త్వగుణమ్ |

శ్లో|| ఆహు స్త్వాం పాండవా రాజన్ అభివాద్య ప్రసాద్య చ |
భవత శ్శాసనాత్ దుఃఖ మనుభూతం సహానుగైః || 40

శ్లో|| ద్వాదశేమాని వర్షాణి వనే నిర్వ్యుషితాని నః |
త్రయోదశం తథాజ్ఞాతైః సజనే పరివత్సరమ్ || 41

శ్లో|| స్థాతా నః సమయే తస్మిన్ పితేతి కృతనిశ్చయాః |
నాహాస్మ సమయం తాత తం చ నో బ్రాహ్మణా విదుః | 42

శ్లో|| తస్మిన్ న స్సమయే తిష్ఠ స్థితానాం భరతర్షభ |
నిత్యం సంక్లేశితా రాజన్ స్వరాజ్యాంశం లభేమహి || 43

శ్లో|| త్వం ధర్మ మర్థం సంజానన్ సమ్య జ్ఞ్న స్త్రాతు మర్హసి |
గురుత్వం భవతి ప్రేక్ష్య బహూన్ క్లేశాన్ తితిక్ష్మహే || 44

శ్లో|| సంస్థాపయ పథిష్వస్మాన్ తిష్ఠ ధర్మే సువర్తని |
ఆహు శ్చేమాం పరిషదం పుత్రా స్తే బరతర్షబ || 47

శ్లో|| దర్మజ్ఞేషు సబాసత్సు నేహ యుక్త మసాంప్రతమ్ |
యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం య త్రానృతేన చ || 48

శ్లో|| హన్యతే ప్రేక్షమాణానాం హతా స్తత్ర సభాసదః |
విద్ధో దర్మో హ్యదర్మేణ సభాం యత్ర ప్రపద్యతే || 49

శ్లో|| న చాస్య శల్యం కృంతంతి విద్ధా స్తత్ర సభాసదః |
దర్మ ఏతా నారుజతి యథా న ద్యనుకూలజాన్ || 50

<u>నీలకంఠీయమ్</u> ఆరుజతి హినస్తి, అనుకూలజాన్ కూలం కూలం అనుసృత్య జాతన్ వృక్షాదీన్ |

# బాలప్రియ

"చేసికొన్న యొప్పందము నందు మాతండ్రి నిలిచియుండ గల డను తలంపుముతో మేము ఆయొప్పందమును అతిక్రమింపకుండ వర్తించితిమి ఆవిషయమును బ్రాహ్మణు లెఱుంగుదురు. కావున నీవును ఆయొప్పందము నందు నిలుపుము .. మేము మా రాజ్యభాగమును పొందుదుము గాక" (శ్లో. 42. 43) అని పాండవుల వాక్యమునుగా శ్రీకృష్ణుడు పేర్కొనినయంశము చాల ముఖ్యమైనది ఈ సందర్భమున ఆయొప్పందమును పరిశీలించుట ఆవశ్యకము.

రెండవసారి జరిగిన జూదమునందు శకుని పందెమును ఈవిధముగా ఉద్ఘాటించెను. "ఇందు మేము ఓడిన యెడల పంద్రెండేండ్లు వనవాసము చేసి పదుమూడవ యేడు జనపదమునందు అజ్ఞాతవాసము చేయుదుము. అజ్ఞాతవాసమున బయల్పడితి మేని మరల పంద్రెండేండ్లు వనవాసము పిదప ఒక సంవత్సరము అజ్ఞాతవాసము చేయుదుము. మీరు కూడ ఓడినయెడల అట్లే చేయవలయును. తగినరీతిలో పదుమూడవ యేడు పూర్తి యైనంతనే మేము కాని మీరు కాని స్వరాజ్యమును పొందవలసియుండును".

శ్లో॥ త్రయోదశే చ నిర్వృత్తే పునరేవ యథోచితమ్।
స్వరాజ్యం ప్రతిపత్తవ్య మితరై రథ వేతరైః॥ 14

శ్రీమహాభారతే - సభాపర్వణి - అధ్యాయః - 76

ఈ యొప్పందము ప్రకారము అరణ్యాజ్ఞాతవాసములు ముగిసినంతనే తమరాజ్యము తమకు రావలె నని పాండవులు అడుగుచున్నారు. అరణ్యాజ్ఞాత వాసములను పాండవులు సక్రమముగా పూర్తి చేసినా రన్నవిషయము గోగ్రహణసమయమునందే భీష్ముడు దుర్యోధనునకు స్పష్ట మొనరించినాడు "వీరు ఒప్పుకొన్న విధముగా సర్వము నిర్వర్తించినారు. ఈ విషయమును రూఢిగా తెలిసికొన్న తరువాతనే అర్జునుడు వచ్చినాడు.... కావున యుద్ధోచితమైన కృత్యమును గాని దర్మయుక్తమైన కార్యమును గాని త్వరగా నిశ్చయింపుము ధనంజయుడు సమీపించుచున్నాడు".

శ్లో॥ సర్వం యథావ చ్చరితం యద్య దేభిః ప్రతిశ్రుతమ్।
ఏవ మేత ద్ధ్రువం జ్ఞాత్వా తతో బీభత్సు రాగతః॥ 5

శ్లో॥ తస్మా ద్యుద్ధోచితం కర్మ కర్మ వా ధర్మసంహితమ్।
క్రియతా మాశు రాజేంద్ర సంప్రాప్త శ్చ ధనంజయః॥ 12

<u>నీలకంఠీయమ్</u> ధర్మసంహితమ్ కర్మ, అయుద్దేన ఏతై స్సహ ఐక్యం గత్వా రాజ్యప్రదానమ్ |

ఈమాట విని ధర్మయుక్తమైనరాజ్యప్రదానమునకు అంగీకరింపక దుర్యోధనుడు ఇట్లనెను. "పితామహా ! నేను పాండవులకు రాజ్యము నీయను యుద్ధప్రయత్నమునే త్వరగా ఆజ్ఞాపింపుము".

శ్లో|| నాహం రాజ్యం ప్రదాస్యామి పాండవానాం పితామహ |
యుద్ధోపచారికం యత్తు తచ్ఛీఘ్రం ప్రవిధీయతామ్ || 52

శ్రీమహాభారతే - విరాటపర్వణి - అధ్యాయః - 52

కౌరవపాండవ వివాదవిషయమున ఇది అత్యంతము ముఖ్యమైన యంశము. ఒప్పందము ప్రకారము అజ్ఞాతవాసము పూర్తియైనంతనే దుర్యోధనుడే పాండవులను పిలిచి వారి రాజ్యమును వారికి ఇచ్చియుండవలె. అట్లు ఈయక మాటతప్పిన దుర్యోధనుని ఎవరైనను గర్హింపవలసియే యున్నది. అయిదు గ్రామములిచ్చినను అంగీకరింతు మని పాండవులు శాంతిని కోరుచున్నప్పుడు "సూదిమొన మోపినంత భూమి నైనను నేను ఈయను" అని యతడు మొండితనముతో ధర్మమును ధిక్కరించి మాటాడుచున్నప్పుడు వానిని దండింపక తప్ప దనుటయు నిశ్చితమే. దుర్యోధనుడు ఒప్పందమును అతిక్రమించి మాట తప్పుట కేవలము అధర్మ మని నిశ్చయ మగుచున్నను భీష్మద్రోణాదులు వానిపక్షముననే యుండి పాండవులతో యుద్ధము చేయబూనుట శోచనీయము. ఇంకను దుర్యోధనునియందు ఏదో కొంత ధర్మ మున్నట్లు ఎవరైన మాటాడినచో అది కేవలము బుద్ధిహీనత యనియే గ్రహింపవలసియున్నది.

## (iii) దుర్యోధనోపదేశ చమనము

శ్రీకృష్ణుని ప్రసంగమును విని రాజు లందఱు పులకితులై, "ఈవచనమున కెవరును సమాధానము చెప్పలేరు" అని మౌనముతో నుండిరి. అప్పుడు పరశురాముడు కణ్వుడు నారదుడు శ్రీకృష్ణుని వచనానుసారముగా సందెకి అంగీకరింపు డని ధృతరాష్ట్రదుర్యోధనులకు ఉపదేశించిరి. దుర్యోధనుడు అంగీకరింపలేదు.

ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణునితో ఇట్లనెను. "కృష్ణా! నీవు నాకు ఇహపరసాధకముగా చెప్పితివి కాని నేను నావశమందు లేను. ఇప్పుడు జరుగుచున్నది నాకు ప్రియము కూడ కాదు. వత్సా ! మందుడై నామాటను శాస్త్రవచనమును కూడ అతిక్రమించుచున్న యీ దుర్యోధనునకు బోధించుటకు యత్నింపుము. హితమును కోరునట్టి గాంధారి, విదురుడు, భీష్ముడు మొదలగువారు ఎంతగా చెప్పినను వీడు వినుట లేదు. నీవు ప్రయత్నింపుము".

శ్రీకృష్ణుడు దుర్యోధనునకు అభిముఖుడై మధురముగా ఇట్లనెను "దుర్యోధన! సానుచరముగా నీకు సుఖము కలుగునట్లుగా నేను చెప్పుచున్న మాటలను వినుము. నీవు మహాప్రాజ్ఞుల కులమునందు పుట్టినవాడవు . విజ్ఞానశాలివి. గుణసంపన్నుడవు. ఇట్టి సందర్భములందు నీవు చక్కగా వర్తింపవలె ఇప్పుడు నీవు తలంచుచున్న విధముగా దురాత్ములు నృశంసులు లజ్జాహీనులు మాత్రమే వర్తింతురు సత్పురుషుల ప్రవృత్తి ధర్మార్థయుక్తముగా నుండును. ధర్మవిరుద్ధమైన వర్తనము నీయందు తఱచుగా కన్పించుచున్నది. అధర్మమునకు ఫలము మహాఘోరముగా ప్రాణహారముగా నుండును. ఆయనర్థమును పరిహరించినచో నీసోదరులు మిత్రులు భృత్యులు మొదలుగా అంతరకును శ్రేయస్సు కలుగును. నీవు అదర్మమునుండి అపకీర్తినుండి ముక్తుడ వగుదువు. ప్రాజ్ఞులు శూరులను అయిన పాండవులతో సంధిచేసికొనుము. మీ తండ్రికి అది హితము, ప్రియము. భీష్మద్రోణాదులైన పెద్దలకు, మిత్రులకు కూడ అదియే అభిమతము. నీవు శమమును పొందినచో సకల జగత్తునకు సౌఖ్యము కలుగును తల్లిదండ్రులయనుశాసనము ననుసరించి వర్తింపుము. ఎవ్వడైనను పెద్దయాపద వచ్చినప్పుడు తండ్రి చెప్పిన యుపదేశమునే స్మరించును మీతండ్రికి పాండవులతో సంధి గావించుకొనుట ఇష్టముగ నున్నది. కావున నీవు కూడ అంద లకు అంగీకరింపుము.

శాస్త్రము ననుసరించి చెప్పునట్టి మిత్రులవాక్యమును విననివాడు తుదకు విషఫలమును బక్షించినవానివలె పరితాపము నొందును. హితవచనములను వినక అహితమును ఆలకించువాడు అచిరకాలముననే శత్రువులచేత జిక్కును పెద్దలైన మంత్రులను వీడి హీనుల వాక్యములను పాటించువాడు ఘోరమైన విపత్తులో చిక్కుకొని బయల్పడలేక వినాశ మొందును. దురాత్ములను సేవించుచు పరులను వరించుచు తనవారిని ద్వేషించువానిని భూమి కూడ పరిత్యజించును నీవు వీరులైన సోదరులతో విరోధమును పెంచుకొని అశిష్టులు అసమర్థులు మూఢులును అయినవారు నిన్ను రక్షింతు రని అనుకొనుచున్నావు. ఇంద్రసమానులైన మహారథులను అతిక్రమించి ఇతరులవలన మేలు కలుగు నని నీవలె తలంచువాడు లోకమున ఎవ్వడును ఉండడు. నీవు పుట్టినప్పటినుండియు నిత్యము పాండవులకు అపకారమునే చేయుచుంటివి. అయినను వారు ధర్మాత్ములగుటచే నీయందు ఎప్పుడును కోపమును పొందలేదు. నీవు కూడ వారియందు ప్రీతితోనే వర్తింపవలె.

ప్రాజ్ఞులయొక్క కార్యారంభము ధర్మార్థకామములకు మూడింటికి అనుకూలమైనదిగా ఉండును. మూడింటిని సమకూర్చుకొనుటకు అవకాశము లేనప్పుడు వారు ధర్మమును అర్థమును అనుసరింతురు. మూడింటికిని అనుకూల్యము లేని సందర్భమునందు ధీరుడు అర్థకామముల నుపేక్షించి ధర్మమునే అవలంబించును. మధ్యముడు కలహకారణమైన యర్థమును అవలంబించును బాలుడు కామమునే అవలంబించును. ప్రలోభమునకు వశుడై అర్థకామములను హీనములైన

యుపాయములతో సంపాదించుకొనుటకు ప్రయత్నించుచు ధర్మమును త్యజించునట్టి ప్రాకృతుడు వినాశము నొందును. అర్థకామములను సంపాదింపగోరువాడు మొదట ధర్మమునే ఆచరింపవలె అర్థము కాని, కామము కాని ధర్మమునకు తొలగియుండవు. ధర్మార్థకామముల సిద్ధికి ధర్మమే ఉపాయమని పెద్దలు చెప్పుదురు. అహితమైన యుపాయముచేత వానిని సంపాదింపబూనుకొన్నచో అది అడవిలో అగ్నివలె వినాశమును కలిగించుచు పెంపొందుచునే యుండును. నీవు అయుక్తమైన యుపాయముచేత సామ్రాజ్యమును సంపాదింప దలంచుచున్నావు. సద్వర్తనము గలవారితో వంచనముతో వర్తించువాడు, గొడ్డలితో వనమును వలె, తన్ను నఱకుకొనువా డగును. పరాభవింపదగని వానియొక్క మనస్సును కలత పెట్టరాదు మూడు లోకములలో ఎవ్వడైనను ధీరుని అవమానింపరాదు. ప్రాకృతుడైన వానిని కూడ అభిమానవంతుని అవమానింపరా దన్నచో పాండవులను భంగపెట్ట రాదని చెప్పవలసిన దేమున్నది?

క్రోధమునకు వశమైనవాడు దేనిని తెలిసికొనలేడు. దుర్యోధనా! నీయనవహానమువలన కార్య మంతయు మార్గమునుండి తప్పుచున్నది. నీవు చక్కగా ఆలోచించుకొనుము. దుర్జనులతోడి సాంగత్యముకంటె నీకు పాండవులతోడి సహవాసమే శ్రేయస్కరము. వారిసంప్రీతివలన నీవు సకలకామములను పొందగలవు. పాండవులచేత సంపాదింపబడిన రాజ్యమును అనుభవించుచు వారిని త్రోసివేసి నీవు ఇతరులవలన రక్షణము కలుగు నని ఆశపడుచున్నావు. దుశ్శాసన శకుని కర్ణాదులు ఈశ్వరు లని తలంచుచు వారివలన సంపద కలుగు నని భావించుచున్నావు ధర్మముయొక్క అర్థముయొక్క జ్ఞానమును నీకు బోధించుటకు వారు చాలరు పాండవులను ప్రతిఘటించుటకు వారి విక్రమము కూడ చాలదు. వారే కాదు ఈ రాజు లందఱు కూడినను యుద్ధరంగమున క్రుద్ధుడైన భీమసేనుని ముఖమును తేరి చూడజాలరు నీకు సన్నిహితమైన పార్థివబల మంతయు ఇచ్చటనే యున్నది. ఈ భీష్ముడు ద్రోణుడు కర్ణుడు మొదలుగా వీ రందఱును అర్జునుని ప్రతిఘటించుటకు సమర్థులు కారు. అతడు దేవదానవాదులకు కూడ అజేయుడు. యుద్ధమును తలంపకుము. అర్జునునియుద్ధమున మార్కొనిక్షేమముగా ఇంటికి చేరగలిగిన వీరుడు వీరిలో ఎవ్వడైన ఉన్నా డేమో చూడుము. ఇంత జనక్షయ మెందులకు? మీపక్షమున అర్జునుని జయింపగలిగినవానిని ఒక్కనిని చూడుము. అతడు అర్జునుని జయించినచో నీవు జయించినట్లే ఖాండవప్రస్థమునందు గంధర్వయక్షరాక్షసపన్నగులతో దండెత్తి వచ్చిన మహేంద్రుని అర్జునుడు జయించినాడు. వానితో ఎవడు పోరాడగలడు? వానితో యుద్ధము చేసి సాక్షాత్తుగా మహాదేవుడే సంతోషించి వరప్రదు డైనాడు. ఇటీవలనే కదా విరాటనగరమున ఆత డొక్కడే మి మ్మందఱను ప్రతిఘటించి గోవులను మరలించినా డని వినుచున్నాము. అతని యజేయత్వమునకు ఆనిదర్శనము ఒక్కటియే చాలును. అతనికి నేను కూడ తోడై యున్నప్పుడు మహేంద్రు డైనను మార్కొన దలంపలేడు.

పుత్రులు భ్రాతలు సంబంధులు మొదలుగా వీరియందఱ క్షేమమును చూడుము వీరందఱు నీవు కారణముగా నశింపకుందురు గాక! ఈ కులమునకు పరాభవము కలుగకుండును గాక! కులనాశకుడ వను నప కీర్తి నీకు కలుగకుండును గాక!

పాండవులతో సంధి జేసికొన్నచో వారు మీ తండ్రినే మహారాజునుగా, నిన్నే యువరాజునుగా సంభావింతురు దుర్యోధనా! ఎదురుగా వచ్చుచున్న రాజ్యలక్ష్మిని అవమానింపకుము. పాండవులకు అర్ధరాజ్యము నొసంగి మహారాజ్యలక్ష్మిని పొందుము. సుహృత్తులమాట పాటించి పాండవులతో సఖ్యమును పొందినచో పుత్రమిత్రాదులతో కూడి చిరకాలము శుభములను పొందగలవు"

శ్లో|| ఏవ ముక్త్వా తతః కృష్ణ మభ్యభాషత కౌరవః |
స్వర్గ్యం లోక్యం చ మా మాత్థ దర్మ్యం న్యాయం చ కేశవ || 2

శ్లో|| న త్వహం స్వవశ స్తాత క్రియమాణం న మే ప్రియమ్ |
అంగ దుర్యోధనం కృష్ణ మందం శాస్త్రాతిగం మమ || 3

శ్లో|| అనునేతుం మహాబాహో ! యతస్వ పురుషోత్తమ |
న శృణోతి మహాబాహో వచనం సాధు భాషితమ్ || 4

శ్లో|| సుహృత్కార్యం తు సుమహత్ కృతం తే స్యా జ్జనార్దన |
తతో ఽభ్యావృత్య వార్ష్ణేయో దుర్యోధన మమర్షణమ్ || 7

శ్లో|| అబ్రవీ న్మధురాం వాచం సర్వధర్మార్థ తత్త్వవిత్ |
దుర్యోధన నిబో ధేదం మద్వాక్యం కురుసత్తమ || 8

శ్లో|| శమార్థం విశేషేణ సానుబంధస్య భారత |
మహాప్రాజ్ఞకులే జాతః సా ధ్వేతత్ కర్తు మర్హసి || 9

శ్లో|| శమే శర్మ భవే త్తాత సర్వస్య జగత స్తథా |
హ్రీమా నసి కులే జాతః శ్రుతవా ననృశంసవాన్ |
తిష్ఠ తాత పితు శ్శాస్త్రే మాతు శ్చ భరతర్షభ || 19

శ్లో|| రోచతే తే పితు స్తాత పాండవై స్సహ సంగమః |
సామాత్యస్య కురుశ్రేష్ఠ తత్తుభ్యం తాత రోచతామ్ || 21

శ్లో|| జన్మప్రభృతి కౌంతేయా నిత్యం వినికృతా స్త్వయా |
న చ తే జాతు కుర్వన్తి ధర్మాత్మానో హి పాండవాః || 31

శ్లో|| త్రివర్గయుక్తః ప్రాజ్ఞానా మారంభో భరతర్షభ |
దర్మార్థా వనురుధ్యంతే త్రివర్గాసంభవే నరాః || 34

శ్లో॥ పృథక్ చ వినివిష్టానాం ధర్మం ధీరోఽనురుధ్యతే।
మధ్యమోఽర్థం కలిం బాలః కామ మేవానురుధ్యతే॥ 35

శ్లో॥ ఇంద్రియైః ప్రాకృతో లోభా ద్ధర్మం విప్రజహాతి యః।
కామార్థా వనుపాయేన లిప్సమానో వినశ్యతి॥ 36

శ్లో॥ కామార్థౌ లిప్సమానస్తు ధర్మ మాదిత శ్చరేత్।
నహి ధర్మా దపై త్యర్థః కామో వాఽపి కదాచన॥ 37

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 124

## (iv) దోషావిష్కరణ చమసము

శ్రీకృష్ణునియుపదేశము ననుసరించి భీష్ముడు ద్రోణుడు విదురుడు ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు హితము నుపదేశించిరి.

అప్రియప్రసంగములను సహింపక దుర్యోధనుడు వాసుదేవునితో ఇట్లనెను "కృష్ణా! నీవు విషయమును చక్కగా సమీక్షించి మాటాడవలసియున్నది. మా బలాబలములను ఏమి పరిశీలించితివి? పాండవులయందలి భక్తితో నన్నే పరుషముగ నిందించుచున్నావు. నీతో పాటు పితామహాదులును నన్నే నిష్కారణముగా గర్హించుచున్నారు. నేను గావించిన యక్రమకృత్య మేమో నాకు గోచరించుటలేదు. అయినను మాతండ్రితో కూడ మీరందఱు నన్ను ద్వేషించుచున్నారు. ఎంత ఆలోచించినను నేను గావించినయపరాధ మేదియో నాకు రవ్వంతయు కన్పించుట లేదు

నేను పాండవులను ప్రీతితో ఆహ్వానించినప్పుడు యుధిష్ఠిరుడు శకునితో జూదమాడి రాజ్యమును కోల్పోయినాడు. అందులో నాతప్పు ఏమున్నది? అప్పుడు మేము గెలుచుకొన్న సంపదను మరల వారికే యిచ్చితిమి. వారు మరల పాచికలాడి ఓడిపోయి అడవులపాలైనచో మావలన జరిగిన యపరాధ మేమున్నది? అశక్తులైన పాండవులు ఇప్పుడు బంధువుల ప్రోత్సాహమున ప్రహృష్టులై ఏదేనొకమిషతో మాపై వైరమును సాధించుటకు సిద్ధమగుచున్నారు. మేము వారికి గావించిన పాపమేమున్నది? వారు నిష్కారణముగా యాదవులతో కూడి ధార్తరాష్ట్రులను హింసింపగోరుచున్నారు. మేము ఉగ్రములైన వచనములచే గాని భయంకర కృత్యములచేత గాని భయపడి క్షత్రధర్మము నుండి భ్రష్టులమై దేవేంద్రునకు కూడ తలవంచము. యుద్ధధర్మమును పాటించుచు మమ్ము మార్కొనగలవాడు నాకు ఎవ్వడును కన్పించుట లేదు. భీష్మద్రోణకృపకర్ణులను దేవతలు కూడ జయింపలేరు. ఇంక పాండవుల కశక్యమని చెప్పవలసినదేమున్నది? మేము స్వధర్మమును అనుష్ఠించుచు యుద్ధమున

మరణింతుమేని అది స్వర్గప్రదమే యగును. శరతల్పమునందు శయనించుట క్షత్రియులకు ముఖ్యధర్మమే కదా ! మేము శత్రువులకు ప్రణమిల్లకుండ వీరశయనమును పొందినచో మావా రెవ్వరును పరితపింపరు. ఉత్తమకులమున జన్మించి క్షత్రియధర్మమును అవలంబించువాడు ఎవడైనను ప్రాణభయముతో శత్రువునకు నమస్కరించునా ? "ఉద్యమమే యొనరింపవలె. శత్రువునకు ప్రణమిల్లరాదు. అయుక్తమైన సందర్భమునందు నడిమిని విఱిగిన విఱుగవచ్చును గాని పరునకు ప్రణమిల్ల రాదు" అన్న మాతంగమునియొక్క వచనమును హితమును కోరువారు అవలంబింతురు. ధర్మముకొఱకైనచో నావంటివాడు బ్రాహ్మణులకే ప్రణమిల్లును. ఇది క్షత్రియులకు ధర్మము నా మతము కూడ ఇంతే.

మాతండ్రి యింతకు పూర్వము వారి కొసంగిన రాజ్యాంశము, నేను జీవించి యుండగా, మరల వారికి లభింపదు. ధృతరాష్ట్రుడు రాజుగా జీవించియున్నంతవఱకు మేముగాని వారుగాని ఆయుధములను వదలి మాకిప్పు డున్నదానిని అనుభవించుచు ఉండవచ్చును. నేను అస్వతంత్రుడనైయుండగా వారికి ఈయబడినరాజ్యము మాత్రము మరల వారికి ఇచ్చుట మాత్రము జరుగదు. నేను బాలుడనై యుండగా అజ్ఞానమువలనగాని భయమువలనగాని దత్తమైనరాజ్యము, ఇప్పుడు నేను బ్రతికియుండగా వారికి లభించుట అసంభవము. మా భూమియందు వాడియైన సూదియొక్క మొన మోపుటకు వలసినంత నేలనైనను నేను వారికి వదలను".

శ్లో|| ప్రసమీక్ష్య భవా నేత ద్వక్తు మర్హసి కేశవ |
మామేవ హి విశేషేణ విభాష్య పరిగర్హసే || 2

శ్లో|| భక్తివాదేన పార్థానా మకస్మా న్మధుసూదన |
భవాన్ గర్హయతే నిత్యం కిం సమీక్ష్య బలా బలమ్ || 3

శ్లో|| న చాహం కంచి దత్యర్థ మపరాధ మరిందమ |
విచింతయన్ ప్రపశ్యామి సుసూక్ష్మ మపి కేశవ || 6

శ్లో|| కేన వాప్యపవాదేన విరుధ్యం త్యరిభి స్సహ |
అశక్తాః పాండవాః కృష్ణ ప్రహృష్టాః ప్రత్యమిత్రవత్ || 10

శ్లో|| కి మస్మాభిః కృతం తేషాం కస్మిన్ వా పున రాగసి |
దార్తరాష్ట్రాన్ జిఘాంసంతి పాండవాః సృంజయై స్సహ || 11

శ్లో|| న చాపి వయ ముగ్రేణ కర్మణా వచనేన వా |
ప్రభ్రష్టాః ప్రణమా మేహ భయా దపి శతక్రతుమ్ || 12

శ్లో|| న చ తం కృష్ణ పశ్యామి క్షత్రధర్మ మనుష్ఠితమ్ |
ఉత్సహేత యుదా జేతుం యో న శ్శత్రునిబర్హణ || 13

శ్లో|| ముఖ్యశ్చై వైష నో ధర్మః క్షత్రియాణాం జనార్దన |
యత్ శయీమహి సంగ్రామే శరతల్పగతా వయమ్ || 16

శ్లో|| ఉద్యచ్ఛే దేవ న నమేత్ ఉద్యమో హ్యేవ పౌరుషమ్ |
అ ప్యపర్వణి బజ్యేత న నమే దిహ కర్హిచిత్ || 19

నీలకంఠీయమ్ ఉద్యచ్ఛేదేవ ఉద్యమం కుర్యాదేవ | అపర్వణి అప్రస్తావే, "పర్వ స్యా ద్యుత్సవే గ్రంథౌ ప్రస్తావే లక్షణాంతరే" ఇతి విశ్వః

శ్లో|| ఇతి మాతంగవచనం పరీప్స్యంతి హితేప్సవః |
దర్మాయ చైవ ప్రణమే ద్బ్రాహ్మణేభ్య శ్చ మద్విధః || 20

శ్లో|| రాజ్యాంశ శ్చాభ్యనుజ్ఞాతో యో మే పిత్రా పురాభవత్ |
న స లభ్యః పునర్జాతు మయి జీవతి కేశవ || 22

శ్లో|| ధ్రియమాణే మహాబాహౌ మయి సంప్రతి కేశవ |
యావద్ధి తీక్ష్ణయా సూచ్యా విధ్యే దగ్రేణ కేశవ |
తావ దప్యపరిత్యాజ్యం భూమే ర్నః పాండవాన్ ప్రతి || 25

శ్రీమహాబారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 127

ఆమాటలకు క్రుద్ధుడై కృష్ణుడు కనులు పెద్దవి చేసి పకపక నవ్వి దుర్యోధనునితో ఇట్లనెను. "సరే! నీకు వీరశయనమే లభించును. నీకోరిక తీరును. మహాయుద్ధము రానున్నది. అమాత్యులతో కూడ స్థిరుడవై యుందుము. పాండవులకు నేనేమియు అపకారము చేయలేదు అని మూడుడవై తలంచుచున్నావు. వారి విషయమున నీవు గావించిన యపరాధ మెట్టిదో ఈరాజు లందఱు తెలిసికొందురు గాక!

మహాత్ములైన పాండవుల వైభవమునకు సంపదకు పరితపించుచు నీవు శకునితో జూదమునుగూర్చి దుష్టమైనయాలోచనము గావించితివి. ఋజువర్తనులై సజ్జనసమ్మానితులైన జ్ఞాతుల విషయమున నీవు వంచనముతో వారిని ఆహ్వానించి మన్నించుచున్నట్లు ఎట్లు నటించితివి? మహాప్రాజ్ఞులైన సత్పురుషులకు కూడ ద్యూతము బుద్ధిని నశింపజేయును. దుర్జనులకు తప్పక అది కలహమును దుఃఖమును కలిగించును. ఇప్పుడు కలిగిన యాపద అంతయు ఆజూదమువలననే సంభవించినది. అగ్రజుని భార్యను సభకు రప్పించి నీవలె దుర్భాషలాడువాడు ఎవడైన ఉన్నాడా ? మహాపతివ్రతయైన పాండవధర్మపత్ని, వారికి ప్రాణాధికప్రియురాలును అయిన పాంచాలిని నిండుసభలో నీవు ఘోరముగా అవమానింతివి. ఆనాడు సభలో నీవు

ఆమెనుగూర్చి అన్నమాటలను కౌరవులందఱును ఎఱుగుదురు. అడవులకు పోవుచున్న పాండవులను దుశ్శాసను డన్న మాటలను కూడ వీ రెఱుంగుదురు. ధర్మవర్తనులైన బంధువుల యెడ ఎవ్వడైనను అనుచితముగ ప్రవర్తించునా ? అనార్యులవలె నృశంసులవలె నీవు కర్ణుడు దుశ్శాసనుడు వారిని ఎన్నో మాట లన్నారు వారు బాలురై యుండగా వారణావతమున తల్లితో కూడ వారిని దగ్ధమొనర్చుటకు నీవు పెద్ద ప్రయత్నము చేసితివి కాని నీకోరిక సిద్ధింపలేదు. అప్పుడు వారు నీ హత్యాప్రయత్నములనుండి తప్పించుకొనుటకై తల్లితో కూడ ప్రచ్ఛన్నులై ఏకచక్రపురమున చిరకాలముండిరి విషముచేత సర్పములచేత బంధనములచేత నీవు సకలవిధముల వారిని అంతమొందించుటకు యత్నించితివి. అయినను నీ సంకల్పము నెరవేరలేదు ఇట్లు ఎల్లప్పుడు వారికి ద్రోహమునే తలపెట్టుచు వారికి నేనెట్టియపరాధమును చేయలేదని ఎట్లు చెప్పుచున్నావు ? ఇప్పుడు వారు తమ తండ్రిభాగముకొఱకు యాచించుచుండగా ఈయ ననుచున్నావు. పాపాత్ముడా ! ఐశ్వర్యభ్రష్టుడవై నేలగూలినప్పుడు ఆభాగమును తప్పక ఇత్తువు. అనార్యుడవై వంచకుడవై క్రూరుడవై వారియెడల ఎన్నో అపరాధములను చేసి ఇప్పుడు నేను చేయలేదనుచున్నావు.

తల్లిదండ్రులు భీష్ముడు ద్రోణుడు విదురుడు శమింపుమని ఎన్నిపర్యాయములు నీకు బోధించిననను వినకున్నావు నీవు శమము నవలంబించినచో నీకును పాండవులకు కూడ గొప్ప శ్రేయస్సు కలుగును. బుద్ధిహీనతవలన నీకు అది రుచించుట లేదు సుహృత్తుల వచనములను అతిక్రమించుచున్న నీకు సుఖము కలుగదు. నీవు దర్మవిరుద్ధము అపకీర్తికరమును అయిన పనికి పూనుకొన్నావు."

శ్లో॥ తతః ప్రహస్య దాశార్హః క్రోధపర్యాకులేక్షణః ।
దుర్యోధన మిదం వాక్య మబ్రవీత్ కురుసంసది ॥ 1

శ్లో॥ లప్స్యసే వీరశయనం కామ మేత దవాప్స్యసి ।
స్థిరో భవ సహామాత్యో విమర్దో భవితా మహాన్ ॥ 2

శ్లో॥ యచ్చైవం మన్యసే మూఢ న మే కశ్చిద్వ్యతిక్రమః ।
పాండవే ష్వితి ; తత్సర్వం నిబోధత నరాధిపాః ॥ 3

శ్లో॥ శ్రియా సంతప్యమానేన పాండవానాం మహాత్మనామ్ ।
త్వయా దుర్మంత్రితం ద్యూతం సౌబలేన చ భారత ॥ 4

శ్లో॥ తదిదం వ్యసనం ఘోరం త్వయా ద్యూతముఖం కృతమ్ ।
**అసమీక్ష్య సదాచారైః సార్ధపాపానుబంధనైః ॥ 7**

శ్లో॥ కశ్చాన్యో భ్రాతృభార్యాం వై విప్రకర్తుం తథార్హతి|
ఆనీయ చ సభాం వ్యక్తం యథోక్తా ద్రౌపదీత్వయా॥ 8

శ్లో॥ నృశంసానా మనార్యాణాం పురుషాణాంచ భాషణమ్|
కర్ణదుశ్శాసనాభ్యాం చ త్వయా చ బహుశః కృతమ్॥ 12

శ్లో॥ సహ మాత్రా ప్రదగ్ధుం తాన్ బాలకాన్ వారణావతే|
ఆస్థితః పరమం యత్నం న సమృద్ధం చ తత్తవ॥ 15

శ్లో॥ ఏవం బుద్ధిః పాండవేషు మిథ్యావృత్తి స్సదా భవాన్|
కథం తే నావరాధోఽస్తి పాండవేషు మహాత్మసు॥ 16

శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి - అధ్యాయః - 128

# 2. విశ్వాత్మకత్వప్రకటన కమండలువు

## (i) బంధనోద్యమ చమసము

శ్రీకృష్ణుడిట్లు చెప్పుచుండగా దుశ్శాసనుడు దుర్యోధనునితో ఇట్లనెను "అన్నా! నీవు పాండవులతో సంధికి ఇష్టపడకున్నచో కౌరవులు నిన్ను బంధించి యుధిష్ఠిరునకు అప్పగింతురు. భీష్మద్రోణులు తండ్రి కూడ నిన్ను నన్ను కర్ణుని పాండవులకు ఇచ్చివేయుదురు" ఆమాటలను విని మహాసర్పము వలె నిట్టూర్చుచు దుర్యోధనుడు మహారాజును భీష్మద్రోణాదులను అనాదరించి సభామర్యాదను పాటింపక లజ్జాహీనుడై బయలుదేరెను. వానివెంట వాని సోదరులు ఇష్టులైనరాజులను బయలుదేరిరి.

వెడలిపోవుచున్న దుర్యోధనుని జూచి భీష్ముడిట్లనెను "దురాత్ముడైన యీ దార్తరాష్ట్రుడు ధర్మమును అర్థమును వదలి సంఘర్షణమునే కోరుచున్నాడు. ఈరాజులందఱును మూఢులై మంత్రులతో కూడ వీనివెంట పోవుచున్నారు. కృష్ణా! క్షత్రియజాతి యంతయు కాలవశమున మృత్యువునకు పక్వమైయున్నదని తలంచుచున్నాను"

ఆమాటపైన శ్రీకృష్ణుడు కురువృద్ధుల నందఱను చూచి ఇట్లనెను. "ఐశ్వర్యమువలన మందుడైయున్నరాజును నియమింపక ఈ కురువృద్ధు లందఱును పెద్ద దర్మవ్యతిక్రమమునకు పాల్పడుచున్నారు. మీరందఱును శత్రుసంహార సమర్థులు. ఇప్పుడు కాలోచితమైన కర్తవ్యమును చెప్పుచున్నాను. వినుడు. ఈకార్యనిర్వాహణమున శ్రేయస్సు కలుగును. జరిగినదంతయు మీకు ప్రత్యక్షమే. కావున నేను చెప్పు హితము మీకు రుచించినచో అట్లు చేయుడు.

వృద్ధుడు భోజకులమునకు అదిపతి సకలయాదవులకు రాజు అయిన యుగ్రసేనుడు జీవించియుండగనే, అయన కుమారుడు కంసుడు దుర్వర్తనుడై తండ్రియొక్క ప్రభుత్వమును హరించెను. వానిని బంధువు లందఱును పరిత్యజించిరి అప్పుడు నేను జ్ఞాతులహితమును కోరి కంసుని సంహరించితిని. పిదప మే మందఱము ఉగ్రసేనుని సత్కరించి రాజును గావించితిమి కంసు నొక్కనిని పరిత్యజించి భోజాంధకవృష్ణులు కూడి సుఖముగా అభ్యుదయము నొందుచున్నారు.

పూర్వము దేవతలు దానవులు యుద్ధమునకు సిద్ధపడిరి. వారి ననుసరించి లోకములోని మనుష్యగంధర్వాదు లందఱును రెండు పక్షములైరి. "దేవతలే జయింతురు కాని యుద్ధము జరిగినచో అమితముగ ప్రజావినాశము జరుగు"నని ప్రజాపతియైన పరమేష్ఠి, "దైత్యదానవులను బంధించి వరుణునకు అప్పగింపు"మని దర్మునకు ఆదేశించెను. ఆనియోగముచేత ధర్ముడు దైతేయ దానవులను బంధించి వరుణునకు అప్పగించెను ధర్మునియొక్క పాశములచే బద్ధులైయున్నవారిని వరుణుడు వారుణపాశములచేత కూడ బంధించి సాగరమునందు ప్రబలయత్నముతో రక్షించుచున్నాడు.

కాబట్టి ఆవిధముగానే మీరు దుర్యోధనకర్ణదుశ్శాసనశకునులను బంధించి పాండవులకు అప్పగింపుడు. కులముయొక్క క్షేమముకొఱకు పురుషుని, గ్రామముకొఱకు కులమును, జనపదముకొఱకు గ్రామమును, తనకొఱకు పృథివిని త్యజింపవలయును. మహారాజ! దుర్యోదనుని బందించి పాండవులతో శాంతిని పొందుము. అట్లయినచో నీనిమిత్తమున క్షత్రియులు నశింపకుందురు"

శ్లో|| సర్వేషాం కురువృద్ధానాం మహా నయ మతిక్రమః |
ప్రసహ్య మంద మైశ్వర్యే న నియచ్ఛత య న్నృపమ్ || 34

శ్లో|| తత్ర కార్య మహం మన్యే కాలప్రాప్త మరిందమాః |
క్రియమాణే భవే చ్ఛ్రేయః తత్సర్వం శృణుతానఘాః || 35

శ్లో|| ఉగ్రసేనసుతః కంసః పరిత్యక్త స్స బాంధవైః |
జ్ఞాతీనాం హితకామేన మయా శస్తో మహామృధే || 38

శ్లో|| కంస మేకం పరిత్యజ్య కులార్థే సర్వయాదవాః |
సంభూయ సుఖ మేధన్తే భోజకాంధకవృష్ణయః || 40

శ్లో|| దేవాసురమనుష్యా శ్చ గంధర్వోరగ రాక్షసాః |
అస్మిన్ యుద్ధే సుసంక్రుద్ధా హనిష్యంతి పరస్పరమ్ || 44

శ్లో|| ఇతి మత్వాఽబ్రవీద్ధర్మం పరమేష్ఠీ ప్రజాపతిః |
వరుణాయ ప్రయచ్ఛైతాన్ బద్ధ్వా దైతేయదానవాన్ || 45

శ్లో ఏక ముక్త స్తతో దర్మో నియోగాత్ పరమేష్ఠినః |
వరుణాయ దదౌ సర్వాన్ బద్ధ్వా దైతేయ దానవాన్ || 46

శ్లో తథా దుర్యోధనం కర్ణం శకునిం చాపి సౌబలమ్ |
బద్ధ్వా దుశ్శాసనం చాపి పాండవేభ్యః ప్రయచ్ఛధ || 48

శ్లో త్యజేత్ కులార్థే పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్ |
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృధివీం త్యజేత్ || 49

శ్లో|| రాజన్ దుర్యోధనం బద్ధ్వా తతః సంశామ్య పాండవైః |
త్వత్కృతే న నశ్యేయుః క్షత్రియాః క్షత్రియర్షభ || 50

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 128

ఆమాటలు విని దృతరాష్ట్రుడు కృష్ణునకు సమాధానము చెప్పకుండ త్వరపడుచు విదురుని పిలిచి గాంధారిని పిలుచుకొని రమ్మనెను. ఆమె వచ్చిన తరువాత విదురుడు దుర్యోధనుని తీసికొని వచ్చెను. భీష్మాదులు తండ్రియు చెప్పినట్లు పాండవులతో సంధి చెసికొమ్మని ఆమె పుత్రునకు బోధించెను అతడు ఆమె మాటను అనాదరించి సభ నుండి వెడలిపోయి శకునికర్ణదుశ్శాసనులతో మంతనము లారంభించెను శ్రీకృష్ణుని అప్పుడే అచ్చటనే బందింపవలయు నని ఆదుష్టచతుష్టయము నిశ్చయించెను ఆవిషయము నెఱింగి సాత్యకి కృతవర్మను సభాద్వారమునొద్ద సన్నద్ధుడవై యుండు మని చెప్పి సభలోనికి వచ్చి కృష్ణునకు ధృతరాష్ట్రాదులకు దుర్యోధనుని దురాలోచనము నెఱింగించెను

విదురుడు దృతరాష్ట్ర నిట్లు హెచ్చరించెను. "అన్నా! నీకొడుకులకు కాలము దాపురించినది వారు పుండరీకాక్షుని నిగ్రహింపదలంచుచున్నారు సింహము ఏనుగులను వలె ఆయన వారిని అంత మొందింపగలడు. శ్రీకృష్ణుడు నిందితమైన కార్యమును పాపమును ఎప్పుడును చేయడు , ధర్మమును అతిక్రమింపడు"

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో అందఱు వినుచుండగా ఇట్లనెను "మహారాజా! వీరు క్రుద్ధులై నన్ను నిగ్రహింపవచ్చును. వీరు నన్నుగాని, నేను వీరినిగాని నిగ్రహించుటకు నీవు అనుమతినొసంగుము వీరి నందఱను నేను నిగ్రహింపగోరుచున్నాను నేను నింది తమైన పాపకర్మను ఎప్పుడును చేయను. పాండవులసంపదకై పేరాసనొందుచు నీకొడుకులు తమకు ఉన్న దానిని కూడ కోల్పోవుచున్నారు. వీరు ఈవిధముగా నన్ను నిగ్రహింపగోరుటవలన యుధిష్ఠిరుని కార్య మిప్పుడే సిద్ధించుచున్నది. ఇప్పుడే నీకొడుకులను వారియనుచరులను బంధించి పాండవులకు అప్పగింతును. అది దుష్కృత మగునా ఏమి ? నీసన్నిధియందు క్రోధవశుడనై నిందితమైన కార్యమును ప్రవర్తింపజేయను. ఈ దుర్యోధనుడు తనకు ఇష్టము వచ్చినట్లు చేయును గాక! నీకొడుకులు స్వేచ్ఛగా వర్తించుటకు నేను అనుజ్ఞనిచ్చుచున్నాను".

ధృతరాష్ట్రుడు కృష్ణునకు సమాధానము చెప్పక విదురుని పంపి సానుచరముగా దుర్యోధనుని పిలిపించి తీవ్రముగ మందలించెను. విదురుడు కూడ శ్రీకృష్ణుని పరాక్రమమును ప్రశంసించి దుర్యోధనుని బెదిరించెను.

శ్లో|| సింహో నాగా నివ క్రుద్ధో గమయే ద్యమసాదనమ్ |
న త్వయం నిందితం, కర్మ కుర్యాత్పాపం కథంచన || 22

శ్లో|| న చ ధర్మా దపక్రామే దచ్యుతః పురుషోత్తమః |
విదురేణైవ ముక్తేతు కేశవో వాక్య మబ్రవీత్ || 23

శ్లో|| ధృతరాష్ట్ర మభిప్రేక్ష్య సుహృదాం శృణ్వతాం మిథః |
రాజ న్నేతే యది క్రుద్ధా మాం నిగృహ్ణీయు రోజసా || 24

శ్లో|| ఏతే వా మా మహం వైనా ననుజానీహి పార్థివ |
ఏతాన్ హి సర్వాన్ సంరబ్ధా న్నియంతు మహ ముత్సహే || 25

శ్లో|| న త్వహం నిందితం కర్మ కుర్యాం పాపం కదంచన |
పాండవార్థే హి లుభ్యంతః స్వార్థాన్ హాస్యంతి తే సుతాః || 26

శ్లో|| ఏతే చే దేవ మిచ్ఛంతి కృతకార్యో యుధిష్ఠిరః |
అద్యైవ హ్యహ మేనాంశ్చ యే చైనా నను భారత || 27

శ్లో|| నిగృహ్య రాజన్ పార్థేభ్యో దద్యాం కిం దుష్కృతం భవేత్ |
ఇదం తు న ప్రవర్తేయం నిందితం కర్మ బారత || 28

శ్లో|| సన్నిదౌ తే మహారాజ క్రోధజం పాపబుద్ధిజమ్ |
ఏష దుర్యోధనో రాజన్ యథేచ్ఛతి తథాఽస్తు తత్ || 29

శ్లో|| అహం తు సర్వాం స్తనయాన్ అనుజానామి తే నృప |
ఏతచ్ఛ్రుత్వాతు విదురం ధృతరాష్ట్రోఽభ్యభాషత || 30

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 130

## బాలప్రియ

తల్లిదండ్రులయొక్క పితామహాదులయొక్క హితోపదేశమును అతిక్రమించుట తప్పని, అప్పుడు వారు తమ్ము నిగ్రహింపవచ్చు నని దుశ్శాసనుడు తలంచుట గమనింపదగి యున్నది. తాము చేయుచున్నది యపరాధమని వారికి తెలియు నన్నమాట. ఇంతమాత్రము ధృతరాష్ట్రునకు భీష్మునకు తెలియదని తలంచుటకు వీలులేదు. తల్లిదండ్రుల మాట వినక కులనాశమునకు సిద్ధపడుచున్న పుత్త్రుని పరిత్యజించుట

తల్లిదండ్రులకు ధర్మకర్తవ్య మని శ్రీకృష్ణుడు స్పష్టముగా నిరూపించెను ధృతరాష్ట్రుడు పుత్రప్రేమకు వశుడై కర్తవ్యమును నిర్వహించబూనలేదు. సర్వధర్మజ్ఞుడైన భీష్ముడు కూడ సామాన్యులవలె, "కాలముయొక్క ప్రభావ మిట్లున్నది. మన మేమి చేయగలము" అని అంగలార్పజొచ్చెనే కాని కర్తవ్యనిర్వహణమునకు పూనుకొనలేదు. రాజ్యమును వదలుకొన్నంత మాత్రమున భీష్మునకు కుటుంబమున అదికారస్థానము పోదు కుటుంబమునకు పెద్దవాడుగా అదర్మమును నివారించుటకై ఆయన దుర్యోదనుని పరిత్యజింపుమని ధృతరాష్ట్రుని శాసింపవలసియుండెను కాని ఆయన తనకర్తవ్యమును నిర్వహింపబూనుకొనలేదు. ఇది పెద్ద ధర్మాతిక్రమణము. ధృతరాష్ట్రుని నియమింపకుండ ఊరకచూచుచున్న బీష్మాదులైన కురువృద్దు లందఱును గావించుచున్నది పెద్దధర్మాతిక్రమణ మని శ్రీకృష్ణుడు నిస్సంకోచముగా ప్రకటించెను ఈమాటను వారెవరును కాదన లేదు. కాని కర్తవ్యమును నిర్వహించుటకు మాత్రము పూనుకొనలేదు.

శ్రీకృష్ణుడు చెప్పినను ధృతరాష్ట్రుడు భీష్మాదులు కర్తవ్యమును నిర్వహింపబూనుకొనలేదు. ప్రేమవశులైయున్న వారు తమ్ము నిగ్రహింప రని దుర్యోధనునకు చక్కగా తెలియును. అందువలన అతడు వారు చెప్పినట్లుగా వినకపోగా దూతగా వచ్చిన శ్రీకృష్ణుని బంధించుటకు పూనుకొనెను ఇది అప్పుడు ప్రత్యక్షమగుచున్న నేరము. ఈనేరము చేయబూనినవానిని రాజు వెంటనే విచారించి శిక్షింపవలసియున్నది. దుర్యోధనుడుకాక మఱియొకడు అపరాది యైనచో దృతరాష్ట్రుడు తప్పక శిక్షించి యుండెడివాడు ప్రభుత్వకర్తవ్యమును వదలి దృతరాష్ట్రుడు కుమారుని శిక్షింపక మరల హితబోధ చేయుటకే పూనుకొనెను.

ఇప్పుడు శ్రీకృష్ణు డేమి చేయవలె ? దుర్యోదనాదులు తన్ను బంధించుటకు వచ్చినచో ఆయన బందింపబడవలసినదేనా ? అప్పుడైనను ధృతరాష్ట్రాదులు వారిని అడ్డగించి శ్రీకృష్ణుని రక్షింతురని నమ్మకమేమున్నది ? ఇంటికోడలైన ద్రౌపదినే రక్షింపబూనకొనలేని కురువృద్ధులు దూతను రక్షింపబూనుకొందురా ? అప్పుడు శ్రీకృష్ణుడు ఆత్మరక్షణముకొఱకు విక్రమించి వారిని సంహరింపవచ్చునా ? కుంతిసంబందముచేత దృతరాష్ట్రుడు శ్రీకృష్ణునకు మామ, పెద్దవాడు. ఆయనయింటికి దూతగా వచ్చి ఆయన సమక్షమున ఆయనకుమారులను ఆత్మరక్షణకొఱకైనను సంహరించుట ధర్మము కాదు. అది క్రోధజము పాపబుద్ధిజము అగును. కాని దుర్యోదనాదులను ప్రతిఘటింపక లోబడుట అధర్మమునకు లోబడుటయే యగును అది క్షత్రియునకు ఉచితము కాదు అందువలన ఆయన ధృతరాష్ట్రుని పెద్దఱికమును మన్నించి ఆత్మరక్షణకై దుర్యోధనాదులను నిగ్రహించుటకు తనకు అనుమతి నిమ్మని ప్రార్థించెను. అప్పుడు కూడ ఆయన వారిని సంహరింతు నన లేదు , బంధించి పాండవులకు అప్పగింతు నని మాత్రమే చెప్పెను. తనకు అపాయము సంభవించుచున్న సందర్భమున ఆత్మరక్షణకై పెద్దలయనుమతిని పొందవలయు నని సామాన్యునకు

తోచనే తోచదు. ఇది శ్రీకృష్ణునియొక్క దర్మాత్మత్వమునకు ప్రబలనిదర్శనము ఆయన ఆ సందర్భమున క్రోధమును ప్రకటించి దుర్యోధనుని బెదరించెనే కాని క్రోధమునకు లోబడ లే దనుటయు స్పష్టమే

ఆత్మరక్షణకై శ్రీకృష్ణుడు అనుమతిని కోరుచున్నప్పటికి ధృతరాష్ట్రుడు సమాదానము చెప్పక మరల దుర్యోధనునకు హితబోధ చేయుటకే పూనుకొనుటవలన ఆయనయొక్క స్వార్థపరత్వము ఎంత దృఢముగా నున్నదో వ్యక్తమగుచున్నది.

## (ii) విశ్వరూప ప్రదర్శన చమసము

విదురుడు దుర్యోదనునకు హితమును చెప్పి విరమించినంతనే శ్రీకృష్ణుడు దుర్యోధనునితో ఇట్లనెను "దుర్యోధనా ! అజ్ఞానమువలన నీవు నాకు సహాయులు లేరని నన్ను పరిభవించి బంధింపవలెనని తలంచుచున్నావు. కాని పాండవులు అంధకులు వృష్ణులు ఆదిత్యులు రుద్రులు వసువులు ఋషులును ఇచ్చటనే యున్నారు." ఇట్లని శ్రీకృష్ణుడు పెద్దగా నవ్వెను. ఆయన నవ్వుచుండగా పాండవాదులు మెఱపు తీగలవలె ఆయననుండి అగ్నిజ్వాలలను వెలువరించుచు బొటనవ్రేలంతటి యాకారములతో వెలువడి ప్రకాశింపజొచ్చిరి. ఆయనయొక్క లలాటమునందు బ్రహ్మ, వక్షస్సునందు రుద్రుడు, బుజములయందు లోకపాలకులు, నోటియందు అగ్నిదేవుడు కన్పించిరి. ఆదిత్యులు సాద్యులు వసువులు అశ్వినులు, ఇంద్రునితో కూడ మరుత్తులు, విశ్వేదేవతలు ఆయనయొక్క వివిధ రూపబాగములయందు ప్రకాశించిరి. ఆయన బాహువులయందు కుడివైపున అర్జునుడు ఎడమవైపున బలరాముడు ఆవిర్భవించిరి భీమఃడు యుధిష్ఠిరుడు సకలసహదేవులు ఆయన వెనుక భాగమునుండి పైకవచ్చిరి అంధకవృష్ణులు ప్రద్యుమ్నాదులు మహాయుధములతో ఆయనకు ముందుభాగమున తేజరిల్లిరి. ఆయనయొక్క అనేక బాహువులయందు శంఖచక్రగదానందకాదులైన దివ్యాయుధములు ఉద్యతములై దీపింపజొచ్చెను. నేత్రయుగళము నుండి నాసికనుండి చెవులనుండి రోమకూపములనుండి, సూర్యునినుండి కిరణములవలె, పొగలసెగలతో పావకజ్వాలలు బయలుదేరెను.

భయంకరమైన యామహారూపమును చూచి, మహర్షులు భీష్మద్రోణవిదురసంజయులు తప్ప, రాజు లందఱును విభీతులై కనులు మూసికొనిరి. భీష్మాదులకు శ్రీకృష్ణభగవానుడు దివ్యదృష్టిని ప్రసాదించెను. ఆ సభాతలమునందు ప్రద్యోతమానమగుచున్న వాసుదేవుని మహాశ్చర్యరూపమును చూచి దేవతలు దుందుభులను మ్రోగించి పుష్పములను వర్షించిరి.

ధృతరాష్ట్రుడు ఆసంరంభమునుబట్టి శ్రీకృష్ణు డేదో అద్భుతమును ప్రదర్శించుచున్నాడని గ్రహించి, "భగవానుడా ! పుండరీకాక్షా ! నన్ను అనుగ్రహింపుము, దృష్టి నొసంగుము. అదృష్టితో భగవంతుడవైన నిన్ను తప్ప నేను

ఎవరిని చూడగోరుట లేదు నిన్ను చూచిన పిదప నాదృష్టి యంతరించును గాక!" అని ప్రార్థించెను "అట్లే చూడుము" అని వాసుదేవు డనుగ్రహించినంతనే ధృతరాష్ట్రుడు రెండు కన్నులతో ఆవిశ్వరూపమును చూడజూచ్చెను పుట్టుగ్రుడ్డికి దృష్టి కలుగుటను చూచి విస్మితులై మహర్షులు శ్రీకృష్ణుని స్తుతించిరి

అప్పుడు భూమి చలించెను. సాగరము క్షుభితమయ్యెను. రాజు లందఱు విస్మితులగుచుండగా శ్రీకృష్ణుడు దివ్యము చిత్రము సమృద్ధమును అయిన విశ్వరూపమును ఉపసంహరించెను పిదప సాత్యకిని కృతవర్మను గైకొని ఆయన సభాభవనమునుండి బయలుదేఱెను. మహర్షులు అంతర్హితులై వెడలిపోయిరి. శతక్రతునివెంట దేవతలవలె, రాజులు శ్రీకృష్ణునివెంట బయలుదేఱిరి.

ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని సమీపించి ఇట్లనెను "కృష్ణా! కుమారుల విషయమున నాకు గల సామర్థ్యమెట్టిదో నీవు చూచితివి. కురువులకు శాంతినే అభిలక్షించుచు ప్రయత్నించుచున్నను అశక్తుడనైన నాపరిస్థితిని గమనించి నన్ను నీవు శంకింపకుము. నాకు పాండవులయెడ పాపబుద్ధి లేదు నేను దుర్యోధనునకు హితమును బోధించుట నీవు వింటివి. శాంతికొఱకు నేను సర్వవిధముల ప్రయత్నించుచున్నానని ఈరాజు లందఱును ఎఱుగుదురు".

శ్రీకృష్ణుడు భీష్మాదులను చూచి ఇట్లనెను. "మీయెదుటనే రోషముతో దుర్జనుడైన దుర్యోధనుడు ప్రవర్తించిన విధము మీరు ప్రత్యక్షముగా చూచితిరి. ఈ మహారాజు ధృతరాష్ట్రుడు పుత్రుల విషయమున తాను అసమర్థుడ నని చెప్పుచున్నాడు ఇంక మీ రందఱు నాకు సెలవిండు. నేను యుధిష్ఠిరుని యొద్దకు పోవుదును".

వారిని వీడ్కొని వాసుదేవుడు చెప్పిపోవుటకై కుంతియింటికి పోయెను. ఆమెకు పాదాభివందనము గావించి ఆయన జరిగిన వృత్తాంతమును చెప్పి, "పాండవులకు నీ మాటగా ఏమి చెప్పుమందువు?" అని యడిగెను ఆమె యుధిష్ఠిరునకు క్షత్రియధర్మవిశేషములను వివరించి, "క్షత్రియస్త్రీ ఏప్రయోజనముకొఱకు పుత్రుని పొందునో ఆసమయ మాసన్న మైనది" అని చెప్పుమనెను.

కృష్ణు డామెకు వందనముగావించి ప్రదక్షిణమొనర్చి ఆమెయింటినుండి బయలుదేఱి భీష్మాదులతో పోయివత్తు నని సెలవు గైకొని కర్ణుని మాత్రము తనరథమునందు ఎక్కించుకొని పయనమయ్యెను.

శ్లో|| ఏకోఽహ మితి యన్మోహా న్మన్యసే మాం సుయోధన|
పరిభూయ సుదుర్బుద్ధే గ్రహీతుం మాం చికీర్షసి || 2

శ్లో|| ఇహైవ పాండవా స్సర్వే తథైవాంధక వృష్ణయః|
ఇహాదిత్యాశ్చ రుద్రాశ్చ వసవశ్చ మహర్షిభిః || 3

శ్లో|| ఏవ ముక్త్వా జహా సోచ్చైః కేశవః పరవీరహా |
తస్య సంస్మయత శ్శౌరే ర్విద్యుద్రూపా మహాత్మనః || 4

శ్లో|| అంగుష్ఠమాత్రా స్త్రిదశా ముముచుః పావకార్చిషః |
అస్య బ్రహ్మా లలాటస్థో రుద్రో వక్షసి చాభవత్|| 5

శ్లో|| తత్రాద్భుతం మహారాజ ధృతరాష్ట్ర శ్చ చక్షుషీ |
లబ్ధవాన్ వాసుదేవాచ్చ విశ్వరూపదిదృక్షయా || 20

శ్లో|| తతో௨బ్రవీ న్మహాబాహు ర్ధృతరాష్ట్రం జనార్దనః |
ద్రోణం పితామహం భీమం క్షత్తారం బాహ్లికం కృపమ్ || 36

శ్లో|| ప్రత్యక్షమేవ భవతాం యద్వృత్తం కురుసంసది |
యథా చాశిష్టవ న్మందో రోషా దద్య సముత్థితః || 37

శ్లో|| వద త్యనీశ మాత్మానం ధృతరాష్ట్రో మహీపతిః |
అపృచ్ఛే భవత స్సర్వాన్ గమిష్యామి యుధిష్ఠిరమ్ || 38

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 131

## బాలప్రియ

మహాభారతకథయందు శ్రీకృష్ణుడు ప్రదర్శించిన విశ్వరూపములలో ఇది మొదటిది. విశ్వపరిపాలనకు సంబంధించినయధికారపదవులందున్న దేవతలు మహర్షులు మొదలగువారిని భగవంతుడు తన శరీరమునందే యున్నట్లు చూపుట విశ్వరూపప్రదర్శనము. ఇందు దేవతలను కాక పాండవాదులను చూపుట గమనింపదగియున్నది. అర్జునునకు యుద్ధరంగమున చూపినది ఇందులకు కొన్ని విశేషములతో భిన్నముగా నున్నది. ఇట్లే ఉదంకునకు చూపిన విశ్వరూపము పై రెండింటికిని భిన్నముగా నున్నది. విశ్వపరిపాలనకు అధికారులైనవా రందఱు తనయందే ఉన్నారని చూపుట మూడింటియందును సమానమైన ప్రధానాంశము. దీనికి అంగముగా, ప్రేక్షకులైన ధృతరాష్ట్రాదులకు, అర్జునునకు, ఉదంకునకు ఏర్పడిన సందర్భభేదముల ననుసరించి ఆయాసమయములకు ఉచితముగా ఆయన అనేకములైన యితరాంశములను ప్రదర్శించెనని గ్రహింపవలసియున్నది. అందువలన ఇది సిద్ధమైన రూపము కాదని భగవంతుడు తనవిశ్వమయత్వమును ప్రకటింపదలంచుకొన్నప్పుడు అప్పటికప్పుడు సందర్భానుసారముగా సంకల్పించి విశ్వరూపమును ఏర్పఱిచి చూపునని స్పష్టమగుచున్నది. కావున దీనికి ప్రయోజనము కూడ భిన్నముగానే యుండుననుట స్పష్టము. ఇచ్చట దుర్యోధనాదులను మూఢులను గావించి వారివిజృంభణమును అరికట్టుట ముఖ్యప్రయోజనము. అంతశక్తిమంతుడైన శ్రీకృష్ణుడు

పాండవులపక్షమునందు ఉండుటచే, యుద్ధము సంభవించినచో తమకు వినాశము పాండవులకు జయము తప్పదని గ్రహించి దుర్యోధనుడు సంధి కంగీకరించుటకు అవకాశము కలదు. అతడు అంగీకరింపకున్నను ధృతరాష్ట్రభీష్మాదులైన వానిని నిగ్రహింపవచ్చును. కావున శ్రీకృష్ణుడు సంధికొఱకై కావించిన యుద్యోగమున ఇది తుదిప్రయత్నము. దీనినిబట్టి ఆయన సంధికొఱకై సకలప్రయత్నములను గావించెననుట స్పష్టము

విశ్వరూపమును ప్రదర్శించి తనపరమేశ్వరత్వమును ప్రకటించిన కృష్ణుడు ధృతరాష్ట్రాదుల యధర్మపరత్వమును ఉద్ఘాటించి ధిక్కరింపక వారి పెద్దఱికమును మన్నించి సగౌరవముగా వారియొద్ద సెలవు తీసికొనుట గమనింపదగియున్నది. అట్లే కుంతికి పాదాభివందనము గావించి ఆయన ప్రదక్షిణము గావించి సెలవు తీసికొన్నాడు. పరమేశ్వరుడేయైనను తాను వహించుచున్న మనుష్యదేహము ననుసరించి సకల మర్యాదలను పాటింపవలసినదే యనునియమమును ఆయన ఇట్లు ప్రదర్శించినాడు.

నిగూఢమైన మఱియొక ప్రయోజనము కూడ ఈరాయబారయత్నమున మనము ఊహింపవచ్చును. విదురుడు చెప్పినట్లు దుర్యోధనాదులు ఏపరిస్థితియందు కూడ సంధికి అంగీకరింప రని కృష్ణునకు కూడ తెలియును. అయినను ధర్మకర్తవ్యము-- ఆయన దీనిని నిర్వహించె ననుట స్పష్టమే. ఆయన యీ రాయబారమునకై హస్తినకు పోకుండినచో ఒక పెద్దయపాయమునకు అవకాశముండెడిది. దుర్యోధనుడు తండ్రిని బలవంతపెట్టి ఆయనవలన ధర్మరాజును జూదమునకో ద్వంద్వయుద్ధమునకో పిలిపింపవచ్చును లేదా సంజయుడు చెప్పినట్లుగా ధృతరాష్ట్రుడే యుధిష్ఠిరుని పిలిపించి, "నీవు మహాత్ముడవు నీనడవడికి నీకు భిక్షాన్నమైన మేలె దుర్యోధనునితో యుద్ధమునకు పూనుకోవద్దు" అని పెద్దతండ్రిగా ఆదేశింపవచ్చును. అప్పుడు ధార్మికుడైన యుధిష్ఠిరుడు తండ్రిమాటను పాటింపవలసియే యుండును పూర్వము కూడ యుధిష్ఠిరుడు తండ్రియాజ్ఞకొఱకే అర్ధరాజ్యమునకు అంగీకరించెను, వారణావతమునకు పోయెను, జూదమునకు రెండు పర్యాయములు వచ్చెను. "మాతండ్రి ఆదేశించినచో పావకునియందైనను పడుదును" అని శ్రీరాముడు చెప్పినట్లు ధర్మరాజునకు తండ్రియాజ్ఞ అతిక్రమింపరానిదే యగును. ధృతరాష్ట్రునిస్వభావమును ఎరుగనివాడగుటచే యుధిష్ఠిరుడు ఆయనకు ఎట్లైనను సంతృప్తిని కలిగింపవలయు ననియే, తమకు అయిదూళ్లు ఇచ్చినను చాలు నని చెప్పెను. అందులకు కూడ అంగీకరింపక ధృతరాష్ట్రుడు, "నీవు యుద్ధమునకు రావద్దు" అని ఆదేశించినచో ధర్మాత్ముడైన శ్రీకృష్ణుడు కూడ, తండ్రియాజ్ఞను ధిక్కరించి పగను తీర్చుకొమ్మని ధర్మరాజునకు చెప్పజాలడు. అందువలన ధృతరాష్ట్రుడు ఆవిధముగా ఆదేశించుటకు **అవకాశము లేకుండజేయుటకు కూడ శ్రీకృష్ణుడు రాయబారమునకు బయలుదేఱె నని** యూహింపవచ్చును. ఆయన కురువృద్ధుల సమక్షమున దుర్యోధనుని దుర్వర్తనమును [illegible] తండ్రిచే తల్లిచే భీష్మాదులచే బోధింపజేసెను. దుర్యోధనుని

శాసించుటకు తనకు శక్తిలేదని ధృతరాష్ట్రుడు చెప్పవలసివచ్చెను సొంత కొడుకును శాసింపలేని ధృతరాష్ట్రుడు తమ్ముని కొడుకును శాసింపబూనుకొనుట అనుచితము హాస్యాస్పదము, లోకనిందకు హేతువగును. ధృతరాష్ట్రుడు అట్టి సాహసము చేయుటకు ఏమాత్రము అవకాశము లేకుండజేయుట శ్రీకృష్ణుని దౌత్యమునకు మఱియొక ముఖ్యప్రయోజనము.

ధర్మరాజు కురుక్షేత్రమునందు యుద్ధము నారంభించుటకు ముందుగా, భీష్మాదులయొద్దకు పోయి పెద్దల యనుమతిని పొందుటకూడ ఇట్టిదే.

మాతృదేవతగా కుంతి యుద్ధము చేయుమని ఆదేశించినది కదా! ధృతరాష్ట్రాదుల యాదేశములను ధర్మరాజు లెక్క పెట్టవలసిన యక్కఱ యేమున్నది ? కుంతి ధర్మరాజునకు మాతృదేవతయే. కాని భర్త గతించిన తరువాత ఆమె కుటుంబమునకు పెద్దవాడైన ధృతరాష్ట్రుని యాదేశమునకు లోబడి వర్తింపవలసియున్నది. అందువలన ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరుని ఆజ్ఞాపించినచో ఆయాజ్ఞకు భిన్నముగా ఆమె ఆదేశించినచో ఆయాదేశము చెల్లదు. అయోధ్యలోనే యుండుమని రాముని కౌసల్య ఆదేశించినప్పుడు, రాముడు ఈకారణముచేతనే ఆమె యాదేశమును నిరాకరించి తండ్రివచనమునే పాటించి వనమునకు పోయెను. కావున ధృతరాష్ట్రుడు కాని భీష్మాదులుకాని "యుద్ధమునకు రావల"దని శాసించినచో ఆ శాసనమును యుధిష్ఠిరుడు అతిక్రమించుట ధర్మదృష్టితో సంభవము కాదు. కావుననే శ్రీకృష్ణుడు రాయబారమునకు పోయి "యుద్ధమును నివారింపవలె నన్నచో వారు దుర్యోధనుని శాసింపవలయునే కాని ధర్మరాజును శాసింపరాదు, దుర్యోధనుని శాసింపలేనివారు ధర్మజును శాసింపబూనుట అక్రమము హాస్యాస్పదము లోకనింద్యము" అను విషయము లోకమునకు ప్రకటమగునట్లు చేసి వారు ఆవిధముగా శాసించుటకు అవకాశము లేకుండ జేసెను. అప్పటికే వారు అధర్మపక్షము నవలంబించి లోకనిందకు పాత్రులై యుండిరి. అందువలన వారు ఇంకను అక్రమముగా ధర్మరాజును శాసించుటకు సాహసింపలేక పోయిరి.

## (iii) రాధేయాకర్షణ ప్రయత్న చమనము

శ్రీకృష్ణుడు కర్ణునితో బయలుదేఱి కొంతదూరము వచ్చిన తరువాత రథము నిలిపి ఏకాంతమునందు ఆతనితో ఇట్లనెను. "రాధేయా! నీవు బ్రాహ్మణులను చక్కగా ఉపాసించితివి. ధర్మశాస్త్రములందు సూక్ష్మవిశేషములను పరినిష్ఠితముగా గ్రహించితివి. కానీనుడు సహోఢుడు అను నిరువురకు, తల్లిని వివాహము చేసికొన్నవాడే తండ్రియని శాస్త్రవేత్తలు చెప్పుదురు. నీవు ఆవిధముగా కుంతికి జన్మించితివి, కావున ధర్మము ననుసరించి పాండురాజునకు పుత్రుడవు ధర్మశాస్త్రములయొక్క నిగ్రహమువలన నీవు రాజు కాగలవు రమ్ము. తండ్రి పక్షమునందు పాండవులు, తల్లిపక్షమునందు వృష్ణులు, నీవు నాతో ఇప్పుడు వచ్చినచో, నిన్ను కౌంతేయునిగా తెలిసికొందురు.

యుదిష్ఠిరునికంటె నీవు ముందు పుట్టినవాడ వగుటచే పాండవులు అయిదుగురు, ద్రౌపదీపుత్రులు అభిమన్యుడు, పాండవులకు సహాయులై వచ్చియున్న రాజులు రాజపుత్రులు నీకు పాదాభివందనము గావింతురు సర్వరత్నౌషధీ బీజపూర్ణములైన హిరణ్మయ కుంభములతో అభిషేచనిక ద్రవ్యములను రాజన్యులు రాజకన్యలు గైకొనివత్తురు ఆఱవపర్యాయమున ద్రౌపది నీయొద్దకు కూడ రాగలదు. పాండవుల పురోహితుడైన దౌమ్యుడు నీకొఱకు అగ్నిహోత్రమును గావించును ఆయనతో కూడ చతుర్వేద పారంగతులు విప్రులు పాండవులు పాంచాలురు నేను నిన్ను పృధివీపతినిగా అభిషేకింతుము. యుధిష్ఠిరుడు యువరాజగును. అభిషిక్తుడవై నీవు ఊరేగింపునకు బయలుదేఱునప్పుడు రథమునందు ధర్మరాజు శ్వేతవ్యజనమును గైకొని నిన్ను సేవించును. భీమసేనుడు శ్వేతచ్ఛత్రమును పట్టును. శ్వేతాశ్వయుక్తమైన రథమును అర్జునుడు సారధియై నడపును. అభిమన్యుడు నీకనుసన్నలతో ఉండును. నకులసహదేవులు ద్రౌవదీపుత్రులు పాంచాలురు అంధకవృష్ణులు దాశార్హులు, దశార్ణులు నేను నిన్ను అనుసరించి వత్తుము. ద్రవిడులు కుంతలులు ఆంధ్రులు మొదలగువారు నీరథమునకు ముందు నడుచుచుందురు. సూతమాగదులు నిన్ను బహువిధముల స్తుతించుచుందురు. పాండవులు నీవిజయమును ఉద్ఘోషింతురు. నక్షత్రములతో చంద్రునివలె పాండవులతోకూడి రాజ్యమును పాలింపుము. కుంతికి ఆనందమును కలిగింపుము".

శ్లో|| కానీనశ్చ సహోఢశ్చ కన్యాయాం యశ్చ జాయతే |
వోఢారం పితరం తస్య ప్రాహు శ్శాస్త్రవిదో జనాః || 8

శ్లో|| సోఽసి కర్ణ తథా జాతః పాండోః పుత్రోఽసి ధర్మతః |
నిగ్రహా ద్ధర్మశాస్త్రాణా మేహి రాజా భవిష్యసి || 9

<u>**నీలకంఠీయమ్**</u> : కానీన శ్చ ద్వివిధః | సహోఢః వివాహాత్ ఊర్ధ్వం జాతః | కానీనః వివాహాత్ ప్రాగ్జాతః | తస్మాతుః వోఢారం తస్య పితరం ప్రాహుః |

శ్లో|| మయా సార్ధ మితో యాత మద్య త్వాం తాత పాండవాః |
అభిజా నంతు కౌంతేయం పూర్వం జాతం యుధిష్ఠిరాత్ || 11

శ్లో|| పాదౌ తవ గ్రహీష్యంతి భ్రాతరః పంచపాండవాః |
ద్రౌపదేయా స్తథా పంచ సౌభద్ర శ్చాపరాజితః || 12

శ్లో|| రాజన్యా రాజకన్యా శ్చాప్యానయం త్వభిషేచనమ్ |
షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌప ద్యుపగమిష్యతి || 15

శ్లో|| స త్వం పరివృతః పార్థైః నక్షత్రైరి వ చంద్రమాః |
ప్రశాధి రాజ్యం కౌంతేయ కుంతీం చ ప్రతినందయ || 28

**శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 139**

కర్ణుడు శ్రీకృష్ణుని యనురాగమును అభినందించి ఇట్లనెను. "కృష్ణా! నీవు చెప్పిన దంతయు నిజమే. కాని అధిరదుడు రాధయు నన్ను పుత్రునిగా ఎంతో ప్రేమతో పెంచిరి, జాతకర్మాదు లన్నియు నిర్వర్తించిరి. సూతకులమునందే నాకు వివాహాదు లన్నియు నిర్వర్తించిరి. పుత్రులు పౌత్రులు కలిగిరి. సువర్ణరాసులతో నాకు సకలమైన పృధ్వి లభించినను, నేను వారి యనుబంధమును అసత్య మొనరింపజాలను. దుర్యోధనుడు నన్ను అర్జునునకు ప్రతియోద్ధనుగా నమ్మి పాండవులతో యుద్ధమునకు సిద్ధపడియున్నాడు. బంధనవధాదులవలన భయముచేతగాని రాజ్యలోభమువలన గాని నేను దుర్యోధనున కొసంగిన మాటను అన్సృత మొనరింపజాలను. ఇప్పుడు నేను కౌంతేయుడ నని వారిపక్షమున జేరి అర్జునునితో ఎక్కటికయ్యమును విరమించుకొన్నచో, అది నాకే కాక అర్జునునకు కూడ అపకీర్తిని కలిగించును. పాండవులు నీవు చెప్పినట్లు చేయుదు రనుట నిస్సంశయము. ఈ విషయమును రహస్యముగా నుంచుము. యుధిష్ఠిరుడు నన్ను అన్ననుగా తెలిసికొన్నచో రాజ్యమును పరిగ్రహింపడు. నాకు రాజ్యము లభించినను నేను దానిని దుర్యోధనునకే ఇత్తును. ధర్మాత్ముడైన యుధిష్ఠిరుడు రాజు కావలె. ఈ యుద్ధయజ్ఞము భీమసేనుడు దుర్యోధనుని వధించుటతో సమాప్తమగును. యుధిష్ఠిరుని యుద్ధమునకు తీసికొనిరమ్ము. నాజన్మరహస్యమును కాపాడుమ్ము".

శ్రీకృష్ణు డిట్లనెను. "కర్ణా ! యుద్ధము తప్పదని పాండవులకు విజయము నిశ్చితమని, భీష్మాదులతో దుర్యోధనునితో చెప్పుము. ఎక్కువగా ఎండ, చలి లేకుండ సౌమ్యముగా ఓషధీ ఫల సమృద్ధముగా ఈమాసము జరుగుచున్నది. నేటికి ఏడవదినమున అమావాస్య వచ్చును. అది శక్రదైవతము. అప్పుడు యుద్ధమునందు "మీరు కోరినట్లుగా వీరస్వర్గము లభించునట్లు చేయుదు"నని నామాటగా దుర్యోధనాదులకు చెప్పుము".

కర్ణుడు కృష్ణుని మాటను సమర్థించుచు ఇట్లనెను. "కృష్ణా ! నీవు చెప్పినట్లే జరుగును. కౌరవ వినాశసూచకములైన శకునము లనేకములు కన్పించుచున్నవి. స్వప్నములు కూడ నాకు అట్లే కలుగుచున్నవి. యుధిష్ఠిరుడే భూమిని పాలించును. నేనును దుర్యోధనునకు సహాయమై యున్న క్షత్రమండల మంతయు గాండీవాగ్నియందు ప్రవేశింతుము. ఇందులకు సందియము లేదు".

కృష్ణుడు కర్ణునినిశ్చయము నెఱింగి కౌగిలించుకొని వీడ్కొలిపెను. కర్ణుడు హాస్తినకు బయలుదేఱగా కృష్ణుడు సపరివారుడై వేగముగా ఉపప్లవ్యమునకు పోయెను.

## బాలప్రియ

యుద్ధమును నివారించుకర్తవ్యమున శ్రీకృష్ణుడు కర్ణుని పాండవులయొద్దకు ఆకర్షించుటకు తుది ప్రయత్నమొనరించెను. కర్ణుడు లేకున్నచో దుర్యోధనుడు

యుద్ధమునకు పూనుకొనడు. కుంతి ఎంతో ప్రయత్నముతో వేదనతో దాచుకొనుచున్న కన్యాత్వభంగవృత్తాంతమును ఇందులకై బహిరంగపఱచుటకు కూడ కృష్ణుడు వెనుదీయలేదు. అట్లు చేయుటవలన మేనత్తకు సాటివారిలో అవమానము మనస్తాపము కలుగు ననుట నిశ్చితము. అయినను ఆయన ప్రజావినాశనివారణ మనుకర్తవ్య నిర్వాహణదృష్టితో దానిని లెక్కపెట్టలేదు

కానీనుడు సహోఢుడు అని కన్యాపుత్రులు రెండు విధములు. కన్యకు వివాహమునకు పూర్వమందు జన్మించినవాడు కానీనుడు ; వివాహమునకు తరువాత జన్మించినవాడు సహోఢుడు. ఆమెను వివాహము చేసికొన్న వాడే ఇరువురకును తండ్రియగును. కావున ధర్మాదులవలన జన్మించిన యుధిష్ఠిరాదులకు వలెనే సూర్యునివలన కుంతియందు జన్మించిన కర్ణునకు కూడ పాండురాజే ధర్మపద్ధతియందు తండ్రియగును. "ధర్మశాస్త్రముల యొక్క నిగ్రహమువలన నీవు రాజు కాగలవు (నిగ్రహాత్ ధర్మశాస్త్రాణామ్) అని శ్రీకృష్ణుడనుట గమనింపదగియున్నది. నిగ్రహమనగా ఇతరులను శాసించుట. ఇచ్చట ధర్మశాస్త్రములు ఎవరిని శాసించును? కర్ణుని విషయమున పాండురాజపుత్రత్వమును సంశయించువారిని, ధర్మశాస్త్రములు శాసింపవలసియున్నది. కర్ణుడు కుంతీపుత్రుడైనను జాతకర్మవివాహాద్యశంసంస్కారము లన్నియు సూతకులముననే పొంది పుత్రపౌత్రులతో వర్ధిల్లెను. అందువలన అతడు జన్మచే క్షత్రియుడైనను సంస్కారములచే సూతుడే యైనాడు. అందువలన అతడు సుక్షత్రియుడైన పాండురాజునకు కుమారుడగుట, క్షత్రియసంస్కారములతో పెంపొందిన యుధిష్ఠిరాదులకు అగ్రజుడగుట ఎట్లు కుదురు నని కొందఱు సందేహింపవచ్చును. సూతులు రథకారవృత్తియం దుండి రాజ్యపాలనకు అర్హులుగా భావింపబడకున్నను సూతజాతి క్షత్రియ వర్ణాంతర్గతమే. కావుననే దుర్యోధనుడు కర్ణుని అంగరాజును కావింపగలిగెను. అతడు అంగరాజైనతరువాత పెక్కుయజ్ఞములను గావించెను. అందుచేత ధర్మశాస్త్రములయొక్క బలమువలన అతడు పాండురాజునకు పుత్రుడగుట సమంజసమే అని ఒప్పించుటయే ధర్మశాస్త్రములయొక్క నిగ్రహము. విద్యావృత్తిసంస్కారాదులు జన్మలక్షణమును మార్చలేవు. యుద్ధములు చేసిన ద్రోణుడు బ్రాహ్మణత్వమును, నందునియింట పెరిగిన బలరామకృష్ణులు క్షత్రియత్వమును కోల్పోలేదు.

రాజ్యలోభముచేతనే కాక ద్రౌపదీసౌందర్యముచేత కూడ శ్రీకృష్ణుడు కర్ణుని ఆకర్షించుటకు ప్రయత్నించెను. మహావీరులుగా ఎదిగియున్న యువపాండవులకు అయిదుగురికి తల్లియైన ద్రౌపది విషయమున ఆయన ఇట్లు మాటాడుట ధర్మమా అని అనేకులు సంశయింతురు కాని "నేను నిందితమైన కార్యమును ప్రవర్తింపజేయను" అని ధృతరాష్ట్రునితో, "కామక్రోధాదులవలన నేను ఎప్పుడును ధర్మమును వీడను" అని దుర్యోధనునితో ఆయన ఇంతకు ముందే చెప్పినాడు. "పురుషోత్తముడైన యీ యచ్యుతుడు ధర్మము నతిక్రమింపడు" అని తటస్థుడైన విదురుడు కూడ ప్రశంసించెను.

అట్టి కృష్ణుడు ద్రౌపదినిగూర్చి ధర్మహీనముగ ప్రసంగించె ననుట సంభావ్యము కాదు. కావున అందలి ధర్మవిశేషమును మనము విమర్శించి గ్రహింపవలసియున్నది.

ద్రౌపది పాండవులకు అయిదుగురికి ఏ హేతువు చేత భార్య అయ్యెనో ఆ హేతువు చేతనే కర్ణునకు కూడ భార్య అగుట నమంజసమని గ్రహింపవలసియున్నది "బిక్షను మీ రందఱు భుజింపుడు" అని ద్రౌపదీవివాహ సందర్భమున కుంతి యనుటచే, ఆమాటపై వారందఱును ద్రౌపదిని భార్యనుగా పరిగ్రహించిరి. "మీరు అందఱు" అన్నప్పుడు కుంతియొక్క దృష్టియందు కర్ణుడున్నాడా? లేడు. కాని ఆమె మనస్సునందు కుమారుడుగా కర్ణుడు మెదలుచునే యున్నాడు. లోకమునకు భయపడి ఆమె ఆవిషయమును బయల్పఱుప లేకపోయినను వానిని ఎప్పుడును విస్మరింపలేదు. కులవినాశమును నివారించుటకై ఆమె లోకాపవాదమును లెక్కపెట్టక వానిని కుమారునిగా ప్రకటించుటకు సిద్ధపడి కృష్ణుని రాయబారమున కనంతరము వానిని కలిసికొని పాండవపక్షమున చేరుమని బ్రతిమిలాడినది. తుదకు యుద్ధమృతులకు ప్రేతకార్యములు కావించునప్పుడు, పరలోకమున కూడ వానికి దుర్గతి సంభవింపరాదు, అను తలంపుతో సాహసించి యుధిష్ఠిరునకు వాని జన్మవృత్తాంతమును చెప్పెను. కావున కర్ణుడు తనకుమారుడే అని ఆమె ప్రకటించినతరువాత, అయిదుగురు కుమారులకు సమానముగా భోగ్యగా నున్న ద్రౌపది అగ్రజునకు భోగ్యకాదని చెప్పజాలదు. యుధిష్ఠిరుడైనను అగ్రజునకు అందని ద్రౌపదీభోగమును తాను పొందుటకు అంగీకరింపడు. అయినచో ఎప్పుడో వివాహమై పుత్త్రులను కూడ పొందియున్న ద్రౌపదికి అప్పుడు మరల కర్ణున కిచ్చి పెండ్లి చేయుదురా ? ఆమెకు యుధిష్ఠిరునితో వివాహమైన తరువాతనే కదా తక్కిన నలువురితో వివాహములు జరిగినది. ఆ విశేషవిధిచేతనే ఇప్పుడుకూడ ఆమెకు కర్ణునితో వివాహము జరుగవచ్చును.

ఈ వివాహమునకు యుధిష్ఠిరాదులు అంగీకరించినను ద్రౌపది యంగీకరించునా? కురుసభలో ఆమెను బంధకి అని, ఆమెను వివస్త్రను గావించినను దోషము లేదని కర్ణుడు అమానుషముగా ఉద్ఘాటించి పరిహసించినాడు. దుశ్శాసనునిచర్య కన్న కర్ణుని పరిహాసమే తనకు ఎంతో బాధను కలిగించుచున్నదని ఆమె, వనమునందు ఓదార్చుటకు వచ్చిన కృష్ణునితో చెప్పినది. అంతద్వేషముతో ఉన్న ఆమె కర్ణునకు భార్య యగునా? కాని పాండవులకు మాత్రము కర్ణుని యందు తక్కువద్వేష మున్నదా? కర్ణుని సంహరించిరాలే దని యుధిష్ఠిరుడే అర్జునుని ఎంతో నిందించినాడు అట్టి యుధిష్ఠిరుడే అతడు తమకు అన్న యని తెలిసినంతనే పొందినపరితాపము సామాన్యమైనది కాదు. ఆయన ఆతాపమునకు తట్టుకొనలేక తల్లినే నిందించినాడు. ధార్మికులు ఏపరిస్థితియందైనను స్వాతంత్ర్యమును అవలంబింపరు. ఎట్టి కష్టనష్టములు కలుగుచున్నను వారు వానిని సహించుచు ధర్మవిహితమైన మార్గముననే వర్తింతురు. ధృతరాష్ట్రునివలన ఎన్నియాపదలు వచ్చినను ధర్మరాజు పెదతండ్రియాజ్ఞలను

పాటించుచునే యుండెను. అందువలన ధర్మరాజు, అతని ననుసరించుచు అతనితమ్ములు, కర్ణునివలన కలిగిన యవమానములను విస్మరించి వానిని అన్ననుగా ఆరాధించునప్పుడు, ద్రౌపదికూడ అట్లే వానిని భర్తనుగా అంగీకరించుట తప్పదు

ద్రౌపదివిషయమున కృష్ణుడు గావించిన ప్రస్తావము చాల విడ్డూరముగ తోచుచుండుటచే కొందఱు, ఆఱవపర్యాయమున ద్రౌపది నీయొద్దకు కూడ రాగలదు. "షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌపద్యుపగమిష్యతి" అని కృష్ణుడు చెప్పినమాటకు, ఆమె కర్ణునకు భార్యయగుట అర్థము కాదని, ఒకానొక సమయమున అందఱతోపాటు ఆమెకూడ రాజైన కర్ణుని సేవించుటకు పోవుట దానికి అర్థమని చెప్పుచున్నారు. కాని, "నిన్ను కూడ" (త్వాంచ) అన్నచోట "కూడ" (చ) అనుపదము "త్వాం" అనుపదమునకు సన్నిహితమై అన్వయించుచున్నది. "ద్రౌపది కూడ" అని చెప్పుట చాల దూరాన్వయమగును. అందఱతోపాటు ఆమె కూడ మహారాజునుగా కర్ణుని సేవించు నని కృష్ణుడు చెప్పుట నిర్విశేషము నిరర్థకము. అందఱతోపాటు ఆమె కూడ కర్ణుని మహారాజునుగా సేవించు ననుటలో కర్ణుడు పొందదగిన యాకర్షణ మేదియును లేదు. కృష్ణు డప్పుడు చెప్పుచున్న మాటలే కన్నింటికిని కర్ణుని ఎట్లైనను పాండవుల వక్షమునకు ఆకర్షించుటయే తాత్పర్యము. అందువలన "యుధిష్ఠిరాదులనువలె నిన్ను కూడ ద్రౌపది ఆఱవపర్యాయమున భర్తనుగా పొందును" అని కృష్ణుడు చెప్పిననే కర్ణునకు ఆకర్షణము కలుగుటకు అవకాశమేర్పడును. ఆమె కర్ణుని మహారాజునుగా మాత్రమే సేవించుట కృష్ణునకు తాత్పర్యమైనచో, "నిన్ను కూడ" (త్వాంచ) అని చెప్పకుండ "త్వామేవ" అని చెప్పియుండును. అప్పటివఱకును యుధిష్ఠిరుడు మహారాజై యుండినను కర్ణుడు పట్టాభిషిక్తుడైనచో కర్ణుడే మహా రాజగును. అందువలన "మహారాజునుగా "నిన్నే" (త్వా మేవ) ద్రౌపది సేవించును" అని కృష్ణుడు చెప్పవలసి యుండును. అప్పుడు ఎవరైనను కర్ణుని ఒక్కనినే మహారాజునుగా సేవింతురు గాని యుధిష్ఠిరుని అట్లు సేవింపరు. కావున కర్ణుని ఆకర్షించుటకొఱకు, ద్రౌపది అతనికి బార్య యగుననియే ప్రలోభపెట్టె నని, ఆయన అట్లు ప్రస్తావించుట అసంగతము అధర్మము కాదని గ్రహింపవలసియున్నది.

ఈ కృష్ణకర్ణసంవాదమును సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పినట్లుగా ఉన్నది. "హృదయమునకు వట్టునట్లుగా మధుసూదనుడు కర్ణునకు చెప్పినమాటలను చెప్పెదను వినుము" అని సంజయుడు ధృతరాష్ట్రునకు వారిసంవాదమును చెప్పెను.

శ్లో॥ హృదయ గ్రహణీయాని రాధేయం మధుసూదనః।
యాన్యబ్రవీ దమేయాత్మా తాని మే శృణు భారత॥ 5

**శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 139**

రహస్యమును కాపాడు మని కర్ణుడు కృష్ణునకు చెప్పియుండుటవలన వారిరువురు

ఏకాంతమునందు మూడవవానికి తెలియకుండ మాటాడుకొని రనుట స్పష్టము. కాబట్టి సంజయుడు వారియొద్ద లేడు. అప్పటికి సంజయునకు దూరదృష్టి దూరశ్రవణము పరచిత్త విజ్ఞానము మొదలగుశక్తులు లభింపలేదు. యుద్ధమునకు రెండు పక్షములవారు కురుక్షేత్రమున చేరి శిబిరములు నిర్మించుకొన్న తరువాత వ్యాసభగవానుడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చి, "నీవు యుద్ధమును చూడదలచుకొన్నచో నీకు దివ్యదృష్టి నొసంగుదును" అనెను. ధృతరాష్ట్రుడు, "నేను ఘోరయుద్ధమును చూడలేను. కాని వినగోరుచున్నాను" అనెను అప్పుడు వ్యాసభగవానుడు సంజయునకు దూరదృష్టి దూరశ్రవణము మొదలగు శక్తులను ప్రసాదించి ధృతరాష్ట్రునకు యుద్ధవిషయము లను చెప్పుమని ఆదేశించి వెడలిపోయెను.

భీష్మపర్వము - అధ్యాయము - శ్లో 9, 10

యుద్ధారంభమునుండియే సంజయునకు ఈ శక్తులు కలిగినవి. కృష్ణకర్ణసంవాదసమయమునకు అతనికి ఆ శక్తులు లేవు. అందువలన ఏకాంతమునందు జరిగినయాసంవాదము సంజయునకు తెలియుట, అతడు ధృతరాష్ట్రునకు చెప్పుట, అసంభవము.

ధృతరాష్ట్రునకు సంజయుడు కర్ణజన్మవృత్తాంతమును చెప్పియున్నచో వెంటనే ఆయన దుర్యోధనునకు చెప్పకుండుట కుదురదు. ఆవిధముగా యుద్ధమునకు [illegible]మే కర్ణుడు కౌంతేయుడని తెలిసినచో దుర్యోధనుడు యుద్ధమునకు సిద్ధపడు[illegible] వానికి తెలిసినతరువాత పాండవులకు తెలియకుండుట సంభవము కాదు. కర్ణుడు అన్నయని ఎఱింగినచో యుధిష్ఠిరుడు యుద్ధమునకు వచ్చునా ? కుంతి రహస్యమును కాపాడె నని యుధిష్ఠిరుడు పరితపించుటవలన, యుద్ధము ముగిసి ప్రేతకార్యములు ఆరంభమగువఱకు ధృతరాష్ట్రాదులకు పాండవులకు కర్ణుని జన్మరహస్యము తెలియదనుట స్పష్టము. కావున కృష్ణకర్ణసంవాదమును సంజయుడు చెప్పలేదు , ధృతరాష్ట్రుడు వినలేదు.

కృష్ణుడు బయలుదేఱి పోవునప్పుడు ప్రత్యేకముగా కర్ణుని వెంటగొని పోవుట, ఏకాంతమున అతనితో మాటాడుట ధృతరాష్ట్రునకు ఇతరులకు కూడ చాల కుతూహలమును కలిగించియుండు ననుటలో సందేహము లేదు. కాని ఆసంవాదము ఎట్లు జరిగినదో ఎవరికిని తెలియకపోవుటచే ఒకరి కొకరు చెప్పుకొనునవకాశము కలుగలేదు. ధృతరాష్ట్రుడు ఎవరినైన కుతూహలముతో అడిగినను, "ఏమి జరిగనదో మాకు కూడ తెలియదు" అనియే వారు కూడ చెప్పియుందురు అందువలన యుద్ధము ముగిసిన తరువాత కుంతి ప్రకటించువఱకు కర్ణుని జన్మవృత్తాంతము రహస్యముగానేయుండెను.

కథను వినుచున్న జనమేజయునకు ఈవిషయమున తప్పక కుతూహలము కలిగియుండును. అతడు అడుగగా వైశంపాయనుడు ఈసంవాదమును చెప్పెనని గ్రహింపవలసియున్నది. సంజయుడు యుద్ధవిశేషములను అన్నింటిని ధృతరాష్ట్రునకు చెప్పియుండుటచే ఈసంవాదమును కూడ అతడే చెప్పియుండు నను భ్రాంతితో ఈ సంవాదమునకు ఆరంభమునందు ముగింపునందు సంజయధృతరాష్ట్రుల సంభాషణమును ఎవరో కూర్చియుందురు. అందువలన ఈ శ్లోకములు ప్రక్షిప్తము లనుట స్పష్టము.

ధృతరాష్ట్రసంజయుల సంభాషణముతోపాటు కృష్ణకర్ణసంవాదము కూడ ప్రక్షిప్తమే ఏల కారాదు అని కొందఱు ప్రశ్నింపవచ్చును. ఈసంవాదము లేకున్నచో ఈ మహాకావ్యమునందు కలుగు భంగమేదియును లేదు. దీనిని గూర్చిన ప్రస్తావము దీనికి ముందుగాని తరువాతగాని కన్పించుటలేదు. అందువలన ఇది ప్రక్షిప్తమని తలంపవచ్చును. కాని పదుమూడవ శతాబ్దమున మహాభారతమును ఆంధ్రీకరించిన తిక్కనగారు దీనిని అనువదించియుండుటచే అప్పటికే ఇది మూలమునందున్న దని ఆయన దీనిని వ్యాసకృతముగానే స్వీకరించె నని స్పష్టమగుచున్నది. కావున ఇది ధృతరాష్ట్రసంజయుల సంభాషణముగా కాక జనమేజయవైశంపాయనుల ప్రశ్నోత్తరపూర్వకముగా మూలమున ఉండియుండు నని తలంపవచ్చును.

# 3. కర్తవ్య నిశ్చయ కమండలువు

## (1) భీష్మాది వచన కథన చమనము

హాస్తిననుండి ఉపప్లవ్యమునకు తిరిగివచ్చి శ్రీకృష్ణుడు ధర్మజుని కొలువులో కురుసభావృత్తాంతమును సంగ్రహముగా చెప్పెను. తరువాత ఆయన తనభవనమునకు పోయి విశ్రమించెను. యుధిష్ఠిరుడు రాజులను వీడ్కొని సభను ముగించి సాయంసంధ్య నుపాసించి తమ్ములతో కూడియుండి తనభవనమునకు శ్రీకృష్ణుని పిలిపించి, కురుసభలో భీష్మాదులు దుర్యోధనునకు ఎట్లెట్లు హితమును బోధించిరో వివరముగా చెప్పు మని యభ్యర్థించెను

శ్రీకృష్ణుడు డిట్లు చెప్పెను "సభలో నేను సంధినిగూర్చి ప్రసంగించినంతనే దుర్యోధనుడు నవ్వెను. భీష్ముడు క్రుద్ధుడై కురువంశవర్ధనమునకై తాను గావించినకృషి నంతయు వివరించి వానితో ఇట్లనెను "నా తమ్ముడు క్షయవ్యాధితో మరణించినప్పుడు సత్యవతీదేవి యనుజ్ఞతో సంతతిని ప్రసాదింపుమని వ్యాసమహర్షిని ప్రార్థించితిని. ఆయన భ్రాతృభార్యలందు ముగ్గురు కుమారులను కలిగించెను. అంధుడైన నీ తండ్రి రాజు కాలేదు. పాండుడే రాజయ్యెను. పాండురాజుయొక్క పుత్త్రులు తండ్రిరాజ్యమును కోరుచున్నారు. వారితో కలహింపకుము. సగము రాజ్యము నొసంగుము".

శ్లో॥ అయాచం భ్రాతృదారేమ తదా వ్యాసం మహామునిమ్।
సహ మాత్రా మహారాజ ప్రసాద్య త మృషిం తదా॥ 39

శ్లో॥ అపత్యార్థం మహారాజ ప్రసాదం కృతవాంశ్చ నః।
త్రీన్ స పుత్రా నజనయ త్తదా భరతసత్తమ॥ 40

శ్లో॥ అంధః కరణహీనత్వా న్నైవ రాజా పితా తవ।
రాజా తు పాండు రభవ న్మహాత్మా లోకవిశ్రుతః॥ 41

శ్లో॥ స రాజా, తస్య తే పుత్రాః పితు ర్దాయాద్య హారిణః।
మా తాత కలహం కార్షీ రాజ్య స్యార్థం ప్రదీయతామ్॥ 42

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 146

తరువాత ద్రోణు డిట్లు వానికి హితమును బోధించెను. "ధర్మాత్ముడైన పాండుడు రాజై కులప్రదీపకు డయ్యెను. అయన జ్యేష్ఠుడైన ధృతరాష్ట్రునకు, అట్లే చిన్నవాడైన విదురునకు రాజ్యము నొసంగి, ఈయనను సింహాసనమునం దుంచి భార్యలతో కూడ వనమునకు పోయెను. విదురుడు సింహాసనమునకు క్రిందుగా కూర్చుండి వాలవ్యజనమును గైకొని వినయముతో మీతండ్రిని సేవించుచున్నాడు. ఆవిదముగా పాండురాజు రాజ్యమును ధృతరాష్ట్రునకు విదురునకు అప్పగించి పృథివియందు పర్యటించుచుండెను. కోశవృద్ధిని భృత్యవర్యవేక్షణమును విదురుడు కావించుచుండెను. అట్టి కులమున జన్మించిన నీవు కులభేదమును కలిగించుటకు ఎట్లు నిశ్చయించుచున్నావు? సోదరులతో కూడిరాజ్యమును భోగములను అనుభవింపుము. నేను దైన్యముతో కాని ధనార్థినై కాని చెప్పుట లేదు. నాకు భీష్ముడు ఇచ్చినదానినే నేను కోరుచున్నాను. నేను నీవలన జీవనోపాయమును వృత్తిని కాంక్షించుట లేదు. భీష్ముడు ఏవైపున నుండునో నేను ఆవైపుననే ఉందును. భీష్ముడు చెప్పినట్లు చేయుము. రాజ్యములో సగమును పాండవుల కొసంగుము. నాయాచార్యకత్వము మీయందు పాండవుల యందును సమానమే. నాకు అశ్వత్థామ ఎంతో అర్జునుడు కూడ అంతే. ఇన్నిమాట లెందుకు ? ధర్మమెచ్చట నుండునో జయ మచ్చటనే యుండును"

శ్లో॥ తథా పాండు ర్నరపతి స్సత్యసంధో జితేంద్రియః।
రాజా కురూణాం ధర్మాత్మా సువ్రత స్సుసమాహితః॥ 3

శ్లో॥ జ్యేష్ఠాయ రాజ్య మదద ద్ధృతరాష్ట్రాయ దీమతే।
యవీయసే తథా క్షత్త్రే కురుణాం వంశవర్ధనః॥ 4

<u>నీలకంఠీయమ్</u> : జ్యేష్ఠో అంధత్వాత్ అనర్హః। క్షత్తా వియోనిత్వాత్ అనర్హః ఇతి సూచయన్, యథా జ్యేష్ఠాయ అదదత్ తథా క్షత్త్రే విదురాయ అపి న్యాసభూత మదదత్ ఇతిబావః।

శ్లో॥ విసృజ్య ధృతరాష్ట్రాయ రాజ్యం స విదురాయ చ
చచార పథివీం పాండుః సర్వాం పరపురంజయః ॥ 8

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 147

పిమ్మట దర్మవిదుడైన విదురుడు భీష్మునివైపు తిరిగి ఆయన ముఖమువంక జూచుచు ఇట్లనెను. "తండ్రీ! నామాట వినుము. నీవు పునరుద్ధరించిన కురువంశము నశించుచున్నది. నేను ఎంతగా విలపించుచున్నను నీవు నామాటను లెక్కపెట్టుట లేదు. ఈకులమునందు కులపాంసనుడైన యీ దుర్యోధను డెవడు ? లోభహతుడైన వీనిమాటను నీవు అనుసరించుచున్నావు. అనార్యుడు కృతఘ్నుడు తండ్రికి అవిదేయుడును అయిన వీనికారణముగా కౌరవులు నశింపకుండునట్లు చూడుము నీవు నన్ను ధృతరాష్ట్రుని ఈకులమును, చిత్రకారుడు పటమున చిత్రమును తీర్చునట్లుగా, పెంపొందించితివి. ఇప్పుడు జరుగనున్న కులక్షయమును ఉపేక్షింపకము. వినాశము దాపురించుటవలన నీమతి నశించినదా యేమి ? ధృతరాష్ట్రునితో కూడ నాతో వనమునకు పోవుదము రమ్ము, లేదా వంచన మాత్రమున ప్రజ్ఞాశాలియైన యీదుర్యోధనుని బంధించి పాండవులచే అభిరక్షితమైన యీ రాజ్యము పాలింపుము"

శ్లో॥ పితు ర్వదన మన్వీక్ష్య పరివృత్య చ ధర్మవిత్।
దేవవ్రత నిబోధేదం వచనం మమ భాషతః ॥ 18

శ్లో॥ ప్రనష్టః కౌరవో వంశ స్త్వయా యత్పున రుద్ధృతః।
తన్మే విలపమానస్య వచనం సముపేక్షసే ॥ 19

శ్లో॥ కోఽయం దుర్యోధనో నామ కులేఽస్మిన్ కులపాంసనః।
తస్య లోభాభిభూతస్య మతిం సమనువర్తసే ॥ 20

శ్లో॥ ఏతే నశ్యంతి కురవో దుర్యోదనకృతేన వై।
యథా తే న ప్రణశ్యేయు ర్మహారాజ తథా కురు ॥ 22

శ్లో॥ అథ తేఽద్య మతి ర్నష్టా వినాశే ప్రత్యుపస్థితే।
వనం గచ్ఛ మయా సార్థం ధృతరాష్ట్రేణ చైవ హ ॥ 25

శ్లో॥ బద్ధ్వా వా నికృతిప్రజ్ఞం ధార్తరాష్ట్రం సుదుర్మతిమ్।
శాధీదం రాజ్య మద్యాశు పాండవై రభిరక్షితమ్ ॥ 26

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 147

పిదప గాంధారి కుమారుని చూచి కోపముతో రాజు లందఱు వినుచుండగా ఇట్లనెను. "ఈ రాజసభయందున్న పార్థివులు బ్రహ్మర్షులు తక్కిన సభాసదు లందఱును

నీయపరాధమును విందురు గాక! ఈ రాజ్యము పాండునిది. దానిని పాలించుటకు ఇప్పుడు ఆతనిపుత్రులే అర్హులు. ఇతరులు ఎవ్వరును అర్హులు కారు. పితృపితామహులనుండి ప్రాప్తమైన యీరాజ్యము సర్వము పాండవులకు, వారి పుత్రపౌత్రులకే చెందును. భీష్మధృతరాష్ట్రులను పురస్కరించుకొని న్యాయాగతమైన కురువుల యీ రాజ్యమును దర్మపుత్రుడు పరిపాలించును గాక!

శ్లో|| రాజ్యం తు పాండో రిద మప్రధృష్యం తస్యాద్య పుత్రాః ప్రభవన్తి నాన్యే|
రాజ్యం తదేత న్నిఖిలం పాండవానాం పైతామహం పుత్రపౌత్రానుగామి || 34

శ్లో|| న్యాయాగతం రాజ్య మిదం కురూణాం యుధిష్ఠిర శ్శాస్తు వై దర్మపుత్రః|
ప్రచోదితో ధృతరాష్ట్రేణ రాజ్ఞా పురస్కృత శ్శాంతనవేన చైవ || 37

శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 147

అనంతరము ధృతరాష్ట్రుడు కూడ కుమారుని అనునయించుచు తమ వంశప్రశస్తిని వివరించి ఇట్లు చెప్పెను. "జ్యేష్ఠుడనైన నేను అంగహీనుడ నని రాజ్యము నుండి తొలగింపబడితిని. చిన్నవాడైనను పాండుడు రాజ్యమును పొందెను. వానియనంతరము వానిపుత్రులకే ఈ రాజ్యము సంక్రమించును. నాకే రాజ్యమునందు అదికారము లేనప్పుడు నీకు స్వామ్యమెట్లు కలుగును ? రాజ్యార్హత లేని వానికి పుత్రుడవైన నీకు రాజ్యముపై స్వామ్యములేదు. నీవు రాజ్యమును గోరుచు పరులసొమ్మును హరింపదలంచుచున్నావు. యుధిష్ఠిరుడు రాజునకు పుత్రుడు. న్యాయబద్ధముగా రాజ్యము ఆతనిది. అతడే ఈకులమునకు భర్త శాసకుడును అగును. నీవు ఆతనికి సగము రాజ్యము నొసంగుము. మిగిలినది నీకు నీసోదరులకు చాలును".

శ్లో|| జ్యేష్ఠః ప్రభ్రంశితో రాజ్యాత్ హీనాంగ ఇతి భారత|
పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయా నపి స న్నృపః || 30

శ్లో|| వినాశే తస్య పుత్రాణా మిదం రాజ్యమరిందమ|
మ య్యభా గిని రాజ్యాయ కథం త్వం రాజ్యమిచ్ఛసి|
అరాజపుత్రో హ్యస్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి || 31

శ్లో|| యుధిష్ఠిరో రాజపుత్రో మహాత్మా న్యాయాగతం రాజ్య మిదం తస్య|
స కౌరవ స్యాస్య కులస్య భర్తా ప్రశాసితా చైవ మహానుభావః || 32

శ్లో|| అరాజపుత్ర స్త్వ మనార్యవృత్తో లుబ్ధ స్సదా బంధుషు పాపబుద్ధిః|
క్రమాగతం రాజ్య మిదం పరేషాం హర్తుం కథం శక్ష్యసి దుర్వినీత || 35

**శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి - అధ్యాయః - 148**

ద్రోణుడు చెప్పినమాటలలో పాండురాజు అడవులకు పోవుచు రాజ్యపాలనభారమును ధృతరాష్ట్రునకు విదురునకు అప్పగించి పోయెనని స్పష్టమగుచున్నది. తాను తిరిగి వచ్చువఱకో లేక తనపుత్రులు వచ్చువఱకో విదురుని సాయముతో ధృతరాష్ట్రుని పేరట భీష్ముడు రాజ్యమును పాలంపవలె నని పాండురాజు తలంచెను. అంతమాత్రమే కాని ఆయన అన్నకు రాజ్యపట్టాభిషేకము చేయలేదు. విదురునకు కూడ ఆయనరాజ్యము నొసంగె ననుటవలనరాజ్యపాలననాధి కారమును తాత్కాలికముగా వారిపైనుంచె నన్నమాట. శూద్రస్త్రీయందు జన్మించి పారశవుడైన విదురునకు రాజ్యముపై ఎట్లుస్వామ్యము లేదో అట్లే చక్షురింద్రియహీనుడై అంధుడైన ధృతరాష్ట్రునకు కూడ లేదు అనుట స్పష్టము పాండురాజు తనపుత్రులకొఱకు రాజ్యమును అన్నయొద్ద తమ్మునియొద్ద న్యాసమునుగా, అనగా ఇల్లడగా, ఉంచె నన్నమాట. ఇల్లడగా ఉంచిన వస్తువులపై, వానిని రక్షింప స్వీకరించినవానికి, స్వామ్యము ఎప్పటికిని ఏర్పడదు. అందువలననే ధృతరాష్ట్రుడు రాజు కాలేదు. దుర్యోధనుడు రాజపుత్రుడు కాలేదు. కావున రాజ్యమంతయు ధర్మరాజుదే. ధర్మబుద్ధితో గాంధారి రాజ్యభాగమును ప్రస్తావింపక, "పితృపితామహులనుండి ప్రాప్తమైన యీరాజ్యము సర్వము పాండవులకు వారి పుత్రపౌత్రులకే చెందును" అని ఉద్ఘాటించినది. (రాజ్యం త దేత న్నిఖిలం పాండవానాం, పైతామహం పుత్రపౌత్రానుగామీ).

రాజ్యముపై దుర్యోధనునకు ఎట్టిస్వామ్యము లేదని, అతడు రాజ్యమును కోరుట పరులసొమ్మును హరించుటయే, యని భీష్మాదు లందఱును ఉద్ఘాటించిరి. కాని దుర్యోధనుని నిగ్రహించి ఎట్లైనను ధర్మజునకు రాజ్యము నిప్పింపవలయు నను కర్తవ్యమును నిర్వహించుటకు మాత్రము ఎవ్వరును ముందునకు రాలేదు. దుర్యోధనుని సరియైనమార్గమున నుంచుట తమకు శక్యము కానప్పుడు, అధర్మమును సహించుట కూడ అధర్మమే యగును. కావుననే ధృతరాష్ట్రుడు భీష్ముడు, అవిధేయుడు పాపాత్ముడును అయినదుర్యోధనుని వదలి అడవికి పోవలయునని విదురుడు చెప్పెను భీష్ముడు వెడలిపోయినచో ద్రోణుడు, అశ్వత్థామ కూడ ఆయన వెంటనే వెడలిపోవుదురు. అప్పుడు దుర్యోధనునకు ధర్మరాజు నెదుర్కొను సాహసముండదు. అప్పుడు తప్పనిసరిగా అర్ధరాజ్యమునో, కనీసము అయిదూళ్ళనో ఇచ్చి అతడు ధర్మరాజుతో సంధిచేసికొన వచ్చునని, ఆవిధముగా భీష్మాదులు కొంతవఱకైనను అధర్మము నుండి తొలగినవారు కావచ్చునని విదురుడు తలంచెను. శ్రీకృష్ణుడు విదురుడు ధర్మమార్గమును నిర్దేశించుచున్నను భీష్ముడు ఆమార్గమును అవలంబింప దలంప కుండుట శోచనీయము భీష్మునితోడి మైత్రికొఱకు ద్రోణుడైనను వనవాసమునకు బయలుదేరకుండుట కేవల హృదయదౌర్బల్యమే యని చెప్పవలసియున్నది.

భీష్మాదుల ప్రసంగములలోని యీ విషయములు కురుసభ ఘట్టమున వైశంపాయనుడు జనమేజయునితో చెప్పలేదు. ఇక్కడ కృష్ణుని ప్రసంగమున అవి యుద్ఘాటింపబడుచున్నవి. "అక్కడ ఎందుకు వైశంపాయనుడు వీనిని చెప్ప లేదు?" అని సంశయము కలుగవచ్చును. ఇది వ్యాసభగవానుని మహాకావ్యనిర్మాణ కళాకౌశలము. అక్కడ చెప్పిన విషయములనే మరల ఇక్కడ చెప్పినచో వినుచున్న కావ్యశ్రోతలకు పునరుక్తిగా తోచి విసుగును కలిగించును. అట్టి విసుగు కలుగకుండ కవిత్వకౌశలదక్షుడైన వ్యాసభగవానుడు అక్కడ కొన్ని విషయములను చెప్పి తక్కిన విషయములను ఉపప్లవ్యమున పాండవుల సన్నిధియందు కృష్ణుని ప్రసంగమున సమకూర్చెను. కురుసభయందే అన్ని విషయములను చెప్పి, కృష్ణుడు పాండవులకు అక్కడ జరిగినదంతయు చెప్పెనని ఒక్కవాక్యముతో **ముగించి**నచో, పాండవులు యుద్ధనిశ్చయమును గావించుకొను ఘట్టము నీరసముగా నుండును.

## (ii) కార్యాలోచన చమసము

భీష్మాదులు గావించిన ప్రసంగములను వివరించిన తరువాత శ్రీకృష్ణుడు అచ్చట జరిగిన సంఘటనములను గూర్చి యిట్లు చెప్పెను. "భీష్మాదులు హితమునుపదేశించు చుండగా దుర్యోధనుడు వివేకమును పొందక క్రుద్ధుడై వారిని లెక్కపెట్టక సభలోనుండి లేచిపోయెను. వానివెంట సహాయులైన రాజులను వెడలిపోయిరి నేను మొదట సామమార్గమున దుర్యోధనుని ఒప్పించుటకు ప్రయత్నించితిని. తరువాత మీయొక్క మానుషములు దివ్యములును అయిన పరాక్రమములను ప్రశంసించి రాజులకు బయమును కలిగించితిని. రాజులను దుర్యోదనుని భీష్మాదులను తృణీకరించి వారిని నిర్విణ్ణులను గావించితిని. బాదమును స్మరింపజేసి ధార్తరాష్ట్రులను నిందించి రాజులకు వారియెడ వైమనస్యమును కలిగించితిని. పాండవులు శూరులయ్యును ధృతరాష్ట్రునకు భీష్మాదులకు విధేయులై యుందు రని చెప్పితిని. తుదకు, "అయిదు గ్రామముల నొసంగినను పాండవులు సంతృప్తులగుదురు. ఎటైనను వారు మీతండ్రికి పోషణీయులే కదా! వారిపోషణ కోసమైనను కొన్ని గ్రామము లిచ్చినట్లే తలంపుము తక్కిన రాజ్యమంతయు నీకే యుండును కదా" అని దుర్యోధనుని బ్రతిమిలాడితిని.

అయినను వాడు అంతమాత్రమైన యిచ్చుటకు అంగీకరింపలేదు. అద్భుతములు ఘోరములు అమానుషములునైన దృశ్యములును ప్రదర్శించితిని ఎటైనను వాడు సుముఖుడు కాలేదు. వానివిషయమున ఇంక దండము తప్పను వేఱు మార్గములేదు. వారిని యుద్ధమున నిగ్రహింపకుండ నీకు రాజ్యము రాదు"

ధర్మరాజు సోదరులతో ఇట్లనెను. "మీరు సభావృత్తాంతమును, మాధవుని యభిప్రాయమును విన్నారు. ఇంక కౌరవులకు సేనాపతియైన భీష్మునకు సమానుడైన వాడు మనయందు ఎవ్వడు సేనాపతి కాదగునో చెప్పుడు" అనెను. సహదేవాదులు

విరాటాదులను పేర్కొనిన తరువాత దర్మరాజు శ్రీకృష్ణుని చెప్పుమనెను. ఆయన దృష్టద్యుమ్నుడు సేనాపతి కాదగునని చెప్పెను.

మఱునాడే యుదిష్ఠిరుడు సేనాసమేతుడై కురుక్షేత్రమునకు పోయి హిరణ్వతీనదీ తీరమును చేరెను. అచ్చట కృష్ణుడు పరిఖలను త్రవ్వించి స్కంధావారములను నిర్మింపజేసెను.

స్కంధావారమున మరల ధర్మరాజు "కర్తవ్యము యుద్ధమే యగునా" అని కృష్ణుని ప్రశ్నించెను. "ధర్మార్థసహితముగా నేనెంతగా చెప్పినను దుర్యోధనుడు వినలేదు , అంతేకాదు ; అతడు నన్ను బంధించుటకు కూడ ప్రయత్నించెను ; ఇంక నీకు యుద్ధము తప్ప గత్యంతరమే మున్నది ? కుంతీవిదురుల యభిప్రాయము కూడ ఇదియే." అని కృష్ణుడనెను అప్పటికి యుధిష్ఠిరుడు యుద్ధకర్తవ్యనిశ్చయమున నిరూఢు డయ్యెను.

# 8. విజయ కాండము

## విజయగీత

(భీష్మపర్వమున భగవద్గీతాపర్వము)

25వ అధ్యాయము నుండి 42 అధ్యాయములు

## విజయప్రభా వ్యాఖ్యాన కలితము

## I. అర్జున ప్రబోధ కలశము

### 1. బ్రహ్మ నిష్ఠా కమండలువు

### (i) అర్జున నిర్వేద చమసము

### గీత

శ్రీకృష్ణుడు సారథ్యమును వహించిన రథముపై అర్జునుడు యుద్ధరంగమున ప్రవేశించెను. కృష్ణుడు అర్జునుని చూచి, "అర్జునా ! శుచివై సంగ్రామరంగమునకు అభిముఖుడవై నీజయము కొఱకు, శత్రువుల పరాజయము కొఱకు దుర్గాస్తోత్రమును పఠింపుము" అని చెప్పెను. అర్జునుడు రథమునుండి దిగి అట్లే భక్తిపూర్వకముగా దుర్గాదేవిని స్తుతించెను. వెంటనే ఆపరమేశ్వరి ప్రత్యక్షమై జయము కలుగు నని వరమిచ్చెను.

శ్లో|| శుచి ర్భూత్వా మహాబాహో! సంగ్రామాభిముఖః స్థితః |
పరాజయాయ శత్రూణాం దుర్గాస్తోత్ర ముదీరయత్|| 2

**శ్రీ మహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 22**

యుద్ధము ఆరంభము కా నుండగా అర్జునుడు శ్రీకృష్ణుని చూచి, "రథమును రెండు సేనల మధ్య నిలుపుము ; రెండు పక్షములవారిని జూచెదను" అనెను. ఆయన అట్లే రథమును రెండు సేనల మధ్య నిలిపి, "సన్నద్ధులై యున్న కౌరవుల నందఱను చూడుము" అనెను. అర్జునుడు ఇరుపక్షములయందు సన్నద్ధులై యున్న పితృపితామహులను ఆచార్యులను సోదరులను పుత్రపౌత్రులను మిత్రులను చూచి కృపాతిశయముచేత అవిష్టుడై విషాదముతో ఇట్లనెను. "కృష్ణా! యుద్ధమునకు సన్నద్ధమై యున్న స్వజనమును చూడగా నా ముఖము ఎండిపోవుచున్నది, శరీరము కంపించుచున్నది ; అవయవములు పట్టు తప్పుచున్నవి, గాండీవము చేతినుండి జారిపోవుచున్నది ; నా మనస్సు

భ్రమించుచున్నది ; నేను నిలువలేకున్నాను.

ఎవరికొఱకు మేము రాజ్యమును సుఖభోగములను కోరుచున్నామో అట్టి స్వజనమును చంపుటవలన ఏమి శ్రేయస్సు కలుగునో నాకు తోచుట లేదు. వీ రందఱు నశించిన తరువాత రాజ్యమువలన సుఖభోగములవలన ఏమి ప్రయోజనము ? బ్రతికియుండుటవలన నేమి లాభము ? లోభోపహత చేతస్కులై వీరు కులక్షయకృతమైన దోషమును మిత్రద్రోహమునందలి పాతకమును తెలిసికొన లేకున్నను మే మైనను గ్రహించి ఈ పాపమునుండి వెనుకకు మరల నక్కఱ లేదా ? కులక్షయము సంభవించినచో సనాతనములైన కులధర్మములు నశించును. ధర్మము నశించినచో కులమును అధర్మము ఆక్రమించును. అయ్యో ! రాజ్యసుఖలోభము చేత స్వజనమునే సంహరించుటకు ఉద్యుక్తులమైన మేము ఎంత పాపమునకు సిద్ధపడినాము ! నిరాయుధుడనై ఊరకయున్న నన్ను శస్త్రపాణులై ధార్తరాష్ట్రులు సంహరించినను, నాకది మిగుల మేలే యగును"

ఇట్లనుచు అర్జునుడు శోకావేశవశుడై శరచాపములను వదలి రథమున వెనుకభాగమునకు వచ్చి కూర్చుండెను. అట్లు కృపావేశవశుడై కనుల నీరునిండుచుండగా విషాదము నొందుచున్న యర్జునుని చూచి శ్రీకృష్ణు డిట్లనెను-"విషమమైన యీ పరిస్థితియందు ఈ కశ్మలము నీకు ఎక్కడ నుండి దాపురించినది ? దీనివలన కీర్తి కలుగదు; స్వర్గము లభింపదు. ఇది పామరులకు సంభవించునట్టిది. నపుంసకత్వమును పొందకుము. ఇది నీకు తగదు. క్షుద్రమైన యీ హృదయదౌర్బల్యమును వీడి లెమ్ము".

అర్జునుడు ఇట్లు దుఃఖించెను. "కృష్ణా ! పూజార్హులైన భీష్మద్రోణులను ఎట్లు మార్కొందును ? మహానుభావులైన గురువులను హింసించుటకంటె భిక్షావృత్తియే శ్రేయస్కరము. ఈ రక్తపు కూడు నాకు వలదు. నా మనస్సు దైన్యముచేత హతమై యున్నది. నా కేమియు తోచుటలేదు. మూఢమై యున్ననా బుద్ధి ధర్మమును నిశ్చయింపజాలకున్నది. నాకు ఏది శ్రేయస్కరమో నీవు నిశ్చయించి చెప్పుము. నేను నీకు శిష్యుడను , నిన్ను శరణుపొందుచున్నాను. నన్ను శాసింపుము. ఎదురులేని సామ్రాజ్యము సంభవించినను, లేక స్వర్గాధిపత్యమే లభించినను అవి యీశోకమును తొలగింపగల వని తోచుట లేదు నే నింక యుద్ధము చేయను"

రెండు సేనల మధ్య అట్లు మాటాడి కూర్చుండి చింతించుచున్న యర్జునుని చూచి శ్రీకృష్ణుడు పరిహాసించుచున్నట్లుగా నవ్వి సమాదానము చెప్ప నారంభించెను.

## విజయప్రభ

నిపుణుడైన వైద్యుడు పైకి రాబోవుచున్న వ్యాధిని గుర్తించి దానికి ముందుగానే మందు నొసంగునట్లు (preventive medicine) శ్రీకృష్ణుడు పార్థునియందు పైకి రానున్న

విషాదమును ఊహించి దానికి విరుగుడుగా దుర్గాదేవిని స్తుతింపు మని అర్జునుని ప్రోత్సహించెను. దేవి ప్రత్యక్షమై విజయము కలుగు నని చెప్పినది. యుద్ధ సన్నద్ధుడైన వానికి దేవి యొసంగిన వరము సకల సంకోచములను నివారించి అమోఘముగా ధైర్యోత్సాహములను కలిగించుననుట తథ్యము. కాని ఆమె వర మొసంగిన తరువాత కొన్ని నిముషములలోనే అర్జునునియందు నిర్వేదము విషాదము పెల్లుబికినవి మందును మించి వ్యాధి విజృంభించునట్లు విషాద మాతనియందు, దేవియొక్క వరమును కూడ విస్మరింపజేసి, ఉప్పెనవలె పొంగివచ్చినది. అంత మాత్రమున దేవివరము వ్యర్థము కాలేదు. దాని ప్రభావము చేతనే అర్జునుడు "నేను యుద్ధము చేయను" (న యోత్స్యే) అని చెప్పుచుండియు, నేను నీకు శిష్యుడను; ప్రపన్నుడను. నన్ను శాసింపుము" అని శ్రీకృష్ణుని ప్రార్థించెను. ఇది పార్థుని జీవితమునందు అత్యంతము ప్రముఖమైన సన్నివేశము. దీనిచేత అతడు తరించుటయే కాక తరతరములుగా మానవావళికి తారకమైన భగవద్గీతను అందించినవాడయ్యెను. ఇది దేవియొక్క అనుగ్రహమే అని చెప్ప వచ్చును.

అర్జునుడు బంధువులను చూచి కృపతో గురువులయందలి పూజ్యభావనతో వారితో యుద్ధము చేయజాల నని విషాదము నొందుచుండగా శ్రీకృష్ణుడు ఆభావము కశ్మల మని నపుంసకత్వమును పొందకు మని పరుషముగ తిరస్కరించుట తగునా ? చెడిపోయి పారవేయవలసిన పదార్థమును కశ్మల మందుము. అర్జునుని మనస్సు తీవ్రమైన కృపయొక్క ఆవేశముచేత కశ్మల మైనది. కామావేశము క్రోధావేశము మొదలుగా ఏ భావ మావేశించినను మనస్సు కశ్మలమే యగును. మఱి కృపయొక్క ఆవేశము కూడ దుష్టమే యగునా ? యథార్థమైన కృపవలన ఆవేశము కలుగదు. పరులసుఖముకొఱకు యత్నింపవలయు నను నిచ్ఛ కృప. అయిచ్ఛ కలిగినప్పుడు ఆ ప్రయత్నమున ధైర్యము ఉత్సాహము కలుగునే కాని విషాదము శోకము కలుగవు. కావున అర్జునునకు కలిగినది కృప కాదు. అది కృపవలె తోచుచున్న విషాదము. "వీరందఱు నా వారు. వీరు అందఱు నశించినచో నేను ఎట్లు సుఖముగా నుండగలను ?" అను భయమే ఈ విషాదమునకు మూలము. "ఎవరికొఱకు మేము రాజ్యమును భోగములను సుఖములను గోరుచున్నామో వారే యుద్ధము చేయుటకు నిలిచియున్నారు". (యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ త ఇమేఽవస్థితాః) "ఎవరిని సంహరించినచో మాకు జీవింపవలయు నను నిచ్ఛయే కలుగదో వారే ఎదుట నిలిచియున్నారు" (యానేవ హత్వా న జిజీవిషామః తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః) అను వాక్యములవలన ఈ భయము స్పష్టమగుచున్నది. ఈ భయవిషాదములచేత అతనియందు ఆలోచనము అంతరించినది. భీమునకు విషము పెట్టుట, ద్రౌపదిని పరిభవించుట, తమ రాజ్యమును హరించి అయిదూళ్ళనైనను ఇచ్చుటకు నిరాకరించుట దూతయైన శ్రీకృష్ణుని బంధింప యత్నించుట మొదలుగా దుర్యోధనాదులు గావించిన దుష్కృత్యము లన్నియు అర్జునునియందు ఆక్షణమున విస్మృతము లయ్యెను. రాయబారములు జరిపి చర్చలు

జరిపి యుద్ధమే తమకు ధర్మవిహితమైన కర్తవ్య మని ధర్మరాజు నిశ్చయించుకొన్న తరువాతనే తాను యుద్ధమునకు వచ్చె నని, అన్నయాజ్ఞ అతిక్రమింప రాని దని కూడ అతనికి తోచలేదు. క్షత్రియుడు అపరాధులను దండింపక వారియెడ కనికరమును చూపినచో లోకులు అది పిరికితన మని పరిహసింతురే కాని దయ అని ప్రశంసింపరు విక్రమించి క్షత్రియుడు అపరాధులను దండించినచో ఈలోకమున కీర్తి పరలోకమునందు స్వర్గము పొందును. అట్లు గాక అపరాదులయందు దయను చూపి కర్తవ్యమును మానుకొన్నచో అపకీర్తియు నరకము కలుగక తప్పదు. అందువలన అర్జునునకు కలిగిన విషాదము కశ్మల మని నపుంసకత్వ మని శ్రీకృష్ణుడు ఉద్ఘాటించెను

అర్జునుడు నిర్వేద విషాదముల చేత ఆర్తుడై కర్తవ్య మే మని అడుగుచుండగా శ్రీకృష్ణుడు పరిహసింపవచ్చునా ? అర్జునుడు మహావీరుడు. ఎన్నో యుద్ధములలో కోట్లకొలదిగా రాక్షసులనే గాక మనుష్యయోధులను కూడ సంహారించినాడు. ఆ యుద్ధములలో అతనికి ఎప్పుడును ఇట్టి దయాభావములు కలుగలేదు. ఇప్పుడే ఏల కలుగవలె ? వారు పరులు కాబట్టి కలుగ లేదు. అపరాధులు మనవా రైనచో కనికరింపవచ్చునా ? పరులైనచో పరిమార్పవలయునా ? ఈ భేదభావనకు శ్రీకృష్ణునకు నవ్వు వచ్చెను.

అంతే కాదు. "నిన్ను అడుగుచున్నాను , మూఢమై యున్న నా బుద్ధి ధర్మమును నిశ్చయింప జాలకున్నది. నేను నీకు శిష్యుడను , ప్రపన్నుడను ; నన్ను శాసింపుము" పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః। శిష్య స్తే ఒహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ అని వినయమును ప్రకటించి అర్జునుడు మఱుక్షణమే "నేను యుద్ధము జేయను" (న యోత్స్యే) అని పలికెను. గురువును ధర్మమును గూర్చి ప్రశ్నించిన తరువాత ఆయన ఏమి చెప్పునో విని ఆవిధముగా శిష్యుడు వర్తింపవలయునే కాని తానే నిశ్చయించుకొనుట ఎట్లు సమంజస మగును ? యుద్ధము చేయకుండుట తన నిశ్చయమైనచో అర్జునుడు కృష్ణుని గురువునుగా భావించి అడుగుట ఎందులకు ? ఇట్లయినచో కృష్ణుని గురుత్వ మే మున్నది, అర్జునుని శిష్యత్వ మే మున్నది, అను భావముతో కూడ శ్రీకృష్ణుడు నవ్వి యుండును.

## (ii) సాంఖ్యచమసము

## గీత

శ్రీకృష్ణుడు దయాళువై అర్జునునకు ఇట్లు బోధించెను. "అర్జునా ఎవరినిగూర్చి శోకింవ నక్కఱలేదో అట్టివారిని గూర్చి శోకించుచున్నావు. చచ్చిపోయిన వారిని గూర్చి కాని బ్రతికియున్నవారిని గూర్చి కాని పండితులు శోకింపరు. భీష్మాదులకు మనకు ఆత్మయే స్వరూపము. అది నిత్యము. కావున మన మందఱము నిత్యులము. కాని

దేహములు అనిత్యములు. నిత్యమైనది ఎప్పుడును ఉండును. అనిత్యములు ఎప్పుడును ఉండవు. ఉన్నది ఎప్పటికైనను లేకపోవుట గాని, లేనిది ఒకప్పు డైనను ఉండుట గాని సంభవింపదు

శరీరము చంపబడినను ఆత్మ చావదు. ఆత్మ చంపుట లేదు : చంపబడుట లేదు. ఆత్మ చంపుచున్న దని, చంపబడుచున్న దని తలంచువా రిద్దరును అజ్ఞులే. ఆత్మ పుట్టుట లేదు. చచ్చుట లేదు పుట్టుట పెరుగుట చచ్చుట మొదలగు వి[క్రియ లన్నియు దేహమునందే తోచుచున్నవి, కాని ఆత్మకు సంబంధింపవు. ఆత్మ నిర్వికారము. చినిగిన వస్త్రములను వదలి నూతన వస్త్రములను గ్రహించునట్లు జీవుడు జీర్ణములైన శరీరములను వదలి క్రొత్తవానిని స్వీకరించును. శరీరములు పోవుచున్నప్పుడు ధీరుడు కలత నొందడు. శరీరములందు వచ్చుచు పోవుచు నుండు శీతోష్ణసుఖదుఃఖాదులకు అతడు చలింపడు. కావున నీవు కూడ వానిని సహింపుము. ఆ ద్వంద్వములయందు సమస్థితిలో నుండగలవాడే అమృతత్వమును పొందుటకు అర్హుడగును.

ఒకవేళ ఈ శరీరమే ఆత్మ యని నీవు తలంచుచున్నను ఇది పోవునప్పుడు నీవు దుఃఖించవలసిన దేమున్నది ? పుట్టిన శరీరము ఎప్పటికైనన్మఃగిట్టక తప్పదు కదా ! తప్పించుటకు వీలు లేనిది, తప్పక జరుగవలసినది జరుగుచున్నప్పుడు దుః ఖించుటవలన ప్రయోజన మేమి ?

నీవు స్వధర్మదృష్టితో కూడ యుద్ధమునుండి తొలగిపోవుట తగదు ధర్మయుక్తమైన యుద్ధము కంటె క్షత్రియులకు శ్రేయస్కరమైన దే మున్నది ? ఇది క్షత్రియులకు తెఱచియుంచిన స్వర్గద్వారము వంటిది. లభించిన దీనిని వదులుకొని పోయినచో నీకు స్వదర్మము కీర్తియు పోవుటయే కాక పాపము కూడ కలుగును లోకముచేత సంభావితు డగుచున్న వానికి అపకీర్తి, మరణముకంటెను యాతనావహ మగును. ఈ మహావీరు లందఱును నీవు పిఱికితనము చేతనే పారిపోయితి వని తలంచి గేలిసేయుదురు. ఇంతకంటె దుఃఖతరమైన దే మున్నది ?

సుఖదుఃఖములను లాభనష్టములను జయాపజయములను సమముగా చూచుచు యుద్ధమునకు సన్నద్ధుడ వగుము. అట్లయినచో నీకు పాపము కలుగదు. స్వధర్మమైన యుద్ధమునందు జయింతువేని రాజభోగముల ననుభవింతువు ; లేక హతుడ వైనచో స్వర్గభోగములను పొందుదువు"

## విజయప్రభ

**"చచ్చిపోయిన వారిని గూర్చి కాని బ్రతికియున్నవారిని గూర్చి కాని పండితులు శోకింపరు" అని శ్రీకృష్ణు డనుట గమనింపదగియున్నది. బ్రతికియున్నవారిని గూర్చి శోక ప్రసక్తియే మున్నది ? భీష్మాదులు చనిపోవుట ఎట్లు శోకమును కలిగించునో దుర్యోధన కర్ణాదులు బ్రతికియుండుట అట్లే అర్జునునకు శోకమును కలిగించును.**

భీష్మాదులశరీరములు నిహతము లగు నని వారు భయంకరముగా మరణింతు రని, అట్లు వారిని వధించుటే వారివలన వియోగము తనకు దుఃఖమును కలిగించు ననియే అర్జునుడు చింతించుచున్నాడు. అతనికి వారి విషయమున వారు ఆత్మస్వరూపు లను భావన లేదు. అందువలననే శ్రీకృష్ణుడు శరీరదృష్టితో కూడ దుఃఖించుట తగదని చెప్పుచున్నాడు. పరిహార్యములు అపరిహార్యము లని దుఃఖవిషయములు రెండు విధములు. తప్పించుకొనుటకు వీలయినవి పరిహార్యములు. ఎప్పటి కైనను తప్పించుకొనుటకు వీలుకానివి అపరిహార్యములు. దారిద్ర్యము వ్యాధులు మొదలగునవి పరిహార్యములు. వానినిగూర్చి దుఃఖించినచో ఇతరులకు జాలి కలుగవచ్చును. వారిసాయమున మనము ఆ దుఃఖవిషయములను పరిహరించుకొనవచ్చును. కాని చావు అపరిహార్యము. దానిని ఇతరులు తప్పించుట కాని తాము తప్పించుకొనుట కాని సాధ్యము కాదు. కావున మృత్యువునుగూర్చి దుఃఖించుట నిష్ప్రయోజనము.

ఒకడు మరణించినప్పుడు వాని కొడుకు భార్య మొదలగువారు ఎంతగా విలపించినను అతడు బ్రతుకడు. ఈ విషయము అందఱకును తెలియును. కాని నూటికి తొంబది తొమ్మిది మంది ఇష్టులైనవారు గతించినప్పుడు దుఃఖించుచునేయున్నారు. మఱి నిష్ప్రయోజన మని తెలిసికూడ వా రెందుకు దుఃఖించుచున్నారు ? పొంగివచ్చుచున్న దుఃఖమును ఆపుకొనలేక వారు దుఃఖించుచున్నారు. దానిని ఆపుకొన గలిగినవారు, దానికి అవకాశమునే యొసంగనివారు కొందఱు ధీరులు, దుఃఖింపకుండ ఉండగలుగుచున్నారు. కావున అట్టి సందర్భమున దుఃఖించుట హృదయదౌర్బల్యము వలననే సంభవించుచున్న దనుట స్పష్టము. ప్రియులు హితులు ధార్మికులు మరణించినప్పుడు ఇంచుమించుగా అందఱను దుఃఖించుచునే యుందురు. కావున ఈ హృదయదౌర్బల్యము నైసర్గిక మని చెప్పవచ్చును (Natural wekaness). కాని అప్రియులు అహితులు అధార్మికులును అయినవారు హతులైనప్పుడు కూడ కొందఱు, తమకు వారితో గల పూర్వ సంబంధమును స్మరించియో లేక వారిబంధువుల దుఃఖమువలననో, దుఃఖించుచుందురు. ఇది అసహజము అయుక్తము నైన హృదయదౌర్బల్యము (unnatural and worse weakness) ఇంక చంపదగినట్టి యపరాధులనుగూర్చి, వారు చత్తురో చావరో మనలనే చంపుదురో తెలియకముందే, వారు చచ్చిపోవుదురేమో యని యూహించి శోకించుట నికృష్టమైన హృదయదౌర్బల్యము. దీనినే శ్రీకృష్ణుడు క్షుద్రమైన హృదయదౌర్బల్య మన్నాడు. హత్యాప్రయత్నములు గావించిన దుర్యోధనాదులు వధ్యులు వారివధ జరుగకుండ వారికి సహాయులై వారిని రక్షించుచున్న భీష్మాదులు కూడ వధ్యులే. వారు యుద్ధమునందు చత్తురో చావరో పాండవపక్షమున నెంతమందిని సంహరింతురో తెలియదు. అట్టివారినిగూర్చి వారు మరణించినచో తనకు జీవితమే శూన్యమగునని అర్జునుడు శోకించుటకు మూలము కేవలమైన హృదయదౌర్బల్యము. ఆ దౌర్బల్యమువలన అతడు క్షత్రియునకు అధర్మమైన భిక్షావృత్తిని ధర్మమునుగా, స్వధర్మమైన యుద్ధమును అధర్మమునుగా భావింపజొచ్చెను. అందువలన

అర్జునునియందలి యీ శోక ప్రవృత్తిని కశ్మలమని క్షుద్రమైన హృదయదౌర్బల్య మని నపుంసకత్వమని శ్రీకృష్ణుడు నిస్సంకోచముగ అర్జునుని మందలించెను.

ఈ సందర్భమున మఱియొక విషయమును కూడ గమనింపవలసియున్నది ఆత్మ నిత్యము సత్యము ; శరీరములు అనిత్యములు అసత్యములు అని బోధించినవెంటనే శీతోష్ణాది సుఖదుఃఖములయందు తితీక్షను ఓర్పును వహింపుము. వానియందు సమస్థితిలోనుండువాడు అమృతత్వమును పొందుటకు అర్హుడగును (అమృతత్వాయ కల్పతే) అని చెప్పుట ఎందులకు ? ఆత్మజ్ఞానమునకు తితీక్షకును ఏమి సంబంధము ?

ఆత్మవేత్త శోకమును తరించు నని (తరతి శోక మాత్మవిత్) ఉపనిషత్తులలో ప్రసిద్ధముగానున్నది. ఇప్పుడు అర్జునునకు శ్రీకృష్ణుడు ఆత్మస్వరూపమును బోధించినాడు. ఇది జరిగిన వెంటనే ఒక గంటలోపల అర్జునుడు మహాయుద్ధమును చేయబోవుచున్నాడు ; చేయుమని శ్రీకృష్ణుడే ప్రోత్సహించుచున్నాడు మఱి యుద్ధము చేయుచున్నప్పుడు క్రోధము, అబిమన్యుడు మొదలగువారు చనిపోయినప్పుడు శోకము, అతనికి కలుగకుండునా ? అవి కలుగుచున్నప్పుడు, "ఆత్మజ్ఞానోపదేశమును పొందియుంటిని గదా ! నాకు ఇంకను శోకమోహములు కలుగుచున్న వేమి ? నాకు ఆత్మజ్ఞానము కలిగినదా లేదా ? లేక కలిగిన జ్ఞానము యథార్థ మైనది కాదా ? శోకమోహములు కలుగకుండ అమృతత్వమును పొందుటకు ఇంతకు మించిన జ్ఞానము కాని యోగము కాని సాధనము కాని ఇంకేమైన నున్నదా ?" అని అనేక సందేహములు అర్జునునకు కలుగుటకు అవకాశమున్నది పరోక్షమైన (indirect) శాస్త్రజ్ఞానము కలిగినంత మాత్రమున ప్రారబ్ధవశమున సంభవించు సుఖదుఃఖములు కలుగకుండబోవు వానిని సహించుచు దేహాభిమానమును తగ్గించుకొను ప్రయత్నము చేయుచు నుండవలసినదే కాని శాస్త్రము ననుసరించి ఆచార్యు డుపదేశించిన యాత్మజ్ఞానమును శంకింపరా దని, అమృతత్వమునకు అదియే సాధన మని, అంతకు మించినది యేదియును లే దను దృఢ విశ్వాసమును కలిగించుటకొఱకే భగవాను డిచ్చట తితీక్షను ప్రస్తావించినాడు

ఆచార్యోపదేశమువలన వేదాంతశాస్త్రమునందు పరినిష్ఠితులై పరోక్షజ్ఞానమును పొందిన పండితులు కూడ సుఖదుఃఖానుభవమును, పశువులు మొదలగువానితో సమానముగానే, పొందుదు రని శ్రీ శంకరభగవత్పాదుల వారు (పశ్వాదిభిశ్చావిశేషాత్) అధ్యాసభాష్యమునందు ఉదాహరించియున్నారు పశువులు కఱ్ఱను చూపినచో పారిపోవుచు, గడ్డిని చూపినచో పరువెత్తుకొని వచ్చుచుండును అట్లే పరోక్షజ్ఞానము గలిగిన వారు ఎంత పండితు లైనను క్రోధముతో ఖడ్గహస్తుడై ఎవడైన ఎదురుగా వచ్చినచో భయముతో పారిపోవుచు, అర్ఘ్యపాద్యులతో ఆహ్వానులు ఎదురుగా వచ్చినచో హర్షముతో వారిని చేరబోవుదురు మఱి ఉత్తమ జ్ఞానులైన జనకుడు శ్రీకృష్ణుడు మొదలైనవారు కూడ ఆత్మరక్షణము గావించుకొనుచు శత్రువులకు పరిహరించుచు మిత్రులను అభినందించి నట్లు తెలియుచున్నది కదా ! వారికి కూడ

అపరోక్షమైన (direct) ఆత్మానుభూతి లేదని చెప్పవచ్చునా ? అపరోక్షానుభూతి కలిగినవా రందఱు సన్యాసులో అవధూతలో అయి ఉండరు. ముఖ్యముగా, సన్యాసాధికారము లేని క్షత్రియాదులు ఉత్తమ జ్ఞాను లయ్యును గృహస్థులుగానే యుందురు. అప్పుడు వారు కామ్యకర్మలను వదలి తమవర్ణమునకు ఆశ్రమమునకు విహితములైన కార్యములు మాత్రము నిర్వహించుచుందురు. వారికి ఆత్మరక్షణము శత్రుశిక్షణము కర్తవ్యములే యగును. సాదారణ వ్యక్తులకు వారికిని వ్యవహారమునందు బేదము కన్పింపదు. కాని వారు భయముతో రాగద్వేషములతో ఏ పనిని చేయరు. వారి ప్రవృత్తికి ధర్మాధర్మములు రెండే హేతువులుగా నుండును. ధర్మపాలనముకొఱకు సజ్జనులయెడ ప్రీతి యున్నట్లుగా, అధర్మనిర్మూలనముకొఱకు దుర్జనులయెడ ద్వేష మున్నట్లుగా వారు వ్యవహరించుచుందురు. శీతోష్ణములు సుఖదుఃఖములు మొదలుగా ద్వంద్వములవలన వారు చలింపరు. వారు శరీరములందు ఉన్నను, పండి ఎండిన కాయలో గింజలవలె, ఆ శరీరములతో సంబంధము లేనివారుగానే యుందురు.

ఈవిషయము ఛాందోగ్యోపనిషత్తునందు చక్కగా నిరూపింపబడినది. "ఆత్మవేత్త శోకమును తరించును" అను సూక్తి ననుసరించి నారదమహర్షి సనత్కుమారునకు శుశ్రూష గావించి ఆత్మజ్ఞానమును పొందెను. శోకమును తరించుట ఎట్లు సంభవించునో దీనియందు తరువాత వివరింపబడినది. "సశరీరుడైనవానికి ప్రియాప్రియములు నశింపవు" (న హ వా సశరీరస్య ప్రియాప్రియయో రపహతి రస్తి). సశరీరు డనగా "ఈ శరీరమే నేను , ఈ శరీరము నాది" అను నహంకారము మమకారము శరీరమునందు గలవాడు సశరీరుడు. ఈ శరీరాబిమానము ఉన్నంతవఱకు, పరోక్షమైన వేదాంతజ్ఞానము ఎంత యున్నను, ప్రియము అప్రియము రాగము ద్వేషము మొదలగువాని యొక్క తాకిడి తప్పదు. కాని ఆత్మజ్ఞానముయొక్క మనన నిదిద్యాసనములవలన క్రమముగా శరీరాభిమానము నశించినచో ఇవి చిత్తమును స్పృశింపలేవు. "అశరీరుడుగనున్న వానిని ప్రియాప్రియములు స్పృశింపవు". (అశరీరం వావ సన్తం ప్రియాప్రియే న స్పృశతః) అనగా అట్టి వాని చిత్తమును హర్షశోకములు చలింపజేయలేవు.

హర్షశోకములకు మూలము అబిమానము దేనియందు మనకు ఎంత అభిమానము ఏర్పడునో దానినిబట్టియే ఆవ్యక్తియొక్క ఆ విషయముయొక్క అభివృద్ధియందు అంతగా హర్షము కలుగును. అట్లే ఆవ్యక్తికో విషయమునకో వినాశము సంబవించినప్పుడు మనకు ఎంత అబిమాన మున్నదో అంతే దుఃఖము కలుగును. అభిమానము లేనిచోట హర్షము ఉండదు, దుఃఖము కూడ ఉండదు. ఇంటిని అమ్మి డబ్బు తీసికొన్నవానికి వెంటనే ఆ ఇల్లు కూలినను తగులబడినను ఏమియు దుఃఖము కలుగదు. తనకు డబ్బు ముట్టుటకు ముందు కాక, డబ్బు చేతిలోబడిన తరువాత, ఆ యిల్లు అట్లయినందులకు వాడు తన సుకృతమును అభినందించుకొనును. అట్లే శరీరము సాదనముగా గురువులకు శుశ్రూష చేసి జ్ఞానము సంపాదించుకొనిన తరువాత, మనన

నిదిధ్యాసనముచేత ఆత్మసాక్షాత్కారమున అమృతత్వమును పొందిన పిదప జ్ఞానికి ఆ శరీరముపై అభిమాన ముండదు. భోజనము పూర్తియగు వఱకు ఎవరికైనను విస్తరిపై శ్రద్ధయుండును. కాని భోజనము పూర్తి యైనంతనే దానిని విసరిపారవేయుటకే ప్రతీవ్యక్తియు త్వరపడును ఆట్లే జ్ఞానికూడ శరీరముపై ఏమాత్రము అబిమానము కలిగియుండడు "కృతకృత్యులైనవారు మృత్యువును ప్రియుడైన అతిదినిగా ప్రతీక్షించుచుందురు" (కృతకృత్యాః ప్రతీక్షన్తే మృత్యుం ప్రియ మి వాతిథిమ్) శరీరాబిమాన రాహిత్యమువలన అట్టిజ్ఞానులు శోకమును తరించి అమృతత్వమును పొందుదురు.

కావున గురువువలన ఆత్మజ్ఞానోపదేశమును పొందిన తరువాత మననినిదిధ్యాసనములచేత శరీరాబిమానము నశించువఱకును సాధకుడు సుఖదుః ఖములయెడ తితీక్షను అనగా సహనమును వహించుచు సమత్వముకొఱకు ప్రయత్నించుచునే యుండవలె. "విలాపము దిగులు లేకుండ, ప్రతిక్రియ గావించుటకు ప్రయత్నింపక సకలదుఃఖములను సహించుటయే తితీక్ష"

శ్లో|| సహనం సర్వదుఃఖానా మప్రతీకార పూర్వకమ్ |
చింతావిలాపరహితం సా తితీక్షా నిగద్యతే ||

శ్రీ శంకర బగవత్పాదులవారు

కావున ఆత్మజ్ఞానోపదేశమును పొందినంతనే ఆత్మానందము కలుగలేదే అని నిర్వేదముతో తాను పొందిన జ్ఞానముయొక్క సామర్థ్యమును శంకింపరాదు , ద్వంద్వములను సహించుచు వానియందు సమస్థితిలో ఉండుటకే ప్రయత్నింపవలె. అమృతత్వ మను గమ్యమునకు ఆత్మజ్ఞానము సూటియైన మార్గము. అది తప్ప వేఱొక మార్గము లేదు. కాని మార్గమునందు అడుగుపెట్టినంతనే గమ్యము చేరువ కాదు. మనన నిదిధ్యాసనములు అను జోడు గుఱ్ఱములు కల తితీక్ష అను బండిపై ముందుకు పోవువానికి అచిరకాలముననే అమృతత్వము అందును. "సుఖదుఃఖములయందు సముడై ధీరుడై యున్న యెవనిని ఈ ద్వంద్వములు వ్యథితుని గావింప లేవో అతడు అమృతత్వమును పొందుటకు అర్హుడగును" అని బగవానుడు ఆత్మజ్ఞానమును పొందినతరువాత అమృతత్వమును పొందుటకు సాదనముగా తితీక్ష ఆవశ్యక మని ఉద్ఘాటించుచున్నాడు.

శ్లో|| యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ |
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే || 15

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయ - 26

# (iii) యోగచమసము

## గీత

సాంఖ్యమునకు అంగము, తితీక్షకు సహాయకమును అయిన యోగమును భగవానుడు ఉపదేశించుచున్నాడు.

"సాంఖ్యము ననుసరించి ఇంతవఱకు చెప్పితిని ఇప్పుడు యోగమును చెప్పెదను వినుము. యోగమువలన కర్మబంధము తొలగును ఈ యోగవర్తనము మధ్యలో ఏ కారణముచేతనైన ఆగిపోయినప్పటికి అప్పటివఱకును జరిగిన యభ్యాసము వ్యర్థము కాదు ; దోషము కలుగదు. ఇందు స్వల్పమైన యభ్యాసము కూడ నిన్ను పెద్ద భయము నుండి రక్షింపగలదు.

ఈ యోగాభ్యాసమునందు నిశ్చయాత్మకమైన బుద్ధి అవశ్యకము , బహుముఖములుగా అనేక శాస్త్రములలో పరిభ్రమించు బుద్ధి నిష్ప్రయోజనము. వేదముల తాత్పర్యము నెఱుంగనివారు స్వర్గభోగములే మహనీయములని తాము భ్రమించుచు ఇతరులను భ్రమపెట్టుచున్నారు. భోగైశ్వర్యములందు ఆసక్తి కలవారికి ఈ యోగాభ్యాసమునందు బుద్ధి నిలువదు.

వేదములు త్రిగుణములకు సంబంధించిన విషయమును చెప్పుచున్నవి. నీవు త్రిగుణ విషయసంబంధమును వీడి ద్వంద్వరహితుడవై యోగక్షేమములను తలంపక ధీరుడవై ఎల్లప్పుడు సత్త్వమునం దుండుము.

చిన్న జలాశయమునందు స్నానపానాదికమైన ప్రయోజనమును ఎంతమాత్రము పొందునో, అంతమాత్రమే ఎవడైనను పుష్కలముగా జల మున్నచోట కూడ పొందును. అట్లే విజ్ఞానశాలియైన బ్రాహ్మణుడు సకల వేదములయందును తనకు ఎంతవఱకు ఆవశ్యకమో అంతవఱకే పొందుచున్నాడు

నీకు కర్మలయందు తప్ప ఫలములయందు ఎప్పుడును అధికారము లేదు. చేయుచున్న కర్మఫలములకు నీవు హేతువు కారాదు. కర్మలు చేయకుండుటయందును నీకు ఆసక్తి యుండరాదు. ఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను సముడవై యోగమునం దుండి కర్మలను చేయుము. సమత్వమే యోగము. కేవల కర్మానుష్ఠానము కన్న ఈ యోగముతో కూడిన కర్మాచరణము చాల మిన్న. యోగబుద్ధి కలవాడు సుకృతదుష్కృతములను రెండింటిని ఇచ్చటనే వదలివేయుచున్నాడు కావున యోగమునకై పూనుకొనుము. యోగము కర్మలయందు కౌశలము. బుద్ధిశాలు లీ యోగమును అవలంబించి కర్మవలన కలుగు ఫలమును పరిత్యజించి జన్మబంధమునుండి ముక్తులై అమృతత్వమును పొందుచున్నారు.

అజ్ఞాన మను బురదనుండి నీ బుద్ధి ఎప్పుడు పైకి వచ్చునో అప్పుడు నీకు వినియుండిన దానియందు, ఇంకను వినవలసియున్న దానియందును విరక్తి కలుగును. ఒకచోట ఒకవిధముగా వేఱొకచోట మఱియొక విధముగా వినియుండుటవలన చంచలముగా ఉన్న నీబుద్ధి ఎప్పుడు ఆత్మవిషయమున నిశ్చయరూపమైన నిశ్చలత్వమును పొందునో, అట్లే ఆత్మస్వరూపధ్యానమునందు అచంచలముగా నిలుచునో, అప్పుడు నీవు యోగమును పొందుదువు".

శ్లో|| యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే |
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః |

శ్లో|| కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన |
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగో ఽస్త్వకర్మణి ||

శ్లో|| యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి |
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ||

శ్లో|| శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా |
సమాధా వచలాబుద్ధి స్తదా యోగ మవాప్స్యసి ||

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 26

## విజయప్రభ

"ఇది క్షత్రియులకు తెఱచియుంచిన స్వర్గద్వారమువంటిది" అని అర్జునుని యుద్ధము చేయుటకు ప్రోత్సహించిన కృష్ణుడు ఇప్పుడు స్వర్గభోగాదులను కోరవల దన్ని, వానిని ప్రశంసించుచు వేదప్రవచనము చేయువారు వేదతాత్పర్యము నెఱుంగని వారు (అవిపశ్చితులు) అని యుద్ఘాటించుట గమనింపదగియున్నది. కర్మప్రతిపాదకములైన వేదభాగములు స్వర్గాదిభోగములను గూర్చి చాల మనోహరముగ చెప్పుచున్న మాట నిజమే. కాని వేదములకు తాత్పర్యము అది కా దని భగవానుడు విశద మొనర్చుచున్నాడు. "నీవు చక్కగా చదువుకొన్నచో నీకు మంచి మిఠాయి పెట్టెదను" అని తల్లి బాలునకు చెప్పినప్పుడు, పిల్లవాడు అల్లరి చేయుచు ఆటలాడుచు తిరుగకుండ ఎట్లైనను చదువుకోవలె ననుటయే ఆమె యభిప్రాయము. కాని వానికి మిఠాయి పెట్టుట ఆమె తాత్పర్యము కాదు. అట్లే వేదమాత కూడ ఐహికభోగములయందు ఐశ్వర్యమునందు సహజముగా ఆసక్తులై యుండు మానవులను, వాని నుండి తప్పించుట కొఱకే, స్వర్గభోగములను వానికి సాధనములైన యజ్ఞాదిక్రియాకలాపములను ప్రశంసించుచున్నది. వేట జూదము మగువ మద్యము మొదలగు వానియందు ఆసక్తులైయున్న వారికంటె వేదవిహితములైన కర్మలను స్వర్గభోగాదులను ఆసించి

చేయువారు ఎన్నో రెట్లు అధికులు సందేహము లేదు. కాని వారు ఆమెట్టు మీదనే యుండి స్వర్గమునకు పోయి, పుణ్యమున్నంతవఱకు భోగముల ననుభవించి, మరల ఈ లోకమున జన్మించి యజ్ఞములు చేసి స్వర్గమునకు పోవుచు, రాకపోకలు చేయుచుండుట వేదమాతకు అభీష్టము కాదు. వారు ఎప్పటికైనను విరక్తి నొంది ఆత్మజ్ఞానమును సంపాదించుకొని అమృతత్వమును పొందవలయు ననుటయే సకల వేదములకు తాత్పర్యము అప్పటికి అర్జునుని యర్హతనుబట్టి స్వధర్మాచరణమును ప్రోత్సహించుచు స్వర్గమును ప్రశంసించినను శ్రీకృష్ణుడు, ప్రేమాస్పదుడైన శిష్యునకు వత్సలుడైన గురువు సామాన్య విషయములనే కాక ఉత్తమములైన శాస్త్రరహస్యములను కూడ ఉపదేశించునట్లు, స్వర్గభోగములే పరమ లక్ష్యములు కావని, ఫలాపేక్షలేని కర్మాచరణము అమృతత్వమునకు సాదన మని చెప్పుచున్నాడు.

ఈ దృష్టితో ఆయన వేదవిహితములైన కర్మలయొక్క ఉపయోగ మెట్టిదో వివరించినాడు. ఉదపాన మనగా బావివంటి చిన్న జలాశయము. దానియందు స్నానపానాద్యనుష్ఠానము లన్నియు జరిగిపోవును. అంతకు మించి పుష్కలమైన జలముగల సరస్సు నది మొదలగు వానియందు కూడ మన స్నానపానాదులకు క్కావలసినంత జలమునే ఉపయోగించుకొనగలము కాని, ఆ జలము నంతను వాడుకొనలేము. అట్లే వివేకము కలవాడు వేదములలో వందలకొలదిగా ఎన్ని కర్మవిశేషములు వర్ణింపబడియున్నను తన వర్ణమునకు ఆశ్రమమునకు నిత్యనైమిత్తికములుగా అవశ్యాచరణీయములుగా విహితములైన వానిని మాత్రమే గ్రహించును. వానిని కూడ ఫలాపేక్ష లేకుండ కర్తవ్యమాత్రములనుగా నిర్వహించును.

"యావానర్థ ఉడపానే" అని మొదలగు శ్లోకమునకు పైయర్థము గాక పెద్దలు మఱియొక యభిప్రాయమును ఇట్లు వ్యక్తీకరించుచున్నారని నీలకంఠాచార్యుడు చెప్పినాడు. బావి మడుగు మొదలగు చిన్న జలాశయములందు ఏయే ప్రయోజనములు సిద్ధించుచున్నవో అవి యన్నియు ఒక్క పెద్ద సరస్సునందో నదీ ప్రవాహమునందో లభించుచున్నట్లే, వేద ప్రతిపాదితములైన స్వర్గాదిభోగములవలన కలుగు సుఖ మంతయు, తత్త్వజ్ఞునకు ఆత్మజ్ఞానమువలనకలుగు నానందమునందే లీనమగుచున్నది. కావున ఐశ్వర్యము స్వర్గము మొదలుగా ఒక్కొక్క పలముకొఱకు భిన్నభిన్నములైన ఎన్నో కర్మల ననుష్ఠించుచు శ్రమపడుటకంటె సకల సుఖములకు నిదానమైన యమృతత్వమును ఆత్మజ్ఞానమువలన సంపాదించుకొనుట వివేకవంతుని లక్షణము.

"నీకు కర్మలయందు తప్ప, ఫలములయందు ఎప్పుడును అధికారము లేదు" అని భగవానుడు మనము చేయుకర్మలయొక్క ఫలములు కేవలము మనయధీనములో లేవని ఈశ్వరాధీనము లను విషయమును స్పష్టము చేయుచున్నాడు. మన కార్యదక్షతవల్లనే మనము ఎన్నో కార్యములను సాధించుకొనుచున్నా మని అనేకులు భావించుచున్నారు. చాలసందర్భములలో మనప్రయత్నములవల్లకార్యములు సిద్ధించుచుండుట ప్రత్యక్షమే.

పురుషప్రయత్నము కార్యసాధనమున అత్యంతము ఆవశ్యక మనుట సత్యమే. కాని కొన్ని సందర్భములలో మనము ఎంత యత్నించినను కార్యము సిద్ధింపకుండుట కూడ అందఱకు తెలిసినదే. అప్పుడు మాత్రము, "మన దే మున్నది ? అంతయు ఈశ్వరాధీనము" అని చెప్పుచుందుము. కాని కార్యములు సిద్ధించినప్పుడు కూడ ఈశ్వరాధీనముగానే అవి పలించిన వని మనము గ్రహింపవలసియున్నది.

ఫలములు మన యధీనమందు లేనప్పుడు వానిని గూర్చి ఆలోచించుచుండుట కాని, వానిని అభిలషించుచు కార్యములకు పూనుకొనుట కాని యుక్తము కాదు. కళాశాలయందు చేరిన విద్యార్థి శ్రద్ధతో శక్తినంతయు విద్యాభ్యాసమునందు వినియోగింపవలయునే కాని పరీక్షలనుగూర్చి అప్పటి ఫలితములనుగూర్చి ఆలోచించుటవలన ప్రయోజన మేమున్నది ? పరీక్షలు అనుకూలముగ జరుగ వేమో యని తోచినప్పుడు క్రుంగిపోవుట, అవి అనుకూలముగనే యుండునని తోచినప్పుడు పొంగిపోయి ఏమఱుపాటు నొందుట సంభవించును. అందువలన ఫలితములను గూర్చి భావించుచుండట నిష్ప్రయోజనము.

భగవానుడు దీనికి పైమెట్టును నిర్దేశించుచు "పలము హేతువుగా నుండు కార్యము కలవాడవు కావద్దు" అని చెప్పుచున్నాడు. (మా కర్మ ఫల హేతు ర్భూః - కర్మ ఫల హేతుః (త్వం) మా భూః - యస్య కర్మ పల హేతుః భవతి, సః కర్మ పల హేతుః) అనగా పలము నుద్దేశించి కర్మను చేయువాడవు కాకుము అని యర్థము. కామ్యములు, పలాభిప్రాయగర్భిత కర్తవ్యములు, కర్తవ్యములు అని వైదిక కర్మలు మూడు విదములుగా నున్నవి. కేవలము పలాపేక్షతో చేయు పుత్రకామేష్టి తపోవ్రతాదులు కామ్యములు. ఇవి తప్పక చేయవలసినవి కావు. చేయకున్నచో కలుగు దోషమేదియు నుండదు. వర్ణాశ్రమధర్మముల ననుసరించి వ్యక్తులకు విహితములైన యాదేశములు, "తల్లిని దేవతగా కలిగి యుండుము, ఆచార్యుని దేవునిగా కలిగియుందుము. అతిథిని దేవునిగా కలిగియుండుము" మొదలగునవి, సంధ్యావందనాది నిత్యనైమిత్తికములు, కర్తవ్యములు. (మాతృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిదిదేవో భవ) తల్లిదండ్రులు మొదలగువారిని సేవించువా రందఱును అది కేవలము కర్తవ్యమను తలంపుతో నుండరు. వారిలో నూటికి తొంబది మంది, అప్పుడు కాకున్నను తరువాత నైనను, ఏదేని లాభము కీర్తి మొదలగు పలములు కలుగు ననియే ఆసించుచుందురు. వారి పలాభిలాష ప్రకటము గాక గర్భితముగానుండును. అందువలన వారు చేయు కార్యములు ఫలాభిప్రాయ గర్భితములైన కర్తవ్యములు

వేలమందిలో ఒకానొకడు మాత్రమే, "ఇది నాకు శాస్త్రవిహితమైన కర్తవ్యము, కావున చేయుచున్నాను, ఫలము ఎంత ప్రతికూలముగా నున్నను నేను దీనిని తప్పక నిర్వహింతును" అని శాస్త్రవిహితములైన యాదేశములను కేవల కర్తవ్యదృష్టితో అనుష్ఠించును. తండ్రియౌవరాజ్యము నిత్తునన్నప్పుడు దానిని స్వీకరించుటకు

సిద్ధపడినట్లే రాముడు ఆయనవలన అడవికి పోవలసివచ్చినప్పుడు కూడ తండ్రిమాటను పాటించుట ఆవశ్యకకర్తవ్యముగా భావించెను. ఈవిషయమునే ఆయన కైకేయి యొద్ద "కేవలముగా ధర్మమును అవలంబించియున్న నన్ను ఋషులతో తుల్యునిగా గ్రహింపుము" అని చెప్పెను. (విద్ధి మాం ఋషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్) దీనినిబట్టి ధర్మమును కేవలకర్తవ్యబుద్ధితో అనుష్ఠించువారు ఋషులతో సమానులని స్పష్టమగుచున్నది. కావున అర్జునుడు కూడ కేవలకర్తవ్య దృష్టితో ఋషులవలె శ్రీరామునివలె స్వధర్మమును ఆచరింపవలయునని భగవానుడు చెప్పుచున్నాడు.

"ప్రయోజనము లేకుండ బుద్ధిహీనుడు కూడ ప్రవర్తింపడు" (ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే) అను న్యాయము ననుసరించి ఫలాపేక్ష లేకున్నచో ఎవనికైనను ఏ పనియందైనను ఉన్ముఖత్వము ఉత్సాహము ఎట్లు కలుగును అని ప్రశ్నింపవచ్చును. కర్తవ్యములయందు సంకల్పబలముతో దృఢనిశ్చయముతో ఉన్ముఖత్వమును ఉత్సాహమును పొంది ఆకార్యములను యథావిధిగా నిర్వహింపవలసినదే. సోమరితనముతో ఊరకుండుట కాని అశ్రద్ధతో ఎట్లో చేయుటకాని తగదు. కర్తవ్యలోపమున పాపము సంభవించును. అందువలన సోమరితనమునందు ఆసక్తి నొందరాదు.

ఫలమును గూర్చిన భావనయే లేకుండ కేవల కర్తవ్యదృష్టితో స్వధర్మమును అనుష్ఠించుచున్నప్పుడు జయములు అపజయములు సుఖములు దుఃఖములు ఎన్నో సంభవించుచుండును. అట్లే చిత్త శుద్ధి కలుగవచ్చును. కలుగక పోవచ్చును. ఈ ద్వంద్వములయందు పొంగుట కాని క్రుంగుట కాని లేక, సమచిత్తముతో నుండుటయే యోగము. చిత్తమును ఇట్లు సమస్థితిలో నిలుపుకొనుచున్నాను, "ఇతరులు ఫలములకై ఆసించుచుండగా నేను మాత్రము ఫలములు కోరక సమబుద్ధితో కర్మల ననుష్ఠించుచున్నాను", అను నిట్టి తలంపులు కలుగుచునే యుండును. సమత్వయోగమం దున్నవాడు ఈ కర్తృత్వసంబంధమును కూడ త్యజించి కర్మలను అనుష్ఠింపవలె. (యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా) తితీక్షతో చిత్తసమత్వముతో, "నేను చేయుచున్నాను" అను కర్తృత్వభావనను కూడ పరిత్యజించిన యోగికి వివిధములైన కర్తవ్యములను నిర్వహించునప్పుడు సంభవించు సుకృతము, దుష్కృతము ఫలముల నొసంగవు. అట్టివాడు తండ్రి యాదేశమున గొప్పయాగమును అనుష్ఠించినను వానికి స్వర్గమునకు పోవలసిన పనియుండదు. అట్లే, రాముడు తాటకను సంహరించినట్లుగా అతడు గురువుయొక్క ఆదేశమున గోహత్య కావించినను నరకమునకు పోవలసిన పనియుండదు. యజ్ఞమునందు సాధనములైన స్రుక్స్రువములకు ఆ సుకృతఫలముతో, సంహారమునందు సాధనమైన యాయుధమునకు ఆ దుష్కృతఫలముతో ఎట్లు సంబంధము లేదో, అట్లే సమత్వయోగ మందున్న వానికి కూడ ఫలములతో సంబంధము ఉండదు. పుణ్యపాపములను కలిగించి కర్తను జన్మపరంపరలలో

బంధించుట కర్మలకు లక్షణము. అట్టి కర్మలను ఆచరించుచుండియు వానివలన ఏర్పడు జన్మబంధమునుండి తప్పించుకొనగలుగుటయే కర్మాచరణమునందు కౌశలము ఇదియే యోగము. అనగా యోగమునకు ఫలము.

ఈ యోగఫలము అమృతత్వసిద్ధికి ప్రముఖసాధనము యోగభ్యాసమున కామక్రోధాదులు అహంకారమమకారములు తొలగి చిత్తశుద్ధి కలుగుచున్నప్పుడు, ఆత్మస్వరూపమును ఆవరించియున్న యజ్ఞానము క్రమముగా తొలగిపోవును. అప్పుడు శాస్త్రము ననుసరించి ఆచార్యుడు ఉపదేశించిన యాత్మస్వరూపమును గూర్చి, "ఇదియే ఆత్మతత్త్వము, ఇదియే పరమగమ్యము, ఇంతకు మించినది ఏదియు లేదు" (సా కాష్ఠా సా పరాగతిః) అను నిశ్చయము కలుగును. అప్పటివఱకును దర్మమునుగూర్చి ఎంతోమందివలన వినియున్న వివిద విషయములందు, ఇంకను వినవలయు నని తలంచుచున్న విషయములందును ఆసక్తి నశించును. పరీక్షలలో ఉత్తీర్ణుడైనవానికి అప్పటివఱకు జదివియుండిన గ్రంధములందు, దానికి సంబంధించి ఇంకను చదువక పోయితినే అను తలంచుచున్న గ్రంధములందును ఎట్లు అశ్రద్ధ కలుగునో అట్లే ఆత్మతత్త్వమున నిశ్చయ మేర్పడినవానికి సకల శాస్త్రములయందును అనాదరము కలుగున్ను(తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ).

అట్లు నిశ్చయము కుదిరినవానికి తాను నిశ్చయించుకొన్న యాత్మతత్త్వము యొక్క మననమువలన నిదిధ్యాసనము సిద్ధించును. ధ్యానింపవలయు నను నిచ్ఛ దిధ్యాస. నిరంతరము ద్యానింపవలయు నను నిచ్ఛ నిదిద్యాస. ఆ ధ్యానమే సమాధి అప్పటివఱకు చంచలముగా నున్న మనస్సు ఆ సమాధియందు అచంచలముగా నిలుచును. అప్పుడు అతడు ఆత్మస్వరూపముతో యోగమును, అనగా కూడియుండుటను లేక తాదాత్మ్యమును పొందును. (సమాధావచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి). ఇది సాంఖ్యమునకు ఫలస్వరూపము.

## (iv) స్థితప్రజ్ఞ చమసము

## గీత

ఇది విని అర్జును డడిగినాడు "కృష్ణా! స్థితప్రజ్ఞుడై సమాదియందున్న వానిని ఎట్లు పలుకరించవలె ? అతడు సమాధిని వీడిన తరువాత ఏ విదముగా మాటాడును ? ఎట్లు కూర్చుండును ? ఏరీతిగా సంచరించును?"

భగవాను డిట్లు సమాధానము చెప్పెను. "అర్జునా సకల కామములను వీడి సాధకుడు తన స్వరూపము చేతనే సంతుష్టుడై యున్నప్పుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును. రాగభయక్రోధరహితుడై అతడు దుఃఖములు వచ్చినప్పుడు ఉద్వేగమును, సుఖములు

కలిగినప్పుడు వానియందు కోరికను పొందడు ; శుభమును అభినందింపడు అశుభమును ద్వేషింపడు. అవయవములను వెలుపలనుండి లోపలికి లాగుకొను తాబేలువలె అతడు విషయములనుండి ఇంద్రియములను వెనకకు మరలించుకొని యుండును. ఆహారములేని వానికి కూడ ఇంద్రియములు విషయములపై నుండి వెనుకకు మరలి పోవు నను మాట నిజమే. కాని వానికి విషయములపై అనురాగము నశింపదు. స్థితప్రజ్ఞుని స్థితి అది కాదు. పరమాత్మసాక్షాత్కారమును పొందియుండుటచే, అతనికి చిత్తము రాగము కూడ ఇంద్రియములతోపాటు నివృత్తమగును.

యోగమున సిద్ధిని సాధించుటకు యత్నించుచున్న పండితుని మనస్సును కూడ ఇంద్రియములు మిగులవేగముతో విషయములవైపు లాగుచుండును. వాని నన్నింటిని నిగ్రహించి మనస్సును నాయందు నిలుపవలయును. ఇంద్రియములు వశపడినప్పుడే అతడు స్థితప్రజ్ఞుడగును.

విషయములను భావించువానికి వానియందు ఆసక్తి కలుగును. దానివలన కామము కలుగను. కామము వలన క్రోధము జనించును. క్రోధమునుండి మోహము కలుగును. దానివలన శ్రవణమొనర్చిన శాస్త్రార్థము భ్రంశము నొందును. ఆభ్రంశమువలన బుద్ధినశించును. బుద్ధినాశమువలన సాధకుడు వినాశము నొందును.

వ్యవహరించుచున్నప్పుడు సాధకుడు మనస్సును తనకు విధేయమగునట్లు చేసికొని, దానికి లోబడినవియు, రాగద్వేష వియుక్తములను అయిన ఇంద్రియములతో విషయములందు ప్రవర్తించుచున్నచో ప్రసన్నతను పొందును. చిత్తము ప్రసన్నమైనప్పుడు సర్వదుఃఖములు తొలగిపోవును. ఆ ప్రసన్నతవలననే బుద్ధి చక్కగా నిలిచియుండును.

యోగమును అభ్యసింపనివానికి శాస్త్రార్థమునందు బుద్ధి నిలువదు. ధ్యానముతో సమాధిని అభ్యసింపనివానికి ఆత్మస్వరూపభావన కుదరదు. ఆ భావన లేనివానికి దుఃఖములు శమింపవు. శాంతి లేనివానికి సుఖ మెక్కడిది ?

అహంకార మమకారములు లేక దేనియందును అభిలాష నొందక సకల కామములను వీడి చరించువాడు శాంతిని పొందుచున్నాడు. అర్జునా ! ఇది బ్రహ్మవేత్తయొక్క స్థితి. దీనిని పొందినవాడు మోహము నొందడు. అంతకాలమునందైనను ఈస్థితిని పొందినవాడు అమృతత్వమును పొందును".

## విజయప్రభ

స్థితప్రజ్ఞుని లక్షణములను విన్నంతనే అర్జునుడు విస్మితుడై ప్రశ్నించుట గమనింపదగియున్నది. గాఢమైన తపస్సుచేత అర్జునుడు కూడ పరమేశ్వరుని

సాక్షాత్కరింపజేసికొని వరములను పొందినవాడే కాని సామాన్యుడు కాడు అతని కెప్పుడును ఈ లక్షణములు మనస్సునకు రాలేదు. అతడు గొప్పతాపసులను బ్రహ్మర్షులను కూడ చూచియున్నాడు. వారిలో ఎవ్వరును ఈ లక్షణములు కలవారుగా అతనికి తోచుటలేదు స్థితప్రజ్ఞ డనగా వీరందరికంటెను విలక్షణముగా ఏయడవిలోనో ఆశ్రమములోనో ఏకాంతముగా సమాధియందుండు నొకానొక యద్భుత వ్యక్తి యని అర్జునుడు భావించుచున్నట్లు ఆతని ప్రశ్నలవలన వ్యక్త మగుచున్నది. అంతే కాదు తనకు అప్పుడు ఉపదేశించుచున్న శ్రీకృష్ణుడు స్థితప్రజ్ఞుడని అతనికి తోచలేదు. అట్లు తోచియున్నచో "నీవు స్థితప్రజ్ఞుడవే కదా! ఈ స్థితిని ఎట్లు పొందితివో చెప్పుము" అని యడిగియుండెడివాడు. శ్రీకృష్ణునివంటివారు సామాన్యులతో కలిసిమెలసి సంసారులవలె వ్యవహరించుచున్నప్పుడు వారియొక్క స్థితప్రజ్ఞత్వమును గుర్తించుట ఎంత దుర్ఘటమో ఈ సన్నివేశమువలన స్పష్టమగుచున్నది.

ద్రౌపదీస్వయంవర సమయమునుండి కురుక్షేత్ర యుద్ధమువఱకు సుమారు ఏబది సంవత్సరములు అర్జునుడు శ్రీకృష్ణునితో స్నేహము కలిగియుండెను. ఆయనను గూర్చి తమకంటె అధికముగా దివ్యశక్తులు కలవాడని, ఆవేశమును పొందడని, ఆలోచనాదక్షుడని ప్రశంసాభావమే కాని ఆయన యోగీశ్వరుడు బ్రహ్మవేత్త అను తలంపు అర్జునునకు కలుగ లేదు. అందువల్లనే ఇప్పుడు కూడ ధర్మసందేహమును తీర్చు మని యడిగినాడే కాని తత్త్వమును ఉపదేశింపు మని ప్రార్థింప లేదు.

భీష్మాదులయందున్న గాఢమైన యనురాగము చేత మమకారముచేత వారితో పోరాడుటకు తనమనస్సు ఉన్ముఖ మగుట లే దని, వారితో పోరాటమును విరమించుకొని వెడలిపోవుట శ్రేయస్కర మగునా కాదా అని మాత్రమే అర్జునుడు అడిగెను. అంతటితో ఊరకొనక, "నేను యుద్ధము చేయను" అని శరచాపములను వదలి యుద్ధము చేయకుండుటయే తనయభీష్టమని వ్యక్తము చేసెను. ఇట్టియెడల, "క్షత్రియుడవైన నీకు స్వధర్మము యుద్ధమే, కావున యుద్ధము చేయక తప్పదు" అని శ్రీకృష్ణుడు రెండు వాక్యములలో అతనికి సమాధానము చెప్పియూరకొనక ఇంత తత్త్వబోధ ఎందులకు చేసినాడు ?

ఇంతమాత్రపు సమాధానము అర్జునునకు కూడ తెలియును. కాని తీవ్రమైన శోకము అతని బుద్ధిని ఆక్రమించి స్వధర్మమైన యుద్ధమును అధర్మకృత్యమునుగా, అధర్మమైన భిక్షావృత్తిని ధర్మవర్తనముగా తోచునట్లు చేసి అతనియందున్న కర్తవ్యపరత్వమును అడ్డగించుచున్నది. ఆసమయమున కృష్ణుడు కేవలముగా ధర్మనిర్ణయమును మాత్రమే గావించుచు యుద్ధము చేయవలసినదే అని అతనిని శాసించినచో, అతడు ఆయనుశాసనమును అతిక్రమింప లేక తప్పనిసరిగా యుద్ధమునకు పూనుకొన్నను, ఆ నిర్వేదము దుఃఖము అతనిని వెంటాడుచునే యుండును. అందువలన అతడు వెనుకటివలె విక్రమింపలేక భీష్మాదులవలన భంగపడవచ్చును. ఎంతో

ఉపదేశింపబడిన తరువాత కూడ అర్జునుడు యుద్ధమునందు నిర్వేదమునకు లోనగుచున్నప్పుడు కృష్ణుడు చక్రమును ధరించి "నేనే శత్రువులను వదింతును, నీకు చేతగాకున్నచో చూచుచుండుము" అని అతనియందు రోషమును రెండుపర్యాయములు ఉద్దీపింపజేయవలసివచ్చెను. కావున ఈసందర్భమున ధర్మనిర్ణయమును కావించి శాసించుటకంటె అతని శోకమును నివారించుటయే శ్రీకృష్ణునకు అవశ్యకర్తవ్య మయ్యెను

అర్జునుని కర్తవ్య వైముఖ్యమునకు మూలము హృదయదౌర్బల్యమును కలిగించుచున్న శోకము. "వీరు నా వారు" అను మమకారము ఆశోకమునకు మూలము. ఆత్మతత్త్వము నెఱుంగకుండుటయే మమకారమునకు పునాది. ఆయజ్ఞానము ఆత్మజ్ఞానముచే గాని తొలగదు. అజ్ఞానము తొలగినచో మమకారము క్షీణించును. మమకారము నశించినచో శోకముండదు. శోకము తొలగినంతనే కర్తవ్యపరత్వము మబ్బులోనుండి వెలుపలికి వచ్చిన సూర్యబింబమువలె ప్రదీప్తమగును. అప్పుడే అర్జునుడు ఉత్సాహదీపితుడై విక్రమింపగలడు. అందువలన అర్జునుడు ధర్మసందేహమును మాత్రమే అడిగినను శ్రీకృష్ణుడు ఆత్మతత్త్వమును ఉపదేశించుటకు ఉద్యుక్తుడయ్యెను. దీనిని గమనింపక పండితులు కొందఱు శ్రీకృష్ణుడు అర్జునునకు కర్మయోగమునే ప్రధానముగా బోధించె నని, అదియే భగవద్గీతకు తాత్పర్య మని సిద్ధాంతములు చేయుచుండుట శోచనీయము. "ఫలాభిలాష లేకుండ కర్తవ్యమును నిర్వహింపుము" అని బోధించినంతమాత్రమున అర్జునుని శోకము పోదు. ఆత్మతత్త్వము నుపదేశించిననే తప్ప మమకారము శోకము తొలగవు. అందువలన భగవంతుడు అర్జునునకు ప్రధానముగా ఉపదేశించినది ఆత్మజ్ఞానమే యనుట నిస్సంశయము.

గృహస్థులయందు కూడ స్థితప్రజ్ఞు లుండవచ్చు నను విషయమును శ్రీకృష్ణుడు నేరుగా చెప్పకున్నను కొన్ని లక్షణముల చేత వ్యక్తీకరించినాడు. "దుఃఖములు వచ్చినప్పుడు ఉద్వేగమును, సుఖములు కలిగినప్పుడు వానియందు కోరికను పొందడు" (దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః), "రాగద్వేషవియుక్తములైన యింద్రియములతో విషయములందు ప్రవర్తించుచు" (రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్) అను మొదలగు వాక్యములచేత ఆయన సాంసారిక వ్యవహారములందు స్థితప్రజ్ఞులు పాల్గొనుచుండుటయు సంభవించు నని స్పష్టమొనర్చినాడు.

ఇంతే కాదు. "ఎవని సంగతియో ఎందులకు ? నేను చెప్పుచున్న యీ సాంఖ్యయోగములను అనుష్ఠించినచో నీవు కూడ స్థితప్రజ్ఞుడవు కాగలవు" అను భావమును ఆయన పెక్కు వాక్యములలో అనేకపర్యాయములు వ్యక్తమొనరించినాడు. **"యోగము నవలంబించి కర్మలు చేయుము" (యోగస్థః కురు కర్మాణి) "యోగమునకై యత్నింపుము" (యోగాయ యుజ్యస్వ) "అప్పుడు నీవు ఆత్మస్వరూపముతో**

కూడియుందువు" (తదా యోగ మవాప్స్యసి) అను మొదలగు వాక్యములచేత భగవానుడు, "ఈలోకమునందే ఈజీవితములోనే నీవు అమృతత్వమును పొందగలవు" అను భావమును దృఢముగా అర్జునునకు కలిగించుచున్నాడు. తత్త్వబోధయందు ఇది ఉత్తమమైన పద్ధతి.

లోకమునందు సాధారణముగా అనేకులు కుతూహలముతో, "జీవుని స్వరూప మేమి ? బ్రహ్మముయొక్క లక్షణ మేమి ? ముక్తి ఎట్లు కలుగును?" అని తటస్థముగా ప్రశ్నించుచుందురే కాని తీవ్రమైన నిర్వేదముతో, "ఈసంసారము దుఃఖమయముగానున్నది. దీనిని ఎట్లు తొలగించుకొనవలయునో తెలియుట లేదు. దయ యుంచి మీరు దీనిని నేను ఎట్లు తొలగించుకొనవలయునో బోధింపుడు" అని ఆర్తితో అడుగరు. గురువులు కూడ అనేకులు, "జీవుడు చిదాభాసుడు, బ్రహ్మము సచ్చిదానందము, జీవుడు ఆబ్రహ్మమునందు ఐక్యమొందుటయే ముక్తి" అని తటస్థముగా ఎవరికథనో చెప్పుచున్నట్లుగా బోధించుచుందురే కాని, "నీ స్వరూపమే బ్రహ్మము, నీవు ఎప్పుడును ముక్తుడవే, నీవు ఈవిషయమును ఇప్పుడే తెలిసికొని సకల దుఃఖములకు దూరుడవై మహానందమును పొందగలవు" అని యుపదేశింపరు. బ్రహ్మముయొక్క తటస్థలక్షణ మేమి, స్వరూపలక్షణమేమి ?" ఇత్యాది చర్చలతోనే వేదాంతశాస్త్రపాఠములు కూడ జరుగుచుండును. ఈ పరిస్థితివలన "బ్రహ్మవిద్య యనగా సామాన్యమా ? అది యందఱకు తెలియునా ? ఎన్ని జన్మలకో ఎప్పటికో ఎవరికో సుకృతాత్ములకు మాత్రమే ఆ బ్రహ్మసాక్షాత్కారము, ముక్తి, ఏ వైకుంఠములోనో కైలాసములోనో సంభవించును, కాని ఇప్పుడు ఇక్కడ మనకు అందునది కాదు" అని శిష్యులు గురువులు కూడ భావించుచుందురు.

ఉత్తముడైన గురువు తత్త్వవిషయముల నన్నింటిని శిష్యునకే అన్వయించి బోధించును కాని బ్రహ్మమన్నది ఎక్కడనో ఉన్నట్లు తటస్థముగా చెప్పడు. స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములందు ఆరంభముననే, "అర్జునా ! సకల కామములను వీడి సాధకుడు తన స్వరూపముచేత సంతుష్టుడైనప్పుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును" అని చెప్పుచు శ్రీకృష్ణుడు దుఃఖమును తొలగించి ఆనందమును గలిగించు బ్రహ్మము ఎక్కడనో లేదని మనయందే యున్నదని స్పష్టము చేయుచున్నాడు (ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్త దోచ్యతే) ఆత్మస్వరూపమున నిలిచియుండుటకు ఇంద్రియములను మనస్సును నిగ్రహించుట అత్యంతము ఆవశ్యక మని, స్థితప్రజ్ఞుని లక్షణము లన్నియు అందులకు అవలంబింపవలసిన యుపాయములే అని భగవానుడు స్పష్టము చేయుచున్నాడు

# 2. లోకసంగ్రహ కమండలువు

## (i) లోకోపకార చమసము

### గీత

స్థితప్రజ్ఞుని లక్షణములను విన్న వెంటనే అర్జునుడు ఇట్లు ప్రశ్నించెను. "కృష్ణా! నీ దృష్టిలో కర్మకంటె బుద్ధియే గొప్పదైనచో నన్ను ఘోరమైన యీయుద్ధకర్మమునందు ఏల నియోగించుచున్నావు ? రెండు విషయములను మిశ్రణముగా చేసి నాకు విభ్రాంతి కలిగించునట్లుగా మాటాడుచున్నావు. నేను దేనివలన శ్రేయస్సును పొందగలనో దానిని నిశ్చయించి చెప్పుము."

శ్రీకృష్ణుడిట్లనెను. "సాంఖ్యులకు జ్ఞానయోగముతో యోగులకు కర్మయోగముతో ఈనిష్ఠను వెనుక చెప్పితిని. కర్మలను ఆరంభింపనంతమాత్రమున ఎవనికైనను నైష్కర్మ్యము సిద్ధింపదు, సన్న్యసించినంత మాత్రమున జ్ఞానసిద్ధి కలుగదు.

సకల కర్మలను త్యజించి యూరకుండుట ఎవ్వనికిని సాధ్యము కాదు. ప్రతివ్యక్తిని వాని ప్రకృతియందలి గుణములు పట్టుకొని బలవంతముగా వానిచేత పని చేయించుచునే యుండును. కర్మేంద్రియములను నిగ్రహించి మనస్సును నిలుపలేక విషయములను భావించుచుండు మూఢుడు మిథ్యాచారుడని చెప్పబడును. మనస్సుచేత జ్ఞానేంద్రియములను నిగ్రహించి కేవలము కర్మేంద్రియములతో కర్మయోగమును అవలంబించువాడు గొప్పవాడు. నీకు నియమింపబడిన కర్మను నీవు చేయుము. ఊరకుండుటకంటె నియతమైన కర్మను చేయుచుండుట చాల మేలు. ఏపనియు చేయకున్నచో జీవనమైనను ఎట్లు జరుగును ?

యజ్ఞముకొఱకు చేయునవి తప్ప తక్కినకర్మలు బంధకము లగును. కావున నీవు యజ్ఞనిమిత్తముగా కర్మలను ఫలాభిలాషను వీడి చేయుము. యజ్ఞములతో కూడ ప్రజలను సృష్టించి బ్రహ్మదేవుడు పూర్వమిట్లు ఆదేశించెను " ఈయజ్ఞము మీకు కామధేనువువలె, కోరిన కోరికలను ఒసంగును మీరు దీనితో దేవతలను పూజింపుడు. వారు మీకు ఇష్టములైన భోగములను ప్రసాదింతురు. వారివలన పొందినపదార్థములను యజ్ఞములందు వారికి అర్పింపక భుజించువాడు దొంగయే యగును యజ్ఞములందు దేవతల కర్పింపగా మిగిలిన పదార్థములను అనుభవించువాడు సకల పాపముల నుండి ముక్తుడగును ఎవడు తనకొఱకే వండుకొని తినుచున్నాడో వాడు పాపమునే భుజించుచున్నాడు. యజ్ఞమువలన మేఘములు, వానివలన అన్నము, అన్నమువలన సకలప్రాణులు సంభవించుచున్నవి. ఈ యజ్ఞచక్రమును వర్తింపజేయని యింద్రియలోలుని జీవితము వ్యర్థము, పాపభూయిష్ఠము

ఆత్మజ్ఞానముచేత సంతృప్తుడైన వానికి మాత్రము కర్తవ్య మేదియు నుండదు ఒకపని చక్కగా జరిగినప్పుడుగానీ జరుగక పోయినప్పుడు గాని అతనికి కలుగు ప్రయోజన మేదియు నుండదు. అతడు ఏ పనికొఱకు ఎవనిపైనను ఎప్పుడును ఆధారపడడు.

(నీవు అట్టి ఆత్మజ్ఞాన సంతుష్టుడవు కావు) కావున నీవు నీకు విహితమైన కార్యమును ఆసక్తి లేకుండ చేయుచుండుము. ఆసక్తిరహితుడై కర్తవ్యమును నిర్వహించు పురుషుడు (క్రమముగా) పరమపదమును పొందును.

జనకుడు మొదలగువారు కర్మాచరణముతోనే సంసిద్ధిని పొందియున్నారు. నీవు లోకసంగ్రహమును గమనించి యైనను కర్మను ఆచరింపవలసి యున్నది. సమాజమున శ్రేష్ఠుడైనవాడు ఎట్లు ఆచరించునో ఇతరులు కూడ అట్లే ఆచరింతురు. అతడు దేనిని ప్రమాణముగా ఏర్పఱచునో లోకము దానినే అనుసరించును.

నాకు మూడులోకములలో పొందవలసినది ఏదియు లేదు. కావున నాకు కర్తవ్యము లేదు. అయినను కర్మమును ఆచరించుచునే యున్నాను. నేను చుఱుకుదనముతో నాకు విహితమైన కార్యమునందు వర్తింపకున్నచో మనుష్యులు సకలవిధముల నాపద్ధతినే అవలంబింతురు. నేను కర్మచేయకున్నచో సంకరమునకు కర్తనగుచు ఈప్రజలను హింసించినవాడ నగుదును; ఈ లోకములు నశించును.

అర్జునా! ఆసక్తితో అవిద్వాంసులు కర్మలను ఎట్లు చేయుచుందురో అట్లే విద్వాంసుడు కూడ లోకసంగ్రహమును చేయగోరుచు అసక్తుడై చేయుచుండవలయును. కర్మలయందు ఆసక్తులై యున్న యజ్ఞులకు కర్తవ్యబుద్ధియందు విద్వాంసుడు భేదమును కలిగింప రాదు. అందులకై అతడు తనకు విహితములైన సకల కర్మలను యోగము నవలంబించి ఆచరించుచుండవలె. (అజ్ఞాని జ్ఞాని ఒక విధముగానే కర్మలను ఆచరించుచున్నట్లు కన్పించుచుందురు. కాని వారి చిత్తవృత్తులయందు చాలబేదముండును). కర్మలు ప్రకృతియొక్క గుణములచేత జరుపబడుచుండగా అజ్ఞుడు మూఢుడై, "నేను చేయుచున్నా"నని భావించుచుండును. కాని గుణవిభాగముయొక్క కర్మవిభాగముయొక్క తత్త్వము నెఱింగినవాడు ఒకవిధమైన గుణములు మఱియొక విధమైన గుణములందు వర్తించుచున్న వని తలంచుచు వానియందు ఆసక్తి నొందడు.

ఆత్మస్వరూపమునందు నిమగ్నమైన బుద్ధితో నీవు సకలకర్మలను నాయందుంచి వానియందలి యాశను మమకారమును వీడి ఉద్వేగరహితుడవై యుద్ధమొనరింపుము.

అసూయారహితులై శ్రద్ధావంతులై ఎల్లప్పుడు నా యీ మతమును అనుష్ఠించువారు (నీతో పాటు ఇతరులు) కూడ కర్మలనుండి ముక్తు లగుదురు. అసూయతో నా యీ మతమును అనుష్ఠింపని వారు వివేకశూన్యు లని, సర్వజ్ఞాన విమూఢు లని, వినాశము నొందుదు రని యెఱుంగుము.

స్థితప్రజ్ఞుని లక్షణములు విన్నంతనే అర్జునునకు పెద్ద సందేహము కలిగినది. సాంఖ్యయోగము చేత కలుగునట్టి బ్రాహ్మీస్థితి, కర్మాచరణరూపమైన యోగము కంటె చాల గొప్ప దని స్పష్ట మగుచున్నది. అట్టియెడల శ్రీకృష్ణుడు గొప్పదియైన సాంఖ్య బుద్ధి నవలంబింపు మని చెప్పక తక్కువదియైన కర్మయోగమును ఆచరింపు మని ఎందులకు చెప్పవలె ? సాంఖ్యబుద్ధిని అవలంబించుటకు అర్జునునకు అర్హత లేదని ఆయన తలంచుచున్నచో, "నీకు సాంఖ్యమునందు ప్రవేశించుటకు అర్హత లేదు. కావున నీవు కర్మయోగమునే అవలంబింపవలె" అని నిశ్చితముగా చెప్పియుండవలసినది. అట్లు చెప్పక పోగా ఆయన పూర్వాపరవిరుద్ధముగా ఇట్లు చెప్పియున్నాడు. "వేదములు త్రిగుణములకు సంబంధించిన విషయములను చెప్పుచున్నవి. నీవు త్రిగుణ విషయసంబంధమును వీడి ద్వంద్వ రహితుడవై యోగక్షేమములను తలంపక ధీరుడవై ఎల్లప్పుడు సత్త్వమునం దుండుము" అని ఆయన కర్మలను వీడు మని ముందు చెప్పినాడు.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భ వార్జున।
నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ 45

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయము - 26

వెంటనే ఆయన, "యోగమునం దుండి కర్మలను చేయుము" (యోగస్థః కురు కర్మాణి .... శ్లో. 48) అని కూడ చెప్పినాడు. మఱి అర్జునుడు త్రిగుణవిషయములైన కర్మలను చేయవలెనా మానుకోవలెనా ?

"నాకు విభ్రాంతి కలిగించునట్లుగా మాటాడుచున్నావు" (బుద్ధిం మోహయ సీవ మే... శ్లో. 2 అధ్యాయము - 27) అని అర్జునుడు, కృష్ణుడు తనకు భ్రాంతి కలిగించుటకై మాటాడుట లే దని, ఆయన చెప్పినది నిశ్చితముగానే యున్నను, తానే అర్థము చేసికొనలేకున్నా నని వినయమును ప్రకటించుచున్నాడు. వాత్సల్యముతో ఉపదేశింపబూనుకొన్నవాడు సందిగ్ధముగా నేల చెప్పును ?

శ్రీకృష్ణు డిట్లు సమాధానము చెప్పెను. నిష్ఠయనగా బ్రహ్మనిష్ఠ లేక బ్రాహ్మీస్థితి. ఇది ఒక్కటే. కాని ఇది ద్వివిధముగా నున్నది (ద్వివిధానిష్ఠా - శ్లో. 3. అధ్యాయము - 27) లోకమున బ్రాహ్మస్థితిని లేక ముక్తిని కోరువారు రెండు విధములుగా నున్నారు. పూర్వపుణ్యవశమున కొందఱు బాల్యమునుండియు విషయసుఖములకు వ్యవహారమునకు దూరులై తత్త్వవిచారమునందు ఆసక్తులై యుందురు. సంఖ్య అనగా జ్ఞానులు. తత్పరాయణులు సాంఖ్యులు. గురువులు వీరి చిత్తపరిపాకమును గుర్తించి వీరిని శ్రవణమననాది రూపమైన జ్ఞానకక్ష్యయందు ప్రవేశపెట్టుదురు. మఱి కొందఱు మోక్షము

కావలయు నను కోరిక యున్నను వ్యవహారప్రదానులై కర్మాచరణమునందు ఆసక్తులై యుందురు. అట్టివారికి గురువులు చిత్తశుద్ధికొఱకు కర్మయోగమును ఉపదేశింతురు. బాల్యమునుండి విరక్తులైన శుకుడు మొదలగువారు సాంఖ్య లని వారు జ్ఞానయోగమునకు అర్హు లని, నిరంతరము కర్మాచరణమునందు నిమగ్నులై యుండు అర్జునుడు మొదలగువారు కర్మయోగమునకు అర్హు లనుట శ్రీకృష్ణుని యభిప్రాయము. అట్లయినచో ఆయన ఆమాటను సూటిగా చెప్పవచ్చును కదా! ఆత్మజ్ఞానమునుగూర్చి ఆయన ఇంత విశేషముగా చెప్పవలసినపని యేమున్నది? అర్జునుని యొక్క శోకమును నివారించుటకు ఆత్మజ్ఞానము నుపదేశించుట ఆవశ్యక మగుట మొదటి కారణము జ్ఞానయోగము, కర్మయోగము పరస్పరసంబందమును కలిగియుండుట రెండవ కారణము అవిరెండును పరస్పరాపేక్షలేని బిన్న మార్గములు కావు యోగసంబంధము లేకుండ సాంఖ్యము, సాంఖ్యసంబందము లేకుండ యోగము ఉండవు సహజముగా చిత్తశుద్ధ కలిగిన సాంఖ్యయోగులకు కర్మయోగముయొక్క ఉపదేశము అనావశ్యకము అయినను వారు కూడ జీవయాత్రకై ఆవశ్యకములైన కర్మలను ఆచరించునప్పుడు సమత్వరూపమైన యోగబుద్ధి నవలంబించియే వర్తించుచుందురు. అట్లే కర్మయోగులు కూడ, అమృతత్వమును కోరుచున్నవారే కావట్టి, వీలైనప్పుడెల్ల ఉద్దిలపలన తత్త్వవిషయములను వినుచునే యుందురు. సాంఖ్యులవలె ఆత్మజ్ఞానము సునిశ్చితముగా ఏర్పడకున్నను, యోగులకు అది బుద్ధియందు మొదలుచు ముముక్షుత్వమును దృఢమొనర్చుచుండును. యుధిష్ఠిరుడు దర్మకర్మపరాయణుడై ధర్మముతోపాటు తత్త్వమునుగూర్చి కూడ వినుచునే యుండెను ఆ తత్త్వశ్రవణ మంతయు కర్మయోగమునకు బలమును కలిగించుచు క్రమముగా సాంఖ్యయోగసిద్ధికి అనగా అమృతత్వమునకు మార్గ మేర్పఱచు ననుటలో సందేహము లేదు

సాంఖ్యయోగసిద్ధి కలిగినచో, యుదిష్ఠిరుడు కాని అర్జునుడు కాని క్షత్రియవిహితములైన కర్మలను విడువవచ్చునా? స్థితప్రజ్ఞత్వము కలిగినను వారు వర్ణాశ్రమదర్మములను వదల రాదనియే శ్రీకృష్ణుని యభిప్రాయము అమృతత్వము జ్ఞానమువలన కలుగుచున్నదా కర్మత్యాగమువలన కలుగుచున్నదా? జ్ఞానమువలననే కైవల్యము కలుగు ననుట, వేఱొక మార్గము లే దనుట, సకల వేదాంతములకు సారాంశము. (జ్ఞానా దేవ తు కైవల్యమ్ నాన్యః పంథా విద్యతే౽యనాయ) కావున కర్మలను మానుకొన్నంత మాత్రమున అమృతత్వము కలుగ దనుట నిశ్చితము. అంతమాత్రమే కాదు కర్మలను ఆచరించుచున్నచో జ్ఞానమువలన కలిగిన యమృతత్వమునకు భంగము కలుగునా? నిశ్చితమైన యమృతత్వము లేక మోక్షము దేనివలనను భంగపడ దనుట కూడ నిశ్చితమే "ఇది బ్రాహ్మీస్థితి, అర్జునా దీనిని పొందినవాడు మోహమును పొందడు" (ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి..... శ్లో. 72 - అధ్యాయము - 26) అని శ్రీకృష్ణుడు స్పష్టమొనరించెను. కర్మాచరణముచేత ఆ స్థితికి భంగము కలుగునేమో యని ఎవనికైన తోచినచో వానికి

యథార్థముగా బ్రాహ్మీస్థితియే కలుగలేదనుట స్పష్టము. అట్టియెడల జ్ఞాని విహితములైన కర్మలను ఏల మానుకోవలె ?

ఈ విషయమునే భగవానుడు ఇట్లు ఉద్ఘాటించినాడు. **"కర్మలను ఆరంభింపనంత** మాత్రమున ఎవడైనను నైష్కర్మ్యము సిద్ధింపడు, సన్న్యసించినంత మాత్రమున జ్ఞానసిద్ధి కలుగదు"

శ్లో|| న కర్మణా మనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే|
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి || 4

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 27

నైష్కర్మ్య మనగా ఏపనియు చేయకుండ ఊరకుండుట ఒకయర్థము, కర్మలవలన కలుగు పుణ్యపాపములచేత సంభవించు సుఖదుఃఖములను పొందకుండుట రెండవ యర్థము. విహితములైన సంధ్యావందనాదికర్మలను మానుకొన్నను స్నానపానభోజనాదికములు ఎవనికిని తప్పవు. కావున ఊరకయుండుట సంభవము కాదు. వానివలన సుఖదుఃఖములను పొందకుండ ఉండగలుగుటయు అసంభవమే. అట్లే చిత్తశుద్ధి కలుగకుండ తురీయాశ్రమమును స్వీకరించి కర్మలను శాస్త్రవిహితముగా సన్న్యసించి నంతమాత్రమున కూడ జ్ఞానసిద్ధి కలుగదు. ఫలాపేక్ష లేకుండ విహితకర్మలను నిర్వర్తించుచుండుటవలన చిత్తశుద్ధి కలుగును. చిత్తశుద్ధితో శ్రవణమననాదులు చేయుటవలన జ్ఞానసిద్ధి కలుగును. కావున విహితములైన కర్మలను మానుకొనుటవలన లాభమేదియు లేక పోగా అనేక జన్మార్జితమైన దురితము మాత్రము అక్షయముగా నుండును.

ఆత్మతత్త్వమును తెలిసికోవలయు నని తురీయాశ్రమమును స్వీకరించిన వివిదిషా సన్యాసులు కూడ గురువు నాశ్రయించి శ్రవణమననాదులను కావించుచుండిననే గాని జ్ఞానసిద్ధిని పొందజాలరు. "అర్జునుడు కూడ తురీయాశ్రమమును స్వీకరించి శ్రవణమననాదులను ఏల కావింపరాదు ?" అని కొందఱు ప్రశ్నింపవచ్చును. భిక్షాచర్యాత్మకమైన పరివ్రాజనమును వేదము బ్రాహ్మణుల విషయముననే ఉద్ఘాటించినది "ఈయాత్మను తమస్వరూపమునుగా తెలిసికొని బ్రాహ్మణులు పుత్త్రైషణమునుండి విత్తైషణమునుండి లోకైషణమునుండి పైకి లేచి భిక్షాచర్యమున వర్తించుచున్నారు"

"ఏతం వై త మాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్త్రై
షణాయా శ్చ విత్తైషణాయా శ్చ లోకైషణా
యా శ్చ వ్యుత్థా యాథ భిక్షాచర్యం చరన్తి" బృహదారణ్యకము

పైవాక్యముందు తత్త్వమును తెలిసికొన్న విద్వాంసులైన బ్రాహ్మణుల విషయమున భిక్షాచర్యాత్మకమైన పరివ్రాజనము చెప్పబడియున్నది. కాని తత్త్వము నెఱుంగగోరి అవలంబించునట్టి వివిదిషా సన్న్యాసమునందు కూడ భిక్షాచర్యము వృత్తిగా నున్నది. కావున వివిదిషా సన్న్యాసమునందు కూడ బ్రాహ్మణులకే యధికార మున్న దని, క్షత్రియాదులకు లే దని స్పష్ట మగుచున్నది. భిక్షావృత్తి క్షత్రియాదులకు నిషిద్ధము. అందువలన వారికి సన్న్యాసము కూడ నిషిద్ధమే యైనది

కావుననే విద్వాంసులైన జనకుడు, రాముడు, కృష్ణుడు మొదలుగా క్షత్రియు లెవరును సన్న్యాసమును గైకొనలేదు. ఈ కారణముచేతనే శ్రీకృష్ణుడు, అప్పుడు కాకున్నను మఱియొకప్పుడైనను అర్జునుడు సన్న్యాసమును గైకొనవచ్చునని చెప్ప లేదు సన్న్యాసాశ్రమమునందు అధికారము లేకపోయినను క్షత్రియాదుల కందఱకును జ్ఞానమును సంపాదించుకొని మోక్షమును పొందుటయందు అధికారము కలదు. వాన ప్రస్థమునందు బ్రహ్మచర్య గృహస్థాశ్రమములందు కూడ భీష్ముడు ధర్మరాజు మొదలగువారు మహర్షులవలన లోకధర్మములనే కాక మోక్షధర్మములను కూడ తెలిసికొనుచుండి రనుట సుప్రసిద్ధము.

విరక్తి కలిగిన దని జిజ్ఞాస తీవ్రమైన దని క్షత్రియులలో ఆరంభమైన సన్న్యాసము అవైదిక మని భగవంతునకు అభిమతము కాదని నిశ్చితముగా గ్రహింపవలసియున్నది క్షత్రియులలో ఆరంభమైన యీ యవైదిక సన్న్యాసము అంతటితో ఆగక అఖిలవర్ణములకు కులములకు తుదకు ఆమ్రపాలివంటి యవతులైన వేశ్యలకును సంక్రమించినది అర్జునునకు కలిగిన యావేశమువంటి విరక్తియొక్క ఆవేశముతో భిక్షుకులైన యువతీయువకులు ఎందఱో ఆ యావేశము చల్లాఱినంతనే పరివ్రాజక నియమములను పాటింప లేక భ్రష్టత్వమును పొంది రనుట చరిత్ర ప్రసిద్ధమైన విషయము. కుటుంబములకు సంఘమునకు ఆవశ్యకవస్తూత్పాదనము చేత (production of esentual commodities) సేవల చేత (services) ఆధారస్తంభములుగా నుండవలసిన యువతీయువకులు భిక్షుకులై పరాన్నజీవను లగుట (parasites) జాతిదుర్గతికి రాజమార్గమగు ననుటయు చరిత్రవలననే స్పష్టమగుచున్నది. ఈ సన్న్యాసుల సంఖ్య పెరుగుచున్నప్పుడే విదేశీయులు మనదేశముపై దాడులొనర్చి అనేక ప్రాంతములను సులభముగా ఆక్రమింపకలిగిరి. శ్రీరాముని కాలమున శ్రీకృష్ణుని కాలమున కూడ బ్రాహ్మణులైనను అనేకులు సన్న్యాసులు కాకుండుట, వసిష్ఠాదులైన మహర్షులు కూడ సన్న్యాసమును గైకొన లేదనుట గమనింపదగియున్నది. సంఘమున భిక్షుకుల సంఖ్యాభివృద్ధి దారిద్ర్యదుఃఖాభివృద్ధికి సూచకమే (indicator) అగును.

శ్రీకృష్ణుడు అర్జునునకు సన్న్యాసము నిషిద్ధ మని చెప్పుచు, తన వర్తనముచే దృష్టాంతమునుగా చూపి, "అసక్తితో అవిద్వాంసులు కర్మలను ఎట్లు చేయుచుందురో అట్లే విద్వాంసుడు కూడ లోకసంగ్రహమును చేయగోరుచు అసక్తుడై చేయుచుండవలయును" అని చెప్పెను.

శ్లో॥ సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యా ద్విద్వాం స్త థాసక్తా శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్॥ 25

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 27

లోకసంగ్రహమునుగూర్చి కొందఱిట్లు భావింతురు. "సన్యాసమనగా కేవలమైన భిక్షుకవృత్తి కాదు. సన్యసించిన వాడు స్వార్థముతో తనమోక్షముకొఱకు మాత్రమే పాటుపడకుండ సమాజసేవ చేయుచు లోకసంగ్రహ మొనరింపవలె" ఈ యభిప్రాయమును పరిశీలింపవలసియున్నది. శ్రీకృష్ణభగవానుడు ఉద్దేశించిన లోకసంగ్రహ మేమి ? సంగ్రహమనగా చక్కగా గ్రహించుట (సమ్యక్ గ్రహణమ్) పాలను చక్కగా గ్రహింపదలచినవాడు గట్టిపాత్రను దృఢముగా పట్టుకొని దానియందు పాలను గ్రహింపవలె. పాత్ర ఓటి దైనను, గట్టిపాత్రను దృఢముగా పట్టుకొనకున్నను, పాలు నేల పాలగుట తప్పదు. లోకముయొక్క యోగక్షేమములు అను పాలకు శాస్త్రవిహితమైన జీవన విధానము గట్టిపాత్ర. తమకు విహితములైన జీవన విధానములను తాము దృఢముగా అవలంబించి నాయకులు, ఇతరులను వారికి విహితములైన విధానములందు ప్రవర్తింపజేయుటయే లోకసంగ్రహము. క్షత్రియుడైన కృష్ణుడు తన వర్ణమునకు విహితములైన కార్యములను జాగరూకతతో నిర్వహించుచు అర్జునునివంటి వారిని వారికి విహితములైన కార్యములందు ప్రవర్తింపజేసి లోకసంగ్రహమును గావించినాడు. జ్ఞాని అయ్యును ఆయన క్షత్రియులకు విహితమైన యుద్ధకర్మను, హింసాత్మకమైనదేయైనను, తాను చేయుచు అర్జునుని చేయు మని ప్రోత్సహించుచున్నాడు. ఆయనకు మూడులోకములలో కావలసినది ఏదియును లేదు. అప్పుడు ఆయన ఆ యుద్ధములో సారధిగా పాల్గొన్నచో ఆయనకు కల్గు లాభము కాని, పాల్గొనక పోయినచో కలుగు నష్టము కాని లేదు అయినను ఆయన అర్జునునకు ఇచ్చిన మాటకొఱకు, తనయంతస్తునకు ఎంతో తక్కువదియైన సారథ్యమును అంగీకరించి యుద్ధమున పాల్గొనుచున్నాడు. "నేను జ్ఞానిని. నా కేమియు అక్కఱలేదు , హింసాత్మకములైన యుద్ధములతో నా కేమి పని ? ఇంతకంటె వైద్యవృత్తియో ఉపాధ్యాయవృత్తియో చాల మేలు" అని తలంచుచు ఆయన క్షత్రియధర్మమును వీడి వైద్యమునో ఉపాధ్యాయవృత్తినో అవలంబించినచో ఆయనను చూచి ఇతరులు కూడ తమకు తోచిన వృత్తులను అవలంబింపబూనినచో వర్ణధర్మములు వృత్తివిధానములు సంకరము లగును. సంఘమున వ్యవస్థ విచ్ఛిన్నమగును. తనకు దేనియందు అభిరుచి, అభిమానము, అభినివేశము, కౌశలము ఉన్నదో అది స్వధర్మము కాదు తాను ఏ వర్ణమునందు ఏకులమునందు జన్మించెనో, ఆవర్ణమునకు ఆకులమునకు సంబంధించి శాస్త్రముచేత తనకు విహితమైనదియే స్వధర్మము. భీష్మునకు కృష్ణునకు విదురునకు బోధనమునందు ఎంత అభిరుచియున్నను కౌశలము ఉన్నను వారికి ఉపాధ్యాయవృత్తి స్వధర్మము కాదు. అట్లే ద్రోణునకు కృపునకు యుద్ధ కార్యమున ఎంత కౌశలము పరాక్రమము ఉన్నను వారి కది పరధర్మమే కాని స్వధర్మము కాదు కావున

మహాపురుషులు స్వధర్మమును తాము అనుష్ఠించుచు తమతోనున్న లోకులను, అనగా అనుచరులను, భావికాలమున తమ్ము అనుసరింపబోవు భక్తులను, వారి స్వధర్మములందు ప్రవర్తింపజేసి వారు అధోగతి నందకుండునట్లు చేయుటయే లోకసంగ్రహ మొనరించుట.

శ్రీకృష్ణుడు క్షత్త్రియధర్మము నతిక్రమించి బ్రాహ్మణోచితమైన సన్యాసమును అవలంబించి యున్నచో ఆయనను అనుసరించి సమకాలమున తరువాత తరములలో యువతీయువకులు కూడ భిక్షుకులై భ్రంశము నొందినచో అధర్మసంకరమునకు ఆయన కర్త యగును. (సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః) అందువలన ఆయన తనధర్మమును దృఢముగా అనుష్ఠించుచు తన యనుచరులయొక్క భక్తులయొక్క సముదాయరూపమైన లోకమును శాస్త్రవిహితమైన మార్గమున వర్తింపజేయుచు దుర్గతిపాలు కాకుండునట్లు చేసి లోకసంగ్రహ మొనరించెను.

ఈ దృష్టితో పరిశీలించినచో సన్యసించిన వారు సమాజసేవయే లక్ష్యముగా వర్తించుట లోకసంగ్రహము కాదనుట స్పష్టము. ఆత్మజ్ఞానముకొఱకు సకల లౌకికవైదిక వ్యవహారములను వదలిన వివిదిషాసన్యాసి తనశక్తిని కాలమును పూర్తిగా జ్ఞానసంపాదనకే వినియోగించుట స్వధర్మ మగును. సమాజసేవ వానికి పరధర్మమే యగును. ఫలాపేక్ష లేకుండ సమాజసేవాకార్యక్రమములను నిర్వహించుచున్నచో వానికి చిత్తశుద్ధి కలుగవచ్చును గదా ! చిత్తశుద్ధికొఱకైనను అతడు గురుశుశ్రూష శ్రవణము మననము నిదిధ్యాసనములనే అవలంబింపవలె. అవియే వానికి చిత్తశుద్ధిని తత్త్వజ్ఞానమును కూడ కలిగింపగలవు.

చిత్తశుద్ధిని జ్ఞానమును పొందిన సన్యాసికి, అనగా విద్వత్సన్యాసికి, ఇంక సాధింపవలసినది ఏదియు ఉండదు. అట్టివాడు కేవల కారుణ్యదృష్టితో లోకసంగ్రహ మొనరింపవచ్చును కదా ! బ్రాహ్మణేతరులైన జనకుడు, శ్రీకృష్ణుడు మొదలగువారు సన్యాసమునే స్వీకరింపరు. వారు లోకసంగ్రహముకొఱకు సమాజమున అధర్మమును నిర్మూలించుటకు ధర్మమును పెంపొందించుటకు నిరంతరము కృషి చేయుచునే యుందురు. బ్రాహ్మణులలో కూడ లోకసంగ్రహమునకై వర్తింపవలయు నను తలంపు కలవారు జ్ఞాను లయ్యును సన్యసింపరు. వారు వసిష్ఠ విశ్వామిత్రాదులవలె యజ్ఞయాగాదికములను శిష్యశిక్షణాదికార్యములను నిర్వహించుచు లోకసంగ్రహమును కావించుచునే యుందురు. అట్టివారు కొంతకాలమైన తరువాత కేవలమైన యాత్మానందమును నిరంతరముగా అనుభవించుటకై సన్యసింపవచ్చును. సన్యసించిన తరువాత వారు కేవలమైన యాత్మనిష్ఠయందే యుందురు. కాని సామాజిక కార్యకలాపములలో ప్రవేశింపరు. అట్టి తలంపున్నచో సన్యాసమునే స్వీకరింపరు. వారు సన్యాసమును స్వీకరించినచో "నిద్ర వచ్చువఱకు మృతి సంభవించువఱకు వేదాంతచింతనముతోనే కాలము గడుపవలయును" (ఆసుప్తేః ఆమృతేః కాలం నయే

ద్వేదాంతచింతయా" అను న్యాయము ననుసరించి తాము ఆత్మనిష్ఠులై తమ్ము ఆశ్రయించిన వారియందు ఆత్మవిచారమును కలిగించుటకే యత్నించుచుందురు. అదియే వారు చేయు లోకసంగ్రహము. ఇటీవలి కాలములో శ్రీరమణమహర్షి మొదలగువారు ఇట్లే చేయుచుండిరి. అట్లు కాక వారు యజ్ఞయాగాదుల నిర్వహణమునకో వైద్యాలయపాఠశాలాదుల నిర్మాణమునకో పాటుపడుచుండిన యెడల వారికి ఆత్మజ్ఞానము సిద్ధింప లేదనియే గ్రహింపవలె. "జ్ఞానామృతముచేత తృప్తుడై కృతకృత్యుడైన యోగికి కర్తవ్యము ఏదియు ఉండదు , ఉండినచో అతడు తత్త్వవేత్త కాడు" అనుట ప్రాచీనసంప్రదాయ సిద్ధాంతము

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్ కర్తవ్య, మస్తి చేత్ న స తత్త్వవిత్॥

ఇచ్చట భగవంతుడు తనమతమును అనుష్ఠించువారు కర్మలనుండి ముక్తు లగుదు రని, తనయందలి అసూయతో అనుష్ఠింపనివారు వివేకశూన్యు లని సర్వజ్ఞాన విమూఢులై నశింతు రని అనగా స్వర్గమోక్షములకు దూరులగుదు రని, ఉద్ఘాటించుట గమనింపదగియున్నది. గుణవంతమైన విషయమునందును దోషమును భావించుట అసూయ. అర్జునుని నిమిత్తముగా చేసికొని శ్రీకృష్ణుడు సకలమానవులకు శ్రేయస్సును కలిగించునట్టి కర్మయోగమును జ్ఞాననిష్ఠను బోధించుచు "నాయందు కర్మలను ఉంచి ఉద్వేగరహితుడవై యుద్ధము చేయుము, నా యీ మతమును అనుష్ఠించువారు కర్మలనుండి ముక్తు లగుదురు" అని చెప్పినాడు. ఇది విన్నంతనే కొందఱు, "మనవలెనే జీవించుచున్న యీ కృష్ణుడు సర్వజ్ఞుడా ? పరమేశ్వరుడా ? ఈయనయందు కర్మలను అర్పించినంత మాత్రమున ఎవ డైనను పుణ్యపాపముల నుండి ఎట్లు ముక్తుడగును ?" అని ఆక్షేపింతురు మంచిని చెప్పినను గ్రహింపక చెడునుగా త్రోసిపుచ్చువారు అసూయాపరులు.

వారు సర్వజ్ఞానవిమూఢులు. లౌకికములు వైదికములును అయిన సకలజ్ఞానములందును వారు విమూఢులు. వేదశాస్త్రములప్రమాణదృష్టితో ఆలోచించినను, లేక లౌకికమైన తర్కదృష్టితో విమర్శించినను శ్రీకృష్ణుని యుపదేశము శ్రేయస్కరమని స్పష్టముగా గోచరించును. ఏ విధమైన విమర్శన జ్ఞానము లేనివారు సర్వజ్ఞాన విమూఢులు. ఇచ్చట సర్వశబ్దమునకు అర్థము ఈశ్వరు డని నీలకంఠాచార్యులవారు నిరూపించినారు. "సర్వమును పొందియున్నావు కావున, నీవు సర్వుడవు" (సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః) అను నిర్వచనమువలన సర్వజ్ఞాన మనగా ఈశ్వరజ్ఞాన మని ఆయన ఉద్ఘాటించినాడు

తనమతమును అనుష్ఠించుటవలన కలుగు లాభమును ఆచరింపకుండుటవలన సంభవించు నష్టమును భగవంతుడు నిరూపించుటవలన, ఇది ఆయనయుపదేశమునకు ఫలశ్రుతి అని వ్యక్తమగుచున్నది దీనినిబట్టి, "సకలకర్మలను నాయం దుంచి .

ఉద్వేగరహితుడవై యుద్ధము చేయుము" అను వాక్యముతో ఆయన కావింపదలచిన యుపదేశము పూర్తియైనదని స్పష్టమగుచున్నది. పదునెనిమిదవ యధ్యాయమునందు కూడ, "బుద్ధియోగము నవలంబించి మనస్సుచేత సకలకర్మలను నాయందు ఉంచి మత్పరుడవై నన్ను ఎల్లప్పుడు తలంచుచుండుము" అని చెప్పి, "సర్వధర్మములను పరిత్యజించి నన్ను ఒక్కనినే శరణముగా పొందుము, నేను నిన్ను సర్వపాపములనుండి విముక్తుని కావింతును" అని యుద్ఘాటించుట గమనింప దగియున్నది. కావున "సకల కర్మలను నాయం దుంచి" మయి సర్వాణి కర్మాణి" అని యారంభమగుచున్న శ్లోకముతో భగవానుని ప్రధానమైన యుపదేశము పూర్తి యైనదని స్పష్టమగుచున్నది. తక్కిన గ్రంథ మంతయు అర్జునుని సందేహములకు ప్రశ్నలకు సమాధానరూపముగా ఏర్పడిన వివరణ మని గ్రహింపవలసి యున్నది.

శ్లో|| మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా |
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః || 30

శ్లో|| యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః |
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః || 31

శ్లో|| యే త్వే తదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ |
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః || 32

నీలకంఠీయమ్ - సర్వశబ్దః ఈశ్వరవాచీ, "సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః" ఇతి నిర్వచనాత్, తస్య జ్ఞానే విషయే విశేషేణ మూఢాన్, పారోక్ష్యేణాపి తే ఈశ్వర మజానంతో దేహమాత్రనిష్ఠాః, తాన్ నష్టాన్ స్వర్గాపవర్గ భ్రష్టాన్ | భీష్మపర్వము - అధ్యాయ - 27

## (ii) కామనిగ్రహ చమసము

## గీత

తనమతము ననుష్ఠింపనివారు వివేకశూన్యులని సర్వజ్ఞాన విమూఢులని నశింతు రని శ్రీకృష్ణుడు చెప్పినంతనే ఎవరికైనను ఒకసందేహము కలుగవచ్చును. సర్వాంతర్యామి యైన భగవంతుడు వారియందు కూడ ఉన్నాడు కదా, ఆయన వారిని ఏల సన్మార్గమునందు ప్రవేశపెట్టడు ? అర్జునుడు ఈ సందేహమును ప్రకటింపక పోయినను శ్రీకృష్ణుడు దీనిని భావించి ఇట్లు సమాధానము చెప్పినాడు.

"జ్ఞానము కలవాడు కూడ తన ప్రకృతికి తగినట్లే అచరించుచున్నాడు. భూతములు తమ ప్రకృతుల ననుసరించి వర్తించుచున్నవి. నిగ్రహము ఏమి చేయగలదు?

ఒక్కొక్క ఇంద్రియమునకు దానివిషయమునందు రాగద్వేషములు వ్యవస్థితములై యున్నవి. వానికి లోబడరాదు. అవియే సాధకునకు విరోధులు. చక్కగా అనుష్ఠింపబడిన పరధర్మముకంటె, గుణహీనమైన స్వధర్మమే శ్రేయస్కరము. స్వధర్మమున మరణము సంభవించినను మేలే పరధర్మము భయావహము"

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవా నపి |
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ 33

శ్లో॥ ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితే |
తయో ర్న వశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ ॥ 34

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ |
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 27

## విజయప్రభ

సర్వాంతర్యామియైన భగవంతుడు దుర్జనులయందు కూడ ఉన్నమాట నిజమే. కాని వారి ప్రకృతులను మార్చుట ఆయన ధర్మము కాదు. ఒక్కొక్క జీవునకు వాడు పూర్వజన్మలలో గావించిన ధర్మాధర్మములవలన ఏర్పడిన పుణ్యాపాపముల సముదాయము వానికి ప్రకృతి అగును. మట్టినుండి కుండ రూపొందునట్లు ఆ ప్రకృతి నుండి వానికి శరీరము అంతరంగము ఇంద్రియములు ఏర్పడుచున్నవి. సర్వాంతర్యామియైన భగవంతుడు ఆశరీరమునకు అంతరంగమునకు ఇంద్రియములకు చైతన్యమును మాత్రమే కలిగించును. వానిని మార్చుట ఆయనపనికాదు. చిన్నవి, పెద్దవి, తెల్లనివి, ఎఱ్ఱనివి, పచ్చనివి మొదలుగా ఎన్నో విధములుగా ఉండు దీపములయందు (Bulbs) అన్నింటియందును విద్యుచ్ఛక్తి అంతర్యామిగ సమానముగా ప్రసరించుచుండును. అట్లే అది ఎన్నో విధములైన యంత్రములయందును ప్రవహించుచుండును. వాని కన్నింటికి అది చైతన్యమును మాత్రమే కలిగించుచుండును. దానిచైతన్యమువలననే ఆదీపములు వెలుగును, యంత్రములు పని చేయుచుండును. వానియందు అంతర్యామియై యున్న విద్యుచ్ఛక్తి ఆ దీపములయొక్క ప్రకృతిని, అనగా రూపపరిమాణ వర్ణాదులను (form, size, colour etc) మార్చదు. అది దాని ధర్మము కాదు. అట్లే సర్వాంతర్యామియైన భగవంతుడు ఆ యా జీవులకు వారి ప్రకృతులవలన రూపొందియున్న శరీరస్వభావాదులకు చైతన్యమును మాత్రమే కలిగించును. కాని వానిని మార్చడు. విద్యుచ్ఛక్తి వలన ఎఱ్ఱ దీపము ఎఱ్ఱని కాంతిని, పచ్చ దీపము పచ్చని వెలుగును ఇచ్చునట్లు, చిన్నయంత్రము కొద్దిపనిని, పెద్దయంత్రము పెద్దపనిని చేయునట్లు, జీవులు కూడ భగవంతుని చైతన్యమువలన తమ ప్రకృతికి తగినట్లుగా

శరీరముయొక్క బలాబలములను, స్వభావమునందలి మాంద్యము తీవ్రత మొదలగువాని ననుసరించి చిన్న పనులను, పెద్ద పనులను, సత్కార్యములను, దుష్కృత్యములను చేయుచుందురు. వానికి అన్నింటికి వారి ప్రకృతులే కారణము కాని వారియందున్న భగవంతుడు కాడు. ఆయనకు వానితో సంబంధము లేదు. ఆయన సాక్షిమాత్రుడుగ నుండి ప్రభువువలె వారి చేష్టలకు ఫలములను మాత్రమే ఇచ్చుచుండును

ప్రకృతి చాలబలము కలది. శ్రవణమననములచేత వేదాంతవిజ్ఞానమును సంపాదించినవాడు, నహుషునివంటివాడు కూడ పరకాంతావ్యామోహమునకు లోనయ్యె నన్నచో పామరులసంగతి చెప్పవలసినది ఏ మున్నది? ప్రభుత్వశాసనములు దండనములు ప్రసిద్ధములుగా ఉన్నను, దుర్జనులు తమ ప్రకృతికి లోనై దుష్కార్యములను చేయుచునే యున్నారు. అట్లే కుంటితనము గ్రుడ్డితనము దారిద్ర్యము దీర్ఘవ్యాధులు మొదలగు రూపములలో భగవంతుడు పాపములకు ఫలము నొసంగుట ఎఱింగియు వారు తమ ప్రకృతులయందలి దుర్వృత్తులకు లోనై పాపకృత్యములను చేయుచునే యున్నారు. వారి విషయమున నిగ్రహము ఏమి చేయగలదు? పండితులు కూడ ప్రకృతికి లోబడి వర్తించుచున్నచో జీవులకు స్వాతంత్ర్య మెక్కడిది?

ఒక్కసారి దుష్టప్రకృతిని పొందినవాడు ఎల్లప్పుడు దుష్టుడు గానే వర్తింపవలసియుండును. అట్టియెడల ధర్మమ్ము నుపదేశించు శాస్త్రములు, వాని ననుసరించి పెద్దలు చేయు హితబోధలు వ్యర్థములే కదా! ప్రకృతియొక్క ప్రభావము ఎంత ప్రబలమైన దైనను అది జీవుని స్వాతంత్ర్యమును హరింప లేదు. తల్లి, తండ్రి, దేశము, కాలము, శరీరము, స్వభావము మొదలైన జన్మసందర్భములు (contexts of life) దైవికములైన శుభాశుభ సన్నివేశములు (Happy and Unhappy events) కేవలము ప్రకృతి చేతనే సంఘటితము లగుచున్నవి. వానియందు ఏ వ్యక్తికి స్వాతంత్ర్యము లేదు ఇవి వాని బుద్ధికి సంబంధించి సంభవించు నవి కావు. కాని జీవితమున ప్రతిసన్నివేశమునందును, తన వర్తనవిధానమును నిశ్చయించుకొనుటయందు, దాని ననుసరించి వర్తించుటకును వర్తింపకుండుటకును, ప్రతివ్యక్తికి స్వాతంత్ర్యము కలదు. ఆ స్వాతంత్ర్యమును పురస్కరించుకొనియే ధర్మశాస్త్రములు పెద్దల యుపదేశములు సార్థకము లగుచున్నవి. పితృవాక్యపాలనకై రాముడు అడవికి బయలు దేఱుచున్నప్పుడు లక్ష్మణునకు తండ్రిపై తీవ్రమైన క్రోధము పొంగివచ్చినది. తండ్రిని ధిక్కరించుట తగ దని రాముడు అతనికి బోధించెను. అప్పుడు ప్రకృతికి వశుడై క్రోధముతో తండ్రిని దిక్కరించుటకు, రామునియుపదేశమును పాటించి శాంతించుటకు లక్ష్మణునకు స్వాతంత్ర్యమున్నది. అందువలన అతడు క్రోధమును వీడి రామునియుపదేశమును పాటించి ధర్మమునే అవలంబించెను. దుర్యోధనునకు లోభము, పాండవులరాజ్యము అతనికి దక్కుటకు అవకాశము, ప్రకృతిచేతనే సంఘటితము లైనవి. అప్పుడు విదురభీష్మాదుల యుపదేశముల ననుసరించి పాండవులకు రాజ్యము నొసంగుటకు లోభముతో

నిరాకరించుటకు దుర్యోధనునకు స్వాతంత్ర్యమున్నది. అతడు ఉపదేశములను నిరాకరించి లోభమునకు లోనై వర్తించెను. అప్పటికి ఆయుపదేశములు ఫలింపలేదు. అయినను అవి పూర్తిగా వ్యర్థము లయ్యె నని చెప్పుటకు వీలు లేదు. ఆ బోధలు వాని చిత్తమున సంస్కార రూపమున ఉండి జన్మాంతరమున వానియందు దుర్గుణములకు బలమును తగ్గించును. కావున దుష్టులకు చేయుబోధలు కూడ కేవలము వ్యర్థములు కావు. ఎంత ప్రబలముగా శోకమోహములు అర్జునుని ఆక్రమించుచున్నను, అతనికి గల స్వాతంత్ర్యమును అనుసరించియే కృష్ణుడు ఉపదేశించుచున్నాడు.

ఈ సందర్భమున ప్రకృతి జీవుని ఎట్లు బంధించుచున్నదో దానినుండి ఎట్లు తప్పించుకొన వచ్చునో శ్రీకృష్ణుడు వివరించినాడు. ఒక్కొక్క యింద్రియమునకు దాని విషయములలో అనుకూలములైన వానియందు రాగము, ప్రతికూలములైన వానియందు ద్వేషము సృష్టి లక్షణముగా (Principle of creation) నియతమై యున్నది. పొగడ్తలు వినుచున్నప్పుడు, ఆమాటలయందు పొగడుచున్న వారియందు రాగము, ఎవరైన నిందించుచున్నప్పుడు వారిమాటలయందు వారియందును ద్వేషము కలుగుట సహజము అట్లే మనోహరదృశ్యములు, సుఖస్పర్శలు రుచికరములైన పదార్థములు, సుగంధములు మొదలగు వానియందు వానిని సమకూర్చువారి యందును రాగము, భయంకరదృశ్యములు, దుఃఖస్పర్శలు, వెగటు కలిగించు భోజన పదార్థములు, దుర్గంధములు మొదలగు వానియందు, వానిని సమకూర్చువారియందును ద్వేషము కలుగుట సహజము. శరీరధారులకు అందఱకును ఇది తప్పదు. అయినను కలుగుచున్న యీ రాగద్వేషములను గమనించుచు వానికి లోబడకుండ తప్పించుకొనగల స్వాతంత్ర్యమును జీవులకు భగవంతుడు ప్రసాదించినాడు. ధర్మమార్గమునుండి ఎవ డైనను తప్పి చరించుటకు ఈ రాగద్వేషములే కారణములు. కావున శ్రేయస్సును కోరువానికి ఇవి ప్రబల విరోధులు తనకు మేలును కోరువాడు వీనికి లోబడరాదు ఏ సన్నివేశమునం దైనను రాగద్వేషములు ఎంత ప్రబలముగా తన్ను ఆవేశించుచున్నను బుద్ధిశాలి యగువాడు వానిని త్రోసివేసి, "ధర్మము ననుసరించి నా కిపుడు కర్తవ్య మేమి?" అని ఆలోచింపవలె. పెద్దల నడిగి ధర్మమును తెలిసికొని ఆ విధముగా వర్తింపవలె, తనకు తోచినట్లు వర్తింప రాదు.

ప్రకృతిలోని మమకారముచేత శోకమోహములు ప్రబలుటవలన అర్జునునకు స్వధర్మమైన యుద్ధమునందు ద్వేషము పరధర్మమైన బిక్షావృత్తియందు రాగము కలిగెను. దేనియం దైనను తనకు అభిరుచి అభినివేశము కౌశలము ఉన్నంతమాత్రమున అది స్వధర్మము కానేరదు ఏది తనకు శాస్త్రముచేత విహితమై యున్నదో అదియే స్వధర్మ మగును. అర్జునుడు రాగద్వేషములకు లోనై భీష్మద్రోణాదులహింసతో కూడిన ఉగ్రమైన యుద్ధమును వీడి అహింసాత్మకమై ప్రశాంతమైన భిక్షావృత్తిని అవలంబించుటకు సిద్ధపడెను పరధర్మమైన యీ భిక్షావృత్తిని అర్జునుడు, బ్రహ్మచర్యాదినియమములతో చక్కగా అనుష్ఠింపగల డనుటకు సందేహము లేదు.

దానిని ఎంత చక్కగా అతడు అనుష్ఠించునను దానికంటె స్వధర్మమైన యుద్ధమే శ్రేయస్కరము. గుణమహితముగా కన్పించుచున్న పరధర్మముకంటె, హింసామయమై హీనముగా కన్పించుచున్నప్పటికి స్వధర్మమైన యుద్ధమే అర్జునునకు శ్రేయస్కర మని భగవంతుడు స్పష్టముగా చెప్పుచున్నాడు అంతే కాదు. స్వధర్మానుష్ఠానమున మరణ మైనను మేలే కాని పరధర్మము నవలంబించుట మాత్రము భయావహ మని ఆయన ఉద్ఘాటించుచున్నాడు

పరుని దైనంతమాత్రమున ఒక ధర్మానుష్ఠానము మరణముకంటె భయావహ మగునా ? దారిద్ర్యము, అవమానము, భయంకర దీర్ఘవ్యాధులు, మరణముకంటె భయంకరములు కావచ్చును. కాని భిక్షావృత్తి వంటి ప్రశాంతమైన ధర్మము కూడ మరణము కంటె భయంకర మగునా ? అర్జునుడు యుద్ధమును వీడి భిక్షావృత్తితో ఆశ్రమములకు పోయినచో, అతడు దయాశాలియై యుద్ధమును వీడె నని ఎవరును తలంపరు. అజ్ఞానముచేత అతడు ధర్మభ్రష్టుడయ్యె ననియే ఋషులు తలంచి గర్హింతురు. సామాన్యజనులు శత్రువులు, అతడు యుద్ధమునుండి పిఱికితనముతో పాఱిపోయి వచ్చె ననియే అతనిని గేలి చేయుదురు వీరవరేణ్యుడుగా అప్పటివఱకును ప్రశంసలను పొందుచున్న యర్జునునకు అల్పుల వలన హేళనము సంభవించినచో సుఖముగా ఎట్లు జీవింపగలడు. ఎవనివలన ఏమి తిరస్కారము సంభవించునో అను భయముతో దినదిన గండముగా అతడు ఎట్లు జీవితమును కొనసాగింపగలడు ? అందువలన అతనికి భిక్షావృత్తి మరణముకంటె భయావహ మగు ననుట నిశ్చితము.

## గీత

స్వధర్మమును త్యజించి పరధర్మమును అవలంబించుట పాపహేతువని తనకు కూడ తెలియును, అయినను తన మనస్సు ఎవరో పట్టి నెట్టుచున్నట్లుగా ఆ పాపకృత్యము వైపునకే ఏల మ్రొగ్గుచున్నదో అర్జునునకు తెలియుట లేదు. అందువలన అతడు కృష్ణు నిట్లు అడిగినాడు "మతీ, శ్రీకృష్ణా! పాపమును చేయుటకు ఇచ్ఛగింపనివాడు కూడ బలవంతముగ నియోగింపబడినట్లు ఎవనిచేత ప్రచోదితుడై పాప మొనరించుచున్నాడు?"

భగవంతుడు డిట్లనెను. "ఇది కామము. ఇదియే క్రోధము. ఇది రజోగుణమునుండి పుట్టును. ఎంత ఆహారమొసంగినను ఇది తృప్తి పడదు. ఇది మహాపాపి. దీనిని ఇందు వైరినిగా ఎఱుంగుము. దీనిని పూరించుట దుష్కరము. ఎంత యొసంగినను ఇది చాలు ననదు. పొగచేత నిప్పువలె, దుమ్ముచేత అద్దమువలె, జరాయువుచేత గర్భమువలె జ్ఞానికి నిత్యశత్రువైన యీకామముచేత జ్ఞానము ఆవరింపబడి యున్నది.

ఇంద్రియములు మనస్సు బుద్ధి దీనికి అధిష్ఠానములుగా చెప్పబడుచున్నవి. వీనిచేత, ఇది జ్ఞానమును ఆవరించి, జీవుని విమూఢుని కావించుచున్నది. కావున నీవు

మొదట ఇంద్రియములను నియమించి జ్ఞానవిజ్ఞాననాశకమైన యీపాపిని ఖండింపుము. ఇంద్రియములు అధికశక్తిమంతములు. వానికంటె మనస్సు పరమైనది. మనస్సుకంటె బుద్ధి మిన్న. బుద్ధికంటె జ్ఞానరూపమైన యాత్మ పరము. బుద్ధిచేత మనస్సును స్తంభింప జేసి పరమైన యాత్మ నెఱింగి దుర్భేద్యమై కామరూపమైన యీశత్రువును సంహరింపుము"

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥ 36

శ్రీ భగవానువాచ

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥ 37

శ్లో॥ ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽదర్శో మలేన చ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్॥ 38

శ్లో॥ ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ॥ 39

శ్లో॥ ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్॥ 40

శ్లో॥ తస్మాత్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥ 41

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః।
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః॥ 42

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥ 43

శ్రీ మహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 27

## విజయప్రభ

రాగద్వేషములు శత్రువు లని భగవంతుడు చెప్పినాడు. కాని అనేకులకు పాపమునందు రాగము ఇచ్ఛ కలుగవు. అట్టివారు కూడ ఎవరి చేతనో ప్రచోదితులైనట్లు పాపమునకు ఎందుకు పాల్పడుచున్నారు. బండిని లాగుటకు ఇష్టపడని పశువులను

చోదకుడు త్రోలునట్లు జీవు[illegible]పాపమువైపునకు ఎవరు త్రోలుచున్నారు? అనేకులకు సహజముగా పాపమునందు రాగము కలుగదనుట నిజమే. కాని కొన్ని అసహజములైన సన్నివేశములందు వారికి రాగము కలుగుట అసంభవము కాదు. చాలమందికి పరస్త్రీల యందు సాధారణముగా రాగము కలుగదు. కాని ఏకాంతమునందు మిగుల రూపవతియైన పరకాంత తనకు అనుకూలముగ తటస్థపడినచో నియమవంతులు కూడ పాప మని యెఱింగియు ఆమెయందు రాగమును పొందుట అసంబవము కాదు. రాగము లేకుండ కామము కలుగదు. కామము లేకుండ పాపాచరణము సంభవింపదు. రాగమే సంకల్పాత్మకమైనప్పుడు కామ మగును. అర్జునునకు సహజముగ భిక్షావృత్తియందు రాగము లేదు. కాని భీష్మద్రోణాదులయందు బాల్యము నుండి గాఢమైన యనురాగము కలదు. అందువలన వారిని సంహరింపవలసి వచ్చినప్పుడు ఆ యనురాగమునకు ప్రతిబంధకమైన యుద్ధమునందు ద్వేషము కలిగినది. దానినుండి తప్పించుకొనుటకు అప్పుడు భిక్షావృత్తి మేలైన యుపాయముగా తోచి దానియందు అతనికి రాగము కలిగినది. వెంటనే యుద్ధమును వీడి ఆ వృత్తిని అవలంబింపవలయు నను సంకల్పరూపమైన కామము కలిగి నేను యుద్ధము చేయ నని శరచాపములను అతడు వీడినాడు. కావున పరధర్మమైన భిక్షావృత్తి నవలంబింప వలయు నని అర్జునునకు కలిగిన పాపప్రవృత్తి యందు రాగము, ఇచ్ఛ, కామము కలిగినవి.

"నీకు భిక్షావృత్తియందు కామము కలిగినది, అదియే నీకు ప్రచోదనము కలిగించుచున్నది". అని చెప్పకుండ శ్రీకృష్ణుడు అర్జునుడు సాధారణముగా అడిగిన ప్రశ్నకు సాదారణముగానే, "కామమే పాపాచరణమునకు మూలము" అని సమాధానము చెప్పినాడు. ఒక వస్తువునందు "ఇది సుఖకరము, కావున పొందదగినది" అను తలంపు రాగము. "ఇది దుఃఖకరము, దీనిని తొలగింపవలె" అను తలంపు ద్వేషము. "ఇది నాకు తప్పక కావలె" అను ప్రబలమైన భావము కలుగునప్పుడు రాగమే కామముగా పరిణమించును. "దీనిని తప్పక నిర్మూలింపవలె" అను భావము కలుగునప్పుడు ద్వేషమే క్రోధముగా పరిణమించును. కామమునకు భంగము కలిగినప్పుడు, భంగకారణముగా కన్పించుచున్న దానియందు కామాత్మకమైన చిత్తవృత్తియే ప్రజ్వలనాత్మకమై క్రోధ మగును. కావున కామము యొక్క రూపాంతరమే క్రోధము. మఱి నిష్కాములైన పరమధార్మికులకు ఋషులకు కూడ క్రోధము కలిగి వారు శపించుట సంభవించుచున్నది కదా! అది నిజమే. కాని వారు ధర్మకాములు. ధర్మము భంగపడినప్పుడు వారియందున్న ధర్మకామమే క్రోధముగా పరిణమించుచున్నది కావున కామమును జయించినచో క్రోధమును కూడ జయించినట్లే యగును

కర్మయోగమునకు సాంఖ్యసిద్ధికి కామమే ప్రదానప్రతిబంధకము దానిని నిర్మూలించినచో అధ్యాత్మయోగమార్గము పూలబాటయే యగును. అందువలన కామ నిర్మూలన విధానమును భగవానుడు వివరించినాడు. శత్రువుయొక్క వ్యూహమును, వానియధిష్ఠానమును, చక్కగా తెలిసికొన్నచో వానిని నిర్మూలించుట సులబ మగును.

శ్రవణమననాదులు చేసి జ్ఞానవిజ్ఞానములను సంపాదించుకొన్నవానికి కూడ అది నిత్యవైరియే నిర్వికల్ప సమాధిని పొందినవాడు కూడ సమాధిని వీడి వ్యవహరించునప్పుడు కామము విషయమున జాగరూకతను కలిగియుండవలె. శాస్త్రాచార్యోపదేశములవలన కలిగిన పరోక్షజ్ఞానమునే కాక, నిదిధ్యాసనముయొక్క పరిపాకమువలన కలిగిన విజ్ఞానమును కూడ అది నాశ మొనరింపగలదు

కామము మూడు దశలలో జ్ఞానమును మూడువిధములుగా ఆవరించుచున్నది. (1) "ఫలాపేక్షలేకుండ జయాపజయాది ద్వంద్వములయందు సమబుద్ధితో శాస్త్రవిహిత కర్తవ్యములను నిర్వహింపవలయు" నను బుద్ధి నిశ్చయము కర్మయోగమునందు జ్ఞానము. దానిని అవలంబించి కర్మలను నిర్వర్తించుచున్నప్పుడు, పొగ నిప్పును ఆవరించినట్లుగా, కామము మాటిమాటికి ఫలములయందు ఆసక్తిని కలిగించుచు సమబుద్ధి రూపమైన జ్ఞానమును ఆవరించుచుండును. (2) "జగత్తు మిథ్య, ఆత్మయే సత్యము, నేను ఆత్మస్వరూపుడను" అను బుద్ధి నిశ్చయము సాంఖ్యమునందు జ్ఞానము. దానిని అవలంబించి భావించుచున్నప్పుడు, దుమ్ము అద్దమును ఆవరించినట్లు, ఇది జగత్తునందు మిథ్యాత్వబుద్ధిని నిలువనీయక రాగరూపమున చిత్తమును ఆవరించుచు దానిని లోకవ్యవహారము వైపునకు ఆకర్షించుచుండును. (3) సకల విషయములనుండి చిత్తమును మరలించి ఆత్మనే గాఢముగ ధ్యానించుచుండుట నిదిధ్యాసనము. ధ్యానింపవలయు నను ఇచ్ఛ దిధ్యాస. గాఢముగ ధ్యానింపవలయు నను ఇచ్ఛ నిదిధ్యాస లేక నిదిధ్యాసనము. దీనియందు ఆత్మస్వరూపమే జ్ఞానము. ఆత్మనిష్ఠను అవలంబించి ఆత్మసాక్షాత్కారమును పొందుటకు ప్రయత్నించుచున్నపుడు, గర్భమును మావి (జరాయువు) ఆవరించినట్లు ఇది ఆత్మస్వరూపమును అజ్ఞానరూపమున ఆవరించి, ఆత్మ సాక్షాత్కరింపకుండ అడ్డుపడుచుండును. కామమునకు మూలము రాగము రాగమునకు మూలము అజ్ఞానము. కావున సకలయోగమార్గములకు పెద్ద ప్రతిబంధకమైన కామము యొక్క ఆక్రమణములోని యీ త్రివిధమైన వ్యూహమును గుర్తించి దీనిని సమూలముగా ఛేదించుట ఆవశ్యకము.

కామముయొక్క అధిష్ఠానము దుర్గమువలె మూడుప్రాకారములను కలిగి యున్నది. ఒక్కొక్క ప్రాకారమును జయించుచు ముందునకు పోయి శత్రువును సంహరించునట్లు, ఇంద్రియములు మనస్సు బుద్ధి అను మూడు ప్రాకారములను క్రమముగా జయించి చిత్తమునందు నెలవుకొనియున్న కామమును నిర్మూలింపవలె. ఇంద్రియములను జయించుట అనగా గ్రుడ్డివానివలె చెవిటివానివలె విషయములనే గ్రహింపకుండుట కాదు. ఇంద్రియములను పరస్త్రీసౌందర్యము పరనింద మొదలగు విషయములందు ప్రసరింపనీయక, నిషిద్ధములు కాని అన్నపాన భార్యాదులయందు కూడ, రాగద్వేషములకు లోను కాకుండ, వానిని యథోచితముగా పొందుచుండుటయే ఇంద్రియజయము. మనస్సు సంకల్పవికల్పాత్మకము. ఇట్లు చేయవలెనని యనుకొనుట సంకల్పము. ఇట్లు కాక మఱియొక విధముగా కూడ చేయవచ్చునేమో అని

అనుకొనుచుండుట వికల్పము. పుత్రులకొఱకు పుత్రకామేష్టి చేయవలె ననుట సంకల్పము. దానికంటెను తపస్సు చేయుట మేలేమో అని అనుకొనుచుండుట వికల్పము. ప్రతి సన్నివేశమునందును శాస్త్రవిహితమైన ధర్మమును అనుసరించియే మనస్సునందు సంకల్పవికల్పములు కలుగునట్లు చేయుట మనస్సును జయించుట బుద్ధి నిశ్చయాత్మకము "జగత్తు మిధ్య, ఆత్మ నిత్యము, నేను ఆత్మను, ఈ మూడు లోకములయందును నేను పొందవలసినది ఏదియును లేదు. అయినను లోకసంగ్రహముకొఱకు స్వధర్మకృత్యములను ఆచరింతును" అను నిశ్చయముతో స్వవర్ణాశ్రమాది ధర్మములను నిర్వహించుచుండుట బుద్ధిజయము ఈ విషయమును శ్రీకృష్ణుడు తనవిషయముననే మఱియొక సందర్భమున ఉద్ఘాటించియుండుట గమనింపదగియున్నది.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః 27

"అర్జునా ! నాకు మూడులోకములందును ఏమియు కర్తవ్యము లేదు (ఎందువల్ల ననగా) నేను పొందనిది, ఇంకను పొందవలసినది ఏదియును లేదు. అయినను పని చేయుచునే యున్నాను."

## (iii) విద్యాసంప్రదాయ చమసము

### గీత

బ్రహ్మవిద్యను బోధించి, దానిని సంపాదించుటకు ఆవశ్యకమైన కామనిగ్రహమునుగూర్చి హెచ్చరించి ఈ విద్యయందు అర్జునునకు ప్రామాణ్యబుద్ధి కలుగుటకు విద్యాసంప్రదాయమును తన సర్వేశ్వరత్వమును సర్వజ్ఞత్వమును శ్రీకృష్ణుడు వ్యక్తీకరించుచున్నాడు

"అర్జునా ! అవ్యయమైన యీ యోగమును నేను వివస్వంతునకు ఉపదేశించితిని. వివస్వంతుడు మనువునకు చెప్పెను. మనువు ఇక్ష్వాకువునకు బోధించెను. ఈవిధముగా సంప్రదాయమువలన ప్రాప్తమైన దీనిని రాజర్షులు తెలిసికొనిరి. దీర్ఘకాలవశమున ఇది నశించినది. నీవు నాకు సఖుడ వని భక్తుడ వని రహస్యము ఉత్తమమును అయిన ఆ పురాతనమైన యోగమునే నేను నీ కిప్పుడు చెప్పితిని

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్॥ 1

శ్లో॥ ఏవం పరంపరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః।
న కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప॥ 2

శ్లో॥ స ఏ వాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్॥ 3

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః 28

# విజయప్రభ

వ్యయ మనగా తగ్గిపోవుట లేక మార్పునొందుట. అట్లు వ్యయము నొందనిది అవ్యయము. సంప్రదాయమువలన వేదమంత్రములు ఎట్టిమార్పును పొందకుండ ఎట్లు వచ్చుచున్నవో అట్లే యీ యోగవిద్య కూడ సంప్రదాయవశమున మార్పును పొందకుండ వచ్చుచున్నది. "నేను వివస్వంతునకు ఉపదేశించితిని" అని భగవానుడు చెప్పుచున్నప్పుడు విష్ణుదేవుడు, సూర్యమండలమునకు అధిష్ఠానదైవతమైన వివస్వంతునకు చెప్పె నని గ్రహింపవలసియున్నది. బ్రహ్మచే సృష్టింపబడిన జగత్తును పాలింపవలసినవాడు విష్ణువు. అందువలన సూర్యవంశక్షత్రియులకు ఆద్యుడైన వివస్వంతునకు దీనిని విష్ణువు బోధించెను. పరిపాలనదక్షతకు బ్రహ్మవిద్య ఆవశ్యకము. యోగి జ్ఞానియు నైన ప్రభువే ఉత్తమముగా ప్రజాపాలనమును నిర్వహింపగలడు. సకలవేదములను పరిశీలించి మనువు వానినుండి ప్రజాజీవనమునకు పరిపాలనకు ఆవశ్యకములైన ధర్మతత్త్వవిశేషములను గ్రంథముగా రూపొందించి మానవజాతికి ప్రసాదించెను. ఆయన ధర్మశాస్త్రకర్తలకు ఆద్యుడు (The first law giver of mankind) ఆయన, మంత్రులు కోశము దండనీతి మొదలగు రాజ్యాంగములను రూపొందించి, తనకుమారుని ఇక్ష్వాకువును మొదటిరాజును గావించెను. ఆయననుండి పితృపుత్రసంప్రదాయరూపమున ఈ యోగవిద్య రాజకుమారులకు సంక్రమించుచుండెను. వారు రాజర్షులై మనువుయొక్క మార్గమును కొంచమైనను తప్పకుండ ప్రజలను పాలించుచుండిరి. రాజులైన ఋషులు రాజర్షులు. ఫలాపేక్ష లేకుండ కేవలము ధర్మమునే అనుష్ఠించువారు ఋషులు. యోగవిద్యవలన రాజులు ఋషిత్వమును పొందగలిగి రని గ్రహింపవలసియున్నది.

ఈ రాజర్షి సంప్రదాయము కాక బ్రహ్మర్షి సంప్రదాయమును కూడ భగవంతుడే ప్రారంభించినాడు. నారాయణుడు, పద్మభువుడు, వసిష్ఠుడు, శక్తి, పరాశరుడు, వ్యాసుడు, శుకుడు, గౌడపాదుడు, గోవిందయోగీంద్రుడు, శ్రీ శంకరాచార్యులవారు, పద్మపాదుడు, మొదలుగా ఈ బ్రహ్మవిద్యాసంప్రదాయము ఆచార్యపరంపరాప్రాప్తమై యున్నది విష్ణుదేవుడు క్షత్రియుడైన శ్రీకృష్ణుడుగా క్షత్రియుడైన యర్జునునకు ఉపదేశించుచున్నాడు, కావున రాజర్షిసంప్రదాయమునే ఉదహరించెనని గ్రహింపవలసియున్నది రెండు సంప్రదాయములందును బ్రహ్మవిద్య సమానమే యనుట స్పష్టము.

శ్లో|| నారాయణం పద్మభువం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్ర పరాశరం చ|
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం|
గోవిందయోగీంద్ర మ థాస్య శిష్యమ్ ||

శ్లో|| శ్రీ శంకరాచార్య మ థాస్య పద్మ
పాదం చ హస్తామలకం చ శిష్యమ్|
తం తోటకం వార్తికకార మన్యా|
నస్మద్గురూన్ సంతత మానతో ఽస్మి ||

ఈ యోగమును గూర్చి (ఇమం యోగమ్) భగవంతుడు అనేక పర్యాయములు ఏకవచనమునే ఉపయోగించి యుండుట గమనింప దగియున్నది. "సాంఖ్యులకు జ్ఞానయోగముతో యోగులకు కర్మయోగముతో ద్వివిదముగా ఈనిష్ఠను నేను పూర్వము ఉపదేశించియుంటిని" అని భగవంతుడు చెప్పియుండుటవలన కర్మయోగము వేఱు సాంఖ్యయోగము వేఱు అని భ్రమించుటకు అవకాశ మున్నది. ఆభ్రాంతిని నివారించుటకు బగవంతుడు కర్మయోగపూర్వకమైన సాంఖ్య మొక్కటియే యోగ మని ఏకవచన ప్రయోగముచేత స్పష్టము చేయుచున్నాడు. ఆయన ఇంత స్పష్టముగా చెప్పుచున్నను కొందఱు భగవద్గీతయందు తాత్పర్యముగా బోధింపబడినది కర్మయోగమే యని తలంచుచుండుట శోచనీయము.

ఈయోగము అవ్యయమైన దని చెప్పుచున్నను వెంటనే బగవానుడు, "ఇది దీర్ఘకాలవశమున నశించినది" అని చెప్పుట ఎట్లు కుదురును ? అవ్యయ మైనది నశించునా ? నశ్ ధాతువునకు మరణము అదర్శనము అనునర్థములు కలవు. ఇచ్చట యోగము నష్టమైన దనగా ధ్వంసమైన దని యర్థము కాదు ; "క్షత్రియుల పరంపరలో ఇటీవల ఇది కన్పించుట లేదు, అనగా బోధింపబడుట లేదు" అనియే అర్థము. క్షత్రియపరంపరలో ఇది కన్పింవక పోయినను ఆచార్యపరంపరలో అవ్యయముగానే యున్నది.

క్షత్రియపరంపరలో నష్ట మగుటకు హేతువును కూడ భగవంతుడే సూచించినాడు. భీష్ముడు మొదలుగా పెద్దలకు కొందఱకు ఈ యోగవిద్య తెలిసియున్నను, ఇది ఉత్తమము రహస్యమును అయినదగుటచే యోగ్యులైన క్షత్రియులు శిష్యులుగ తమ్ము చేరకుండుటచే వారు బోదించుటకు అవకాశము లేకుండపోయినది ఇప్పుడు అర్జునుడు, "నేను నీకు శిష్యుడను, ప్రపన్నుడనైన నన్ను శాసింపుము" అని బక్తుడై శరణాగతి చేయుటవలన శ్రీకృష్ణుడు అతనికి బోదించుట సంభవించెను. రహస్య మనుటవలన ఈ యోగవిద్యను ఇష్టుడు సఖుడును అయినంతమాత్రమున అనర్హునకు బోధింపరాదనుట స్పష్టము. ప్రద్యుమ్నుడు సాత్యకి మొదలైన యిష్టులకు ఆయన ఈ యోగమును బోధించినట్లు కన్పించుట లేదు. భక్తుడైన యర్జునునకు కూడ ఆర్తితో అడిగినప్పుడే ఆయన ఉపదేశించినాడు.

ఇది ఉత్తమ మైనదని భగవంతుడు చెప్పుటవలన, భక్తి ధ్యానము పాతంజలమైన యోగము మొదలైనవన్నియు దీనికి అంగములే యని గ్రహింపవలసియున్నది. "భక్తియే గొప్పది" (భక్తి రేవ గరీయసీ) మొదలగు వాక్యములు శిష్యులయొక్క అర్హతనుబట్టి గురువులు ఒక్కొక్కరికి ఒక్కొక్కదానిని అనుష్ఠింపదగినదిగా బోధించుచు, వారికి ఆయా సాధనములయందు శ్రద్ధ కలుగుటకై చెప్పిన స్తుతివచనములుగానే గ్రహింపవలసియున్నది.

"ఆ పురాతనమైన యోగమునే నీకు చెప్పితిని" అని భగవంతుడు నిర్దేశించుటవలన సంప్రదాయప్రాప్తమైన విద్యయే ప్రమాణమై గ్రాహ్య మగును కాని, ఒకానొకడు తన బుద్ధి శక్తి చేత పరిశోధనము గావించి కాని, తపస్సు చేసి కాని "నేను ఈయోగమును కనుగొన్నాను" అని క్రొత్తగా తనకు తోచినదానిని ప్రవచనము చేసినచో అది ప్రమాణము కాదు, పరిగ్రాహ్యము కా దని గ్రహింపవలసియున్నది. భగవంతుడు కూడ, "ఇది నా బుద్ధికి తోచినది" అని చెప్పుట లేదు. ఈ యోగవిద్య ఋషులచేత, వేదములచేత, బ్రహ్మమును సూత్రీకరించి చెప్పు వేదవాక్యములచేత, ఇది సహేతుకముగా చక్కగా నిశ్చయించి బహువిధములుగా చెప్పబడినది" అని ఆయన తరువాత చెప్పబోవుచున్నాడు.

శ్లో|| ఋషిభి ర్బహుధాగీతం, ఛన్దోభిః వివిధైః పృథక్ |
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః || 5

శ్రీ మహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 37

కావున కేవలము బుద్ధిశక్తిచేత నిరూపింపబడిన ప్రాచ్యపాశ్చాత్యపండితుల సిద్ధాంతములు పరిగ్రాహ్యములు కా వని గ్రహింప వలసియున్నది కలశము.

# II. ఈశ్వర తత్త్వ కలశము

## 1. సందేహ నివారణ కమండలువు

### (i) భగవజ్జన్మ కర్మ వైశిష్ట్యము

### గీత

తనకంటె సుమారు మూడేండ్లు మాత్రమే పెద్దవాడైన కృష్ణుడు, "నేను వివస్వంతునకు చెప్పితిని" అని యుద్ఘాటించినంతనే అర్జునునకు, ఇప్పటివాడైన యీయన ఎంతో పూర్వుడైన యాదిత్యునకు ఎ ట్లుపదేశించెను, అను సందేహము కలిగెను. ఈ సందేహము అర్జునునకు ఇంతకు ముందే కలిగియుండవలసినది. "నేను జ్ఞానయోగముచేత సాంఖ్యులకు కర్మయోగముచేత యోగులకు ద్వివిధమైన యానిష్ఠను

పూర్వము చెప్పియుంటిని" అని భగవంతు డన్నప్పుడే అర్జునుడు, "ఆ సాంఖ్యు లెవరు, ఆయోగు లెవరు, వారికి నీ వెప్పుడు చెప్పితివి, మాకు తెలియదే" అని అడిగి యుండవలసినది. బదరికావనమునకు తపస్సు చేయబోయినప్పుడో, ఎప్పుడో ఎవరికో చెప్పియుండవచ్చు నని అర్జునుడు ఆవిషయమును పట్టించుకొన లేదు. కాని "వివస్వంతునకు చెప్పితిని" అని ఆయన అన్నప్పుడు, అర్జునునకు ఆమాట చాల వింతగా తోచెను. ఆయన అసత్యమును చెప్ప ననుటకు వీలు లేదు. అందువలన అర్జునుడు, "నీజననము ఇప్పటిది, వివస్వంతుడు చాల పూర్వకాలమున జన్మించినవాడు, నీవు మొదట దీనిని చెప్పియున్నా వని నేను ఎట్లు తెలిసికొందును" అని యడిగెను

భగవంతు డిట్లనెను. "అర్జునా ! నాకు నీకు కూడ పెక్కు జన్మలు గడచినవి అవి యన్నియు నాకు తెలియును నీ వెఱుంగవు. నేను పుట్టుకలేని వాడను, మార్పు నొందని వాడను, అయినప్పటికి, భూతములకు ఈశ్వరుడను అయియుండినప్పటికిని, నా ప్రకృతిని అదిష్ఠించి నా మాయచేత పుట్టుచున్నాను. ఎప్పు డెప్పుడు ధర్మమునకు క్షీణత్వము అధర్మమునకు వృద్ధి కలుగునో అప్పుడు నన్ను సృష్టించుకొనుచున్నాను. ప్రతియుగమునందు సాదువులను రక్షించుటకొఱకు దుష్టులను నశింపజేయుటకు, ధర్మమును సంస్థాపించుటకు జన్మించుచున్నాను. దివ్యమైన నా జన్మను కర్మను ఎవడు యదార్థముగా తెలిసికొనుచున్నడో, వాడు శరీరమును వదలిన తరువాత మరల జన్మను పొందడు , నన్నే పొందుచున్నాడు".

"గుణకర్మల విభాగము ననుసరించి నాలుగు వర్ణముల వద్ధతిని నేను సృష్టించితిని. దానికి నేను కర్తనై యున్నను నన్ను అకర్తనుగా అవ్యయునిగా ఎఱుంగుము. కర్మలు నన్ను అంటవు. నాకు కర్మఫలములయందు కోరిక లేదు. ఇట్లు నన్ను తెలిసికొనువాడు కర్మములచేత బంధింపబడడు. ఇట్లు తెలిసికొని పూర్వులైన ముముక్షువులు కూడ కర్మలను అనుష్ఠించిరి కావున నీవు కూడ కర్మనే చేయుము. పూర్వులు తమకంటె పూర్వులైన వారిని అనుసరించి కర్మలను అనుష్ఠించిరి.

ఏది కర్మ ఏది అకర్మ అనువిషయమున మేధావులు కూడ భ్రాంతి నొందుచున్నారు. దేనిని తెలిసికొన్నచో అశుభము నుండి మోక్షమును పొందగలవో అట్టి కర్మను (కర్మాకర్మల లక్షణమును) చెప్పుచున్నాను. కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను చూచువాడే మనుష్యులలో బుద్ధిమంతుడు. అతడే యోగి. అతడే సకలకర్మలను ఆచరించినవాడు.

ఎవనియొక్క కార్యము లన్నియు కామసంకల్పవర్జితములై జ్ఞానాగ్నిచేత దగ్ధము లగుచున్నవో వానిని పండితునిగా బుధులు చెప్పుదురు. కర్మఫలములయందు ఆసక్తిని వీడి నిత్యముతృప్తుడై దేనిని ఆశ్రయింపక కర్మలను సాంగోపాంగముగ ఆచరించుచున్నను అతడు ఏమియు చేయనివాడే అగును"

"ద్రవ్యమయమైన యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము మేలు. కర్మ అంతయు జ్ఞానమునందే పరిసమాప్తిని పొందుచున్నది. కావున సాష్టాంగదండ ప్రణామముతో మాటిమాటికి ప్రశ్నించుచు సేవచేయుచు (పెద్దలవలన) దానిని తెలిసికొనుము. దేనిని తెలిసికొన్నచో నీవు మరల ఇట్టి మోహమును పొందవో, మఱియు దేని చేత సకలభూతములను ఆత్మనైన నాయందు చూడగలవో అట్టి జ్ఞానమును, తత్త్వమును దర్శించిన జ్ఞానులు, నీకు ఉపదేశింపగలరు. పాపు లందఱికంటెను నీవు పాపిష్ఠుడ వైనను సర్వపాపమును జ్ఞాన మను తెప్పచేతనే దాటగలవు. ప్రజ్వలింపజేయబడినయగ్ని సమిథలను దహించునట్లు జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మ మొనరింపగలదు".

"యోగముచేత కర్మలను సన్న్యసించినవానిని, జ్ఞానము చేత సంశయములను ఛేదించుకొన్నవానిని, ఆత్మవంతుని కర్మలు బంధింపవు. కావున అజ్ఞానమువలన కలిగి హృదయమునందున్న యీ సంశయమును జ్ఞాన మను ఖడ్గముచేత ఖండించి యోగమును అవలంబింపుము. లెమ్ము".

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున |
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ||

శ్లో॥ అజో౽పి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరో౽పి సన్ |
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా || 6

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత |
అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజామ్యహమ్ || 7

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ |
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే || 8

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః |
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సో౽ర్జున || 9

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః |
తస్య కర్తార మపి మాం వి ద్ధ్యకర్తార మవ్యయమ్ || 13

శ్లో॥ న మాం కర్మాణి లింపన్తి న మే కర్మఫలే స్పృహా |
ఇతి మాం యో౽భిజానాతి కర్మభి ర్న స బధ్యతే || 14

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః |
**కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ||** 15

శ్లో|| కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః |
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్|| 16

శ్లో|| కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః |
న బుద్ధిమాన్ మనుష్యేషు న యుక్తః కృత్స్నకర్మకృత్|| 18

శ్లో|| యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః |
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః || 19

శ్లో|| త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః |
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్ కరోతి సః || 20

శ్లో|| శ్రేయాన్ ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప |
సర్వం క ర్మాఖిలం పార్థ, జ్ఞానే పరిసమాప్యతే || 33

శ్లో|| త ద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా |
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః || 34

శ్లో|| యద్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ |
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి || 35

శ్లో|| అపి చే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః |
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి || 36

శ్లో|| య థైథాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్ కురుతేఽర్జున |
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా || 37

శ్లో|| యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్ |
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ || 41

శ్లో|| తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞా నాసి నాత్మనః |
ఛి త్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ బారత || 42

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అద్యాయః - 28

## విజయప్రభ

ఈ సందర్భమున శ్రీకృష్ణుడు తన గురువైన సాందీపనిని పేర్కొనకుండుట గమనింపదగియున్నది. అయనయొద్ద విద్యాభ్యాసము గావించినప్పుడు శ్రీకృష్ణు డాయనవలన ఈ విద్యను పొంద లే దని తలంపవలసియున్నది సకల విద్యలను

చెప్పిన సాందీపని అర్హుడైన శ్రీకృష్ణునకు బ్రహ్మవిద్యను ఏల ఉపదేశింప లేదు ? విష్ణుదేవునియంశముతో అవతరించిన శ్రీకృష్ణునకు బ్రహ్మవిద్య నిరంతరము భాసించుచునే యుండెను. అందువలన ఆయన ఈవిద్యను బోధింపు మని గురువును ప్రార్థింప లేదు, ఆయన బోదింపలేదు. వేదాదిశాస్త్రములను శిష్యులు ప్రార్థింప కున్నను బోదింపవచ్చును కాని బ్రహ్మవిద్యను అర్హతముడైన శిష్యునకు కూడ, అతడు ప్రార్థింపకున్నచో, బోదింపరా దని దీనివలన వ్యక్త మగుచున్నది.

త్రిలోకాదిపత్యము ఇంద్రునిది. అయినను ఒక్కొక్కప్పుడు అదర్మము ప్రబలి రాక్షసులు విజృంబించి ఇంద్రునకు కూడ వారిని నిగ్రహించుట అశక్య మైనప్పుడు విష్ణుదేవుడు ఎన్నో రూపములతో అవతరించి అధర్మమును నిగ్రహించి ధర్మమును ఉద్ధరించుచుండును. అందువలన విష్ణుదేవుడైన శ్రీకృష్ణునకు అవతారములుగా ఎన్నో జన్మలు గడిచినవి. అర్జునునకు కూడ అప్పటికి ఎన్నో జన్మలు గడచినవి. "అవి యన్నియు నాకు తెలియును, నీ వెఱుంగవు" అని శ్రీకృష్ణు డనుటవలన, యోగశక్తులవలన మహాత్ములకు తెలిసిన విషయము అన్నియు ఇతరులకు తెలియవలసిన పనిలేదని, పెద్దలు చెప్పునప్పుడు, మనకు ప్రత్యక్షము కాని విషయములను, వారియందలి విశ్వాసమువలన మనము నమ్మవలసినదే కాని శంకింపరా దని గ్రహింపవలసియున్నది. "ఏవిషయమైనను మేము చూచిననే తప్ప నమ్మము, జన్మాంతరములు మాకు గోచరించుట లేదు, కావున మేము నమ్మము" అని కొంద అనుచుండుట బుద్ధిహీనప్రసంగము. విజ్ఞానగ్రహణమున విశ్వాసమే ప్రథమసోపానము" "అడవులలో సింహము లుండును" అని ఉపాధ్యాయుడు బోదించునప్పుడు అడవులను సింహములను విద్యార్థులకు చూపుట అప్పుడు సంభవము కాదు. ఎప్పుడో సంభవము కావచ్చును. అప్పటివఱకు విద్యార్థులు ఉపాధ్యాయునివాక్యములయందలి విశ్వాసముతో ఆవిషయములను గ్రహింపవలసినదే. అట్లు కాక, "మాకు చూపిననే తప్ప మేము నమ్మము" అని ఎవరైన పట్టుపట్టినచో విద్యాభ్యాసమే సాగదు.

ఇంతకు ముందు సాంఖ్యమును బోధించునప్పుడు భగవంతుడు, "నేను నీవు ఈ రాజులు ఇంతకు ముందు లేము అనుట లేదు, ఇంకముందు ఉండము అనుటయు లేదు" అని ఆత్మస్వరూపముచేత ఎల్లరు నిత్యులే అని బోధించియున్నాడు. అనిత్యములైన శరీరములు పుట్టుచు నశించుచుండును. కాని నిత్యమైన యాత్మ పుట్ట లేదు, నశించుటయు లేదు. ఆత్మస్వరూపమును ఉద్దేశించి శ్రీకృష్ణ డిప్పుడు "నేను అజుడను, అవ్యయుడను" అని చెప్పి విష్ణుత్వము నవలంబించి, "భూతములకు ఈశ్వరుడను" అని చెప్పుచున్నాడు. అజునకు జన్మ లెట్లు కలుగును అను శంకకు ఆయన ఇట్లు సమాధానము చెప్పుచున్నాడు. తత్త్వస్వరూపముచేత ఆయన అజుడే, అవ్యయుడే. అయినను వ్యవహారము ననుసరించి విష్ణువుగా అవతరింపవలసినప్పుడు ఆయన తన ప్రకృతిని అధిష్ఠించి తన మాయచేతనే జన్మించుచున్నాడు. భగవంతునకు పర అపర అను రెండు ప్రకృతు లున్నవి.

పంచభూతములు మనస్సు బుద్ధి అహంకారము అనుపదార్థములతో కూడినది అపర. ఆత్మ పరాప్రకృతి. శరీరము లన్నియు, మట్టి నుండి పాత్రలవలె, అపరాప్రకృతివలననే సంభవించుచున్నవి. అందువలన భగవంతుడు దీనిని అధిష్ఠించి శరీరమును పొందుచున్నాడు. అనగా తన యిచ్ఛానుసారముగా వర్తించు శరీరమును, తనకు కావలసిన తల్లిదండ్రులను దేశకాలములను నిర్ణయించుకొని ఆ ప్రకారముగ స్వతంత్రముగా జన్మించుచున్నాడు. ఈ స్వాతంత్ర్యము సాధారణజీవుల కుండదు. వారు పూర్వకర్మవశమున తమకు తెలియకుండగనే జన్మపరంపరలను పొందుచుందురు వారు ప్రకృతిని అధిష్ఠించి తమ యిచ్ఛానుసారముగా జన్మింప లేరు. తాను ప్రకృతికి లోబడక తానే ప్రకృతిని లోబఱచుకొని స్వతంత్రముగా జన్మించి తన శరీరమును ఇచ్ఛానుసారముగా ఉపయోగించుకొన గలుగుట ఈశ్వరత్వముయొక్క విశేషము. ఆయన శరీరము రెండు భుజములతో, నాలుగు భుజములతో విశ్వరూపముతో సందర్భానుసారముగా ప్రకటమగుచుండును, ఒక్కొకప్పుడు అదృశ్యమగుచుండును. అందువలననే భగవంతునిజన్మము దివ్య మని అవతార మని చెప్పబడుచున్నది.

మాయ యనగా ప్రకృతికి మూలమైన యజ్ఞానమే. అజుడు అవ్యయుడునైన పరమేశ్వరుడు పుట్టినవాడుగా పెరిగినవాడుగా ఎన్నో కార్యములను చేయుచున్నవాడుగా లోకులకు తోచునట్లు చేయునదియే మాయ. పరమాత్మనుగా గుర్తింపకున్నను అనేకులు సన్నిహితులు కూడ శ్రీకృష్ణుని విష్ణుదేవుని యవతారముగా తెలిసికొనలేక పోవుటకు కూడ ఈ మాయయే కారణము.

అవతారప్రయోజనములలో ధర్మసంస్థాపనమును పేర్కొని భగవంతుడు, "గుణకర్మల విభాగము ననుసరించి నాలుగు వర్ణముల పద్ధతిని నేను సృష్టించితిని" అని చెప్పుట గమనింప దగియున్నది. దేవమనుష్యాదిలోకములను బ్రహ్మదేవుడు సృష్టించుచుండగా లోకవ్యవస్థకు ప్రధానసాధనమైన చతుర్వర్ణవిధానమును (Main means of administration) విష్ణుదేవుడు సృష్టించినాడు. కావున కాలవశమున సడలిపోవుచున్న చతుర్వర్ణవిధానమును చక్కబెట్టుటయే ఆయన నిర్వహించు ధర్మసంస్థాపన మని గ్రహింపవలసియున్నది. కాబట్టి ధర్మము నుద్ధరింపవలె నని లోకసంగ్రహము గావింపవలె నని ప్రయత్నించు ప్రతివ్యక్తియు భారతదేశమున చతుర్వర్ణవిధానమును చక్కబెట్టుటకే ప్రయత్నింపవలె. ఈదేశమున ఈవర్ణవిధానము దృఢముగా నెలకొనినప్పుడు, ఈ ధర్మముయొక్క ప్రభావముచేత ఇతరదేశములందు కూడ మానవసమాజములలో సామాన్యధర్మములు విశేషధర్మములు శాంతి భద్రతలు నెలకొనగలవు.

వర్ణధర్మములు ఈకాలమునకు పనికిరావు అని కొందఱు తలంచుచుండుట అసంగతము. లోకవ్యవస్థకొఱకై పరమేశ్వరుడు ఏర్పఱచిన విధానము అన్నికాలములలో పనికి వచ్చునదిగానే యుండును, గాని కొన్నికాలములలో

పనికిరానిదిగా నుండదు. అప్పు డది సనాతనధర్మము కానేరదు సనాతన మనగా ఎల్లప్పుడు ఉండునది అని యర్థము. అది యట్లు సనాతనము కాకున్నచో ఆయనయే అది ఏకాలమునందు పనికిరాదో ఆకాలమును నిర్దేశించి యుండెడివాడు. ఆయన అట్లు చెప్పలేదు. లోకవ్యవస్థకొఱకై ఆయన ఏర్పఱచిన విధానము, ఈకాలమునకు పనికి రాదని చెప్పుట ఆయనయొక్క సర్వజ్ఞత్వమును సర్వశక్తిమత్త్వమును శంకించుటయే యగును. భగవంతుడు సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు అని చెప్పుచు ఆయన ఏర్పఱచిన విధానము పనికిరానిదనిచెప్పుట అసంగతము. అట్లు చెప్పువాడు నాస్తికుడే యగును.

మఱికొందఱు చతుర్వర్ణవిభాగము మంచిదే అని అంగీకరించుచు, వర్ణములు జన్మసిద్ధములు కా వని, వ్యక్తులయందు ప్రకట మగుచుండు గుణములను బట్టి, వివిధకర్మలయందలి యాసక్తి అభినివేశము కౌశలము మొదలగువానినిబట్టి ఏర్పఱుపదగిన వని వాదింతురు. "గుణములయొక్క కర్మలయొక్క విభాగము ననుసరించి నాచేత చాతుర్వర్ణ్యము సృష్టింపబడినది" అని ఇచ్చట చెప్పి, "బ్రాహ్మణక్షత్త్రియవైశ్యులకు శూద్రులకు స్వభావప్రభవములైన గుణములచేత కర్మలు విభజింపబడినవి" అని తరువాత చెప్పియుండుటవలన వ్యక్తులగుణములను బట్టి ఎప్పటికప్పుడు వారివర్ణములను నిశ్చయించి, ఆవర్ణములకు దగిన కార్యములయందు వారిని నియోగింపవలయు నని వారు ఉద్ఘాటింతురు.

శ్లో॥ బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాం చ పరంతప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥ 41

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 42

చతుర్వర్ణవిభాగము "నాచేత సృష్టింపబడినది" అని భగవంతుడు చెప్పినాడు, కాని పదిమంది చేరి ఎప్పటి కప్పుడు ఏర్పఱచుకొనవచ్చు నని చెప్పలేదు. అట్లే ఆ యా వర్ణములయొక్క కర్మలు స్వభావప్రభవములైనగుణములచేత విభజింపబడియున్న వని చెప్పినాడే కాని తాత్కాలికముగా వ్యక్తులయందు ప్రకటము లగుచుండు గుణములనుబట్టి ఆయావ్యక్తుల వర్ణకర్మములను కొందఱు నిశ్చయింపవచ్చు నని ఆయన చెప్పలేదు. "విభజింపబడినవి" (ప్రవిభక్తాని) అని ఆయన చెప్పుటవలన, అవి ఆయనచేత, అనగా ఆయన శాసనరూపమైన శ్రుతిస్మృతులచేత, స్వభావసిద్ధములైన గుణముల ననుసరించి విభజింపబడిన వనియే గ్రహింపవలసియున్నది. ఎవరిచేత విభజింపబడిన వని ప్రశ్నించినప్పుడు, గుణములచేత విభజింపబడిన వనుట పొసగదు. గుణములు అచేతనములు అవి విభజింప లేవు కావున వానిని అనుసరించి చేతనుడైన యీశ్వరుడే విభజించి శ్రుతిస్మృతుల మూలమున ప్రకటించె ననియే చెప్పవలసియున్నది.

స్వభావ మనగా ఈశ్వరునియొక్క త్రిగుణాత్మకమైన ప్రకృతి. ప్రభవ మనగా కారణము. ఈ ప్రకృతియందలి గుణములయొక్క సంయోగభేదములవలన చరాచరమైన

సకలసృష్టియందు ఒక్కొక్క పదార్థమునకు, ఒక్కొక్క వ్యక్తికి, భిన్న భిన్నములైన ప్రకృతులు లేక స్వభావములు, ఏర్పడుచున్నవి బంగారము, వెండి, రాగి, ఇనుము మొదలుగా ఒక్కొక్క పదార్థమునకు ఒక్కొక్క ప్రకృతి (properties of matter) నియతమై యుండుట ప్రసిద్ధమే. అట్లే సింహము, వ్యాఘ్రము, ఏనుగు, గుఱ్ఱము మొదలుగా జంతువులకు, దేవతలు గంధర్వులు మనుష్యులు రాక్షసులు మొదలుగా వ్యక్తులకు ప్రత్యేక ప్రకృతులు నియతములై యున్నవి. ఆవిధముగానే సత్త్వప్రధానముగా బ్రాహ్మణ ప్రకృతి, సత్త్వము అంగముగా రజస్సు ప్రధానముగా క్షత్రియప్రకృతి, తమస్సు అంగముగా రజస్సు ప్రధానముగా వైశ్యప్రకృతి, రజస్సు అంగముగా తమస్సు ప్రధానముగా శూద్రప్రకృతియు ఏర్పడుచున్నవి. బంగారము మొదలగువానికి, సింహము మొదలగువానికి ఆయా ప్రకృతులు జన్మసిద్ధము లైనట్లే బ్రాహ్మణాదుల ప్రకృతులు కూడ జన్మసిద్ధములే. బంగారము వెండి యగుట సింహము వ్యాఘ్ర మగుట ఎంత యసంభవమో బ్రాహ్మణుడు క్షత్రియు డగుట అట్లే అసంభవము. శక్తిహీనమైన సింహము నీచసింహ మగునేకాని వ్యాఘ్రము కాదు. అట్లే గుణహీనుడైన బ్రాహ్మణుడు నీచబ్రాహ్మణు డగునే కాని క్షత్రియుడు గాడు.

ఆయావర్ణముల ప్రకృతులకు అనుకూలముగా వృత్తులు నిర్దేశింపబడుచున్నవి. బ్రాహ్మణులకు అధ్యయనము అధ్యాపనములు మొదలగునవి ఉచితములు క్షత్రియునకు యుద్ధము, ప్రభుత్వము ఉచితములు. కాని పరిస్థితులనుబట్టి వీరు భిన్నవృత్తులను అవలంబించుట తటస్థింపవచ్చును అంతమాత్రమున ఆవృత్తులనుబట్టి జన్మసిద్ధములైన వర్ణములు మారవు. ఘోరయుద్ధమొనర్చిన ద్రోణాదులు క్షత్రియులు కాలేదు. ధర్మతత్త్వోపదేశములు గావించిన భీష్ముడు శ్రీకృష్ణుడు బ్రాహ్మణులు గాలేదు. కావున వృత్తులనుబట్టి జన్మసిద్ధములైన వర్ణములు మారవు

జన్మాంతర సంస్కారవశమున, అనగా ప్రారబ్ధమువలన, ప్రతివ్యక్తి స్వభావము, దానికి అనుగుణమైన దేహము కలుగుచున్నది. ప్రారబ్ధమువలన ఒకానొకవ్యక్తి ఒకవర్ణములోని తల్లిదండ్రులకు జన్మించుచున్నాడు. పుట్టుచున్న దేహముతోపాటు వర్ణముకూడ సిద్ధమగుచున్నది. పుట్టిన తరువాత ఆదేహమును వదలి మఱియొక శరీరమును పొందుట ఎంత అసంభవమో, పుట్టుకతో వచ్చినవర్ణమును మార్చుకొనుట కూడ అంతగా దుర్ఘటమే. అందువలన జన్మసిద్ధమైన వర్ణముయొక్క ధర్మమే వ్యక్తికి స్వధర్మ మగును, కాని వానియందు తాత్కాలికముగా గోచరించు వృత్తికౌశలమునుబట్టి స్వధర్మ మేర్పడదు

ఈ సందర్భమున వర్ణవ్యవస్థ జన్మసిద్ధమే గాని మానవులు తమయిష్టానుసారముగా రూపొందించుకొన్న విధానము కాదని ఆధునిక శాస్త్రవేత్తలు సిద్ధాంతీకరించుట గమనింపదగియున్నది. 1988 మేనెల 2వ తేది ఇండియన్ ఎక్స్ప్రెస్ (Indian Express) పత్రికలో ఒక శాస్త్రజ్ఞుల సమావేశములోని చర్చాసారాంశము ఇట్లు ప్రకటింపబడినది

"జీవకణములు వర్ణమును నిర్ణయించినవి. బేడేకర్ ధానే, మే 1 (పి.టి.ఐ.) ఇండియన్ ఎక్స్‌ప్రెస్, మే 2, 1988

ప్రాచీనమైన భారతీయ వర్ణాశ్రమవ్యవస్థ, బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులను చతుర్వర్ణ విభజనము, మానవనిర్మితమని మీరు ఇన్నియేండ్లుగా ఆలోచించుచున్నచో, మీరు ఆవిశ్వాసమును మార్చుకోవలసిన సమయము ఎతెంచినదని విద్యాప్రవీణులు (Doctors) చెప్పుచున్నారు.

"ఈవిభజనపేధానము జననసంబంధముగా సహజములైన లక్షణములవలన అప్రయత్నముగా ప్రకృతిపద్ధతియందే రూపొందినపబడినదే కాని, సాధారణముగా లోకము నమ్ముచున్నట్లుగా, ప్రత్యేక సౌకర్యములు గల యొక ప్రజలతరగతిని నెలకొల్పుటకై ప్రయత్నపూర్వకముగా యథార్థముగా ఎప్పుడును నిర్మింపబడలేదు" అని డాక్టర్ విజయ్ బేడేకర్, డాక్టర్. యు.యమ్. వైద్య అనువారు ప్రాచ్యవిజ్ఞానాధ్యయన సంస్థచే నిన్న వర్ణాశ్రమవ్యవస్థను గూర్చి ఏర్పాటు చేయబడిన చర్చానమావేశమునందు వాదించినారు.

వారు ఇట్లన్నారు. "జీవకణరూపవిశేషములు లేక జీవకణ నిర్మాణపద్ధతులు అను వానిపై ఆధారపడి వివిధ జాతులలో వర్ణములలో ఉన్న నిశ్చితములైన వ్యక్తీకరణములు లక్షణములు, "ఫెనోటైప్స్" అని పేర్కొనబడుచుండినవి, వానిని మార్చుటకు గాని, విధ్వంస మొందించుటకు వీలు లేదని మేము కనుగొనినాము. అవి సమాజమునకు పునాదిలక్షణముగా నిలిచియుండును. వర్ణవిధానములో ఒకరు ఎక్కువ ఇంకొకరు తక్కువ అను భావముల దుష్ప్రవృత్తి అహంకారముచేత, అపోహచేత మానవులవల్లనే ఏర్పడినది. మనుష్యులలో మౌలికములైన భేదములు రక్తకణ నిర్మాణదశయందే ఏర్పడుచున్నవను సిద్ధాంతమువలన "మానవు లందఱు సమానులు" అను మిధ్యావాదము పటాపంచలగుచున్నది.

1865లో గ్రెగర్ మెండెల్ అను అస్ట్రియాదేశీయుడైన పరివ్రాజకుడు జీవకణముల వారసత్వ సిద్ధాంతమును ప్రతిపాదించినాడు జన్యుశాస్త్రమున కొనసాగిన పరిశోధనలవలన కొన్ని విధములైన పుట్టకురుపులు, హృద్రోగములు మదుమేహము, రక్తప్రసారముయొక్క ఉల్బణత్వము, కడుపులోని పుండ్లు, లైంగిక వ్యాధులు మొదలగునవి కుటుంబములలో నిర్దిష్టములైన జన్యులక్షణముల పద్ధతిలో ప్రసరించుచున్నవని స్పష్టమైనది. ఈవిదముగానే శరీరముయొక్క ఎత్తు, చర్మముయొక్క కన్నులయొక్క రంగు, వ్రేలిముద్రలు తెలివితేటలు మొదలైన సామాన్యలక్షణములను ఒక్కొక్క జాతిలో గుర్తింపవచ్చు.

ప్రజలలో పుట్టుకతో వచ్చినలక్షణములవల్లనే మొట్టమొదట జాతులు పైకి వచ్చినవి. వృత్తులనుబట్టి తరువాత కాలమున ఆయావర్ణములకు నామములు తగిలింపబడినప్పటికి జాతులు మాత్రము వృత్తులవలన ఉద్భవింప లేదు.

సంప్రదాయ వర్ణవ్యవస్థ, బ్రాహ్మణులకు ఆధ్యాత్మిక విషయాలశాఖను గురుపీఠమును, క్షత్రియులకు రాజనీతిని పరిపాలనను, యుద్ధనిర్వహణమును, వైశ్యులకు క్రయవిక్రయములను, ఎగుమతిదిగుమతుల వ్యాపారమును, ఈ మూడువర్ణములవారు చేయుటకు సంకోచించు శరీరశ్రమతో కూడిన గృహకృత్యములను సేవావృత్తులను శూద్రులకు అప్పగించినది.

తరువాతికాలమున ఈవిధానమున నలువవర్ణము కల శూద్రుల విషయమున ద్వేషముతో కూడిన యధికత్వాల్పత్వములతో వ్యథాకరమైన వైషమ్యము ప్రబలినను, ఆరంభమున వివిధవ్యక్తులయొక్క సామర్థ్యములను పరిమితులను పరిగణించుచు సౌమనస్యముతో సహకారముతో పరిశ్రమను కార్యోన్ముఖముగా చేయుటకొఱకే ఈ శ్రమవిభాగవిధానము ఉద్దేశింపబడినది.

శరీరలక్షణములచేత బ్రాహ్మణునకు సామాన్యముగా అసాధ్యములై శరీర శ్రమ పూర్వకములైన పంటలు పండించుట మొదలైన కృత్యములను శూద్రులు తమబాధ్యతనుగా స్వీకరించి రని యీడాక్టర్లు నిర్దేశించిరి.

ముఖ్యములైనకొన్ని గుణములు ఆచరణమున అభివ్యక్త మగుటకు (Phenotype expression) ఆవశ్యకమైన జీవకణనిర్మాణము కొంత మందియందు ఉండదు. అట్టివారికి ఆయావృత్తులవలన గరిష్ఠ పరిమాణములో వస్తువుల యుత్పత్తి లభించుటకై వర్ణవిధానము రూపొందింపబడినది.

ఒక్కొక్క జాతి తనకు తగినవృత్తిని స్వీకరించుటచే నాలుగువర్ణములు స్థిరీకృతములైన వని, ఆయావ్యక్తులకే కాక సమాజమునకంతకు ఉపకారకములైనకొన్ని లక్షణములను భద్రపఱచుటకై, వానిని ఆయావర్ణములలోనే పోషించి రని, విశిష్టమైన స్వభావప్రవర్తన నియమములతో సామాజిక వ్యవస్థ ఏర్పాటు చేయబడిన దని డాక్టర్ వైద్య ఉద్ఘాటించినాడు.

శ్రీ యమ్.వి. మహాశబ్దే, పూనేలో జ్ఞాన ప్రబోధినియందు పరిశోధనాధికారిగా (Research Officer) పనిచేసి విశ్రాంతి నొందిన పండితుడు, శిల్ప శాస్త్రముపై వర్ణవిధానమునకు గల ప్రభావమునుగూర్చి ఇట్లు ఉదాటించినాడు. "సమరాంగణసూత్ర" మొదలగు ప్రాచీన శిల్పశాస్త్రగ్రంథముల పరిశోధనమువలన (పదియవ శతాబ్దమునకు చెందినవి) గృహముల నిర్మాణమునకు ఉపయోగించు స్థలములే కాక ఇటుకలు కొయ్య మొదలగు వస్తువులు కూడ గుణముల యొక్క గురుత్వమునుబట్టి లఘుత్వమునుబట్టి బ్రాహ్మణము క్షత్రియము వైశ్యము శూద్రము అను నామములతో విభజింపబడియున్నవి. ఈ విధముగానే ఏ వృక్షములనుండి కొయ్యలను కొట్టి తెచ్చుచున్నారో అవి కూడ నాలుగు వర్ణములుగా నిర్దేశింపబడినవి. బ్రాహ్మణగృహములకు ఏవైపుగానైన ముఖము ఉండవచ్చును, కాని తక్కిన వర్ణముల గృహములకు ఒక్కొక వర్ణమునకు ఒక్కొక్క దిక్కు నిర్దేశింపబడినది.

నాగపూర్ నుండి వచ్చిన ఆచార్యుడు సహస్రబుధే ఒక మంత్రమే నాలుగు వర్ణములవారికి ఎట్లు భిన్నములైన ఫలముల నొసంగునో వివరించినాడు. జపము చేత బ్రాహ్మణునకు అంతరంగమున, బహిరంగముగా సమాజమునకు లాభమును కలిగించు మంత్రమే, క్షత్రియులకు ఆంతరంగికముగా మాత్రమే లాభించును. అదియే వైశ్యునకు నిష్ఫలమై, శూద్రులకు విరుద్ధమైన ఫలము నొసంగును ఈ చతుర్వర్ణవిభాగమున ఉత్తమమైన ప్రతిభకలవారు ఇతరులకంటె ఎక్కువగా పరిశ్రమించుచు అధికముగా త్యాగములు చేయుచు బాధ్యతలను వహించుచుండి రని ఆయన చెప్పెను"

## GENES DETERMINED VARNA : BEDEKAR

Indian Express, May 2, 19 THANE, May 1 (PTI). If you have been thinking all these years that the ancient Indian Varna - Ashrama Institution the four fold division of society into Brahmanas, Kshatriyas, Vaishyas and Sudras, was man-made, now is the time to revise your belief, say doctors.

The classification was never really made deliberately to establish a priveleged class of people as commonly believed, but automatically in the natural course due to inherant genetic characteristics, Dr Vijay Bedekar and Dr. U.M. Vaidya, argued at a day long Seminar on Varna-Ashrama institution in ancient India organised here by the Institute for Oriental Study

We find definite expressions and characters in different Jatis or Castes Caued Phenotypes which being based on Genotypes or Genetic Constitutions cannot be changed or destroyed. They remain as a basic character of society while the evil of caste system with its ideas of superiority and inferiority was man made due to human ego and understanding, the doctors said.

The doctors said there were fundamental differences between men at the cellular level itself which exploded the myth that all men are equal. The principle of heredity propounded by the Austrian Monk Gregor Mendel in 1865 and subsequent researches in genetics had shown thaty certain forms of cancers, coronary heart diseases, diabetes, hypertension, ulcer and other ailments including sex related diseases, showed definite tendency to run in families. Likewise, common traits like stature, finger prints, intelligence quotients, colour of the skin and eyes were discernible in particular Jatis

The Jatis once originally emerged from inborn qualities in people and did not arise due to the profession they were engaged in though later they came to be labelled as such-and-such castes depending on their professions.

Traditional Varna-Ashrama system had entrusted Brahmins with the spiritual portfolio and the sceptere of the teacher, Kshatriyas with politics administration and conduct of wars, the Vaisyas with trade and commerce and the Sudras with manual and menial chores shunned by other classes.

How this division of labour which later acquired obnoxious superiority inferiority overtones mingled with hatred of the black skined Sudras was thus conceived as a harmoniuous cooperative moblisation of labour respecting the abilities and limitations of various individuals

Sudras had taken the responsibility of growing food crops and other labour oriented tasks which in normal course was impossible for brahmin with different bodily characteristics, the doctors pointed out Varna system was organised for the optimal output especially for benefit of those who may have lacked the requisite Genotype background for phenotype expression of certain vital qualities, they said

According to Dr Vaidya, Each jati chose its professions and four Varnas came to be founded To preserve certain characteristics which were good not only for the individuals but for society they were bred in those castes only To develop specialised qualities an environment comprising certain behavioural and social system was created

---

Speaking on the influence of Varna on Silpa Sastra Mr. M V. Mahashabde, Retd , research Officer Jnana Probodhini, Pune, said a study of Samarangana Sutra and other old Silpa treatises (10th Century) revealed that lands on which houses were constructed as well as building materials like bricks and wood were named as Brahmana, Kshatriya, Vaishya and Sudra designating the range of quality from superior to inferior Similarly trees from which wood was cut were known by the four Varnas Brahmin houses could face all directions, while one particular direction was specified for houses of other classes

---

Prof. Sahasrabudhe from Nagpur explained that the same mantras gave different results for the four classes It benefited the Brahmin internally and externally the society, the Kshatriyas only internally, the Vaisyas experienced no effect while adverse reaction was caused in the case of Sudras He said under the `Chaturvarna' (four varnas), the most talented people had a responsibility to shoulder more work and make more sacrifices

("TRUTH" - A Weekly Magazine, 91, Chowringhee, Calcutta - 20 , Pages 124 to 126, Vol No 56, No 8, Friday the 27th May 1988 13th Jaistha 1395 B S , Samwat 2043, Kali 5088)

ఈ చర్చాసమావేశ (seminar) నివేదికా ప్రకటనమున గమనింపవలసిన యంశములు అనేకములు కలవు దీని యనువాదమును ఆంధ్రప్రభ (దినపత్రిక) 2.5 1988

తేది, "వర్ణవ్యవస్థ వెనుక జన్యుపురాణం" అను శీర్షికతో ప్రకటించినది. జన్యుశాస్త్ర మనియో జన్యువిజ్ఞాన మనియో పేర్కొనక **"జన్యుపురాణం"** అని నిర్దేశించుటవలన ఈవిషయమున సంపాదకమహాశయునకు ఎంత అనాదరము, విసుగు ఉన్నదో వ్యక్త మగుచున్నది ఏమైనను, వర్ణవ్యవస్థ ప్రకృతిసిద్ధ మైనదే ఎవరో కొందఱు అగ్రవర్ణములవారు తమ స్వార్థమునకై నిర్మించినది కా దని జన్యుశాస్త్రము ననుసరించి నిశ్చయింపబడుట సంతోషకరము. "నా యధ్యక్షతయందు సచరాచరమైన జగత్తును ప్రకృతి ఉత్పాదించుచున్నది" (మ యాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్ - భగవద్గీత - అధ్యాయ - 9 - శ్లో 10) అని భగవంతుడు చెప్పియుండుటవలన, ఈశ్వరునియభిమతము ననుసరించియే వర్ణవ్యవస్థ ఉత్పన్నమైన దనుట స్పష్టము.

"మానవు లందఱు సమానులు" **(All men are equal)** అను నినాదము అసత్య మని తెలినతరువాత ప్రకృతియందే భూములలో, కొయ్యలలో, వృక్షములలోని గుణముల ఎక్కువతక్కువలను బట్టి వర్గీకరణము, దరల నిర్ణయము జరుగుచుండగా మనుష్యులలో మాత్రము ఎక్కువ తక్కువలు లే వనుట సహేతుకము కాదు. సారవంతమైన పొలమునకు ఇచ్చు దరను చవిటి నేలకు ఈయరు. పందెపు గుఱ్ఱమునకు (Race course Horse) ఇచ్చు దరను, బండినిలాగు గుఱ్ఱమునకు ఈయరు. ప్రదానమంత్రికి నమస్కరించినట్లు బంట్రోతునకు నమస్కరింపరు. శిష్యుడు చక్రవర్తి యైనను గురువునకు పాదాభివందనము చేయును. అంధువలన గురుస్థానమందున్న బ్రాహ్మణులు సమాజమునకు వందనీయు లైరి. పాలకులైన క్షత్రియులు, సంపన్నులైన వైశ్యులు తక్కివారికి వంద్యులైనారు. ఈ యెక్కువ తక్కువలు ఏనా డైనను క్రమశిక్షణకు ఆవశ్యకమే. రాజకీయపక్షములందు కూడ నాయకుని శ్రేష్ఠునిగా తమకంటె గొప్పవానినిగా కార్యకర్తలు **(party workers)** భావింవకున్నచో ఆ పక్షములు బ్రదుకజాల వనుట నిరూఢమైన సత్యము. ఇటీవలి కాలమున పంచాయితీల ఎన్నికలు ప్రవేశించువఱకు పల్లెలలో ప్రజలు పరస్పర సహకార సౌమనస్యములతో ప్రశాంతముగ జీవించుచుండి రని ఎల్లరకును విదితమే. ఎన్నికలవలన అధికార వ్యామోహము ప్రబలినంతనే వర్ణద్వేషములు కులవైరములు రాజకీయస్వార్థముతో ఇరుపక్షముల వారిచేత ప్రచారమొనరింపబడి ప్రబలము లైనవి. ఈ ద్వేషములు వైరములు పోవలయు నన్నచో వర్ణరహితము వర్గరహితము నైన సమసమాజమును నెలకొల్పవలయు నని కొందఱు వాదింప మొదలుపెట్టిరి అలలు లేకుండ సముద్రము ఎట్లు ఉండదో అట్లే ఏరూపములో నైన వర్గములు వర్ణములు పిన్నలు పెద్దలు మొదలుగా విభేదములు లేకుండ ఎప్పుడును ఏ సమాజము ఉండదు వైవిధ్యముతో కూడినవిషమత్వమే సృష్టికి లక్షణము **(Imbalance with Variation is the property of creation)** సర్వసమత్వము ప్రళయమునకు లక్షణము. సత్త్వ, రజస్తమస్సు లను మూడు గుణములు సమస్థితికి వచ్చినప్పుడు ప్రళయము సంభవించును. భూమి నీరు విత్తనము అనునవి భిన్నములుగా నున్నప్పుడే వృక్షము ఉద్భవించును ఈ మూడును తమ గుణములను కోల్పోయి సమత్వము

నొందినచో ఏదియు ఉద్భవింపదు. (Absence of variation is the negotion of creation) కావున సృష్టియందు భేదములు హెచ్చుతగ్గులు తప్పవు. ఆ భేదములను, అధికత్వము, అల్పత్వము మొదలగు భావములను సంఘర్షణ ముఖముగా (towards conflict) కాక సమన్వయముఖముగా (towards adjustment) రూపొందించుకొనుటయే సమాజజీవనలక్షణము. ఇందులకే ప్రతిసమాజమునందు నీతులు ధర్మములు నెలకొల్పబడియున్నవి. వీనివలన పెద్దలయెడల పిన్నలకు గౌరవము భక్తి, పిన్నలయెడల పెద్దలకు అనురాగము వాత్సల్యము కలుగును. "వారు ఎక్కువ, మనము తక్కువ", "మనము ఎక్కువ, వారు తక్కువ (feelings of superiority and inferiority) అను భావములవల్ల కష్టనష్టములు ఏమియు కలుగవు. అధికులయెడ అసూయ (Inferiority complex), దుర్బలులయెడ తిరస్కారము (Superiority complex) ప్రబలినప్పుడే పరస్పర విద్వేషము, శత్రుత్వము సంఘర్షణము సంభవించును. బ్రిటిషువారి రాజనీతి ఈవిషయమున అమోఘముగా పనిచేసినది ఉద్యోగములలో వంతులు ఏర్పఱచి (Communal G O ) హిందువులకు ముస్లిములకు వైరమును కలిగించుటయే కాక, హిందువులలో ఆర్యద్రావిడభేదమును కల్పించి, ఆర్యులు ద్రావిడులను జయించి వారి దేశమును ఆక్రమించి రని, నల్లగా నున్న శూద్రులు మొదలగువారు ద్రావిడు లని, ఆర్యులు ద్రావిడులను అణగద్రొక్కుచున్నా రని విద్వేషబీజములను నాటినారు దానికొఱకు వారు జస్టిస్ పార్టీని కూడ నెలకొనునట్లు చేసినారు. ఆ విద్వేషబీజములు విషపూరితములైన మహావృక్షములుగా పెంపొంది విషఫలముల నొసంగజొచ్చెను. ఆ విషమూర్ఛితులై మనవారు గావించిన భయంకరమైన ఘోరకృత్యము దేశవిభజనము. దానికి శాఖలుగానే కాశ్మీరునకు ప్రత్యేక ప్రతిపత్తి, ఖలిస్తాన్ మొదలుగా వేర్పాటు వాదములు ప్రత్యేక నియోజక వర్గములు (separate electorates), కొన్ని కులములకు విద్యాశాలలో వృత్తులలో కేటాయింపులు (Reservations) ప్రబలము లయ్యెను. మానవు లందఱు సమానమే అని నినాదములు చేయువారు కులముల ప్రత్యేకతలను ప్రయత్నపూర్వకముగా పరిరక్షించుచుండుట ఆశ్చర్యకరము.

వర్ణములు జన్మసిద్ధములే కాని పుట్టిన తరువాత వ్యక్తుల గుణములనుబట్టి, వర్తనమును బట్టి, వృత్తులను బట్టి, ఏర్పడ వనుట చరిత్రాత్మకమైన సత్యము (Historical Reality). మహాయుద్ధ మొనర్చిన ద్రోణాదులు క్షత్రియులు కాలేదు. ధర్మోపదేశకులైన విదుర, సంజయ, శ్రీకృష్ణభీష్మాదులు బ్రాహ్మణులుగా పరిగణింపబడలేదు. రెడ్డిరాజులు, కాకతీయ చక్రవర్తులు తమ్ముగూర్చి చతుర్థకులజులనుగానే చెప్పుకొన్నారు, క్షత్రియుల మని పేర్కొనలేదు. ఈనాటికి అన్ని వృత్తులలో అన్ని వర్ణములవారు ఉన్నప్పటికి వర్ణములు మాఱుట లేదు. డాక్టర్లలో, ఇంజనీర్లలో, వ్యాపారములలో అన్ని వర్ణములవారు ఉన్నారు. తాత్కాలికముగా ఎవడు ఏ వృత్తి నవలంబించినను వానివర్ణము మాఱదనుట స్పష్టము. సృష్టిలో పశుపక్షి వృక్షాదులలో జన్మసిద్ధమైన జాతిలక్షణము గుణకర్మల చేత వృత్తులచేత మాఱనప్పుడు మనుష్యులలో మాత్రము మారు ననుట అసంగతము

(Illogical), అశాస్త్రీయము (unscientific) ఎద్దు సాధు వైనను, పోట్ల ఎద్దైనను, పొలము దున్ననది యైనను, బండి లాగునది యైనను ఎద్దే అగును కాని ఆవు కాదు, దున్నపోతు కాదు. కుక్కను ఎంత వేగము కలదానినిగ తయారు చేసినను గుఱ్ఱము కాదు. గుఱ్ఱము ఎంత హీన మైనను గాడిద కాదు. ఈ జాతుల నన్నింటిని, క్రూరమృగములైన పులులు సింహాము, సర్పములు మొదలగు జాతులను కూడ, ఎంతో శ్రద్ధతో వాని ప్రత్యేక లక్షణములు చెడిపోకుండ కాపాడుకొనుచున్న మేధావులైన మనుష్యులు తమలోని వివిధ జాతిలక్షణములను నిర్మూలింపవలయునని నినాదములు చేయుచుండుట విషమూర్ఛితుల ప్రలాపములే యగును. ఆంగ్లేయులు, అమెరికావారు, చైనావారు తమజాతి లక్షణములను వదలుకోవలయు నని చెప్పుట వలె, వర్ణములను నిర్మూలింపవలయు నని చెప్పుట కూడ అత్యంతము అసహజము అక్రమము.

సమాజమున సంభవించు కల్లోలములకు వర్ణభేదములు వర్గతారతమ్యములు మూల మని తలంచుట పెద్ద భ్రమ. సంఘర్షణములకు జనవినాశమునకు ఏ నాడైనను మూలము కామక్రోధములే.

రామరావణ యుద్ధమునకు మూలము రావణుని కామమే, కాని ఆర్యద్రావిడ భేదము కాదు. రాముడు ఆర్యుడు కాదు ; రావణుడు ద్రావిడుడు కాదు. ఆర్యశబ్దము సజ్జనత్వమును బోధించుపదమే, కాని జాతివాచకము కాదు. సజ్జను లందఱు ఆర్యులే, దుర్జను లందఱు అనార్యులే. సీతాదేవి, "ఆర్యా! జటాయూ" అని జటాయువును (ఆర్య! జటాయో) సంబోధించినది. కావున ఆర్యశబ్దము సద్వర్తనమును తెలుపునదియే కాని జాతివాచకము కాదు. రాక్షసులనుగూర్చి రావణునిగూర్చి ద్రావిడశబ్దము రామాయణమునందు ఎచ్చటను పేర్కొనబడలేదు. ద్రమిళు డనురాజు పాలించుటవలన దక్షిణదేశమునకు ద్రమిళ మను పేరు వచ్చినది. ఆపదమే కాలక్రమమున ద్రమిడ, ద్రవిడ, ద్రావిడ రూపములతో పరిణామమును పొందినది. కావున ద్రావిడ శబ్దము దేశవాచకమే కాని జాతి వాచకము కాదు. రాముడు రావణుడు జాతిచేత భిన్నులు కాదు. రామునివలె రావణుడు కూడ వేదాధ్యయనపరుడు , యజ్ఞకర్త. కావున వారిరువురును వేదసంస్కృతికి చెందినవారే. ఆర్యద్రావిడభేదము పెద్ద అభూతకల్పన. వాలి మరణమునకు, రావణుని పతనమునకు స్త్రీకామమే మూలము కాని, జాతిభేదము కాదు.

ఈనాటి రాజకీయ సంఘర్షణములకు కూడ వర్ణభేదములు కారణము కానే కాదు. ఎంగిలివిస్తరిని వీధిలో విసరివేసినచో అంతవఱకు ప్రశాంతముగ నున్న కుక్కలు మొఱుగుచు ఒకదానితోనొకటి కాట్లాడుకొనునట్లు పదవులు ఎఱగా కన్పించినంతనే "మనము నియోగులము, వారు వైదికులు" అని బ్రాహ్మణులు, "వారు పాకనాటివారు మనము పంటరెడ్లము" అని రెడ్లు, "మనము కమ్మవారము వారు కాపులు" అని కొందఱు ఒకవర్ణమువారే తమలో తామే భేదములు పైకితెచ్చుకొని కాట్లాడుకొనుచున్నారు. ఇందులో వర్ణధర్మముల ప్రసక్తి ఏ మున్నది. రాజ్యకాంక్షవలన స్త్రీ కామమువలన

సోదరులు సైతము పోరాడుకొనుచు నశించుట చరిత్రప్రసిద్ధము. కౌరవులు పాండవులు, పల్నాటియుద్ధమున నలగామరాజు మొదలగువారు ఒక వర్ణములోనే ఒకకులములోనే ఒక కుటుంబమునకే సంబంధించినవారు కారా ? కావున సంఘర్షణములకు జనవినాశమునకు స్వార్థము, దురహంకారము పదవీకాంక్ష మొదలగునవియే మూలములు కాని వర్ణబేదములు కాదు, వర్గబేదములు కాదు

కర్మాగారములలో యజమానులకు పారిశ్రామికులకు సామరస్య మున్నంతవఱకు సమస్యలే యుండవు యజమానులలోనో పారిశ్రామికులలోనో దౌష్ట్యము ప్రబలినప్పుడు సంఘర్షణము ఆరంభ మగును. అగ్రజాతులకు నిమ్నజాతులకు సంభవించు సంఘర్షణములకు కూడ దురహంకారము స్వార్థము కామము మొదలగు నవియే మూలకారణములు. ఎవరు అపరాదులో వారిని నిర్దాక్షిణ్యముగా శిక్షించుటయే ఈ సమస్యలకు పరిష్కారమగును గాని వర్ణభేదములను వర్గతారతమ్యములను పైకి తెచ్చి ప్రచార మొనరించుట ఓట్లను సంపాదించుకొనుటకు రాజకీయనాయకులు అవలంబించుచున్న కుటిలతంత్రమే. అది యే సమస్యను పరిష్కరింపకపోగా వైషమ్యములను వైరములనే దృఢపఱచుచున్నది. ప్రభుత్వము స్వచ్ఛంద సేవాసంస్థలు బలహీనవర్గములవారికి సాయము చేయుట, వారిపై బలవంతులు అత్యాచారములు గావించినచో అపరాదులను శిక్షించుట ఆవశ్యకమే గాని "నిమ్న జాతివారిపై అగ్రజాతుల దాడి" ఇత్యాదిగా కులముల పేరుతో ప్రకటనలు కావించుట సమాజములో భిన్నవర్గముల మధ్య వైరమును పెంచిపోషించుటయే యగును అంతే కాదు. ఒకవర్గమువారు మఱియొక వర్గమును పీడించుచుండగా న్యాయమును చేకూర్చలేని దద్దమ్మగా ఉన్న దని అంతర్జాతీయముగా మన ప్రభుత్వమునకు అపఖ్యాతిని కలిగించుచున్నది. హిందూముస్లిముల కలహముల విషయము కూడ ఇట్టిదే తప్పు చేసిన వారిని ఎవరినైనను దండింపవలసినదే కాని మతముల పేరుతో ప్రకటించుట అక్రమము, అన్యాయము. ఇట్టి ప్రకటనలవలన ఇతర ప్రాంతములలో ప్రతీకారచర్యలు ప్రబలుటకు అవకాశము కలిగించునట్లగుచున్నది ఇట్టి ప్రకటనలను పత్రికలలో చేయరా దని ప్రభుత్వము శాసనము కావించుట అత్యంతము ఆవశ్యకము

పై నివేదికలో, "ఈ విధానమున నలుపువర్ణము కల శూద్రుల విషయమున ద్వేషముతో కూడిన అధికత్వాల్పత్వములతో వ్యథాకరవైషమ్యమము **(obnoxious superiority inferiority overtones mingled with hatred of the black-skinned Sudras)** ప్రబలినను" అని మేదావులైన ఈ డాక్టర్లు తమ పరిధియైన శాస్త్రచర్చను అతిక్రమించి తమ ఊహలను చరిత్రాత్మక వాస్తవములనువలె (Historical facts) ప్రకటించుట భయంకరమైన సాహసము. వారు ఇట్లు భావించుటకు ప్రమాణ మేమి ? నల్లగా నుండుట **శూద్రులయందే కాదు వైశ్యులయందు కూడ బహుళముగానున్నది.** క్షత్రియులయందు అవతారపురుషులైన శ్రీరాముడు శ్రీకృష్ణుడు నల్లనివారు. విష్ణుదేవుడు

నీలమేఘశ్యాముడు. అర్జునుడు ద్రౌపది నల్లనివారు. వ్యాసభగవానుడు నల్లనివాడు. బ్రాహ్మణులలో ఎందఱో నల్లనివారు కలరు. శరీరవర్ణముచేత ఒక వ్యక్తి మఱియొక వ్యక్తిని గాని, ఒక వర్గము మఱియొక వర్గమును ద్వేషించినట్లు గాని మన యితిహాసపురాణములలో నిదర్శన మేదియు కానరాదు రాముడు రాక్షసులను, పరశురాముడు క్షత్రియులను నిర్మూలించుట ప్రసిద్ధమై యున్నది. ఆవిధముగా బ్రాహ్మణులు గాని క్షత్రియులు గాని శూద్రులను నిర్మూలించినట్లు గాని, లేక శూద్రులు పైవర్ణములవారితో వైరమును పూనినట్లు గాని ఒక్క దృష్టాంతము కూడ కన్పింపదు.

ఇంతే కాదు. విదేశీయులు మనదేశముపై దాడి చేసినప్పుడు శూద్రులైన కాకతీయ చక్రవర్తులు, రెడ్డిరాజులు కమ్మ ప్రభువులు వెలమవీరులు గోబ్రాహ్మణ రక్షణమునకై ప్రాణములకు తెగించి పోరాడినా రనుట చరిత్రాత్మకమైన సత్యము. మాన్యములు, ఇనాములు, అగ్రహారములు ఇచ్చి ఇంతకాలము బ్రాహ్మణులను పోషించుచు బ్రాహ్మణత్వమును రక్షించిన వారిలో నూటికి తొంబది తొమ్మిదిపాళ్ళు బ్రాహ్మణేతరులే యనుట పెద్దదీపమువలె వెలుగుచున్న సత్యము. విద్యావంతులుగా మేధావులుగా ప్రసిద్ధులైనవారు పాశ్చాత్య సంస్కృతికి పాదాభివందనము చేయుచున్న యీకాలమున కూడ, వేదపండితులను శిష్టాచారపరాయణులైన బ్రాహ్మణులను ఆదరించుచు సత్కరించుచు సమ్మానించుచున్నవారు బ్రాహ్మణేతరులే కాని బ్రాహ్మణులు అధికసంఖ్యాకులు కారు అనుట అందఱును గుర్తింపవలసిన వాస్తవము. ఆచారభ్రష్టులై నాస్తికులై సర్వభక్షకులై జాతిమాత్రముచేతనే బ్రాహ్మణులుగా చెప్పబడుచున్న వారివిషయముననే అనాదరమును ద్వేషమును ఇతరులు చూపుచున్నారు.

ఏ మైనను ఈ పరామర్శవలన, మానవసమాజము వర్ణములయొక్క గాని వర్గములయొక్క గాని తారతమ్యము లేకుండ ఉండుట, వివిధవృక్షజాతులయొక్క పశుపక్ష్యాదులయొక్క వర్గభేదములు లేని వనము యొక్క ఉనికివలె (Existence of a forest) అసహజ మని అసాధ్య మని అసంభవ మని స్పష్ట మగుచున్నది. వర్గభేద నిర్మూలనమునకై కంకణము కట్టుకొన్న మార్క్సుయొక్క కమ్యూనిజము (Marxist Communism) రష్యాలో ప్రభుత్వమును నిర్మించి తుదకు ఆదేశప్రజలు ఆహారపదార్థములకై అమెరికాదేశమును అర్థింపవలసిన దుర్గతికి తెచ్చినది. వారు కమ్యూనిజమును వీడి ప్రజాస్వామ్య విధానమునే అవలంబించుచున్నారు. కమ్యూనిస్టు ప్రభుత్వములుండిన యితరదేశములలో కూడ వర్గరహిత సమాజమునకు మాఱుగా కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలే (Communist Party Workers) విశేష సౌకర్యములను (Privileges) సంపాదించుకొని సంపన్నులై ప్రత్యేక వర్గముగా ఏర్పడి సాధారణ ప్రజలు వేఱొక వర్గ మైరి దానివలన, కలవారు లేనివారు, పీడకులు పీడితులు, దోచుకొనువారు దోచబడువారు అను వైషమ్యములు పెంపొంది సంఘర్షణములు సంభవించి ఆ ప్రభుత్వములు కూలిపోయినవి. కావున ఒకదశలో ఒకానొక విధముగా నున్న వర్ణములను నిర్మూలింపవలయు నని పూనుకొన్నచో అవి ఆరూపములను కోల్పోయి

తాత్కాలికముగా నశించినట్లు సమసమాజము ఏర్పడుచున్నట్లు గోచరించునే గాని నశింపవు. అవి మరల క్రొత్తరూపములతో సమాజమున ఏర్పడుచునే యుండును.

"కమ్యూనిస్టు సిద్ధాంతము మంచిదే. కాని దానిని అమలు జరుపుటలో సంభవించిన పొరపాటులవలన విషమఫలితములను సంభవించినవి" అని కమ్యూనిస్టు సిద్ధాంతప్రియులు కొందఱు వాదింతురు. ఈవాదము నిరర్థకము ఏసిద్ధాంతము ఎంత మంచి దైనను దానిని అమలు జరుపవలసినవారు మనుష్యులే ఏకాలమునం దైనను ఏ దేశమునం దైనను మనుష్య లందఱు మహాయోగులై యుండరు సాదారణ ప్రజలలో కామక్రోధలోభములు కొంత మందియందు అల్పముగా నున్నను కొంతమంది యందు అధికముగనే యుండును. ఉద్యమములు జరుగుచున్న కాలములో కార్యకర్తలు అనేకులు కామలోభములకు దూరు లైనట్లుగా త్యాగపరాయణులై యున్నను అదికారము చిక్కిన తరువాత పదవులకై ఒకరి నొకరు ధిక్కరించుచుండుట, చంపుచుండుట కూడ చరిత్ర ప్రసిద్ధమే. వారు, వారి సంతతివారు అధిక సౌకర్యములతో అధికారములతో ప్రత్యేక వర్గముగా (Privleged class) ఏర్పడుట సహజము. మనుష్యులలో అనివార్యములైన కామక్రోధలోభమోహములవల్ల సమాజమునందు ఎప్పుడైనను వర్గభేదములు తారతమ్యములు తప్పవు.

మనుష్యులకు జన్మసిద్ధముగా శరీరములు వచ్చినట్లే గుణదోషములు కూడ సంభవించుచున్నవి. వానికి సత్త్వరజస్తమస్సులను మూడు గుణములే మూలము. వానియొక్క పరస్పర సమ్మేళన ప్రకారములవలన (permutations and combinations) ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క స్వభావముగా అనంతములైన మనస్స్వరూపములు (Innumerable different forms of mental set up) ఏర్పడుచున్నవి. వీనిలో కొన్ని సమాన ధర్మములనుబట్టి (Simuliar properties) జాతులను అవాంతర జాతులను శాస్త్రజ్ఞులు గుర్తించుచున్నారు ఱెక్కలు కలిగి ఆకాశమున ఎగురుట అను లక్షణముచేత పక్షులన్నియు ఒక జాతియే అయినను, విశేషలక్షణముల చేత గ్రద్దలు, చిలుకలు, పిట్టలు మొదలుగా ఎన్నో అవాంతరములైన పక్షిజాతులను గ్రహించుచున్నాము. అట్లే పశువులలో వృక్షములలో ఎన్నో అవాంతర జాతులను గుర్తించి వానిని వానికి తగిన ప్రత్యేక పద్ధతులలో పోషించి వానివలన లాభములను పొందుచున్నాము. అట్లే శరీర నిర్మాణ విశిష్టత చేత (particular structure of the body) పశుపక్ష్యాదులకంటె భిన్నముగా మానవు లందఱు ఒకజాతియే యైనను, స్వభావ భేదములచేత ఎన్నో అవాంతర జాతులు (Types of human species) ఏర్పడుచున్నవి ధర్మపరిపాలనకొఱకు భగవానుడు ఈయవాంతర జాతులలో భరతవర్షమున ప్రధానముగా నాలుగింటిని నాలుగు వర్ణములుగా ఆ యా వ్యక్తులకు జన్మసిద్ధములైన గుణములనుబట్టి ఏర్పఱచి, వానికి ధర్మసాధకములైన కర్మలను నిరూపించినాడు. ప్రభుత్వము చక్కగా ప్రజలకు ఉపయోగపడుటకై రాజ్యాంగశాసనము (constitution) ఎట్లో అట్లే సమాజము యొక్క జీవన సామరస్యమునకు (Harmonious living of society) ఈ చతుర్వర్ణవిదానము ఆవశ్యకము.

మనుష్యులలోని కామక్రోదలోభమోహాదులు ఏ విధానమునందును పూర్తిగా నశింపవు. వానిని హద్దులలో నుంచి సమాజజీవనము చక్కగా జరుగుచుండునట్లు చేయుచుండుటయే ధర్మమునకు ప్రయోజనము. మృగములతో మనుష్యులతో వివిదక్రీడలను ప్రదర్శించు యజమాని (Manager of circus) వివిధ జాతుల మృగములను మనుష్యులను సమకూర్చి మృగములకు మనుష్యులకు విడివిడిగా స్థానములను ఆహారవిహారములను క్రీడానైపుణ్యములను కలిగించి పరస్పరము సంఘర్షణము సంబవింపకుండ క్రీడావినోదమును ప్రదర్శించును అట్లే మానవులు సహజములైన కామక్రోధములకు లోనై ఒకరినొకరు హింసించుకొనకుండ బగవంతుడు వర్ణధర్మములతో వారికి హద్దులను ఏర్పఱచినాడు. పెద్ద ఆస్పత్రిలో వైద్యులు రోగులను పరిశీలించి ఆయారోగములను బట్టి ఒక విధమైన రోగములు కలవారిని ఒక విభాగమున, మఱియొక విధమైన రోగములు కలవారిని మఱియొక విభాగమున (different wards) ఉంచి, ఆయావ్యాధులకు తగినట్లుగా చికిత్సలు చేసి ఆరోగ్యమును కలిగించుచుందురు. రోగుల నందఱను ఒకచోటనే ఒకగుంపుగా చేర్చరు. క్రమశిక్షణముతో నడుచుచున్న ఆస్పత్రియందు (disciplined) రోగి సంపన్నుడైనను పేదవాడైనను, గుణవంతుడైనను గుణహీనుడైనను రోగబేదము ననుసరించి, దానికై ప్రత్యేకింపబడిన విభాగమునందే (ward) ప్రవేశపెట్టబడి, తగిన చికిత్సావిధానమును (proper medical care) పొందును. ఆవిధముగానే సదృశములైన గుణదోషములు (similar good and bad qualities) కలవారు, ధనికులైనను దరిద్రులైనను, గుణవంతులైనను నీచులైనను, ఆయావర్ణముల పరిధిలోనే యుండి, అనేక రూపములతో కామక్రోధలోభమోహాత్మకమై క్రుంగదీయుచున్న సంసార మనుమహావ్యాది నుండి విముక్తులు కావలసియున్నది

ఈ కారణముచేత ఈవర్ణవిభజనము సాంఘికములు, ఆర్థికములు, రాజకీయములను అయిన ప్రయోజనములకొఱకు మాత్రమే ఏర్పఱుపబడినదని (socio - economic - polical structure) గ్రహింపరాదు. దీనివలన ఆ ప్రయోజనములు ఉన్నమాట నిజమే. వర్ణముల ననుసరించి వృత్తులు, వృత్తులలో భేదముల ననుసరించి కులములు ఏర్పడుటవలన వ్యక్తులకు వృత్తులు జన్మసిద్ధముగానే లభించుచుండెను. ఇతర కులములవారు తమవృత్తిలో ప్రవేశించి పోటీపడుదు రను భయము ఉండెడిది కాదు. వృత్తికి సంబంధించిన సాధన సామగ్రి ప్రతివ్యక్తికి కుటుంబమున ఆస్తిగా సంక్రమించుచుండెను కులవృత్తులు కొనసాగుటవలన ఆర్థికముగా ఎంతో లాబముండినది. జ్యోతిశ్శాస్త్రవేత్త యొక్క కుమారుడు జ్యోతిషమునే అవలంబించినచో తండ్రి సంపాదించిన గ్రంథములు, ఆయన వలన పొందగలిగిన విజ్ఞానము, మెళకువలు వానికి సులభముగా లబించును అట్లు గాక వాడు వైద్యమును మొదలు పెట్టినచో పై సామగ్రి యంతయు వ్యర్థ మగుటయే కాక క్రొత్త సామగ్రిని సంపాదించుకొనుటకు ధనమును వెచ్చింపవలసియుండును. మరల వాని కొడుకు వైద్యుడు కాక న్యాయవాది యైనచో వైద్యసామగ్రి అంతయు వ్యర్థమై క్రొత్తవృత్తికి క్రొత్త సామగ్రి అవశ్యక మగును

కులములు కట్టుబాటుతో నున్నప్పుడు, ఆకులములకు సంబంధించి యేర్పడు సమస్యలను కులములోని పెద్దలు ప్రభుత్వ దృష్టికి తెచ్చి, సులభముగా పరిష్కరించుకొనుచుండిరి కులములలోని పెద్దలకురాజుల యాస్థానములందు ప్రత్యేక స్థానము లుండెడివి. రాజునకు పట్టాభిషేకము జరుగునప్పుడు ఈ కులముల పెద్దలు కూడ రాజును అబిషేకించుచుండిరి.

కాలక్రమమున నాలుగు వర్ణములలో అనేక శాఖలు, అనేక కులములు ఏర్పడినవి. శాఖలవలన కులములవలన జన్మసిద్ధమైన వర్ణము మారదు. బ్రాహ్మణులలో కొందఱు రాజుల నాశ్రయించి పురోహితులు, కులబ్రాహ్మణులు, నియోగులు, అయినారు. శ్రీరామునికాలముననే వసిష్ఠాదులు పురోహితులుగా నుండిరి. వసిష్ఠుని కుమారుడు సుయజ్ఞుడు, సీతారాములు వనములకు పోవునప్పుడు, వారివలన ఎన్నో దానములను స్వీకరించెను. త్రిజటుడు అనుబ్రాహ్మణుడు ఎంతో పేదవాడయ్యును ఉంచవృత్తితో జీవించుచుండెనే కాని అయోధ్యాపరిసరములలో ఉండియు దానమును గైకొనుటకు రామునియొద్దకు రాలేదు. భార్యయొక్క నిర్బంధమువలన రాముని యొద్దకు వచ్చి గోవులను పరిగ్రహించెను. శ్రీకృష్ణుని మిత్రుడు సుదాముడు కూడ, ఎంతో దారిద్ర్యముతో కుచేలుడుగా నున్నను, శ్రీకృష్ణునియొద్దకు వచ్చుటకు ఇష్టపడలేదు; బార్యానిర్బందమువలననే వచ్చెను. మహర్షులు ఆశ్రమములలో నివసించుచు రాజులను ఆశ్రయింపక స్వతంత్రముగ జీవించుచుండిరి ; క్షత్రియులు యజ్ఞయాగాదులకు ఆహ్వానించినచో వచ్చి ఆక్రతువులను నిర్వహించి మరల ఆశ్రమములకే పోవుచుండిరి. ఇటీవలి కాలమున రాజనియోగములు, అనగా ఉద్యోగములు, ప్రబలి బ్రాహ్మణులనేకులు ఆ నియోగములలో, మంత్రులుగా దండనాధులుగా చేరి నియోగులైరి వైదిక వృత్తిలో ఉండినవారు వైదికులైరి. దూరప్రాంతములలో నున్నవారి అచారభేదములను శంకించుచు ఒక ప్రాంతములోని వారు తమలో తాము సంబంధములు చేసికొనుచు ఇతర ప్రాంతములవారికి దూరముగా నుండజొచ్చిరి. దేశభేదములనే నాడులు అనువ్యవహరించుచుండిరి. ఆవిధముగా వెలనాడు (ఆర్వేలనాడు), ములకనాడు పాకనాడు (ప్రాజ్నాడు-తప్పు సమానము) మొదలుగా నాడుల భేదములు పైకి వచ్చినవి. ఈనాడుల భేదములు తక్కిన వర్ణములవారికి కూడ ఏర్పడినవి. బ్రాహ్మణులు ఏనాడులో, ఏశాఖలో ఉన్నను హెచ్చుతగ్గులను బావించుచున్నను అందఱు బ్రాహ్మణులుగనే యుండిరి. క్షత్రియులలో కూడ సూర్యవంశము, చంద్రవంశము, అగ్నికులమువారు మొదలుగా ఎన్నికులములవారున్నను, ఉపనయన సంస్కారాదులను కలిగినవారందఱు క్షత్రియులుగానే యుండిరి వైశ్యులు కూడ ఇట్టి బేదములు కలిగియున్నను ఉపనయన వివాహాది సంస్కారములవలన వైశ్యులుగానే యుండిరి శూద్రులు కూడ వ్యవసాయము, కుమ్మరివృత్తి, కమ్మరివృత్తి మొదలుగా ఎన్నివృత్తులను అవలంబించినను వర్ణముచేత ఒక్కవర్ణము వారే.

ఒక వర్ణమువారు తమవర్ణములో ఏ అవాంతరశాఖలలోగాని అవాంతర కులములలో గాని వివాహ సంబంధములు చేసికోవచ్చు. నియోగులు వైదికులు వైష్ణవులు శైవులు కమ్మవారు రెడ్లు మొదలగువారు తమతమ వర్ణములలో పరస్పరముగా సంబంధములు చేసికోవచ్చు. వర్ణాంతర వివాహములు, మతాంతరములైన పెండ్లిండ్లు, ఒకవర్ణమునందే సగోత్రవివాహములు, స్త్రీల పునర్వివాహములు మాత్రమే నిషిద్ధములు.

కాని వర్ణవిధానమునకు ఇది మాత్రమే ప్రయోజనము కాదు. జీవులకు పరమగమ్యము మోక్షము. అనేక జన్మలలో కర్మయోగాదులచే క్రమముగా సంసిద్ధిని పొంది తరువాతవారు పరమగతియైన యాలక్ష్యమును పొందుచున్నారు. "అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్" (భగవద్గీత - అధ్యా. 6 శ్లో. 45) ఒక్కొక్క జన్మలో వారు గావించుచున్న కర్మలకు ఫలముగా వారికి పైజన్మలు కలుగుచున్నవి. ఏ జన్మలో నైనను తమకు విహితములైన కర్మలను ఆచరించుటే పరమేశ్వరారాధనమై దాని వలన ఈశ్వరుని యనుగ్రహముతో కర్మయోగముననో ధ్యానయోగముననో సిద్ధిని పొంది పై జన్మలో పైదశకు చేరుకొనుచున్నారు. "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః " (బగవద్గీత - అధ్యా. 8 శ్లో. 46) ఏ జన్మయందైనను ఎవనికి ఏది స్వకర్మ యగునో ఎట్లు తెలియును ? భారతదేశమున జన్మించినవారికి, భగవంతునిచే సృష్టింపబడిన చతుర్వర్ణవిదానము ననుసరించి, తల్లిదండ్రులవలన స్వధర్మము కర్మ ఏర్పడుచున్నవి (చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః" - భగవద్గీత - అధ్యాయ 4 శ్లో. 13) ఇతర దేశీయులు ఈ దేశములో జన్మించిన బ్రాహ్మణునియొద్ద శుశ్రూష చేసి తమకు ఏది స్వధర్మమో, ఏది యాచరణ విధానమో తెలిసికో వలసియున్నది.

శ్లో|| ఏత ద్దేశప్రసూతస్య సకాశా దగ్రజన్మనః |
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ||

మనుస్మృతి - అధ్యా - శ్లో.

కావున వర్ణాశ్రమ విధానము కేవలము సాంఘిక రాజకీయ ప్రయోజనాత్మకమై కొన్ని యుగములలో కొంతమందికి కొన్ని సమాజములకు మాత్రమే యుపయోగపడుటయే కాక, అన్ని కాలములయందు అఖిలమానవులయొక్క సర్వతో ముఖాబివృద్ధికి ఉపయోగపడునది యని గ్రహింపవలసియున్నది.

ఈ సందర్భమున మనకు సమకాలికులై జగత్ప్రసిద్ధులై నూఱేండ్లు జీవించి ఇటీవలనే (8.1.1994 తేదీ) పరమపదించిన జగద్గురువులు కంచి కామకోటి పీఠాపరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు తమయనుగ్రహభాషణములలో ఈ వ్యవస్థనుగూర్చి ఉద్ఘాటించిన యభిప్రాయములను గ్రహించుట ఆవశ్యకము. ట్రూత్ (TRUTH) అనునాంగ పత్రికయందు వారీయభిప్రాయములను సంపాదకులు ఇట్లు

"ఏ వర్ణములోనివారైనను శ్రద్ధాయుక్తములైన ధర్మానుష్ఠానములవలన జ్ఞానముయొక్క పరమగమ్యమును (ఆత్మసాక్షాత్కారమును) పొందవచ్చు నని ఆచార్యుడు చెప్పియుండియు, సమకాలీన ప్రపంచమున సమర్థించుటకు శక్యము కాని వర్ణవ్యవస్థను నిలుపుకోవలసినదే అని ఉద్ఘాటించెను. ఆయన ఇట్లు చెప్పెను "హిందుత్వముయొక్క విశిష్టత, దానియందున్న తత్త్వశాస్త్రముపై గాని, ప్రవర్తన నియమావళిపై గాని, దేవతా విజ్ఞాన శాస్త్రముపై గాని నిలిచియుండుట లేదు. ఆ విశిష్టతకొఱకు కుటుంబముపై వర్ణముపై ఆధారపడిన వంశపరంపరాగతమైన యొక క్రమశిక్షణమును పైవిషయములకు చేర్చవలసియున్నది" ఆయన యభిప్రాయము ననుసరించి "హిందుత్వముయొక్క వృద్ధిగాని పతనము గాని శాస్త్రవిహితమైన శ్రమయొక్క విభాగము పై (Division of labour) నెలకొల్పబడిన సాంఘికములైన క్రమశిక్షణలపై నేరుగా ఆధారపడియున్నది".

Though he stated that men of every caste could reach the highest goal of 'Jnana' (self realisation) through dedicated pursuits of Dharma, The Acharya advocated the preservation of the caste system, thus defending the indefensible in the contemporary world. Said the Acharya : The "distinctiveness of Hinduism does not rest on its philosophy, ethics or theology, but adds to them a hereditary discipline based on family and caste" The growth and decline of Hinduism was, according to him, directly dependent on the social disciplines founded upon a prescribed division of labour.

(P 583, Vol. 61, No. 37, 14 1.94, TRUTH)

## కాంచీపీఠ పరమాచార్యులు జగద్గురువులునైన శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి వారి సందేశము

"మనజాతి ఇప్పుడు శ్రేయస్కరమైన మార్గమునుండి తప్పిపోయినది. ఈ తరము వారియొక్క రానున్న తరములవారియొక్క శుభతరమైన భవిష్యత్తుకొఱకు మనజాతి మరల ఆ మార్గమున ప్రవేశించి పురోగమింపవలసియున్నది. "ధర్మము" అను పదము అనేక విషయముల సంగ్రహము. ఆపదముచేత ప్రవర్తన నియమావళి, నీతులును నిర్దేశింపబడుచున్నవి. వాని విలువలయొక్క పునస్స్థాపనముకొఱకు, అనగా తన సంక్షేమముకొఱకు సంఘటనాత్మకము శక్తిమంతమునైన యుద్యమమును మనదేశము ప్రగాఢముగా వాంఛించుచున్నది. అన్నిరంగములలో వ్యక్తుల శీలము విధ్వంసము నొందుచున్న యీసమయమున అంతరంగమున వ్యథ నొందుచుండియు, చూచుచు ఊరకుండుట, జాతియెడల మనకు గల కర్తవ్యము నుండి భ్రష్టులమై జాతియొక్క చైతన్యమును వంచించుటయే యగును"

**Message of His Holiness Paramacharya Sri Chandra Sekharendra Saraswati**

"Our Country's Welfare demands an organised, sustained movement to re-establish ethical and moral values - signified by the comprehensive term Dharma - so that the nation could regain its lost direction for a better future for the present generation and for posterity To remain passive, though distressed at heart, in this hour of all round crisis of character is a betryal of national consciousness and failure in national duty"

(P. 586, Vol 61, No. 37, 14 1 94 - TRUTH)

ఈ పత్రికాలేఖకుడు పైని పేర్కొన్నట్లుగా స్వామివారు సమర్థించిన వర్ణాశ్రమధర్మము నేటిసమాజమున సమర్థించుటకు శక్యము కానిదిగా, ఆచరణమున అసాధ్య మైనదిగా అనేకులకు తోచుట సహజము. అంతమాత్రమున మహామేధావి, వేదశాస్త్రవిజ్ఞాన నిధి, లోకజ్ఞుడును అయిన పరమాచార్యుడు తన జీవితమున సకలదశలలో ప్రచారమొనర్చిన యీ సనాతన వర్ణధర్మసందేశము అసమర్థము అసమంజసము అని తలంచుటకు వీలులేదు. సనాతన ధర్మము ఈకాలమునకు పనికిరాదని కొందఱు మేధావులు నాయకులు తలంచుచున్నారన్నచో విజాతీయ విజ్ఞాన సంస్కార మేదియో వారిదృష్టిని ఆవరించి సత్యమును గ్రహింపనీయకుండ అడ్డుపడుచున్న దని యూహింపవలసియున్నది. ఈ సందర్భమున కొన్ని యంశములను గమనింపవలసియున్నది.

ధర్మానుష్ఠానమునందు ఏకాలమునం దైనను వ్యక్తులకు దానియందున్న విశ్వాసమే ప్రధాన హేతువు ; కాలవశమున సంభవించునట్టి ఇబ్బందులు ముఖ్యము కాదు. ఎవడు దేనియందు విశ్వాసమును కలిగియున్నాడో ఆకార్యక్రమమును ఏపరిస్థితులయం దైనను అతడు అవకాశము ననుసరించి శక్తి ననుసరించి యనుష్ఠించుచునే యున్నాడు. విదేశీయుల దాడులు జరుగుచున్నప్పుడు జీవితము దినదినగండముగా నున్నప్పుడు కూడ వీరులు ధీరులైనవారు తాము నమ్మిన ధర్మకార్యములనువదలుకొనలేదు. కాకతీయచక్రవర్తులు, రెడ్డిరాజులు కమ్మనాయకులు, వెలమవీరులు వర్ణాశ్రమధర్మరక్షణము కావించుచునే యుండిరి. వారు దానికొఱకై ప్రాణములకు తెగించి పోరాడిరి. ఎందువలన ? వారికి దానియందు ప్రగాఢమైన విశ్వాసమున్నది. ఆరాజులు మంత్రులు సేనానాయకులు విద్వాంసులై యథార్థమైన భారతీయ సంస్కృతిని గ్రహించుటచే వారికి అట్టి విశ్వాసము కలిగినది. ద్విజులు కాని వారికి స్వరప్రధానమైన వేదాధ్యయనము నిషేధింపబడినది కాని, ఇతర శాస్త్రాధ్యయనము నిషేధింపబడ లేదు. వారు దేశభాషాకవులను పండితులను పోషించుచున్నను శాస్త్రగ్రంథములను కావ్యములను సంస్కృతముననే రచించిరి. వారు యదార్థముగా భారతీయవిద్యాసంస్కారవంతు లగుటచే వర్ణధర్మములు సమాజముయొక్క సంక్షేమమునకు ఆవశ్యక మని గ్రహించిరి. వారు తమ్ముగూర్చి చతుర్థకులజాల మని చెప్పుకొనుటకు గాని, బ్రాహ్మణులను పూజించుటకు గాని,

సంకోచింప లేదు. అగ్రహారాదుల నొసంగి అధ్యయన పరులు, అనుష్ఠానపరులు ధర్మప్రవక్తలును అయిన బ్రాహ్మణులను పోషించి బ్రాహ్మణత్వమును వారే రక్షించినారు. ఇప్పటికిని వారిలో పెద్దలు బ్రాహ్మణత్వమునకు దూరులైన బ్రాహ్మణాధములను అప్పుడప్పుడు అదలించుచు బ్రాహ్మణత్వమును నిలుపుటకు యథాశక్తిగా ప్రయత్నించుచునే యున్నారు

పాశ్చాత్య విద్యాసంస్కారమువలన, రాజకీయనాయకుల ప్రచారములవలన సామాన్యులకు వర్ణధర్మములయెడ విశ్వాసము సడలజొచ్చినది. స్వరాజ్యసమరము ముమ్మరముగా జరుగుచున్న దినములలో ఒకప్పుడు సహకార సంఘముల లెక్కలను తనిఖీ చేయు నదికారి (Inspector of Cooperative Societies) యొకడు నెల్లూరు సమీపమునందున్న బుచ్చిరెడ్డి పాళెమునకు పోయెను. ఒక పెద్ద రెడ్డిగారి కొడుకు ఆయూరిలో ఆసంఘమునకు అధ్యక్షుడుగా నుండెను ఆయధికారి వితంతువైన బ్రాహ్మణుడు , అనగా యజ్ఞోపవీత మనుతంతువును తీసివేసినవాడు ఆరెడ్డిగారి యింటిలో ఈయధికారి లెక్కలను చూచుచుండెను. మధ్యాహ్న మగుచుండగా రెడ్డిగారి కొడుకు వచ్చి "స్వామీ! మీ భోజనమునకు మా యయ్యవారి యింటిలో ఏర్పాటు చేసినాను, మీరు అక్కడికి పోయి భోజనము చేసి రండు. మరల లెక్కలు చూడవచ్చును అనెను. ఆ బ్రాహ్మణ వితంతువు నవ్వుచు, "ఇంకను ఈ బేదము లేమిటయ్యా! నాకు అటువంటి పట్టింపులు లేవు , నేను ఎక్కడ నైనను భుజింతును, మీ యింటియందు తినుటకు నా కేమియు యభ్యంతరము లేదు" అనెను వరాండాలో జరుగుచున్న యీ ప్రసంగమును లోపల నుండి పెద్దరెడ్డి వినుచుండెను. కుమారు డేదియో ఆ యదికారికి చెప్పబోవుచుండగా ఆయన కుమారునిలోనికి పిలిచి అధికారికి వినిపించునట్లు పెద్దగా ఇట్లనెను. "అబ్బాయీ! ఆయన తనకు ఏ బేదములు లే వని చెప్పుచున్నాడు కదా! మఱి ఎక్క డెక్కడ ఏ యే కొంపలలో ఏ మేమి తిన్నాడో మనకు తెలియదు. ఆ సంగతి మన కెందులకు ? ఆయనకు అన్నము ఇక్కడనే నీవు పెట్టినచో నా ప్రక్కన మాత్రము ఆయనకు విస్తరివేయకుము" ఈ మాటలను వినుచున్న యీ యధికారి సిగ్గుపడుచు, "సరే! నేను అయ్యవారి యింటికే పోవుదును" అనెను. వెంటనే ఆ పెద్దరెడ్డి దొడ్డివైపునుండి బార్యను అయ్యవారి యింటికి పంపి, ఆ వితంతుబ్రాహ్మణునకు వారివంట యింటిలో అయ్యవారి ప్రక్కన కాకుండ వరాండాలో భోజనము పెట్టు డని కబురు చేసెను.

రెడ్డిరాజులు కమ్మప్రభువులు మొదలగువారు కూడ వర్ణబేదములు లేని బౌద్ధము, జైనము, ఇస్లాము, క్రైస్తవము మొదలగు మతములను గూర్చి వినుచుండియు, రామాయణభారతాది గ్రంధములయందు శాస్త్రములయందు దృఢమైన పాండిత్యమును గలిగియుండుటవలన పరమతములయందలి సిద్ధాంతములను విమర్శించుచు మన వర్ణదర్మవిధానమే మనకు అవలంబనీయ మని దృఢముగా తలంచుచుండిరి మఱి యిటీవల సమాజములో నాయకులుగా పైకి వచ్చిన జవహర్‌లాల్ నెహ్రూ వంటివారు, వారి యనుయాయులు గురుశుశ్రూష చేసి భారతీయమైన ధర్మమును తత్త్వమును

అభ్యసింపక పోగా ఇక్కడ ఇతరదేశములలో కూడ పాశ్చాత్య విద్యచేత కలుషితములైన బుద్ధులతో, వర్ణధర్మములను గూర్చి ఆలోచనయే చేయకుండ, అవి యీకాలమునకు పనికిరావని ఉద్ఘాటించిరి మనసంస్కృతిని చక్కగా గ్రహించి విశ్వసించినరెడ్డిరాజులు మొదలగువారి వచనములు వర్తనము గ్రాహ్యము లగును, కాని మన సంస్కృతిని సక్రమముగా గ్రహింపక విజాతీయ సంస్కృతితో నినాదములు చేయుచున్న నేటి నాయకుల సిద్ధాంతములు వర్తనములు గ్రాహ్యములు కావు.

పరమాచార్యుడు చెప్పినట్లుగా మనము తప్పిపోయిన ధర్మమార్గమునందు మరల ప్రవేశింపవలయునన్నచో ఈ క్రింది యంశములను గ్రహించుట ఆవశ్యకము

1 ఈనాడు ఆంగ్లమున వ్యవహరించుచున్న ప్రభుత్వోద్యోగులు, మంత్రులు, రాజకీయ నాయకులు, శాస్త్రజ్ఞులు, వాణిజ్యనిపుణులు మొదలుగా సమాజ ప్రముఖు లందఱు ఆంగ్లముతో సమానముగా సంస్కృతమున వ్యవహరించు సామర్థ్యమును సంపాదింపవలె.

2 కేంద్ర ప్రభుత్వముయొక్క ప్రదేశప్రభుత్వములయొక్క ఉద్యోగపరీక్షలలో (Public Service Commissions) శ్రీమద్రామాయణ మహాభారతాది గ్రంధములకు సంబంధించిన యొక ప్రశ్న పత్రము ఉండవలె. (Full question paper) దానికి సమాధానమును అభ్యర్థులు సంస్కృతముననే రచింపవలె.

3. ముస్లిములు క్రైస్తవులు మొదలగు వారి కిది కష్ట మగునేమో అని తలంప నక్కఱ లేదు తమకు మాతృభాష కానిది విదేశీయ మైనదియు నైన యాంగ్లమును ఉద్యోగములయపేక్షతో అందఱును నేర్చుకొనుచునే యున్నారు. ప్రతిపదమునకు వర్ణక్రమము (spelling) ఉచ్చారణ (pronounciation) మాఱుచునుండు ఆంగ్లమును నేర్చుకొనుటకంటె సరళవిధానములు గల సంస్కృతమును అభ్యసించుట అత్యంత సులభము. పదియేండ్లు అభ్యసించి ఆంగ్లమున ఎంత పాండిత్యమును సంపాదింపవచ్చునో అంత పాండిత్యమును ఆపరిశ్రమతోనే సంస్కృతమున రెండేండ్లలో పొందవచ్చును.

4. ఫ్రెంచి దేశమునకు పోయి అచ్చట నివసింపదలచుకొన్నవారు ఆదేశపు చరిత్రను సంస్కృతిని అభ్యసించుట ఎంత ఆవశ్యకమో అట్లే ఈదేశమున నివసించుచున్నవారు ఈ దేశముయొక్క చరిత్రను సంస్కృతిని గ్రహించుట ఆవశ్యక మని వేఱుగా చెప్ప నక్కఱ లేదు. సంస్కృత భాషాభ్యాసమువలన ఆసేతు హిమాచలముగా అఖండ జాతీయ భావము (National Integration) పటిష్ఠము కాగలదు.

ఇంక ఈకాలమునకు వర్ణధర్మములు ఆచారణసాధ్యములు కావనువిషయమున

ఏ కాలమునందైనను ఎవరు దేనియందు ప్రగాఢమైన శ్రద్ధను కలిగియుందురో వారు ఆకార్యవిధానమును ఎన్ని కష్టములను సహించియైనను ఆచరించుచునే యుందురు స్వరాజ్యము కొఱకు జరిగిన యుద్యమమునందు ఎందఱో నాయకులు కార్యకర్తలు లాఠీదెబ్బలు తిని చెరసాలలో మ్రగ్గినారు. తక్కిన ప్రజలు లక్షల మంది ప్రభుత్వమునకు భయపడుచుండగా వీరు ఎట్లు తెగింపగలిగిరి ? రాజకీయములైన సంప్రదింపుల కొఱకు (Round Table Conference) ఇంగ్లండునకు పోవలసివచ్చినప్పుడు ఎవరేమన్నను లెక్కపెట్టక గాంధీగారు కొల్లాయి గుడ్డతోనే ఎట్లు పోగలిగిరి ? ఆ సమయముననే పండితమదన మోహన మాలవీయగారు పీపాలతో గంగా జలమును అక్కడికి ఎట్లు తీసికొని పో గలిగిరి ? తాము నమ్మిన సిద్ధాంతముకొఱకు అనుష్ఠానముకొఱకు ధీరులు లోకమును కూడ ధిక్కరింపగలరు ? చంచలమైన లోకులయభిప్రాయములను వారు లెక్కపెట్టరు.

అశుతోష్ ముఖర్జీగారు కలకత్తా విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షులుగా (Vice-Chancellor) నుండిరి. అప్పు డాయన ఒకనాడు గంగలో స్నానము చేసి వెలుపలికి వచ్చుచుండెను. ఒక వృద్ధురాలైన బ్రాహ్మణస్త్రీ మఱునాటి ద్వాదశిపారణకై రమ్మని అక్కడ నున్న బ్రాహ్మణులను ప్రార్థించుచుండెను. వా రందఱు ఏవో సాకులు చెప్పి అంగీకరింపకుండ వెడలిపోయిరి. ఆమె ముఖర్జీగారిని చూచి సాధారణ బ్రాహ్మణు డనుకొని దగరకు పోయి, "నాయనా రేపు ద్వాదశికి ఒక్క బ్రాహ్మణునకైనను ఆపోశనము వేసికోవలయు నని అనేకులను ప్రార్థించితిని. పేదరాలినైన నేను ఎక్కువ దక్షిణను ఇచ్చుకో లే నని కాబోలు ఏవో కారణములు చెప్పి వారు అంగీకరింపకుండ వెడలిపోయిరి. నీ వైనను ఈ ముసలిదానిని కనిపింపుము" అని దీనముగ ప్రార్థించెను. అయన జాలిపడి, "అమ్మా! అట్లే వచ్చెదను. మీ యిల్లు ఎక్కడనో చెప్పుము" అని ఆవివరములు తెలిసికొని మఱునాడు ఆమెయింటికి పోయి భోజనము చేసి ఆమె యిచ్చిన యేగాని దక్షిణను (సుమారుగా ఇప్పటి మూడుపైసలు) తీసికొని తిరిగి వచ్చెను. ఈ వార్త ఎట్లో విశ్వవిద్యాలయమునకు ప్రాకినది. చాలమంది మిగుల ఆశ్చర్యమొందిరి. కొందఱు మిత్రులు సాహసించి ఆయనయొద్దకు పోయి "మీరు ద్వాదశి బ్రాహ్మణార్థమునకు పోయినమాట నిజమేనా!" అని యడిగిరి. ఆయన, "ఔను. పోయినాను. తప్పేమి" అని పలికెను. "తప్పు అని కాదు. ఇంత పదవిలో నున్న తమరు అంత చిన్నపనికి పోయి యుందురా అని సందేహించితిమి" అని వా రనిరి. "అయ్యా! ప్రతిగ్రహము బ్రాహ్మణ లక్షణములలో నొకటి. నేను విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షుడ నైనంతమాత్రమున బ్రాహ్మణుడను కానా ఏమి ? బ్రాహ్మణత్వమునకు పదవులతో అంతస్తులతో సంబంధ మేమున్నది ?" అని ఆయన సమాధానము చెప్పెను.

ఆయన ఆట్లేల చేయగలిగెను ? ఆయనకు బ్రాహ్మణధర్మము నందు ప్రగాఢమైన విశ్వాస మున్నది, కాబట్టి చేయగలిగెను. మఱి స్వరాజ్యమునకై ఎన్నో త్యాగములు చేసిన మహానాయకు లనేకులు సంధ్యావందనాదులను ఏల వదలిపెట్టిరి ? వారికి వానియందు

పరధర్మములను కూడ పాటించియే యుందురు. ధీరులు కర్తవ్యాచరణమున శ్రమను గాని లోకులయవహేళనమును గాని లెక్కపెట్టరు పిఱికిపందలకు సోమరిపోతులకు ధర్మాచరణము ఎప్పుడైనను అసాధ్యముగానే తోచును.

ఈకాలమున వర్ణధర్మముల నాచరించుట అసాధ్య మని కొందఱు చెప్పుచుండుటకు ముఖ్యకారణము సుఖలాలసత్వమే. వారికి తగినంత సమయము గాని శక్తి గాని ఉండ దని చెప్పుటకు వీలు లేదు దూరదర్శనయంత్రమువలన (T V sets) చలనచిత్రములను చూచుటకు దూరశ్రవణ యంత్రములవలన శ్రవ్యనాటికలను సంగీతాదులను వినుటకు తగినంత సమయ ముండగా సంధ్యావందనమునకు దేవతార్చనాదికమునకు సమయము శక్తి లే దనుట ఆత్మవంచనము లోకవంచనము అగును గాని యధార్థము కాదు. దర్మాచరణమునందు విశ్వాసము శ్రద్ధ కలిగినవారు కొన్ని సమయములలో పనుల తొందరవలన అనుష్ఠానమునందు కొన్ని యంశములను పాటింపలేక పోయినను, సాధ్యమైనంతవఱకు విహితములైన కర్మలను ఆచరించుచు, విశ్రాంతి లభించినప్పుడు ఆ కర్మలను సమగ్రముగా అనుష్ఠించుచుందురు కావున ఈకాలమునకు వర్ణధర్మములు అసాధ్యములనుట కుదరదు. సనాతనమైన దర్మము శ్రద్ధ ననుసరించి అన్నికాలములలో యదాశక్తిగా ఆచరణీయమే యగును.

మఱియొక విషయము గమనింపదగియున్నది వేలకొలది తరములుగా కొన్ని కుటుంబములందు ఒకానొక వర్ణముయొక్క ధర్మకర్మములు నిర్వర్తింపబడు చున్నప్పుడు, ఆ కుటుంబములలోని స్త్రీపురుషుల జన్యుకణములందు (Genes) ఆ లక్షణములు (Characteristics) రూఢములై యుండును. ఏకారణముచేత నైనను కొన్ని తరములలో ఆ కుటుంబములలోని వారు వేదాధ్యయనము మొదలగు దర్మములకు దూరులై ప్రభుత్వోద్యోగములు వాణిజ్యము మొదలగు వృత్తులు అవలంబించునప్పుడు ఆజన్యుకణములయందు రూఢములైయున్న వర్ణలక్షణములు ప్రకాశింపక పోవచ్చును అంత మాత్రమున ఆ జన్యువులయందు ఆ లక్షణములు నశించునని చెప్పుటకు వీలు లేదు. ఒకానొకడు వేదపండితుడై నిష్ఠాగరిష్ఠుడై యుండగా, ఆయన కుమారుడు వాణిజ్యముచేతనో, కృషీవలుడుగనో జీవించువాడు కావచ్చును. కాని తండ్రివలన అతనికి సంక్రమించిన జన్యువులు నశింపవు శ్రీ శంకరాచార్యులవారు, శ్రీరామానుజాచార్యులవారు, గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు మహమ్మద్ ప్రవక్త మొదలగు మహాపురుషుల తండ్రులు తాతలు మొదలగువారు అనేకులు, ప్రసిద్ధులైనట్లు చరిత్రలో కన్పించుట లేదు. అయినప్పటికి వారు పూర్వులకంటె చాలమేధావులై రన్నచో, ఆమేధాశక్తికి కారణములైన జన్యువులు వారియందే ఉద్భవించినవి అని చెప్పుటకు వీలు లేదు వారి పూర్వులలో ఎవరివల్లనో ఆ జన్యువులు వారియందు ప్రకాశించిన వని చెప్పవలసియున్నది. కావున మహానాయకులు, మహామేదావులు, ప్రతిబావంతులు **జన్మింపవలయు నన్నచో వంశముల పరంపరలో తల్లివైపున తండ్రివైపున సాంకర్యము లేని విధముగా వివాహముల విషయముననే జాగరూకత వహింపవలయుననుట స్పష్టము.**

ఈ విషయమున పాశ్చాత్య శాస్త్రవేత్తలు చెప్పుచున్న విషయములను మనము గమనింపవలసియున్నది. హోరేషియో హాకెట్ న్యూమన్ అను శాస్త్రజ్ఞుడు ఇట్లు చెప్పుచున్నాడు.

"వంశప్రాప్తలక్షణము (Heridity) రెండవ ప్రదాన విషయము. ఇది పరిణామమునందు కొన్ని పదార్థములను నిలుపుకొనగలిగిన శక్తి కలది. మార్పువలన క్రొత్త లక్షణము ఏర్పడునప్పుడు ఇది కొన్ని పదార్థములను మారకుండ నిలుపును. జీవకణ సముదాయములలో (Organisms) ఒక జాతియందు (race) కలుగుచున్న మార్పే పరిణామము. సంతానమునకు సంక్రమించినప్పుడే తప్ప, ఏ జీవకణ సముదాయములోని మార్పైనను, అది ఎంత గంభీర మైనను ఉపకారక మైనను, పరిణామము కానేరదు. ఇదియే వంశప్రాప్త లక్షణము యొక్క పని "

"The second fundamental factor is heredity, the conservative factor in evolution, that which, when variation has given rise to a new character, causes it to persist Evolution is the change produced in a race of organisms , the mere variation of the individual, no matter how profound or how beneficial it may be, is not evolutionary unless it is handed on to the `offspring', and this is the function of heredity" (P 84)

వంశలక్షణములను కాపాడుకొనకుండ సాంకర్యమునకు తావిచ్చినచో జాతివినాశము ఎట్లు సంభవించునో గమనింపుడు" పూర్వము ప్రథమశ్రేణిలో ఉండిన అనేక జాతులు, అభ్యుదయమువలె కన్పించుచున్న మార్గమునందు అడ్డము లేకుండ ముందుకు పోవుచు, పైకి కన్పింపని కారణములవలన క్షీణింపజొచ్చెను. కాలక్రమమున అవి తమ గౌరవస్థానమునుండి పతనము నొంది ముందుకు పోవుచున్న జాతులలో గణింపబడుట లేదు. జన్యుశాస్త్రముచేత ఉత్తేజితు డగుచున్న ప్రతివ్యక్తియు తనజాతి, అట్టి దుర్గతికి పాలుగారాదని నిశ్చయముతో జన్యుశాస్త్ర లక్ష్యమును సమరములో వలె బావుటాగా పైకెత్తి పట్టుకొని, స్వార్థమును గూర్చిన ఆలోచన లేకుండ ముందుకు సాగవలె

**"In the past many nations of the first rank, when apparently advancing without check on the path of prosperity, have begun to decay from unseen causes, and have in time so fallen from their high estate as to cease to count as factors making for progress. A determination that such a down fall shall not be the fate of his nation is a sentiment felt by every man who is animated by the eugemic ideal, an ideal to be followed like a flag in battle without thought of personal gain".. P 444**

మనుష్యులయందు జన్మసిద్ధముగానే కొందఱియందు ఇతరులయందు కంటె ఎన్నోరెట్లు అధికముగా శక్తి సామర్థ్యములు ఉండును. పవిత్రదాంపత్య [illegible] వలన అట్టి

సమర్థులు జన్మించుటకు అవకాశమును కలిగింపవలయునే కాని, పనికిమాలిన వారిని ప్రజ్ఞావంతులనుగా తీర్చిదిద్ద వలయు ననుకొనుట నిష్ప్రయోజనము. మానవు లందఱు సమాన మనుమాట ఎంత అశాస్త్రీయమో చూడుడు.

"మానవులందఱు జన్మ చేత సమానులు కారు. (అమెరికాకు) స్వాతంత్ర్యము ఉద్ఘోషింపబడినప్పుడు, అమెరికాకు వలసవచ్చినవారు సాంఘిక రాజకీయ మానవ హక్కుల విషయమున ఆంగ్లదేశములోని పౌరులతో సమానులే అని, జార్జిరాజునకు నిర్ణయపూర్వకముగా తెలియజేయుటకొఱకే, ప్రకటింపబడినది. అంతేకాని, ఒకానొక మనస్తత్త్వ శాస్త్రమునకు సంబంధించిన ప్రయోగశాలలో వేలకొలది మానవులను పరీక్షించి నిర్ణయింపబడిన శాస్త్రీయమైన సిద్ధాంతముగా అది ఉద్దేశింపబడలేదు.. కాని మనము మానవుల హక్కులనుగూర్చి కాక మానవుల స్వభావములను గూర్చి సామర్థ్యములనుగూర్చి పరిశీలించునపుడు మానవు లందఱు సమానులు కారని, వారు సమానముగా పుట్టుట లేదని, వారు ఎప్పుడును సమానులుగా నుండ రని, ప్రకృతి సైతము వారిని సమానులనుగా ఉద్దేశించుట లే దని మనకు అత్యంత విస్పష్టముగా గోచరమగును. మఱియును వారిని సమానులనుగా జేయగలిగిన ఏ ప్రభుత్వవిధానము కాని, ఏ సాంఘికమైన నియంత్రణము కాని, లేక విద్యావిధానము కాని ఇప్పటికి ఏర్పఱుపబడ లేదు , ఇక ముందు ఏర్పఱుపబడదు. నీవు ఎంతగా వారిని విద్యావంతులనుగా చేయుదువో, వారిని అంతగా నీవు సమానత లేని వారినిగా చేయుదువు - అని ఆధునికమైన మనస్తత్త్వశాస్త్రము, జీవశాస్త్రము ఆవిష్కరించుట, నిశ్చితముగా, ఆశ్చర్యకరము ఆనందదాయకమును అయి యున్నది... హెన్రీ వాన్ డైక్ అనుకొందును ఇట్లన్నాడు. "అందఱు భిన్నముగా నుండుట అనువిషయమున మాత్రమే అందఱు సమానులు".

All men are not born equal. When the Declaration of Independence made its pronouncement, it was merely to serve notice upon King George that the American Colonists were equal in their social, political and human rights to the citizens of England It was not meant as a scientific formula from some laboratory of psychology which has tested several thousand human beings, and found them all exactly equal ..

But, when we study not men's rights, but men's natures and capacities, nothing is more obvious than that all men are unequal ; they are born unequal, they will always be unequal ; nature intends them to be unequal , and no system of govenment, social control, or education has yet been devised or ever will be devised, that will make them equal (P. 492)

" . . . ముగ్గురు బాలురకు నీవు చరిత్ర విజ్ఞానమును సమానముగా బోధింపవచ్చును. గతచరిత్రలోని యంశములను యథార్థముగా నీవు వారికి

తెలుపవచ్చును. కాని ప్రపంచములోని ఏ అధ్యాపకుడు కూడ వారిని సమానమైన జీవిత దృక్పథముతో ఉత్సాహముతో నింపినట్లు భావింపడు. బోధింపబడిన యీయంశములతో ఒకబాలుడు ఉత్తేజితుడై చారిత్రికములైన నవలలను నాటకములను రచింపవచ్చును. మఱియొకడు ఈయంశములనే ఆర్థికమైన సాంఘికమైన చట్టమునకు ఉపయోగించునవిగా భావింపవచ్చును. మూడవ వాడు వీనివలన ఇంచుమించుగా ఏమియు ప్రభావితుడు కాక, కిరాణాకొట్టు పెట్టుకొనుటయో లేక సబ్బును తయారుచేయుటలో క్రొత్త విధమును కనిపెట్టుటయో తన జీవిత ధ్యేయముగా బావింపవచ్చును. వారి కందఱకు సమానములైన విషయములను, ఒకడే అధ్యాపకుడు, ఒక బడిలోని గదియందే బోధించెను. కాని వా రందఱు తమ సామర్థ్యమును స్వభావమును, అనగా జన్మసిద్ధమైన లక్షణముల ననుసరించి బిన్నభిన్నముగా వర్తించిరి"

You can teach three boys the same knowledge of history. You can inform them of exactly the same facts of the past. But I do not believe any school teacher in the world would maintain that he had filled them with the same spirit and view point One boy will be inspired by these facts to write historical novels and dramas, another will find them helpful in shaping economic and social legislation, while the third may remain almost wholely unaffected and devote his life to keeping a country grocery or to inventing a new method of making soap. They all had the same facts, the same teacher, the same school room. But they are reacted differently, each according to his own ability and temperament i.e., his inborn make-up. Page 492.

ఒకానొకడు క్రింది స్థాయినుండి పైకి సులభముగా ఎక్కి పోవుచుండగా, ఇంకొకడు పై నుండి క్రిందికి వేగముగా జాఱుచుండుట ఎట్లు సంభవించుచున్న దను విషయమును జేమ్సు అనునతడు ఒక కొయ్యపనివానితో ప్రస్తావించుచుడగా ఆ పనివాడు ఇట్లనెను. "ఒకనికి మఱియొకనికి మధ్య భేదము చాలకొంచెముగనే యుండును. కాని ఆభేదము, ఎంత కొంచె మైనను, అత్యంతము ముఖ్య మైనది. "There is very little difference", said the carpenter, "Bet' (between) one man and another ; but, what little there is, is very important." P. 495.

ఆ కొయ్యపనివాడు వ్యక్తులలో గల భేదములు కొంచెమే యని చెప్పినాడు ; కాని శాస్త్రజ్ఞులు ఆభేదములు ఎంత పెద్దవిగానైన ఉండవచ్చునని చెప్పుచున్నారు.

".... మన కనులయెదుట మనమే ఎల్లప్పుడు చూచుచునేయున్నాము ; కొందఱు ఇతరులకంటె ముప్పదిరెట్లు ప్రకృతి సిద్ధములైన శక్తులను కలిగి యుందు రని గాల్టన్ తలంచెను. ఒక మార్గమునందే కొందఱు వేయి, లేక వది లక్షల రెట్లు ఇతరులకంటె అధికములైన శక్తులను కలిగియుందురు".

" . .. for we see always before us that some man have many times - Galton thought thirty times - as great natural endowments as have others Some men have in same direction a thousand or a million times greater powers than have other men". P. 505

జన్మసిద్ధములైన శక్తిసామర్థ్యములు తక్కువగా కలవారిని విద్య మొదలగువానివలన కొంత మందిని కొంతవఱకు పైకి తేవచ్చును. కాని అందఱను అగ్రగణ్యులుగా చేయుట అసాధ్యము. " కొలది శక్తులు కలవారిని ఒకస్థాయిలో గుర్తింపదగినట్లుగా కొన్ని విధానములవలన పైకి తేవచ్చును. కాని సమాజమున, ఆచరణవిషయముగా ఆలోచించినచో మందబుద్ధికలవారిని ప్రతిభాశాలులనుగా రూపొందించుటకు కావలసిన సమయము కాని ధనము కాని లేదు. ధనవ్యయమే లేకుండ, తగిన వివాహములవల్లనే ప్రతిభావంతులు జన్మించుటకు అవకాశము ఉండగా ఈ ప్రయాస ఎందులకు ? ప్రకృతి పరిసరము లన్నియు మానవులకు సమానమై యుండగా, మనుష్యులలో భేదములు కలుగుచుండుటకు చాలవఱకు వంశానుగతములైన జీవకణ సముదాయములోని భేదములే కారణ మని నేను తలంచుచున్నాను".

" . Other measures might produce as marked results with poor material, but in society as a practial matter there is neither the time nor money as yet to try to make imbeciles into geniuses when by proper marriages they can be produced free of charge. The differences among men are, I think, largely due to differences in the original hereditary packets in the germ-cells because so much of the environment of men is common to them all". P. 507

"శాస్త్రవేత్తల వృత్తాంతములను గూర్చి నేను విచారించితని. శాస్త్రపరిశోధనలో నాయకులైన వా రందఱ విషయమున ఒక్క విషయము, తక్కినవిషయములకంటె మిగుల బలీయమైనదిగా పైకి వచ్చినది. వా రందఱు సాధారణముగా ప్రముఖముగా గుర్తింపదగిన శక్తిని గలిగి యుండిరి ; వా రాశక్తిని తల్లిదండ్రులవలన తాతలవలన వంశానుగతముగా పొందియుండిరి; P. 534

"In the enquiries I made on the antecedents of men of science, no point came out more strongly than that the leaders of scientific thought were generally gifted with remarkable energy, and that they had inherited the gift of it from their parents and grand parents". P 534.

"చాతుర్వర్ణ్యము నాచేత సృష్టింపబడినది" అని చెప్పినంతనే, లోకములో అందఱివలెనే తన్ను కూడ కర్తృత్వాభిమానము గల జీవునిగా అర్జునుడు గ్రహించు నేమో అని శ్రీకృష్ణుడు, "దానికి కర్త నైనప్పటికి నన్ను అకర్తనుగా నెఱుంగుము" అని చెప్పెను. సృష్టించినవాడు కర్తఅయ్యును, కర్త కాకపోవుట ఎట్లు సంభవించును ? కర్తృత్వమున రెండు అంశము లున్నవి. "ఈకార్యమును ఇతడు చేసెను" అని లోకు

లనుకొనుట మొదటియంశము "ఆఫలము కొఱకై నేను ఈ పనిని చేయుచున్నాను" అని పని చేయుచున్నవాడు అనుకొనుట రెండవయంశము. లోకు లనుకొనుటవలన మంచిపనికి కీర్తి, చెడ్డపనికి అపకీర్తి సంభవించును. కాని కర్తృత్వము ఏర్పడుటకు రెండవ యంశమే ప్రధానహేతువు. ఫలమును కోరి పనిచేయుచున్నవానికి ఆఫలమునందు అభిలాష, "నేను నాశక్తి సామర్థ్యములతో ఈపనిని చేయుచున్నాను" అను నభిమానము తప్పక ఉండును. ఆఫలమునందు వానికిగల యాసక్తి ననుసరించి వానికి మంచిఫలము కలిగినప్పుడు సంతోషమును, దుష్ఫలము కలిగినప్పుడు దుఃఖమును అతడు అనుభవించును. కార్యమును ఆచరించునప్పుడు రాగద్వేషశోకక్రోధాది భావములను కూడ ఎన్నింటినో అతడు అనుభవించును. అతడు వానిని అనుభవించుచున్నప్పుడు వానికి సంబంధించినసంస్కారములు, అతనికి తెలియకుండగానే అతని మనస్సునకు సూక్ష్మరూపమున ఒక పూతపూసినట్లుగా అంటుకొనియుండును. ఒక వస్తువునకు మనము రంగులతో ఒకపూతపై మఱియొకపూత వేయునట్లుగా, మనము పొందుచుండు ఒక్కొక్క భావముయొక్క యనుభవము మన మనస్సుపై ఒక్కొక్కపూతను వేయుచునే యుండును. ఈ సంస్కారములనే వాసన లందురు. ఒక బరిణయందు కర్పూరము నుంచినచో, దానిని తీసివేసిన తరువాత కూడ దానివాసన బరిణయందు అంటుకొనియుండును. అట్లే వస్త్రముపై బురద చిందిపడినప్పుడు, బురదను కడిగివేసినను దానికి సంబంధించిన మరక లుండును. అట్లే మనము కొన్నికార్యములు చేసి వానిఫలములను ఆయాభావములను అనుభవించి కొంతకాలమునకు వానిని మఱచిపోవచ్చును. కాని వానికి సంబంధించిన పూతలు మాత్రము మన మనస్సుపై ఒకదానిపై ఒకటిగా పేరుకొనుచునే యుండును. జీవితము ముగియునప్పటికి ప్రతివ్యక్తికి మనస్సుపై ఈ సంస్కారముల పూతలు అసంఖ్యాకముగా ఏర్పడియుండును. పూర్వజన్మలలోని కర్మవాసనల సముదాయమును సంచిత మని, ఇప్పటి జన్మలోని వాసనల సముదాయమును ఆగామి అని చెప్పుదురు. మరణ సమయమున ఈరెండును అభివ్యక్తము లగును. అప్పు డీ సముదాయములనుండి ప్రబలమైన యొక భాగము ముందునకు వచ్చి క్రొత్త జన్మను శరీరమును ఇచ్చి వాని మూలమున ఫలము నొసంగుటకు ప్రారంభించును. ఫలము నొసంగుటకు ప్రారంభించిన యా కర్మసముదాయభాగమును ప్రారబ్ధ మందురు. బియ్యపు బస్తానుండి ఒక పూటవంటకై పాత్రలోనికి తీసికొన్న బియ్యము వంటిది ప్రారబ్ధము. బస్తాలో మిగిలియున్న బియ్యము వంటిది సంచితము. ప్రారబ్ధమువలం ఏర్పడిన క్రొత్తజన్మలో క్రొత్త శరీరముతో క్రొత్త జీవితమున కర్మానుభవములవలన మరల ఆగామి ఏర్పడును. బస్తాలో మనము క్రొత్తగా తెచ్చి పోయు బియ్యమువంటిది ఆగామి. కావున ఆగామివలన సంచితము, ఆరెండింటివలన ప్రారబ్ధము సంభవించుచు జన్మపరంపర కొనసాగుచుండును కర్మలవలన జన్మపరంపల కలుగుచుండుటయే కర్మబంధము

ఈ కర్మబంధమునుండి తప్పించుకొను నుపాయమును భగవంతుడు తనదృష్టాంతము చేతనే నిర్దేశించుచున్నాడు. లోకుల దృష్టిలో తాను చాతుర్వర్ణ్యమునకు కర్తగా ప్రసిద్ధుడై యున్నను, తనదృష్టిలో తాను కర్త కాడనియే భగవంతుడు చెప్పుచున్నాడు. ఎందువలన ఆయన కర్త అగుట లేదు? "నన్ను కర్మలు అంటుకొని యుండుట లేదు" (న మాం కర్మాణి లింపన్తి) అని ఆయన కారణమును చెప్పుచున్నాడు. అందఱకు కర్మవాసనలు మనస్సులపై పూతలు పూయుచుండగా (లేపనము - Coating) ఆయనమనస్సును కర్మలు ఏల అంటుకొనియుండుట లేదు? "నాకు ఆకర్మలయందు, వాని ఫలములయందును కోరికలేదు" అని ఆయన కారణమును నిరూపించుచున్నాడు. అనగా పనిచేయుటయందు ఆసక్తి, ఫలములయందు అభిలాషయు లేకున్నచో మనము చేయుచున్న కర్మలవలన వాసనలు ఏర్పడవన్న మాట.

ఈ విధముగా భగవంతునియొక్క అకర్తృత్వమును తెలిసికొని పూర్వము మోక్షమును కోరినవారు, భగవంతుని వలెనే అకర్తలై కర్మలను చేయుచుండిరి వారు నిరంతరము కర్మలను చేయుచుండియు తమ్ము కర్తలనుగా తాము చేయుచున్నది కర్మనుగా వారు తలంపలేదు.

మేధావులైన వారు కూడ, "ఏది కర్మ అగును, ఏది అకర్మ యగును", అను విషయమున భ్రాంతులగుచున్నారు. కాని కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను చూడగలిగినవారే బుద్ధిమంతులు. కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను చూచుట అనగా నేమి? వేగముతో పోవుచున్న పడవలో ప్రయాణము చేయుచున్నవానికి నదీతీరమం దున్న వృక్షములు తనకు ఎదురుగా వచ్చి తన్ను దాటిపోవుచున్నట్లు గోచరించును. కాని చెట్లు కదలవు. అయినను బాలుడు అవి కదులుచున్నట్లే తలంచును. బాలుడు దేనిని కర్మనుగా చూచుచున్నాడో ఆకర్మయందు పెద్దలు అకర్మను, అనగా చెట్లయందు కదలిక లేకపోవుటను వలె, గ్రహించుచున్నారు. అట్లే తత్త్వజ్ఞులు జీవులయందు కన్పించుచున్న వ్యవహారమును చూచుచు అది యంతయు దేహేంద్రియాదులకు సంబంధించినదేకాని ఆత్మకు సంబంధింప దని, ఆత్మ ఎప్పుడును నిష్క్రియమే అని గ్రహించుచుందురు. ఈవిధముగానే వారు అకర్మయందు కర్మను జూతురు. ఒకానొకడు, "నే నేమియు చేయను, చూడను, మాటాడను" అని యూరకున్నచో సాధారణముగా జనులు, "నిజమే, వా డేమియు చేయుట లేదు" అని తలంతురు. కాని వివేకము కలవారు అట్లు తలంపరు. చేయుట చూచుట మాటాడుట మొదలగునవి క్రియ లైనట్లే చేయకుండుట చూడకుండుట మాటాడకుండుట మొదలగునవి కూడ, సంకల్పపూర్వకము లగుటచేత, క్రియలే యగుచున్నవి. ఒకడు, "నేను భోజనము చేయను" అని ఆహారమును తీసికొనకుండ నున్నచో, ఆ యకర్మ వానికి మృత్యువు, బంధుమిత్రులకు ఆందోళనము మొదలుగా పెక్కు ఫలముల నొసంగుచు పెద్దకర్మయే యగుచున్నది. కావున ప్రాజ్ఞులు జీవుల యకర్మయందు కర్మనే చూతురు.

కదలని రైలు బండిలో కూర్చుండి, ప్రక్క నుండి కదలిపోవుచున్న మఱియొక రైలుబండిని మనము చూచుచున్నప్పుడు మనము కూర్చుండిన రైలుబండి కూడ కదలుచున్నట్లే యుండును. కాని మనదృష్టిని కదలుచున్న రైలు బండి నుండి మరలించి మనము కూర్చుండిన బండియందు నిలిపినచో మన బండి నిశ్చలముగానే యున్న దని తెలియును. అట్లే నిరంతరము చలించుచుండు జగద్వ్యవహారమునందు దేహవ్యాపారమునందు దృష్టియుంచినంతవఱకు దాని సాక్షిగా నున్న మనస్వరూపము కూడ చలించుచున్నట్లే గోచరించుచుండును. అట్లు కాక మనదృష్టిని జగత్తుపై నుండి దేహమునుండి మరలించి మనస్వరూపము నందు నిలిపినచో అది నిశ్చలముగానే యున్న దని తెలియును. ఇట్లు నిశ్చలమైన యాత్మదర్శనమువలన మనస్వరూపమైన యాత్మ సకల కర్మలకు వానిఫలములకు అతీతమై ఆనందముగా సాక్షాత్కరించును.

జగద్వ్యవహారమునుండి దృష్టిని మరలించి ఆత్మకు అభిముఖముగా నిలిపిన పండితులు సుఖభోగములను భావింపరు. వారికి దేనియందును కామము కలుగదు. కావున వారు ఏకార్యమును సంకల్పింపరు. మఱి వారు నిష్క్రియులై జడులై యుందురా? జనక శ్రీకృష్ణాదులు ఎన్నో కార్యములు నిర్వహించినట్లు ప్రసిద్ధమై యున్నది గదా! నిజమే. కాని వారి కార్యములకు కామసంకల్పములు కారణములు కావు. వారు తమవర్ణమునకు ఆశ్రమమునకు విధింపబడిన ధర్మకృత్యములను మాత్రమే కేవల కర్తవ్యబుద్ధితో ఆచరించుచుందురు. అకార్యములయొక్క ఫలమలందు వారికి కోరిక లేకపోవుటయే కాక, "నేను చేయుచున్నాను", అను కర్తృత్వాభిమానము కూడ ఉండదు. "నేను సాక్షిమాత్రుడను, నేను ఏమియు చేయుట లేదు, శాస్త్రవిధి ననుసరించి ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నవి, నేను కర్తను కాదు, భోక్తను కాదు" అని వారు నిరంతరము నిశ్చింతతో నుందురు. అందువలన కర్మఫలములయొక్క వాసనలు వారియంతరంగములందు పుట్టవు. "నేను కర్తను గాను, భోక్తను గాను" అను జ్ఞానము అగ్నివలె వారు చేయుచున్న కర్మలయొక్క ఫలములందలి వాసనలను దగ్ధమొనరించును. వారు నిర్వహించుచున్న కార్యములయొక్క ఫలములు లోకులకు ఉపకరించుచున్నను, వారు కర్తలుగా ప్రసిద్ధు లగుచున్నను, వారికి మాత్రము ఆకర్మలనుగూర్చి వానిఫలములనుగూర్చి ఆసక్తియే యుండదు. ఆవిధముగా కర్మవాసనలయొక్క లేపనము వారి యంతరంగములకు ఉండదు. అందువలన వారికి ఆగామి పుట్టదు. కర్తృత్వభోక్తృత్వములు లేనిది, నిత్యము, శుద్ధము, బుద్ధము ముక్తమును అయిన యాత్మయొక్క జ్ఞానముచేత సంచితము కూడ నశించును. అందువలన వారికి మరల జన్మము ఉండదు. ప్రారబ్ధమువలన ఏర్పడిన శరీరము ప్రారబ్ధము అంతము నొందువఱకు లోకులకు కన్పించుచున్నను వారు మాత్రము ఆశరీరముతో సంబంధము నొందక, శరీరమునం దుండియు అశరీరులుగానే యుందురు. కావున కర్మఫలముల యందు ఆసక్తి లేక జ్ఞానామృతముచేత తృప్తులైనవారు శాస్త్రవిధి ననుసరించి ఎన్నో కార్యములను నిర్వహించుచున్నను, ఏమియును చేయనివారే యగుదురు. ఈ విధముగా

భగవంతునియొక్క జన్మకర్మల తత్త్వమును తెలిసికొని, తన్ను కూడ అకర్తనుగా అభోక్తనుగా గుర్తించి, శాస్త్రవిధి ననుసరించి వర్తించువాడు కర్మబంధమునుండి ముక్తుడగును.

సకల కర్మానుష్ఠానమునకు జ్ఞానము పొందుటయే ఫలమని, ద్రవ్యమయములైన యజ్ఞములకంటె జ్ఞానసాధనాత్మకమైన యజ్ఞమే శ్రేయస్కరమని చెప్పి భగవానుడు, అజ్ఞానమును తత్త్వదర్శులైన జ్ఞానులను జేరి సాష్టాంగప్రణామములకో పరిప్రశ్నము గావించుచు పొందుమని చెప్పుచున్నాడు ఇప్పుడాయన బోధించుచున్నది జ్ఞానమే కదా ! దానికొఱకు అర్జునుడు మరల ఇతరుల నాశ్రయింపవలసిన యక్కఱ ఏమున్నది? భగవానుడు జ్ఞానమునే ఉపదేశించుచున్నాడు, సందేహము లేదు. కాని ధర్మకర్తవ్యముగా యుద్ధమును చేయుమని కూడ ఆయన అర్జునుని ప్రోత్సహించుచున్నాడు వీరిసంవాదము పూర్తియైనంతనే అర్జునుడు మహాయుద్ధములో పాల్గొనబోవుచున్నాడు. యుద్ధసమయమునందు అతనికి భగవానుడు బోధించిన తత్త్వవిషయములనుగూర్చి ఆలోచించుటకు మననము చేసికొనుటకు అవకాశమే యుండదు. తరువాత ఇతర కార్యక్రమముల తొందఱలో అతడు దానిని విస్మరించుట కూడ సంభవింపవచ్చును, విస్మరింపకున్నను ఎన్నో సందేహములు కలుగవచ్చును. అందువలన నిస్సందేహముగ తత్త్వము బోధపడువఱకు పెద్దలను సేవించుచు తెలిసికొనుచుండ వలసినదే యని భగవానుడు చెప్పుచున్నాడు

పెద్దలను ఆశ్రయింపవలసిన పద్ధతిని కూడ భగవానుడు ఇందు వ్యక్తమొనర్చుచున్నాడు. పెద్దలవలన జ్ఞానమును పొందగోరువాడు, మహావీరుడైనను, మహారాజైనను, మహావిద్వాంసుడైనను మొదట చేయవలసినది ప్రణిపాతము. సాష్టాంగముగ దండవత్ప్రణామము కావించుచు పెద్దలకు పాదాభివందనము గావించుటయే ప్రణిపాతము. అనగా, "నేను ఇంతవాడను" అను నాత్మాభిమానమును వీడి, "నన్ను శిష్యునిగా స్వీకరింపుడు" అని వినయమును ప్రకటింపవలె. గురువులు శిష్యులను ఆదరించుచున్నను తత్త్వవిషయమున అడుగకుండ ఏమియు చెప్పరు. వారు ప్రశాంతముగ నున్నప్పుడు, "నాకు ఈసంసారబంధ మెట్లు కలిగినది ? మోక్షమెట్లు లభించును?" అను మొదలగు ప్రశ్నలను వేయుచుండవలె. వారు చెప్పునప్పుడు శ్రద్ధతో విని సందేహములు కలిగినచో మరల ప్రశ్నింపవలె విషయమును గూర్చి నిశ్చితజ్ఞానము కలుగువఱకు పెక్కుపర్యాయములు అడుగుచుండుటయే పరిప్రశ్నము. ఇట్లు తఱచుగా ప్రశ్నించుటకు వారిని సేవించుచున్నప్పుడే అవకాశము కలుగును. త్రికరణశుద్ధిగా సేవించుచున్నప్పుడే వారికి శిష్యులయందు అనుగ్రహము సంపూర్ణముగ నుండును. జ్ఞానయోగమున ఇతరసాధనములకంటె గురువుయొక్క అనుగ్రహమే చాల ముఖ్యమనువిషయమును భగవంతుడిచ్చట ప్రకటించుచున్నాడు. గురువుయొక్క **అనుగ్రహములేని విద్యాసంపాదనము పునాదిలేని సౌధము వంటిది.**

అహంకారమును అభిమానమును చంపుకొని ఎవనినో గురువునుగా ఆశ్రయించి వానికి దాస్యము చేయుచు ఈ జ్ఞానమును సంపాదింపకున్నచో ఏమి నష్టము? ఇది అంత గొప్పదా? ఔను గొప్పదే. ఈ జ్ఞానము కంటె గొప్పది పవిత్రమైనది ఏదియును లేదు. ఎందువలన ? ప్రతివ్యక్తి దుఃఖస్పర్శ లేని యానందమును కోరుచున్నాడు. దుఃఖము పాపపుణ్యములవలన కలుగుచున్నది. పుణ్యమువలన స్వర్గాదిభోగములు కలుగుచున్నను, అవి అంతమొందునప్పుడు దుఃఖమునే కలిగించును. అందువలన పుణ్యములు కూడ దుఃఖప్రదములే పుణ్యపాపములు కర్మలవలన కలుగుచున్నవి. కర్మలన్నియు దేహేంద్రియాదులకు సంబంధించినవే కాని ఆత్మకు సంబంధింపవు. ఆత్మ నిష్క్రియము. దానియందు కర్మలు లేవు, సుఖదుఃఖములు లేవు. సూర్యుని ఆవరించుచున్నట్లు కన్పించుచు మేఘములు ఉఱుములతో మెఱుపులతో పిడుగులతో జడివాన కురియుచున్నను సూర్యుడు వానికి లక్షలమైళ్ల దూరములో ప్రకాశించుచునే యుండును. అట్లే ఆత్మ కూడ దేహేంద్రియాదులకు సుఖదుఃఖములకు దూరముగా నిష్క్రియమై ఆనందఘనముగ ప్రకాశించుచునే యున్నది.

# గీత

తన స్వరూపమ్మును నిష్క్రియము నిర్విశేషము జ్ఞానానందఘనమును అయిన యాత్మనుగా గ్రహించినవాడు, అంతవఱకును పరమపాపిష్ఠుడుగ పరిగణింపబడుచున్నను, ఆ జ్ఞానరూపమైన పడవనెక్కి పుణ్యపాపసంకులమైన సంసారసాగరమును హాయిగా దాటుచున్నాడు. ఆజ్ఞానముయొక్క మహిమ అద్భుతమైనది. ప్రజ్వలించినయగ్ని సమిధలను ఎట్లు భస్మ మొనర్చునో అట్లే ఈ జ్ఞాన మను నగ్ని సకలకర్మలను దగ్ధ మొనరించును. ఎట్టివాని నైనను పవిత్రుని గావించుటలో జ్ఞానముతో సమాన మైనది మఱియొకటి లేదు.

ఒక్కసారి ఆత్మనుగూర్చి విన్నంతనే దుఃఖము పోలే దని నిర్వేదము నొందరాదు. సద్గురువును సేవించుచు శాస్త్రానుసారముగ శ్రవణము గావించిన తరువాత స్వయముగా మననము నిదిధ్యాసనములను గావించుచు యోగము నవలంబించి తన విధులయందు ప్రవర్తించుచున్నచో క్రమముగా నిర్వికల్పమైన యాత్మజ్ఞానమునందు నిరూఢు డగును. జితేంద్రియుడై శ్రద్ధాళువై జ్ఞానసంపాదనమే పరమలక్ష్యముగా వర్తించువాడు త్వరలోనే జ్ఞానమును పొంది శాంతిసమృద్ధు డగును.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి ॥ 38

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి ॥ 39

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 28

జ్ఞానసంపన్నుడై శాంతిని పొందినవానికి కూడ, ప్రారబ్ధవశమున ఏర్పడిన శరీరము ఉన్నంతవఱకు దానినుద్దేశించి విధింపబడిన వర్ణాశ్రమధర్మకర్మలు తప్పవని, అయినను ఆకర్మలు వానిని బంధింప వని భగవానుడు మరల హెచ్చరించుచున్నాడు. "యోగముచేత కర్మలను సన్న్యసించినవానిని జ్ఞానముచేత సంశయమును చేదించుకొన్నవానిని, ఆత్మవంతుని కర్మలు బంధింపవు" అని ఆయన యుద్ఘాటించుచున్నాడు. యోగముచేత కర్మలను సన్న్యసించుట అనగా నేమి ? కర్మలను సన్న్యసించుటకు యోగ మెందులకు ? మహాప్రస్థానవిధితో అగ్నిహోత్రములను సకలకర్మలను సన్న్యసింప వచ్చును కదా ! ఇక్కడ భగవంతుడు కేవలమైన కర్మసన్న్యాసమును ఉద్దేశించుట లేదు. యోగనిష్ఠాపూర్వకమైన కర్మసన్న్యాసమును ఆయన ప్రశంసించుచున్నాడు. యోగనిష్ఠ అనగా సంతతమైన పరమార్థదర్శనమే. `ఎట్టి కర్మలు ఎన్ని జరుగుచున్నను, అవి యన్నియు దేహేంద్రియములకు సంబంధించునే కాని, ఆత్మకు సంబంధింపవు, ఆత్మ నిష్క్రియము, నేను ఆత్మస్వరూపుడను' అని సకల వ్యవహారమును సాక్షిగా చూచుచుండుటయే పరమార్థదర్శనము. పరమార్థదర్శన రూపమైన యీ యోగమునందు నెలకొన్నవాడు, ఎన్ని కార్యములను నిర్వహించుచున్నను, తాను ఏమియు చెయుట లే దనియే తలంచును. ఇదియే యోగయుక్తమైన కర్మసన్న్యాసము. కర్మలను చేయుచుండియు తన్ను అకర్తనుగా గ్రహింపగలుగుట దేనిచేత సంభవించును ? జ్ఞానముచేత సకల సంశయములను ఛేదించుకొన్నవానికే, "నేను అకర్తనైన యాత్మను" అను నిష్ఠ కుదురును అజ్ఞానము ఎట్టిది? "ఆత్మ ఒక్కటియే యున్నది, జగత్తు, జీవుడు, ఈశ్వరుడు - అను సమస్తవ్యవహారము, సూర్యకిరణములలో ఎండమావులవలె, ఉన్నట్లు కన్పించుచున్నదే కాని యథార్థముగ లేదు, నిర్విశేషమైన ఆయాత్మనే నేను" అను జ్ఞానముచేతనే సకలసంశయములు తొలగగలవు. సంశయరహితుడై యోగము నవలంబించి కర్మలను కర్మఫలములను ఎండమావులవంటివానినిగా గ్రహించుచు విహితకర్మలను ఆచరించుచున్నవాడు ఆత్మవంతుడు కూడ కావలయును. ఆత్మవంతు డనగా ఆత్మస్వరూప జ్ఞానము కలవాడు ఆత్మస్వరూపజ్ఞానము చేతనే కదా సంశయరహితుడై యోగము నవలంబించుచున్నాడు. అట్టివాడు మరల ఆత్మ వంతుడగుట యేమి ? యోగము నవలంబించి కర్మలను ఆచరించుచున్నప్పుడు క్షణమాత్ర మైనను ఆత్మస్వరూపమును విస్మరింపక అప్రమత్తతతో నుండుటయే ఆత్మవంతు డగుట. వ్యవహారమున ధర్మాధర్మనిశ్చయమును గావించునప్పటి క్లేశము వలన, కార్యాచరణమునందలి వేగమువలన అనుక్షణము ఆత్మజ్ఞానము విస్మృత మగుటకు, కర్మయందు కర్మఫలములయందు ఆసక్తి కలుగుటకును అవకాశము కలుగుచునే యుండును ఏ క్షణమం దైనను ఆత్మజ్ఞానస్మృతిని వీడక వ్యవహరించుచుండు యోగిని మాత్రమే కర్మలు బంధింపజాల వని భగవానుడు

తన తాత్పర్యమును భగవాను డిట్లు ఉద్ఘాటించుచున్నాడు. స్వధర్మమైన యుద్ధము కర్తవ్య మగునా కాదా, అని అజ్ఞానమువలన కలిగిన సందేహమును జ్ఞానముచేత ఖండించి యోగము నవలంబించి స్వధర్మమైన యుద్ధమును నిర్వహించుటకు లెమ్ము అని ఆయన ఆదేశించినాడు.

## (ii) యోగప్రాశస్త్య చమసము

"జ్ఞానాగ్ని సకలకర్మలను భస్మమొనరించును", "జ్ఞానముతో సమానముగా పవిత్ర మైనది మఱియొకటి లేదు" అని జ్ఞానము యొక్క మహిమను కొనియాడి, కర్మ సన్న్యాసమును ప్రశంసించి, భగవానుడు వెంటనే "యోగము నవలంబించి యుద్ధ మొనరించుటకు లెమ్ము" అని చెప్పినంతనే ఆమాటలు పరస్పరవిరుద్ధముగా నున్నట్లు అర్జునునకు తోచెను. యథార్థముగా అందు విరోధము లేదు. కర్మ సంన్యాస మనగా దేహేంద్రియ వ్యాపారములను విరమించి స్వధర్మకర్మలను మానుకొనుట యని అర్జునుడు తలంచుచున్నాడు. కాని భగవానుని యభిప్రాయము అది కాదు. దేహేంద్రియ వ్యాపారములతో కర్మలను నిర్వహించుచున్నను, ఆ కర్మలయందు కర్మఫలములయందు ఆసక్తిని పొందరాదు అని నిశ్చితబుద్ధిరూపమైన యోగముతో నుండుటయే కర్మసంన్యాస మని భగవానుని యభిప్రాయము. అందువలననే ఆయన అట్టివానిని యోగముచేత కర్మలను సంన్యసించినవానినిగా నిర్దేశించెను. అర్జునునకు భగవానుని యభిప్రాయము బోధపడలేదు. అందువలన అతడు ఇట్లు ప్రశ్నించెను. "కృష్ణా ! కర్మలయొక్క సంన్యాసమును మరల యోగమును కూడ ప్రశంసించుచున్నావు. ఈ రెండింటిలో ఏది మేలో నిశ్చయించి చెప్పుము.

## గీత

భగవానుడు ఇట్లు వివరించెను. "అర్జునా ! సన్న్యాసము కర్మయోగము రెండును మోక్షము నొసంగునవియే. కాని వీనిలో కర్మసన్న్యాసముకంటె కర్మయోగము మేలు".

శ్లో|| సంన్యాసః కర్మయోగ శ్చ నిశ్శ్రేయసకరా వుభౌ |
తయో స్తు కర్మసంన్యాసా త్కర్మయోగో విశిష్యతే || 2

అధ్యాయః - 29

అర్జునుడు ఉద్దేశించిన దేహేంద్రియ వ్యాపారములను విరమించుకొనుట అను కర్మ సంన్యాసమును ఉద్దేశించి భగవానుడు దానికంటె కర్మయోగము మేలు అని చెప్పుచున్నాడు. ఆత్మజ్ఞానమును పొందవలయు నను తీవ్రమైన యభిలాష కలిగినంతనే ఎవ డైనను సర్వకర్మలను ఏల సంన్యసింప రాదు ? జ్ఞానసంపాదనకు ముఖ్యసాధనము చిత్తశుద్ధియే కాని సర్వకర్మ నంన్యాసము కాదు. చిత్తశుద్ధి లేని సర్వకర్మ సంన్యాసము

సత్కర్మాచరణమునకు జ్ఞానలక్ష్యమునకు దూర మొనర్చి ఉభయభ్రష్టుని గావించును. చిత్తశుద్ధి కర్మయోగమువలన కలుగును. కావున కేవలకర్మసంన్యాసముకంటె చిత్తశుద్ధిప్రదమైన కర్మయోగము మేలు.

కాషాయదండ కమండలువులు ధరించి జ్ఞానహీనుడై యున్న సంన్యాసికంటె కర్మఫలాసక్తిని వీడి స్వధర్మమును నిర్వహించుచు చిత్తశుద్ధిని పొందియున్న యోగియే యథార్థముగా సంన్యాసి యగు నని భగవానుడు ఉద్ఘాటించుచున్నాడు.

"ఎవడు దేని నైనను ద్వేషింపడో, దేని నైనను కాంక్షింపడో అట్టివాడు నిత్యసంన్యాసిగా గుర్తింపదగను. రాగద్వేషాది ద్వంద్వములు లేనివా డగుటచే అతడు అనాయాసముగా సంసారబంధమునుండి ముక్తు డగుచున్నాడు".

శ్లో॥ జ్ఞేయ స్స నిత్యసంన్యాసీ యో నద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే॥ 3

అధ్యాయః - 29

కర్మఫలాసక్తి లేకుండ స్వధర్మమును నిర్వర్తించుచున్న కర్మయోగికి ఏ ఫలమునందును కోరిక లేకపోవుటవలన దేనియందును ద్వేషము కూడ కలుగదు. రాగద్వేషములు లేకుండుట సంన్యాసమునకు ముఖ్యలక్షణము. ఆ లక్షణము కల కర్మయోగి నిత్యసంన్యాసియే యగును. నిత్యసంన్యాసి యగుట ఏమి ? చిత్తశుద్ధి లేకుండ కాషాయాదులను ధరించినవాడు ఎప్పటికో కాని రాగద్వేషరహితుడై యథార్థముగ సంన్యాసి కాజాలడు. కాని చిత్తశుద్ధకల కర్మయోగి, కాషాయాదులు ధరించి సన్యసింపకున్నను, ఎప్పుడును సంన్యాసిగనే యుండును. అందువలన అతడు నిత్యసంన్యాసి.

"నే నీయోగమును జ్ఞానయోగముచేత సాంఖ్యులకు, కర్మయోగముచేత యోగులకు ఉపదేశించి యుంటిని" అని భగవానుడు వెనుక చెప్పియున్నాడు. సాంఖ్యమార్గమందున్న జ్ఞానులు కొందఱు పరివ్రాజకులై ముక్తపురుషులుగా సంభావింపబడుచున్నారు. ఆశ్రమములలో సంన్యాసము శ్రేష్ఠముగా మన్నింపబడుచున్నది. అందువలన సంసారవ్యవహారముతో సంబంధము కల కర్మయోగముకంటె సాంఖ్యయోగము గొప్పది అని కొందఱు తలంతురు. ఈ యభిప్రాయముతోనే అర్జునుడు కర్మసంన్యాస కర్మయోగములలో ఏదిమే లని ప్రశ్నించినాడు. కాని సాంఖ్యము, యోగము భిన్నములైన రెండు యోగములు కా వని, అట్లు తలంచువారు బాలు రని భగవానుడు చెప్పుచున్నాడు.

"సాంఖ్యము యోగము భిన్నము లని బాలురు ఉద్ఘాటించుచుందురు. కాని పండితులు అట్లు చెప్పరు. (ఎందువల్ల ననగా వీనిలో) ఒక్కదానియందు చక్కగా నెలకొన్నవాడు రెండింటియొక్క ఫలమును పొందుచున్నాడు".

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదన్తి న పండితాః |
ఏక మ ప్యాస్థితః సమ్య గుభయో ర్విందతే పలమ్ ॥ 4

అధ్యాయం - 29

## విజయప్రభ

వేరు, మొక్క ఎట్లు భిన్న పదార్థములు కావో అట్లే కర్మయోగ సాంఖ్యయోగములు కూడ భిన్నములు కావు. చిత్తశుద్ధిని సంపాదించుకొనుచు స్వధర్మమును ఆదర్శప్రాయముగా అనుష్ఠించుచు, ఇతరులను కూడ వారిధర్మములందు నడపుచు లోకసంగ్రహమును గావించుట కర్మయోగమునకు ఫలము. జ్ఞాననిష్ఠతో ఆత్మానందము నొందుచుండుట సాంఖ్యయోగమునకు ఫలము. ఈ జన్మమునందు గాని పూర్వజన్మమునందు గాని కర్మయోగమును అనుష్ఠించిననే తప్ప సాంఖ్యయోగమునందు పట్టు చిక్కదు. కర్మయోగము నవలంబించిన వానికి చిత్తశుద్ధితో పాటు ఈశ్వరానుగ్రహమున సద్గురువువలన శ్రవణమనన నిదిధ్యాసనములు తప్పక సంభవించుచును. వానివలన అతడు సాంఖ్యయోగమునకు పలమైన యమృతత్వము పొందగలడు.అట్లే జ్ఞాననిష్ఠుడైన స్వాంఖ్యయోగి వ్యవహారమునం దున్నచో ఆత్మానందముతో పాటు ఆదర్శప్రాయమైన స్వధర్మనిష్ఠతో కర్మయోగమునకు పలమైన లోకసంగ్రహమును కూడ కావించినవా డగును. కావున ఆరెండింటి యందు ఎక్కువ తక్కువలను భావించుట తగదు. ఏ వ్యక్తికి ఏది యర్హమో అదియే వానికి శ్రేయస్కర మగును.

## గీత

కర్మయోగమువలన సాంఖ్యయోగము యొక్క పలము ఎట్లు కలుగునో భగవానుడు వివరించుచున్నాడు. "కేవలములైన శరీరముచేత మనస్సుచేత బుద్ధిచేత యింద్రియములచేత యోగులు, సంగరహితులై ఆత్మశుద్ధికొఱకు, కర్మచేయుదురు. కర్మఫలమును త్యజించిన యోగి, జ్ఞానయోగనిష్ఠకు ఫలమైన శాంతిని పొందుచున్నాడు. యోగరహితుడు కామపరుడై ఫలమునందు సక్తితో సంసారబద్ధు డగును

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి |
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥ 11

శ్లో॥ యుక్తః కర్మపలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్ |
అయుక్తః కామకారేణ పలే సక్తో నిబద్ధ్యతే ॥ 12

యోగి కేవలములైన శరీరాదులతో పనిచేయుట అనగానేమి ? శరీరాదులందు, "ఇవి నావి, నా శరీరాదులతో నేను ఈఫలమును సాధించుటకై పనిచేయుచున్నాను" అను తలంపు లేకుండుటయే కేవలత్వము "ఈశ్వరు డొసంగిన శరీరేంద్రియాది శక్తులతో కేవలము ఈశ్వరునికొఱకే పనిచేయుచున్నాను, నాకొఱకు కాదు" అని యోగి తలంచును ఇట్టి కర్మాచరణమువలన యోగి జ్ఞాననిష్ఠకు ఫలమైన శాంతిని పొందును. ఇచ్చట శాంతి యనగా మోక్షమే. స్థితప్రజ్ఞుని లక్షణములను వివరించుసందర్భమున శ్రీశంకరులవారు శాంతి శబ్దమునకు మోక్షము అర్థ మని చెప్పిరి (స శాన్తిం మోక్ష మాప్నోతి - శ్లో 72 - అధ్యాయః - 25)

ఇట్లే సాంఖ్యయోగియొక్క వర్తనమువలన కర్మయోగఫలమైన లోకసంగ్రహము ఎట్లు సంభవించునో భగవానుడు వివరించుచున్నాడు.

"విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణునియందు, గోవునందు, ఏనుగునందు, కుక్కయందు, దానిమాంసమును తినువానియందును పండితులు సమమును దర్శింతురు సమ మనగా దోషరహితమైన బ్రహ్మము కావున వారు బ్రహ్మమునందే ఉందురు. ఎవరియొక్క మనస్సు సమభావమునందు నిలిచియుండునో వారు ఇచ్చటనే సర్గమును జయించుచున్నారు".

శ్లో|| విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని |
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః || 18

శ్లో|| ఇహైవ తై ర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః |
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః || 9

అధ్యాయః - 29

## విజయప్రభ

పండితులు అనగా సాంఖ్యయోగనిష్ఠులు. వెండికంచము, పళ్ళెము, గిన్నె మొదలగు వానియందు, అవి చక్కగా ఉన్నను లేక సొట్టపడి వంకపోయినయున్నను, వర్తకుడు వెండినే చూచునట్లు పండితులు బ్రాహ్మణాదులయందు సమముగా ఉన్న బ్రహ్మమును చూచుచుందురు. ఈ సందర్భమున బ్రాహ్మణుడు మొదలుగా శ్వపాకునివఱకు అందఱను పండితులు సమానముగా చూతు రని, అనగా సమానముగా వర్తింతు రని కొందరు చెప్పుదురు. కాని శ్లోకమునందు "సమదర్శినః" అని ఉన్నది కాని 'సమవర్తినః" అని లేదు

వెండివస్తువులలో అన్నింటియందును వర్తకుడు సమముగా వెండిని చూచుచున్నను వానిని విక్రయించునప్పుడు పెద్దవస్తువునకు చిన్న వస్తువునకు,

అందము కలదానికి, లేనిదానికి ఒక్కధరనే చెప్పడు. ఆ యా వస్తువుల విశేషముల ననుసరించియే వెల ఏర్పఱచును అట్లే పండితుడు కూడ విద్వాంసునకు పాదాభివందనము గావించినట్లుగా కుక్కకు నమస్కరించడు , ధర్మపరుని మన్నించినట్లుగా దొంగను గౌరవించడు. వ్యవహారమునందు ఎవరియెడల ఎట్లు వర్తింపవలయు నని శాస్త్రము నిర్దేశించుచున్నదో జ్ఞాని వారియెడల అట్లే వర్తించును. అందఱియందును సమముగా బ్రహ్మమును చూచువా డగుటచే ఆయనకు ఎవరియందును రాగద్వేషము లుండవు అందువలన సకలసందర్భములయందు అందఱివిషయమున ఆయన వర్తనము నూటికి నూఱుపాళ్ళు శాస్త్రీయముగా (Scientific or correct) నుండును అందువలన ఆయన ఆదర్శప్రాయమైన తనవర్తనముచేత హితబోధలచేత ఇతరులను దర్మమార్గమున నడిపించుచు లోకసంగ్రహము కావించును

సర్గ మనగా జన్మము లేక సంసారము. జ్ఞాని అందఱియందును బ్రహ్మమును చూచుచు బ్రహ్మనిష్ఠుడై యుండును. అందువలన ఆయనయందు అహంకారమమకారములు రాగద్వేషములు ఉండవు ఆకారణముచేత ఆయనయందు పాపపుణ్యఫలముల వాసనలు సంభవింపవు. కావున ఈలోకమున వ్యవహరించుచున్నప్పుడే సర్గమును జయించును, అనగా ముక్తుడగును. వానిని జీవన్ముక్తు డందురు. శాస్త్రమునందు విదింపబడిన దర్మములకు జీవన్ముక్తుని వర్తనము ఉదాహరణము వలె నుండును.

## గీత

జీవన్ముక్తుని గుర్తించుటకు ఒకలక్షణమును భగవానుడు సూచించుచున్నాడు. "దేహమును వీడుటకు పూర్వమే (ఉన్నంతవఱకు) ఇచ్చటనే ఎవడు కామక్రోధములవలన కలుగువేగమును సహింపగలుగునో వాడు యోగి, అతడే సుఖపడువాడు"

శ్లో|| శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్|
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః || 23

అధ్యాయః - 29

## విజయప్రభ

శరీర మున్నంతవఱకు ఎవనికైనను కామవేగమునకు క్రోధసంరంభమునకు అనంతములైన యవకాశములు కలుగుచుండును. అట్టివేగము సంభవించుటకు అవకాశములు గల సందర్భములలో ఒకానొకడు ప్రశాంతుడై ధర్మమార్గముననే వర్తించుచుండును. అట్టివానిని జీవన్ముక్తుడని మనము గ్రహింపవచ్చును. మఱియును

కర్మయోగమును అభ్యసించుచున్నవాడు జీవన్ముక్తుని పద్ధతిని గమనించుచు, బావవేగమునకు లోబడక యుండుటయే సుఖ మని గ్రహించి, శరీర మున్నంతవఱకు ఆవేగమునకు లోబడకుండుటకై జాగరూకతను వహింపవలయు నని కూడ భగవానుడు హెచ్చరించుచున్నాడు.

# 2. యోగలక్షణ కమండలువు

## (i) కర్మాచరణ ప్రాశస్త్య చమసము

## గీత

యోగముయొక్క ప్రాశాస్త్యమును లక్షణమును బగవానుడు ఇంకను ఇట్లు నిరూపించుచున్నాడు. "కర్మఫలమును కోరకుండ కార్య మైనకర్మను చేయువాడే సంన్యాసి యోగియు అగును, కాని అగ్నిహోత్రములు లేనివాడు క్రియాశూన్యుడు సంన్యాసి కాడు, యోగి కాడు. అర్జునా! దేనిని సంన్యాసమునుగా చెప్పుచున్నారో అది యోగమే అని గ్రహింపుము. (ఎందువల్ల ననగా) సంకల్పమును సన్న్యసింపని వా డెవడును యోగి కాడు కదా!"

శ్లో|| అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః |
న సంన్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర చా క్రియః || 1

శ్లో|| యం సంన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ |
న హ్యసంన్యస్తసంకల్పో యోగీభవతి కశ్చన || 2

అధ్యాయః - 30

## విజయప్రభ

కార్య మనగా చేయదగినది. ఒకానొకనికి వర్ణము ననుసరించి ఆశ్రమము ననుసరించి శ్రుతిస్మృతులచే విధింపబడుచున్న ధర్మము కార్యము. ఆ దర్మము వానిచే నిర్వర్తింపబడినప్పుడు కార్యమైన కర్మమగును. ఇట్టి కార్యమైన, అనగా కర్తవ్యమైన, కర్మను ఫలాపేక్ష లేకుండ అనుష్ఠించువాడు యోగి అగును. అతడే సంన్యాసి కూడ నగును. అంతే కాని సంధ్యావందనమును అగ్నిహోత్రాదికర్మలను వదలిన వాడు, తపోదానాదికార్యములను చేయనివాడు యోగికాడు సంన్యాసియును కాడు

ఫలాపేక్ష లేకుండ విహితకృత్యములను నిర్వర్తించువాడు యోగి కావచ్చును, కాని అగ్నిహోత్రాదికర్మలను నిత్యము నిర్వర్తించువాడు సంన్యాసి ఎట్లగును ?

సంపదలనో పదవులనో స్వర్గాదిభోగములనో కోరుచు లోకులు వ్రతములను పూజలను యజ్ఞయాగములను చేయుచుందురు. యోగులు ఆఫలములను కోరరు, ఆ కామ్యకర్మలను చేయరు. శాస్త్రవిహితములై తమకు అవశ్యకర్తవ్యములైన యగ్నిహోత్రాదికర్మలను కూడ ఫలములను కోరి సంకల్పింపరు. మఱి వారు అగ్నిహోత్రాదికర్మలయందు సంకల్పమే చేయరా ? శాస్త్రవిహితకర్మములందు సంకల్పము చేయవలసినదే. కానివారు చేయు సంకల్పముశాస్త్రవిదికొఱకే కాని తమకొఱకు కాదు. కావున ఫలాపేక్ష లేని యా సంకల్పము, బొమ్మలో చిత్రింపబడిన వృక్షమువలె, నిష్పలము. కావున కేవలము శాస్త్రవిధికొఱకు మాత్రమే సంకల్పము చేయువాడు సంకల్పమును త్యజించినవానితో సమానుడే యగును. సంన్యాసమునకు ముఖ్యలక్షణము సంకల్పపరిత్యాగము. అది యోగియందు కూడ ఉండును. ఆసామ్యము చేత యోగి సంన్యాసి కూడ అగును.

సరే ! యోగి సంన్యాసి కావచ్చును కాని అగ్నిహోత్రాదికమును వదలినవాడు, తపోదానాది క్రియలను చేయనివాడు యోగి కాడు సంన్యాసియు కా డనుటు ఎట్లు కుదురును. శాస్త్రవిహితముగా అగ్నిహోత్రాదికమును పరిత్యజించి యత్యాశ్రమమును స్వీకరించినవారు యోగులు సంన్యాసులు కారా ? కాకున్నచో తురీయాశ్రమము వ్యర్థమే కదా ! యధాశాస్త్రముగా సన్న్యాసాశ్రమమును స్వీకరించ్చిన విద్వత్సంన్యాసులకు, తత్త్వజ్ఞానసంపాదనకొఱకు నంన్యసించిన వివిదిషా సంన్యాసులకు ఇందు ప్రసక్తి లేదు. వారు యోగులు సంన్యాసులును కావచ్చును. కాని వైరాగ్యావేశముతో స్వధర్మకర్మలను వీడి అడవులకు ఆశ్రమములకు పరువెత్తు వారు, పరివ్రాజకు లగువారు యోగులు సంన్యాసులు కా రని బగవాను డుద్ఘాటించుచున్నాడు. అర్జునుడే శోకముతో వైరాగ్యావేశముతో స్వధర్మమైన యుద్ధమును వీడి భిక్షావృత్తిచే జీవించుట మే లని తలంచినాడు కదా ! శ్రీకృష్ణుడు వారింపకున్నచో అతడు పరివ్రాజకుడై యుండవచ్చును. అప్పు డతడు యోగి యగునా ? సంన్యాసి యగునా ? రెండును కాదనియే భగవానుడు బోధించుచున్నాడు. స్వధర్మకర్మలను వీడక వానిని ఫలసంకల్పరహితముగ నిర్వర్తించుచున్నచో ఆనిష్ఠయే యోగము, సంన్యాసము అగునని ఆయన ఉపదేశించుచున్నాడు.

అగ్నిహోత్రములు లేనివాడు దానతపః క్రియలను వీడినవాడు యోగి కా డని, ఫలమును కోరక కార్యమైన కర్మచేయువాడు యోగి యగు నని బగవానుడు చెప్పుట వలన కార్యమైన కర్మ అనగా అగ్నిహోత్రాదికము దానము తపస్సు అనునవియే యని వ్యక్త మగుచున్నది

అగ్నిశబ్దము చేత అగ్నిహోత్రసంబవములైన యుజ్ఞయాగాదికములు, క్రియాశబ్దముచేత అగ్నిహోత్రసంబందములేని దానము తపస్సు ఉద్దేశింపబడుచున్నవి. అగ్నిహోత్రాదికము కూడ క్రియారూపమే. అట్టియెడల "అ క్రియః" అనువదముచేతనే "అగ్నిహోత్రములు లేనివాడు" అను నర్థము ఏర్పడుచుండగా భగవానుడు, "నిరగ్నిః"

అని చెప్పుట ఎందులకు ? యోగా ...వలంబించువారిలో కొందరు యజ్ఞయాగములను ప్రధానముగా అనుష్ఠించుచుండగా ...వారు దానమునందు తపస్సునందు అధిక శ్రద్ధ కలిగి యుందు రని సూచించుట. ...ట్లు చెప్పుటకు ప్రయోజనము. మొత్తము మీద యోగమును అవలంబింప దలంచువారు శాస్త్రవిహితములైన యజ్ఞయాగములను తపస్సును దానమును అనుష్ఠింపవలయు నని వ్యక్తమగుచున్నది.

## గీత

ఈ విషయమునే భగవానుడు తరువాత స్పష్టముగా చెప్పినాడు. "యజ్ఞము దానము తపస్సు అను (మూడువిధములైన) కర్మను త్యజింప రాదు. అది కార్యమే. యజ్ఞదాన తపస్సులు ప్రజ్ఞాశాలులకు విశుద్ధిని కలిగించునవి యగుచున్నవి. ఈకర్మలను కూడ కర్తవ్యములని వానియందు ఆసక్తిని, వానిఫలములను, త్యజించియే అనుష్ఠింపవలయు ననుటయే ఉత్తమమైన నా నిశ్చితాభిప్రాయము.

శ్లో॥ యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5

శ్లో॥ ఏతా న్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ।
కర్తవ్యా నీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్ ॥ 6

అధ్యాయః - 42

దీనినే భగవానుడు ఇంకను ఇట్లు వివరించినాడు. "ఫలాకాంక్షలేని వారు విధిదృష్టమైనదానిని, "ఇది నాకు కర్తవ్యమే" అని నిశ్చయించుకొని చేయుయజ్ఞము సాత్త్వికమగును"

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్య మే వేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ 11

అధ్యాయః - 41

ఫలాకాంక్ష లేనివా రనగా యోగులే. విధి దృష్టమనగా వర్ణాశ్రమధర్మములందు బోధింపబడినది. "క్షత్రియుడైన గృహస్థుడు ఈ యజ్ఞము చేయవలె", అను పద్ధతిలో శాస్త్రమునందు నిర్దేశింపబడినది. "ఇది నాకు కర్తవ్యమాత్రమే; నాకు దీనివలన ఏఫలము అక్కఱ లేదు" అని దృఢముగ తలంచుటయే నిశ్చయించుకొనుట.

భగవంతునిచే సాత్త్వికములుగా నిరూపింపబడిన కర్త, కర్మ, కరణము మొదలగునవి యన్నియు యోగాభ్యాసపరులకు సంబంధించిన వనియే గ్రహింపవలసి యున్నది. జ్ఞాననిష్ఠులైన సంన్యాసులకు ఇందు ప్రసక్తి లేదు.

తపస్సుయొక్క విశేషములను భగవానుడు ఇట్లు వివరించినాడు. "దేవతలను బ్రాహ్మణులను గురువులను విద్వాంసులను పూజించుట, శుచిగా నుండుట, వంచనము లేని వర్తనము, బ్రహ్మచర్యము, అహింసయు శారీరకమైన తపస్సుగా చెప్పబడుచున్నది. ప్రాణులకు దుఃఖమును కలిగింపకుండ సత్యముగా ప్రియముగా హితముగా మాటాడుచుండుట, స్వాధ్యాయమును అభ్యసించుచుండుట, వాగ్రూపమైన తపస్సుగా చెప్పబడుచున్నది. మనస్సుయొక్క ప్రసన్నత సౌమ్యత్వము మనోనిగ్రహము భావసంశుద్ధియు మానస మను తపస్సుగా చెప్పబడుచున్నది."

శ్లో|| దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్ |
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే || 14

శ్లో|| అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ |
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే || 15

శ్లో|| మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః |
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే || 16

అధ్యాయః - 41

## విజయప్రభ

ఋతుకాలములయందు మాత్రమే భార్యతో సంగమించుట గృహస్థులకు బ్రహ్మచర్య మగును యజ్ఞాదులందు తప్ప భూతములను హింసింపకుండుట అహింస. మాటాడునప్పుడు సత్యాదులన్నియు ఉన్నప్పుడే అది వాగ్రూపమైన తపస్సు అగును. వానిలో ఏది లోపించినను అది తపస్సు కానేరదు. వేదమునందు అధికారము కలవారు తమకు సంబంధించిన వేదభాగములను నియమపూర్వకముగా అధ్యయన మొనర్చి పారాయణమొనర్చుచుండుట స్వాధ్యాయాభ్యసనము. వేదాధికారము లేనివారు శ్రీమద్రామాయణాది పవిత్రగ్రంథములలోని బాగములను గురువుల యుపదేశము ననుసరించి నియమపూర్వకముగా పారాయణము చేయుచుండుట కూడ ఇట్టిదే అగును. కామక్రోధాదుల కాలుష్యము లేకుండుట ప్రసన్నత. సోముని యాకృతి సౌమ్యము, అనగా చంద్రబింబము. సౌమ్యముయొక్క భావము సౌమ్యత్వము ; అనగా చంద్రబింబము యొక్క ఆహ్లాదకరత్వము. ముఖమును చూచినంతనే ఇతరులకు చంద్రుని చూచినట్లుగా ఆహ్లాదమును కలిగించునట్టి మనః ప్రవృత్తి సౌమ్యత్వము. అనగా మనస్సు భూతములయెడ దయాదాక్షిణ్యములకు అనుగుణముగా నుండుట. ఇచ్చట మౌనమనగా మౌనమునకు అనుకూలమగు చిత్తవృత్తి ; అనగా ఏదో చెప్పవలయునను తొందఱ కలుగకుండుట. అనుచితములు అనావశ్యకములు అయిన విషయములందు మనస్సును ప్రసరింప నీయకుండుట మనోనిగ్రహము. వ్యవహారమునందు మాయావిత్వము లేకుండుట భావసంశుద్ధి.

## గీత

యోగికి విషయమైన సాత్త్వికదానమునుగూర్చి భగవంతు డిట్లు చెప్పినాడు "(పుణ్యప్రదమైన) దేశమునందు, కాలమునందు, పాత్రుడైనవానికి అనుపకారికి కర్తవ్యబుద్ధితో చేయబడుదానము సాత్త్విక మని చెప్పబడుచున్నది."

శ్లో|| దాతవ్య మితి యద్దానం దీయతే ఽ నుపకారిణే |
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ || 20

అధ్యాయః - 41

## విజయప్రభ

కురుక్షేత్రాదులు పుణ్యదేశములు. సంక్రాంతి మొదలగునవి పుణ్యకాలములు. షడంగవేత్త వేదపారగుడు, శ్రోత్రియుడును, అయిన విప్రుడు మొదలగువారు పాత్రులు. ఎవనివలన తాను ఉపకారమును అప్పటికి పొంది యుండలేదో, తరువాతనైన కలుగు నను తలంపు లేదో అట్టివాడు అనుపకారి.

పుణ్యఫలమును అపేక్షింపని యోగి పుణ్యదేశకాలములలో ఏల దానము చేయవలె ? గ్రహణ సమయములందు సంక్రమణాదులయందు పుణ్యముకొఱకు అనేకులు దానములు చేయుచుందురు. బంధువులు మిత్త్రులు దానము చేయుచుండగా, తనకు పుణ్యఫల మక్కఱ లే దని, యోగి మానుకొన్నచో, కొందఱు అతనిని లోభినిగా భావింపవచ్చును, మఱికొందఱు, "పెద్దవాడు ఆయనయే చేయుట లేదు ; మనమెందులకు చేయవలె ?" అని మానుకోవచ్చును. అట్లు జరుగుట సమంజసము కాదు. అందువలన, తనకు ఫలము అక్కఱ లేకున్నను, లోకులను పుణ్యమార్గమున ప్రవర్తింపజేయుటకు ఆధర్మమును చూపుటకు మిగుల శ్రద్ధతో "దానము చేయవలె కాబట్టి చేయుచున్నాను , నాకు దీనివలన ఫల మక్కఱ లేదు" అను నిశ్చయముతోనే అతడు దానములు చేయును.

## గీత

నాలుగు వర్ణములవారికి సహజములైన కర్మలను పేర్కొని భగవానుడు, తమ తమ కర్మలను శ్రద్ధతో అనుష్ఠించు యోగులు సిద్ధిని పొందుప్రకారమును ఇట్లు నిరూపించినాడు "తనకు తనకు (విహితమైన) కర్మమునందు తత్పరత్వము కల నరుడు సంసిద్ధిని పొందును. స్వకర్మనిరతుడైనవాడు సిద్ధిని ఎట్లు పొందుచున్నాడో వినుము. ఎవనివలన భూతములకు ప్రవృత్తి సంభవించుచున్నదో, ఎవనిచేత ఈ జగత్తు అంతయు వ్యాప్తమై యున్నదో అట్టివానిని (ఈశ్వరుని) స్వకర్మచేత చక్కగా అర్చించి మానవుడు సిద్ధిని పొందుచున్నాడు".

శ్లో॥ స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥ 45

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్।
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥ 46

అధ్యాయః - 42

# విజయప్రభ

"తనకు తనకు" (స్వే స్వే) అని చెప్పుటవలన, ఒక వర్ణమునందే ఒక్కొక్కడు బ్రహ్మచారిగా, గృహస్థుడుగా శిష్యుడుగా కుమారుడుగా ఏ యే స్థితియం దున్నాడో దానినిబట్టి తనకు కర్తవ్యముగా ఏర్పడుచున్న కర్మను అనుష్ఠింపవలె. అంతే కాని సన్నిహితులైన సహవాసులు ఏకాకరణము చేత నైన బిన్నముగా వర్తించుచున్న చో వారిని అనుసరింపరాదు.

సంసిద్ధి అనగా సమగ్రమైన సిద్ధి. సిద్ధి యనగా కార్యము ఫలించుటయే కదా! సమగ్రమైన సిద్ధి యేమి ? తల్లిదండ్రులను సేవించునప్పుడు వారికి సంతోషమును కలిగించుట, వారి వలన ప్రేమను సంపదలను పొందుట ఆ సేవకు సిద్ధి. అట్లే గురువును సేవించునప్పుడు ఆయనవలన వాత్సల్యమును ఆశీస్సులను విద్యలను పొందుట ఆ సేవకు సిద్ధి. ఫలాపేక్ష లేని యోగికి ఆఫలములతోపాటు జ్ఞాననిష్ఠకు యోగ్యతను కలిగించు మనోవాక్కాయ శుద్ధి కూడ కలుగును. అప్పుడే కర్మానుష్ఠానము యొక్క సిద్ధి సమగ్ర మగును. ఫలాపేక్షను వీడినంత మాత్రముననే ఈ సిద్ధి కలుగునా ? సకల భూతములయుత్పత్తికి కారణమైనవాడు, సర్వవ్యాపకుడును అయిన పరమేశ్వరుని తన కర్మానుష్ఠానము చేత అభిరతితో అర్చించుచున్నచో, ఆయనయొక్క అనుగ్రహమున సంసిద్ధి కలుగును. కర్మలతో అర్చించుట అనగా నేమి ? అర్చన మనగా అర్ఘ్య పాద్య గంధపుష్పాదులతో పూజించుట ఆవిధముగా శిష్యుడు గురువును అర్చించినచో ఆయన సంతోషించు ననుటకు సందియము లేదు. కాని ఆ శిష్యుడు ఆయనచెప్పిన పనులను చేయకున్నచో కోపించు ననుట నిస్సంశయము. మఱియొక శిష్యుడు ఆయనను అర్ఘ్యపాద్యాదులతో అర్చింపకున్నను ఆయన చెప్పిన పనిని చక్కగా నిర్వర్తించినచో ఆయన మిగుల సంతోషించుట తథ్యము కావున పెద్దలను పూజించుట అర్చన మగుచుండగా, వారు చెప్పినట్లుగా వర్తించుట అభ్యర్చన మగును. భగవంతుని విషయమున కూడ ఆయనను అభిషేకనైవేద్యాదులతో పూజించుటకంటె, ఆయన వచనములైన శ్రుతిస్మృతులయందు విహితములైన ధర్మములను అనుష్ఠించుట అభ్యర్చనమై ఆయనకు మిగుల సంతోషమును కలిగించును

ఆయనయొక్క ఉపదేశరూపమగు ధర్మములను వీడి ఈశ్వరుని ఎంత భక్తితో అర్చించినను, ఆయన ఆ పూజవలన అంత సంతోషింపక పోగా కోపించుట సహజము స్వధర్మమైన యుద్ధమును వీడి ఒకనుడు తన్ను పూజించినను భగవంతుడు

సంతోషింపకపోగా క్రోధమునే ప్రకటించును, "జ్యేష్ఠసోదరుడు తండ్రితో సమానుడు" **(జ్యేష్ఠ భ్రాతా పితృ సమః) అను న్యాయముచేత యుధిష్ఠిరునియాజ్ఞ తండ్రియాజ్ఞతో** సమానమే యగును. "తండ్రిని దేవునిగా కలిగి యుండుము" (పితృదేవో భవ) అను వేదముయొక్క అనుశాసనముచేత ధర్మజుని యాజ్ఞ అర్జునునకు దేవునియాజ్ఞయే అగును. అట్టియాజ్ఞను అర్జునుడు పాటింపకున్నచో శ్రీకృష్ణుడు అతనిని క్షమించుట సంభవము కాదు ఇట్లే తల్లిదండ్రులను సేవింపవలసిన పుత్త్రులు, భర్తలను సేవింపవలసిన భార్యలు ఆ కార్యములను వీడి ఎంతనిష్ఠతో ఎన్ని యజ్ఞములను వ్రతములను తపస్సులను చేసినను బగవంతుడు సంతోషింపడు. మాతాపితృసేవ, పతిసేవ, బ్రాహ్మణునకు అధ్యయనాధ్యాపనములు, క్షత్త్రియునకు ప్రజాపాలనము యుద్ధము మొదలగునవి నియతములైన కృత్యములు. వ్రతములు తీర్థయాత్రలు యజ్ఞాదులు ఐచ్ఛికములు. నియతములైన స్వధర్మములను నిర్వహించిన తరువాత ఐచ్ఛికములైన పుణ్యకార్యములను చేసి పుణ్యమును కీర్తిని సంపాదించుకో వచ్చును. మహాకార్యములను చేయుచున్నా మను భ్రాంతితో మాతాపితృసేవాదులను వీడి తపస్సులు మొదలగువానికై పూనుకొనుట తప్పని మహాభారతమున కౌశికునివృత్తాంతమున నిరూపింపబడియున్నది.

పై యంశముల ననుసరించి కర్మయోగ స్వరూపమును ఇట్లు గ్రహింపవచ్చును. గురువులను విద్వాంసులను పూజించుచు వారి వలన పరమేశ్వరుని యాజ్ఞారూపములైన శ్రుతిస్మృతులలోని ధర్మములను తెలిసికొనుచు, వానియందు తనకు విహితములైన దర్మములను గ్రహించి, కామ్యకర్మలను వీడి, కర్తవ్యములైన యజ్ఞదానతపస్సులను పలముల నపేక్షింపక, ఈశ్వరార్చనముగానే అనుష్ఠించుట కర్మయోగ మగును. ఈయనుష్ఠానము ఆదర్శమై ఇతరులు కూడ ధర్మపరాయణులై శ్రేయస్సును పొందుదురు. మానవులకు శ్రేయస్సు కలుగునట్లు వర్తించుటయే మానవసేవ. అదియే మాదవ సేవ. అదియే లోకసంగ్రహము. యోగనిష్ఠులైన జనకుడు దర్మరాజు మొదలగువారు దర్మపరిపాలనముచే లోకసంగ్రహమును కావింపగా, మనువు పరాశరుడు మొదలగువారు ధర్మములను నిరూపించుచు శాస్త్రగ్రంథములను రచించి ప్రజలకు హితమును గావించిరి. జగత్తు యొక్క హితమును ఉద్దేశించియే ఆ ధర్మతత్త్వములను మిత్రసమ్మితముగా కాంతాసమ్మితముగా ఉపదేశించుచు వాల్మీకివ్యాసాదులు నన్నయపోతనాదులు శ్రీరామాయణాది మహాకావ్యములను నిర్మించిరి. త్యాగరాజు మొదలగువారు మహాభక్తులై వాగ్గేయకారకులుగా మహాశిల్పులుగా భగవద్భక్తికై నిర్మించిన సంకీర్తనల సముదాయములు, దేవాలయసుందరశిల్ప చిత్రపరంపరలు, తరతరములుగా లోకహితమును గావించుచునే యున్నవి. కావున స్వధర్మాచరణ పూర్వకములు భగవద్భక్తికరములును అయిన మహాయోగుల కార్యములే లోక సంగ్రహసాధనములు.

ఈ సందర్భమున నేడు అనేకులకు పెక్కు సందేహములు కలుగవచ్చును. **ఈనాడు వైద్యులుగా ఉపాధ్యాయులుగా నాయకులుగా సంఘ సేవకులుగా ఫలాపేక్ష** లేకుండ నిస్స్వార్థముగా చాలమంది ఎన్నో రంగములలో కృషి చేయుచున్నారు. వారిలో కొందఱు భగవంతుడు ఉన్నాడని నమ్మరు. భగవంతు డున్నా డని నమ్ము వారు కూడ కొందఱు వేదశాస్త్రములను విశ్వసింపరు మాతాపితృసేవ అధ్యయనాధ్యాపనములు సంధ్యావందనము మొదలగువానికంటె లోకహితముకొఱకు సేవాకార్యక్రములలో పాల్గొనుట చాల గొప్పపని యని, అత్యంతము ఆవశ్యకమైన కర్తవ్యమని తలంచుచు వివాహము మానుకొని సంసారసుఖభోగములకు దూరులై ఎన్నో శ్రమలకు ఓర్చి వారు నమ్మిన సేవా కార్యములనో విప్లవోద్యమములనో ప్రాణములకు కూడ తెగించి అనుష్ఠించుచుందురు. వీరి యీ కర్మనిష్ఠ కర్మయోగ మగునా ? కాకున్నచో దీనికి ఏమి ఫలము కలుగును ?

భగవంతుని నమ్మనివారు పరలోకములు జన్మాంతరములు పుణ్యాపాపములు ఉన్న వని నమ్మరు. చిత్తశుద్ధి జ్ఞానసంపాదనము వారిదృష్టిలో నుండవు. వారికి అక్రమముగా తోచుచున్న శాసనములను ప్రభుత్వములను ప్రతిఘటించుచు, అక్రమముగా సంపన్నులై అదికారపదవులను ఆక్రమించి ప్రజలను కడుగండ్ల పాలుగావించుచున్న వారిని తొలగించుట లేక నిర్మూలించుట, నూతన ప్రభుత్వమునో లేక నూతనసమాజమును నిర్మించుటయో వారికి లక్ష్యములుగా నుండును. ఇట్టి యాశయములతో ఆవేశముతో వారు చేయు నిశ్చయములు, కైకొను కార్యదీక్షలు త్యాగములు హేతుబద్ధములుగా నుండవు ; అందువలన సిరములుగా నుండవు. ఏయుద్యమ మైనను వెంటనే ఫలించు నని చెప్పుటకు వీలు లేదు. అది ఎప్పటికైనను ఫలింపవచ్చును , లేక నశింపవచ్చు. ఉద్యమము జరుగుచున్నప్పుడు కార్యకర్తలు కొందఱు మరణింపవచ్చు. అట్లు మరణించిన వారికి, వారు గావించినత్యాగములవలన చేసిన సేవవలన ఏమి ఫలము లభించును ? ఉద్యమము ఏకారణముచేత నైనను విజయవంతమైనప్పుడు పదవులకొఱకు పోటీలు ప్రబలినప్పుడు, త్యాగములు చేయనివారు ముందునకు వచ్చి స్వార్థముతో, అప్పటివఱకును కష్టపడి పనిచేయుచుండిన కార్యకర్తలను వెనుకకు త్రోసి, ఆవశ్యకమైనచో హత్యలు కూడ చేసి పదవులను ఆక్రమింతురు. అనగా జరిగిన కృషికి ఫలము కలుగకుండుట, కృషి జరుగకున్నను ఫలము కలుగుట సంభవించు నన్నమాట. జరిగినకృషికి ఇప్పుడు ఫలము లేకున్నను లోకాంతరముననో జన్మాంతరముననో కలుగు నని చెప్పుటకు వీలు లేదు. వారికి వానియందు నమ్మకము లేదు కదా ! కాబట్టి కారణసామగ్రి పుష్కలముగా ఉన్నను కార్యము కలుగక పోవచ్చునని కారణసామగ్రి లేకున్నను కార్యము కలుగవచ్చు నని వారు అంగీకరింపవలసియుండును. కారణము లేకుండ కార్యము కలుగు నని చెప్పుట **అశాస్త్రీయము (unscientific). కారణము లేకుండ కార్యము కలుగుట అసంభవము (There can be no effect with out cause).** విత్తనము లేకుండ మొక్క రాదు. విత్తనము

కన్పింపకున్నను మొక్కను బట్టి ఊహింపవలసినదే, కాని విత్తనము లేకున్నను మొక్క ఉండవచ్చు ననుట సరి కాదు. అట్లు అంగీకరించినచో ప్రయత్నములు లేకుండ పనులు జరుగవచ్చు నని ఒప్పుకో వలసియుండును. ఆ పద్ధతిలో ఉద్యమములు లేకున్నను విప్లవములు, విప్లవములు లేకున్నను నూతన సమాజ నిర్మాణములు జరుగవచ్చు నని కూడ అంగీకరింపవలసియుండును. కావున సహేతుకముగ ఆలోచించినచో బుద్ధిమత్త్వము బుద్ధిహీనత సౌందర్యము, అంగవైకల్యము మొదలగు జన్మసిద్ధలక్షణములను బట్టి పూర్వజన్మకర్మలను కారణములనుగా గ్రహింప వలసియున్నది.

త్యాగము విషయము కూడ ఇట్టిదే. బ్రతికియుండగా సుఖము లేదు , చచ్చిన తరువాత వాడే యుండడు. పరోపకారము పుణ్య మని గాని పరపీడనము పాపమని చెప్పుటకు వీలు లేదు. పుణ్యపాపములకు ఫలములనిచ్చు పరలోకములను జన్మాంతరములను వారు నమ్మరు. అట్టియెడల ఎవరైనను ఏల త్యాగము చేయవలె ? నరకములు జన్మాంతరములు లేనప్పుడు, ఈ లోకమున శిక్షణ తప్పించుకొనుటకు వీలున్నప్పుడు పరులను వంచించి పీడించి సంహరించి యైనను నంపన్నులై పదవులను ఆక్రమించి ఐశ్వర్యమును అనుభవింపవలయు నను తలంపులు వీరికి ఒకప్పటికి కలుగ వని ఎట్లు చెప్పవచ్చును ? ఉద్యమములు విజయవంతములై వీరు ఉన్నవారిని పడగొట్టి ప్రభుత్వాధికారపదవులను సంపాదించినప్పుడు, వెనుకటివారివలె వీరు కూడ స్వార్థపరులై అక్రమముగా సంపాదింప రని ప్రత్యర్థులను పరిమార్ప రని చెప్పుటకు ఆధార మే మున్నది ? కామినీ కాంచనముల యాకర్షణములకు లోబడక, అధికారవ్యామోహమునకు లొంగక, ఉద్యమసమయములందు పాటించిన నీతి నియమములను నిలుపుకొనుటకు కావలసిన నిగ్రహము వీరికి ఎట్లు కలుగును ? గొప్ప తాపసులే కొన్ని సందర్భములలో నిగ్రహమును కోల్పోయి యుండుట ప్రసిద్ధమై యుండగా నిత్యము కామక్రోధసంకులములైన రాజకీయములలో పని చేయువారి సంగతి చెప్పవలసిన దే మున్నది ? వీరిదృష్టిలో పుణ్యపాపములే లేవు కదా ! కావున వీరిత్యాగపరత్వము కార్యదీక్ష పునాది లేని గోడలు చిత్తశుద్ధి, జ్ఞానసంపాదనము వీరికి లక్ష్యములు కాకపోవుట చేత వీరిత్యాగపరత్వము, సేవాకార్యదీక్ష సుదృఢములే యైన పక్షమున కూడ వీరికార్యాచరణము కర్మయోగము కానేరదు. పూర్వజన్మసుకృతవశమున వీరు నీతినియమపరాయణులై సేవాకార్యనిమగ్నులై యున్నచో ఆపుణ్యమువలన జన్మాంతరమునందు నాస్తిక మతావేశము లేని పరిసరములలో పుట్టి పెరిగి ధర్మమార్గమునకు దూరము కాని స్థితిని పొందుదురు.

భగవంతుడు ఉన్నాడని పుణ్యపాపములు, పరలోకజన్మాంతరములు ఉన్నవని నమ్ముచున్నవారు కూడ కొందరు శ్రుతిస్మృతులవలన ధర్మములను గ్రహింపక, తమకు తోచినట్లుగా ప్రజాహితకార్యములను నిర్వహించుటయే భగవద్భక్తికర మని భావించుచున్నారు. వీరు సంధ్యావందనాదులైన నిత్యనైమిత్తిక కృత్యములను

పాటింపరు, మాతాపితృసేవ మొదలగువానిని అవశ్యకర్తవ్యములనుగా గ్రహింపరు. వీరు సమాజసేవా కార్యక్రమములలో మిగుల అభినివేశముతో పాల్గొనుచు హరికథలు వేదాంతోపన్యాసములు మొదలగువానిని వినుచు, స్వాములను బాబాలను సేవించుచు కాలక్షేపము చేయుచుందురు. సమాజసేవాకార్యక్రమములు, ధర్మవిరుద్ధములు కానంతవఱకు మంచివే. కాని భగవంతునిచే ఆదేశింపబడిన స్వధర్మకార్యములను మానుకొనుట మంచిది కాదు. ఆయన ఆదేశమును పాటింపనప్పుడు ఆయన యనుగ్రహము కలుగకపోగా ఆగ్రహమే కలుగవచ్చును. నారదమహర్షి నుండి త్యాగరాజాదులవఱకు మహాభక్తులు మహాగాయకులు మహాకవులు మహాశిల్పులతో ఎవ్వరును వర్ణాశ్రమధర్మములను వదల లేదు. వర్ణాశ్రమ ధర్మములను పాటించుచునే వారు భగవత్ప్రీతికరముగా మహాకార్యములను నిర్వహించిరి. దానివలన ఈశ్వరానుగ్రహమునకు పాత్రులై చిత్తశుద్ధిని జ్ఞాననిష్ఠను పొంది జీవన్ముక్తులైరి. జన్మాంతరకృతమైన దురితమును తొలగించుచు పరమేశ్వరప్రీతిని కలిగించుటలో సంధ్యావందనాది నిత్యనైమిత్తిక కర్మలకు ఉన్న సామర్థ్యము (ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం) తాత్కాలికముగా మనకు తోచుచుండు సేవాకర్యక్రమములకు ఉండదు. సంధ్యావందనాదులు శాస్త్రవిహితములై వసిష్ఠాదిమహర్షులచేత శ్రీరాముడు మొదలైన యవతారపురుషులచేత ఆచరింపబడుచుండినవి. వానికున్న ప్రభావము, తలకొకవిధముగా తోచు సేవా కార్యక్రమములకు ఉండుట అసంభవము.

దేహమునకు స్నానమువలె మనస్సునకు సంధ్యావందనాదికములు శుచిత్వమును కలిగించుటకు అవశ్యకములు. స్నానము చేయక తగినవస్త్రధారణము లేక నగ్నముగానో అర్ధనగ్నముగానో పోయినచో విద్యాశాలలో గాని, కార్యాలయములలోని గాని ప్రవేశించుట ఎట్లు కుదురదో అట్లే సంధ్యావందనాదులను నిర్వర్తించనివానికి కర్మయోగ మను తరగతిలో ప్రవేశించుటకు అర్హత కలగుదు. అయినను భగవంతునియందు విశ్వాస ముంచి ప్రజాహితమునకై పాటుపడువారు జన్మాంతరమున ఆపుణ్యమునకు ఫలముగా సద్గురువును పొంది యథావిధిగా కర్మయోగమార్గమున ప్రవేశించి ముందుకు పోగలరు.

ఈనాడు పరివ్రాజకులయందు కూడ కొందఱియందు కర్మపరాయణత్వము కన్పించుచున్నది. పరివ్రాజనము జ్ఞానసాధనముకొఱకే విధింపబడినది. విద్యాభ్యాసమునకు భంగకరములైన రాజకీయోద్యమాదులు విద్యార్థులకు ఎట్లు దగవో, అట్లే ఆత్మవిద్యాభ్యాసముకొఱకు పరివ్రాజకులైనవారికి శ్రవణాదులు తప్ప వైదికములు లౌకికములు అయిన సకలవ్యవహారములు నిషిద్ధములు. వీరు చిత్తశుద్ధికొఱకు కూడ శ్రవణాదులనే మరల మరల అనుష్ఠించుచుండవలె కాని, మంత్రజపాదులను కూడ అవలంబింపరాదు. కావున వీరివిషయమున కర్మయోగ ప్రసక్తియే లేదు. అట్లయినచో వీరి కర్మాచరణమునకు ఏమి ఫలము కలుగును ?

జ్ఞాననిష్ఠులైన విద్వత్సంన్యాసులకు ప్రారబ్ధవశమున మఠపాలకత్వమో పీఠాధిపత్యమో వచ్చి పడినచో వారు ఆ కార్యములను నిర్వహించుచున్నను వారికి ఆపనులయందు సంగము కర్తృత్వాభిమానము ఉండదు. కావున ఆకర్మ లన్నియు జ్ఞానాగ్నిచే దగ్ధము లగును అవి కర్మలే కావు ఇట్లే జ్ఞానమును సంపాదింప గోరి సంన్యసించినవారికి కూడ ఇట్టి పరిస్థితులు సంభవించినప్పుడు తప్పక నిర్వహింపవలసిన మఠపీఠాధికార్యములను అసంగబుద్ధితో నిర్వహించుచు తక్కిన సమయ మంతయు జ్ఞానసముపార్జనకై శ్రవణాదులకే వినియోగింపవలె. జ్ఞానసిద్ధినే వారు పరమలక్ష్యముగా భావింపవలె ఆలక్ష్యమును వీడి వారు లోకసేవాకార్యములలో నిమగ్ను లగుచు జ్ఞానసాధనమును ఉపేక్షింపరాదు. అనేకులు కావించు పెక్కు లోకసేవాకార్యక్రమములకంటె ఒక్కని జ్ఞానసిద్ధివలననే లోకమునకు చాల మేలు కలుగు నని గ్రహింపవలసి యున్నది.

ఈ విషయమున భగవాన్ శ్రీరమణమహర్షియొక్క అభిప్రాయములు గమనింపదగియున్నవి. "మహాత్ములు సాయము ఎందులకు చేయరు ?" అని ఒక భక్తు డడిగిన ప్రశ్నకు ఆయన ఇట్లు సమాధానము చెప్పెను. "వారు సాయము చెయుట లేదని నీ కెట్లు తెలియును ? వేదికలపై ఉపన్యాసములు, శారీరకమైన కర్మాచరణము, ధనధాన్యాది సాహాయ్యము సర్వము మహాత్ముల మౌనముకంటె తక్కువయే అగుచున్నవి. వారు ఇతరులకంటె అధికముగనే మేలు కావింతురు"

**(21st. October, 1936 . Dr Syed Asked . Why do not Mahatmas help ?**

**M : How do you know that they do not help ? Public speeches, physical activity and material help are all out weighed by the silence of mahatmas They accomplish more than others" - P 227)**

ఇంకొకసారి మఱియొక భక్తుని ప్రశ్నకు సమాధానముగా మహర్షి ఇట్లు ఉద్ఘాటించెను. "అనర్గళమైన యుపన్యాసమును ఒకడు ఒకగంట సేపు విని, తన జీవితమున మార్పును కలిగించు ప్రభావమును కొంచెమైనను పొందక లేచిపోయినచో నీ వే మనుకొందువు ? ఒక పవిత్రమైన సన్నిధియందు కూర్చుండి కొంత సేపైన తరువాత జీవితముపై తన దృక్పథమును పూర్తిగా మార్చుకొని వెడలిపోవునట్టి మఱియొకనిని వీనితో పోల్చిచూడుము. ఈ రెండింటిలో ఏది మేలు ? ఫలితము శూన్యముగా బిగ్గరగా ఉపదేశించుటయా ? లేక మౌనముగా కూర్చుండి ఇతరులయందు మార్పు కలిగించుచు శక్తులను ప్రసరింపజేయుటయా ?"

**(18th Novermber, 1939 Answering the question of a devotee Sri Maharshi remarked**

**"What do you think of a man listening to a harangue for an hour going away without being impressed by it so as to change his life ? Compare with him**

another who sits in a holy presence and leaves after some time with his outlook on life totally changed. Which is better ? To preach loudly without effect or to sit silently sending forth forces to play on others ?" - P. 243)

మఱియొకనితో మాటాడుచు మహర్షి ఈ యభిప్రాయమునే ఇట్లు వివరించెను" ఆత్మసాక్షాత్కారమును పొందుటయే లోకమునకు ఎవడైనను చేయగలిగిన మహత్తమమైన యుపకారము. కావున సాధువులు అరణ్యములలోనే ఉండినప్పటికి సాయము చేయువారుగా చెప్పబడుచున్నారు. .... ఆసాయము కన్పింపకున్నను ఉండనే యున్నది. సాధువు సకలమానవులకు సాయము చేయును. వారి కది తెలియదు"

(Talking with Evans - Wentz Sri Maharshi observed : "...... Ralisation of the self is the gretest help that can be rendered to humanity. Therefore, the saints are said to be helpful, though they remain in forests...."

".. . .. The help is imperceptible but is still there. A saint helps the whole of humanity unknown to the latter" - P. 15 & 16)

Talks with Sri Ramana Maharshi - Fourth Edition - 1968.

కావున వివిదిషాసంన్యాసులు (తత్త్వమును తెలిసికోవలయునని సన్యసించినవారు) శ్రవణమనన నిదిధ్యాసనములనే కావించుచుండవలె. అట్లు కాక వారు వ్యవహారమున ఆసక్తులైనచో మోక్షమును పొంద లేరు. సంన్యాసాశ్రమమును పొందినంతమాత్రమున జ్ఞానసిద్ధి కలుగదు. అందువలన వారు మరల జన్మించి శ్రవణమననాదులను చేయవలసియుండును.

ప్రాచీన సంన్యాససంప్రదాయమున దండకమండలువులు వీడకుండ, శ్రోత్రియ బ్రాహ్మణభిక్షనే స్వీకరించుట మొదలగు నియమములతో ఎంతో అనుష్ఠానము కూడ కలదు. ఈ సంప్రదాయమునకు భిన్నముగా వర్ణాశ్రమధర్మరహితముగా ప్రవర్తించుచున్న మఠాధిపతులు ఆశ్రమాధిపతులు, బాబాలు మొదలగువారి ప్రభావమునకు లోనై బ్రాహ్మణులు కూడ కొందఱు పరివ్రాజకులై దండ కమండలువులు లేక భిక్షానుష్ఠాననియమములను పాటింపక కాషాయవస్త్రములను మాత్రము ధరించుచు భజనసంకీర్తనములు గీతాపారాయణము వేదాంతప్రవచనములు మొదలగు కార్యక్రమములలో నిమగ్నులగుచున్నారు. వీరిలో కొందఱు ముండితశిరస్కులై యుండగా మఱికొందరు శిరోజవిన్యాసభూషితులై యున్నారు. వీరిలో చాలమంది శ్రీశంకరాద్వైతమతానుయాయుల మనియే చెప్పుకొనుచుందురు. ఎట్లైనను వీరు కర్మసంన్యాసము కావించి యుండుటచే వీరి ప్రవర్తనము కర్మయోగము కాదనుట స్పష్టము. కేవలము గీతాపారాయణ ప్రవచనాదులవలన జ్ఞానయోగసిద్ధి కలుగదనుట కూడ స్పష్టమే. వీరు సంప్రదాయవిదులైన సద్గురువుల నాశ్రయించి సంన్యాసధర్మములను యథావిధిగా పాటించుచు శ్రవణమననాదులను కావించినచో

అందలి శ్రద్ధాతిశయము చేత ఉత్తమగతులను తప్పక పొందగలరు.

సంప్రదాయరహితములైన మఠములు ఆశ్రమములు ఈనాడు కొల్లలుగా దేశమంతటను నెలకొనియున్నవి. వీనియందు అన్ని వర్ణములవారికి స్త్రీలకు కూడ కాషాయవస్త్రధారణమాత్రమున పరివ్రాజకత్వము సంభవించుచున్నది. ఈ సంస్థలలో శ్రీశంకరాచార్యాదులమతముల ననుసరించియే ప్రవచనములు బ్రహ్మసూత్ర గీతావ్యాఖ్యానాది గ్రంథప్రకటనములు మహోత్సవ శోభితములుగా జరుగుచుండును. కాని వీరి యీ పరివ్రాజక విధానము భగవంతునిచే విధింపబడిన వర్ణాశ్రమ వ్యవస్థకు విరుద్ధమగుటచే అవైదికమై బౌద్ధమో జైనమో అగును గాని శ్రీశంకరభగవత్పాదులవారి యభిమతము కానేరదు. గీతాభాష్యము యొక్క ప్రారంభమునందు వారు ప్రవృత్తి నివృత్తి రూపమైన వేదవిహితమైన వర్ణాశ్రమధర్మమును నెలకొల్పుటకే శ్రీకృష్ణభగవానుడు అవతరించె నని ఉద్ఘాటించియున్నారు. "జగత్తు యొక్క స్థితికి కారణము, ప్రాణులకు సాక్షాత్తుగా అభ్యుదయమును నిశ్శ్రేయసమును కలిగించుటకు హేతువును అయిన వేదవిహితమైన ధర్మము ప్రవృత్తి లక్షణమ మని నివృత్తి లక్షణమని రెండు విధములుగానున్నది. అది శ్రేయస్సును కోరునట్టి బ్రాహ్మణాది వర్ణములవారి చేత ఆశ్రమ లక్షణములు కల్గువారిచేత అనుష్ఠింపబడుచుండెను... జగత్తుయొక్క స్థితిని పరిపాలింప గోరుచు, ఆదికర్త నారాయణాఖ్యుడును అయిన యావిష్ణువు భూమియందలి బ్రహ్మరూపమైన బ్రాహ్మణత్వముయొక్క రక్షణముకొఱకు దేవకియందు వసుదేవునివలన అంశముచేత కృష్ణుడుగా జన్మించెను గదా ! వర్ణాశ్రమభేదములు దానియధీనము లగుటవలన బ్రాహ్మణత్వముయొక్క రక్షణము చేతనే వైదికమైన ధర్మము రక్షితమగును".

"ద్వివిధో హి వేదోక్తో ధర్మః, ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణః, జగతః స్థితి కారణమ్, ప్రాణినాం సాక్షా దభ్యుదయ నిశ్శ్రేయస హేతు ర్య స్సధర్మో బ్రాహ్మణాద్యై ర్వర్ణిభిః ఆశ్రమిభి శ్చ శ్రేయోఽర్థిభి రనుష్ఠీయమానః ..... జగతః స్థితిం పరిపిపాలయిషుః స ఆదికర్తా నారాయణాఖ్యో విష్ణు ర్భౌమస్య బ్రహ్మణో బ్రాహ్మణత్వస్య రక్షణార్థం దేవక్యాం వసుదేవా దంశేన కృష్ణః కిల సంబభూవ ; బ్రాహ్మణత్వస్య హి రక్షణేన రక్షితః స్యా ద్వైదికో ధర్మః, తదధీనత్వా ద్వర్ణాశ్రమ భేదానామ్".

తమకు విహితములైన మాతాపితృసేవాది ధర్మములను వీడి పురుషులు, పతిశుశ్రూషాది ధర్మములను వీడి స్త్రీలు, తమకు నిషిద్ధమైన పరివ్రాజనమును స్వీకరించుటవలన, వీరి యీ పరివ్రాజనము వైదికమైన జ్ఞానయోగాభ్యాసమని గ్రహించుటకు వీలు లేదు. అట్లే భజన సంకీర్తనాదికమైన వీరి కార్యవిధానము కర్మయోగము కానేరదు. ఈ పద్ధతియం దైనను వీరు కామలోభాదులకు లోనుగాక సాధువర్తనులై తాము నమ్మిన గురువునో బాబానో త్రికరణశుద్ధితో సేవించుచున్నచో జన్మాంతరమున శ్రేయోదాయకములైన కుటుంబములయందు పుట్టి అధ్యాత్మ మార్గమున పురోగమింప గల రని తలంపవచ్చును.

ఈ సందర్భమున మఱియొక విషయమును కూడ గమనింపవలసియున్నది భగవానుడు శోకమోహమహోదధియందు నిమగ్నుడైన యర్జుననునకు, శోకమోహములకు మూలమైన యజ్ఞానమును నిర్మూలించుటకై ఆత్మజ్ఞానవిశేషములను ప్రధానముగా బోధించెననుట స్పష్టమే కాని అర్జునుడు అప్పుడే అధ్యాత్మమార్గమున అడుగుపెట్టుచున్నాడు. అట్టివాడు అప్పటికప్పుడే సాంఖ్యయోగ పదమున ప్రవేశించుట అసాధ్యము. అతడు కర్మయోగమును కొంత కాల మనుష్ఠించి, తరువాత ధ్యానయోగమువలన కూడ చిత్తశుద్ధిని సంపాదించుకొని జ్ఞానిష్ఠను పొందవలసియున్నది. అందువలన అర్జునుడు అవలంబింపవలసిన కర్మయోగమునకు ఆదారమైన స్వధర్మాచరణమునుగూర్చి ఊని చెప్పుచు భగవానుడు, ఆ క్షణమునందు తటస్థమైన యుద్ధధర్మమును అవలంబింపు మని అతనికి అనేక పర్యాయములు చెప్పి ప్రోత్సహించినాడు. స్వధర్మాచరణముయొక్క ప్రాముఖ్యమును నిరూపించుటకై ఆయన వేదవిహితమైన ప్రవృత్తిధర్మమును వివరించినాడు. ఈవిధముగా భగవంతుడు వేదవిహితములైన ప్రవృత్తి నివృత్తి ధర్మములను రెండింటిని ఉపదేశించుట చేత ఈ గీతాగ్రంధము ఉపనిషత్తుల సారాంశమగుటయే కాక సకల వేదార్థసార సంగ్రహమై వేదతుల్యముగా సంభావింపబడుచున్నది. ఈ విషయమును కూడ శ్రీశంకరభగవత్పాదులవారు విస్పష్టమొనరించినారు. "ఆ భగవానుడు... భూతములను అనుగ్రహింపవలయు నను తలంపుతో గుణాదికులచే గ్రహింపబడి అనుష్ఠింపబడుచున్న ధర్మము కదా వృద్ధిని పొందునని, వైదికమైన ధర్మద్వయమును శోకమోహమహోదధియందు నిమగ్నుడై యున్న యర్జుననునకు ఉపదేశించెను. ఆ ధర్మమును, భగవంతునిచే ఎట్లు ఉపదేశింపబడినదో అట్లే, సర్వజ్ఞుడు భగవంతుడును అయిన వేదవ్యాసుడు ఏడు వందలశ్లోకములతో గ్రంథమునుగ నిబంధించెను.

ఆ యీ గీతాశాస్త్రము సమస్తవేదార్థసారసంగ్రహభూతము, దీనియందలియర్థము దుర్విజ్ఞేయము. ఈ యర్థముయొక్క ఆవిష్కరణముకొఱకు అనేకులు పదవిభాగములతో పదార్థములతో వాక్యవిభాగములతో వాక్యార్థ న్యాయములతో వివరణములు గావించినను, ఈ గ్రంథము అత్యంతము విరుద్ధములైన యనేకార్థములతో లౌకికులచే గ్రహింపబడుచుండుటను చూచి నేను వివేకముతో అర్థనిర్ధారణము చేయుటకొఱకు సంక్షేపముగా వివరణము చేయబోవుచున్నాను"

"స చ భగవాన్.... భూతానుజిఘృక్షయా వైదికం ధర్మద్వయ మర్జునాయ శోకమోహమహోదధౌ నిమగ్నా యోపదిదేశ, గుణాధికై ర్హి గృహీతోఽనుష్ఠీయమాన శ్చ ధర్మం ప్రచయం గమిష్య తీతి| తం ధర్మం భగవతా యదోపదిష్టం వేదవ్యాస స్సర్వజ్ఞో భగవాన్ గీతాఖ్యై స్సప్తభిః శ్లోకశతై రుపనిబబంధ

త దిదం గీతాశాస్త్రం సమస్తవేదార్థసారసంగ్రహభూతం దుర్విజ్ఞేయార్థమ్| తదర్థావిష్కరణా యానేకై ర్వివృత పదపదార్థ వాక్య వాక్యార్థన్యాయ మపి అత్యంత విరుద్ధానేకార్థత్వేన లౌకికై ర్గృహ్యమాణ ముపలభ్యాఽహం వివేకతోఽర్థ నిర్ధారణార్థం

దీనినిబట్టి భగవద్గీత కేవలము వేదాంత గ్రంథము కా దని, దీనియందు వర్ణాశ్రమధర్మలక్షణమైన ప్రవృత్తిధర్మము కూడ బోధింపబడిన దని, అదియే కర్మయోగమునందు ఉద్దేశింపబడిన స్వధర్మకర్మాచరణకు మూల మని గ్రహింపవలసియున్నది. అంతేకాదు. సర్వజ్ఞుడు భగవంతుడును అయిన వేదవ్యాసుడు శ్రీకృష్ణుడు ఉపదేశించిన విషయమును ఏడువందల శ్లోకములతో నిబందించె ననుట వలన, బగవానునియుపదేశము హెచ్చుతగ్గులు లేకుండ, చెప్పినది చెప్పినట్లే, గ్రందరూపమును పొందినదనుట స్పష్టము. అట్లే గ్రంథము ఏడువందల శ్లోకసంఖ్యతో శ్రీ శంకరులవారికి ముందే గ్రహింపబడు చున్న దనియు విశద మగుచున్నది. గ్రంధసంఖ్యనుగూర్చి యభిప్రాయభేదము లున్నట్లు వారు ప్రస్తావింప లేదు. అనగా వారికి పూర్వము వందల యేండ్లుగా శ్లోకసంఖ్య ఏడువందలుగానే నిశ్చితమై యున్నదనుట స్పష్టము. అట్టియెడల ఈనాడు కొందఱు ఏడువందలకు పైగా చూపుచున్న శ్లోకములు కల్పితము లగునే కాని మూలగ్రంధస్థములు కా వని గ్రహింపవలసియున్నది.

అట్లే శ్రీశంకరులవారికి పూర్వమే ఎంతో మంది విద్వాంసులు పదవాక్యార్థ వివరణములతో ఈ గ్రంథమునకు వ్యాఖ్యానములు వెలయించినను, ఇందలియర్థము సులభగ్రాహ్యము కాక లోకులు విరుద్ధార్థములతో గ్రహించుచుండిరన్నచో, ఈనాడు అనేకులు, భాషాపరిజ్ఞానములేని రాజకీయనాయకులు కూడ ఈ గ్రంథమునకు వ్యాఖ్యానములు వెలయింపబూనుట మిగుల అక్రమ మని గ్రహింపవలసియున్నది.

## (ii) ధ్యానవిధాన చమసము

## గీత

కర్మయోగమునకు గమ్యమైన జ్ఞానసిద్ధికి ధ్యానయోగము ఆవశ్యక మని, ఆ క్రమమును భగవానుడు నిరూపించుచున్నాడు. "ధ్యానయోగము అను మెట్టు పైకి ఎక్కగోరు మునికి కర్మయోగము సాధనమగును. దానిపైకి ఎక్కినతరువాత అతనికి (జ్ఞానసిద్ధిని పొందుటకు) శమము సాధన మగును.

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥

అధ్యాయః - 30

# విజయప్రభ

**ముని యనగా మననశీలుడు ; కర్మయోగము నవలంబించుచు భగవంతునియొక్క** స్వరూపమునుగూర్చి ఆలోచించువాడు. ధ్యానయోగమును సాధించి జ్ఞానసిద్ధికై ప్రయత్నించువానికి శమము సాధన మగును. బహిరింద్రియ నిగ్రహమును దమ మని అంతరింద్రియ నిగ్రహమును శమ మని చెప్పెదురు. మనస్సు విషయభోగములను అభిలషించుచున్నను దానిని నిరోధించి వానిని అనుభవింపకుండుట దమము. అట్లు మనస్సును మాటిమాటికి భోగములనుండి మరలించుచున్నచో క్రమముగా మనస్సునందు అట్టి అభిలాషయే పుట్టదు అది శమము. మిఠాయీలను అంగడియందు చూచుచున్న బ్రాహ్మణునకు వానిని తినవలయు నని కోరిక కలుగవచ్చును. కాని, "నేను బ్రాహ్మణుడను, వీనిని తినరాదు" అని కోరిక ఉన్నప్పటికిని మానుకొనుట దమము అట్లు అనేక పర్యాయములు మానుకొన్న తరువాత, వానిని చూచుచున్నను, వానియందు మనస్సులో కోరిక పుట్టకుండుట శమము. ఇది జ్ఞానసిద్ధికి ముఖ్యసాధనము

ధ్యానమునందు పరిణతిని పొందిన వాడు పిదప జ్ఞానసిద్ధికై సకలకర్మలను సన్న్యసించి శమమును పొంది శ్రవణమనన నిదిధ్యాసనములందు నిమగ్నుడు కావలయును. యత్యాశ్రమమును స్వీకరించుటకు అవకాశము గాని అధికారము కాని లేని ధ్యానయోగి అత్యంతము ఆవశ్యకములైన స్నానసంధ్యావందన భోజనాదులు తప్ప తక్కిన కార్యములను, పూజావిశేషోత్సవములు, పారాయణములు, తీర్థయాత్రలు, మంత్రజపములు, కావ్యరచనములు, సంకీర్తనములు, గ్రంధనిర్మాణములు, శిల్పచిత్రణములు సమాజసేవా కార్యములు మొదలుగా సకల లౌకికవైదిక వ్యవహారములను పరిత్యజింపవలె. వ్యవహారము ఎంతగా దూర మగునో అంతగా మనస్సునందు శమము నెలకొనును ప్రశాంతమైన చిత్తముతో జ్ఞానయోగసాధకులు సమయమును శక్తిని పూర్తిగా శ్రవణ మనన నిదిధ్యాసనములకే వినియోగింపవలె. నిద్రవచ్చువఱకు, మరణము సంభవించువఱకు కాలమును వేదాంతచింతనముతోనే గడపవలె (ఆసుప్తేః ఆమృతేః కాలం నయే ద్వేదాంతచింతయా)

# గీత

భగవానుడు ధ్యానయోగలక్షణములను ఉపదేశించుచున్నాడు. "(ధ్యాన) యోగి ఎట్టికోరికలు లేనివాడై దేనిని పరిగ్రహింపక శరీరమును చిత్తమును నియమించుకొని ఏకాన్తమునందు ఒంటరిగా మనస్సును లక్ష్యమునందు నిలుపవలె. పరిశుద్ధమైన ప్రదేశమునందు మిగుల ఎత్తు కాకుండ చాల పల్లము కాకుండ, కుశలు వానిపై జింకచర్మము, దానిపై వస్త్రము గలిగిన యాసనమును స్థిరముగా నుండునట్లు ఏర్పఱచుకొనవలయును. దానియందు కూర్చుండి శరీరమును శిరస్సును మెడను నిటారుగా నిశ్చలముగా నిలిపి స్థిరుడై ఏ దిక్కు వైపునకు చూడక నాసికాగ్రమును

చూచుచున్న వానివలె నుండి ఇంద్రియములయొక్క చిత్తముయొక్క వ్యాపారములను నియమించి మనస్సును ఏకాగ్ర మొనరించి చిత్తశుద్ధికొఱకు యోగమును పొందవలె. బ్రహ్మచర్యవ్రతమునం దుండి భయరహితుడు ప్రశాంతాత్ముడును అయిన యోగయుక్తుడు నాయందు చిత్తము గలవాడు నేనే పరమాత్మ ననుభావము కలవాడును అయియుండవలె".

శ్లో|| యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః |
ఏకాకీ యతచిత్తాత్మ నిరాశీ రపరిగ్రహః || 10

శ్లో|| శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః |
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ || 11

శ్లో|| తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేంద్రియ క్రియః |
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే || 12

శ్లో|| సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః |
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్ || 13

శ్లో|| ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః |
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః || 14

అధ్యాయః - 30

## విజయప్రభ

సాధకుడు ఏకాన్తమునందు అనగా రహస్యస్థలమున, (రహసి) యోగమును అభ్యసింపవలె. రహస్యస్థల మెందులకు ? కర్మయోగము గాని జ్ఞానయోగము గాని ఇతరులకు గోచరములు కావు. కాని ధ్యానమున సాధకుడు స్థిరముగా కూర్చుండి దిక్కులను చూడక యోగమును అభ్యసించునప్పుడు జనులు చూచుట సంభవించినచో, "ఇత డెవడో గొప్పతపస్సు చేయుచున్నాడు" అని ప్రశంసించుచు కొందఱు చేరగా, "ఇత డెవడో పిచ్చివాడు కదలకుండ మొద్దువలె కూర్చున్నాడు. వీనిసంగతి ఏమో చూడవలె" అని పరిహాసించుచు కొందఱు చేరుదురు. ప్రశంసలవల్ల పరిహాసములవల్ల అభ్యాసమునకు భంగము తప్పక కలుగును. కాబట్టి ధ్యానయోగ సాధకుడు జనసంచారమునకు దూరమైన ప్రదేశమునందే అభ్యాసమునకు పూనుకోవలె.

"ఏకాన్తమునందు" (రహసి) అని చెప్పినతరువాత సాధకుడు ఒంటరిగా (ఏకాకీ) నుండవలయు నని భగవానుడు చెప్పుటవలన యోగాభ్యాసమునకు పూనుకొనువాడు నన్యసింపవలయు ననుట భగవానుని యభిప్రాయ మని శ్రీ శంకరులవారు చెప్పిరి.

(రహసి స్థితః ఏకాకీ చేతి విశేషణాత్ సంన్యాసం కృత్వేత్యర్థః) కర్మయోగానుష్ఠానముచేత కొంతకాలమునకు చిత్తము శుద్ధ మగుచుండగా జీవజగదీశ్వరుల తత్త్వమును గూర్చి జిజ్ఞాసను, సంసారమునెడ వైముఖ్యమును పొందిన సాధకుడు శ్రవణమననాదులకై తనశక్తిని సమయమును వినియోగించుటకై సన్న్యసించి సద్గురువుల నాశ్రయింపవలయు నని దీనివలన వ్యక్త మగుచున్నది. సన్న్యసించినవాడు ప్రాతఃకాలములందు శ్రవణము గావించి తక్కిన సమయములందు మననము ధ్యానము గావించుకొనుటకై మఠమునందో ఆశ్రమమునందో ఏకాంతస్థలమున ధ్యానమును అభ్యసింపవచ్చును అర్హత యుండియు అనేక కారణములవలన గృహస్థులుగానే ఉన్నవారు తమనివాసమునందే ఒక ప్రదేశమును ఏకాంతస్థలముగా ఏర్పఱచుకొని ధ్యానము చేసికోవలసియుండును.

"చైలాజనకుశోత్తరమ్" అని మూలమునం దున్నను సంప్రదాయము ననుసరించి ఇచ్చట పౌరక్రమమునకు విరుద్ధముగా క్రమమును గ్రహింపవలయు నని శ్రీ శంకరభగవత్పాదులవారు చెప్పిరి. కావున ఆసనముపై ముందు కుశలను (దర్భాసనము) వానిపై జింకచర్మమును దానిపై వస్త్రమును పఱచుకొనుటయే పద్ధతి

"చిత్తశుద్ధికొఱకు యోగమును పొందవలె" (యుంజ్యాద్యోగ మాత్మవిశుద్ధయే) అని చెప్పుటవలన ధ్యానయోగము కూడ కర్మయోగమువలె చిత్తశుద్ధిని కలిగించు సాధనమే అని గ్రహింపవలసియున్నది. ధ్యాననిష్ఠయొక్క అతిశయముచేత ఒకప్పుడు అణిమా మహిమాది సిద్ధులు కలుగవచ్చును. కాని అవి ధ్యానయోగమునకు పరమపలములు కావని సాధకుడు వాని నుపేక్షించి చిత్తశుద్ధినే ఫలముగా భావించుచు క్రమముగా జ్ఞానసిద్ధికొఱకు ప్రయత్నింపవలె.

"తన నాసికాగ్రమును చూచి" (సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం) అని మూలమునం దున్నది. ఇచ్చట నాసికాగ్రమును చూచినట్లు, లేక చూచుచున్నవానివలె, ఉండుటయే ఉద్దేశింపబడిన దని, వలె (ఇవ) అను శబ్దము లుప్తమైన దని గ్రహింపవలె నని శ్రీ శంకరులవారు వివరించిరి. ఇచ్చట, నాసికాగ్రమును చూడవలె నని భగవానుడు విధింప గోరుట లేదు.

అంతఃకరణముయొక్క సమాధానముకొఱకు ఆవశ్యకమైన దృష్టి సన్నిపాతమే (నిలుపుట) ఉద్దేశింపబడినది. నాసికాగ్రమును చూచుటయే ఇచ్చట ఉద్దేశింపబడినచో మనస్సును కూడ అచ్చటనే నిలుపవలసియుండును. "మనస్సును ఆత్మయందు నిలిపి" (ఆత్మసంస్థం మనః కృత్వా - అధ్యా 30 - శ్లో 25) అని భగవానుడు ఆత్మయందు మనస్సును సమాహిత మొనరింపవలయు నని చెప్పబోవుచున్నాడు. కావున "వలె" (ఇవ) అను శబ్దముయొక్క లోపముచేత దృష్టిసన్నిపాతము మాత్రమే "సంప్రేక్ష్య" అను పదమునందు ఉద్దేశింపబడినది. "స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య సమ్యక్ ప్రేక్షణం దర్శనం కృత్వా ఇవేతి, ఇవశబ్దలోపో ద్రష్టవ్యః। నహి స్వ నాసికాగ్రసంప్రేక్షణ మిహ విధిత్సితమ్।

కిం తర్హి ? చక్షుషో ర్దృష్టి సన్నిపాతః | స చాంతః కరణ సమాధానాపేక్షో వివక్షితః | స్వనాసికాసంప్రేక్షణ మేవ చే ద్వివక్షితం మన స్తత్రైవ సమాధీయేత నాత్మని, ఆత్మని హి మనసః సమాధానం వక్ష్యతి "ఆత్మసంస్థం మనః కృత్వా" (గీ. - 6 - 25) ఇతి | తస్మాత్ ఇవశబ్దలోపేన అక్ష్ణోః దృష్టి సన్నిపాత ఏవ సంప్రేక్ష్య ఇత్యుచ్యతే|

దృష్టిసన్నిపాత మనగా దృష్టిని చక్కగా నుంచుట. కన్ను తెఱచినంతనే దృష్టి విషయములయొక్క రూపములయందు ప్రసరించుచు వానివిశేషములను గ్రహించుచుండును రూపగ్రహణము చేయకుండ దృష్టిని నిలుపుటయే దృష్టి సన్నిపాతము ఒకవిషయమును గూర్చి గాఢముగ ఆలోచించుచున్నవానికి ఎదుటికి వచ్చిన వ్యక్తి కనబడడు , అతడు చెప్పినమాట వినబడదు. అట్టివాడు ఆలోచనము ఆగినంతనే వచ్చినవ్యక్తిని గుర్తించి, "నీవా వచ్చినది ! ఏమి చెప్పితివో మరల చెప్పుము" అని యడుగును ఆలోచించుచున్నప్పుడు మనస్సు ఆలోచనమునందు నిమగ్నమై చక్షురింద్రియముపై శ్రోత్రేంద్రియముపై ప్రసరింపలేదు. అందువలన కనులు చెవులు తెఱచినవిగానే యున్నను, దృష్టి రూపమును గ్రహింప లేదు ; శ్రోత్రము శబ్దమును గ్రహింప లేదు. అట్లే మనస్సు గాఢముగ ఆత్మతత్త్వాలోచనమునందు నిలిచినచో పరిసరములందున్న విషయములను గ్రహింపలేదు

విషయగ్రహణము లేకపోవుటవలన మనస్సు ప్రశాంతమగును. కాని తాను ధ్యానమగ్నుడై యున్నప్పుడు తనశరీరమునకు ఏదేని విఘాతము గాని కుటుంబాదులలో ఏదేని ఉపప్లవము సంభవించు నేమో యను భయము యోగికి కలుగవచ్చును. పరమేశ్వరునియందు విశ్వాస ముంచి యోగి ఆ భయమును పోగొట్టుకోవలెను (విగతభీః)

"మచ్చిత్తః" అన్న తరువాత "మత్పరః" అని చెప్పుట ఎందులకు ? ఒకానొకడు స్త్రీచిత్తుడై యుండవచ్చును. కాని వాడు ఆమెనే పరతత్త్వమునుగా తలంపడు స్త్రీయందు ఆసక్తుడై యున్నను అతడు విష్ణువునో శివునో పరతత్త్వమునుగా తలంచుచుండవచ్చును. అట్లే ధ్యానయోగి కూడ శ్రీరామునో శ్రీకృష్ణునో మనస్సునందు నిలుపుకొనియున్నను, వారు పరమపురుష లను నిశ్చయము అతనికి లేక పోవచ్చును. కాని జ్ఞానయోగమున ప్రవేశింప దలచుకొన్నవాడు వాసుదేవుని ధ్యానించుచుండుయే కాక (మచ్చిత్తః), వాసుదేవునికంటె పరతత్త్వ మేదియును లేదను నిశ్చయమును (మత్పరః) కూడ కలిగి యుండవలె. ఇట్లనుట వలన వరములను కోరుచు చేయుతపస్సులు ధ్యానయోగము కానేరవని, అవి చిత్తశుద్ధికి సాధనములు కావని స్పష్ట మగుచున్నది.

ధ్యానయోగి అవలంబింపవలసిన యాహారాది నియమములను భగవంతు డుపదేశించుచున్నాడు. "తనకు కావలిసిన పరిమాణమునకు మించి (రుచికొఱకు) భుజించువానికి, అపరిమాణముకంటె తక్కువగా భుజించువానికి, లేక ఉపవాసములు

చేయుచుండువానికి, అధికముగా నిద్రించువానికి, అసలు నిద్రపోకుండ నుండువానికి యోగము నిలువదు. తనకు తగినంతగా మాత్రమే ఆహారమును గైకొనుచు (క్రీడాది) విహారములను గావించుచు, (లౌకికములు వైదికములైన) కర్మలయందు శక్తికి మించకుండ పనులు చేయుచు, తగినంతగా మేల్కొనుచు నిద్రబోవుచు నుండు వానికి యోగము దుఃఖమును పోగొట్టును"

శ్లో|| నాత్యశ్నత స్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః|
నా చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున|| 16

శ్లో|| యుక్తాహారవిహారస్య యుక్త చేష్టస్య కర్మను
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా || 17

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 30

యోగశాస్త్రమునందు యోగాభ్యాసము చేయువాడు కడుపులో సగము వ్యంజనములతో కూడిన యన్నముతో నింపి మూడవ భాగమును నీటితో నింపి, నాల్గవభాగమును వాయుసంచారమునకై వదలవలయు నని చెప్పబడియున్నది. వ్యంజనము లనగా కూరలు పచ్చడులు పిండివంటలు మొదలగునవి ఆహరింపబడునది, అనగా గ్రహింపబడునది యంతయు ఆహారము. నోటితో గ్రహింపబడు నాహారము కాక చక్షుస్సు మొదలగువానిచే గ్రహింపబడు నాటకములు చలనచిత్రములు ధూపవాసనలు మొదలగునవి కూడ ఆహారములే. వానిని కూడ యుక్తములుగా, అనగా ఉచితములైన వానిని పరిమితముగా, గ్రహింపవలె.

యోగాభ్యాసప్రకారమును భగవాను డింకను ఇట్లు ఉపదేశించుచున్నాడు. "సంకల్పమునుండి పుట్టినట్టి కామముల నన్నింటిని వదలి, ఇంద్రియసముదాయమును మనస్సుచేతనే అన్నివైపులనుండి నియమించి, ధైర్యము చేత పైకి తేబడినబుద్ధితో మెల్లమెల్లగా ఆ కామముల నుండి దూరము కావలె. మనస్సును ఆత్మయందు నిలిపి ఎట్టి విషయమును చింతింపరాదు. చంచలము అస్థిరమును అయినమనస్సు ఏయే విషయము నిమిత్తముగా పైకి వచ్చుచున్నదో ఆ యా విషయమునుండి దానిని నిగ్రహించి ఆత్మయొక్క వశమునందే ఉంచవలె."

శ్లో|| సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః|
మన సైవేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః|| 24

శ్లో|| శనై శ్శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా|
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్|| 25

శ్లో|| యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్|
తత స్తతో నియ మ్యైత దాత్మ న్యేవ వశం నయేత్|| 26

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 30 (భ.గీ. - 6)

ఈయభ్యాసమునకు పూర్వము యోగి కొన్ని సంకల్పములను చేసియుండవచ్చును. వానిని కొనసాగింపవలయు నను కోరికలు కలుగుచుండును. అభ్యాస సమయమున ఆకోరికలను వదలి, ఇంద్రియములకు అధిష్ఠానమైన మనస్సు చేతనే ఇంద్రియములను కదలకుండునట్లు నియమింపవలె. ధైర్యముతో కూడిన బుద్ధితో సాధకుడు మెల్లమెల్లగా ఇంద్రియములకు దూరము కావలె. "ఇవి నన్నేమియు చేయలేవు" అను భావమే ధైర్యము. మెల్లమెల్లగా (శనైశ్శనైః) అనుట ఎందులకు ? బంతిని నెమ్మదిగా దూరమునకు జరిపినచో అది అచ్చటనే పడియుండును. అట్లు కాక దానిని విసరి నేలకు కొట్టినచో అది మరల వేగముతో పైకి లేచి మనమీదికే వచ్చును. అట్లే మెల్లమెల్లగా సాధకుడు ఇంద్రియములను దూర మొనర్చుకోవలె.

మనస్సు చంచలము, అస్థిరము. ఒకచోటనే యుండి అటు నిటు కదలుచుండుట చంచలత్వము. ఒకచోటి నుండి మఱియొక చోటకి తఱచుగా మాఱుచుండుట అస్థిరత్వము.

మనస్సును ఆత్మయందు నిలుపుట అనగా, "సర్వము ఆత్మయే; దానికి అన్యముగా ఏదియును లేదు" అని తలంచుచుండుటయే. అట్లు తలంచుచు ఇంక ఏవిషయమును చింతింపకుండుటయే ఆత్మధ్యానము. అనగా అప్పటివఱకును ధ్యానించుచుండిన శివుడు విష్ణువు మొదలగు దేవతలయొక్క ఆకృతులను గాని సృష్టిస్థితిలయకర్తృత్వాది గుణములను గాని తలంపరా దన్నమాట. "ఇది యోగమునకు పరమమైన విధి" (ఏష యోగస్య పరమో విధిః" అని శ్రీ శంకరభగవత్పాదులవారు నిర్దేశించినారు)

## (iii) జ్ఞానలక్షణ చమసము

## గీత

ధ్యానమును అభ్యసించుచున్నప్పుడు యోగి గురువు నాశ్రయించి ప్రాతః కాలములందు వేదాంత శ్రవణమననాదులను చేయుచు నుండవలె ఉపనిషద్వాక్య శ్రవణమువలన మననమువలన ఆత్మస్వరూపమును గ్రహించి అతడు అప్పటివఱకును ధ్యానించుచుండిన విష్ణుశివాదిదేవతలను వీడి, ఆత్మస్వరూపమునే ధ్యానించుచుండవలె ఆత్మస్వరూపధ్యానమే జ్ఞానయోగము యోగి ఆత్మస్వరూపజ్ఞానమున నిశ్చలముగ నుండుట యోగసిద్ధి. దీనిని భగవానుడు వర్ణించి చెప్పుచున్నాడు.

"ఎప్పుడు యోగి ఐహికములు ఆ ముష్మికములను అయిన సకలకామ ములనుండి విరక్తు డగుచున్నాడో, ఎప్పుడు చిత్తము ఆత్మయందే నిలిచియుండునో అప్పు డతడు యుక్తుడు (యోగసిద్ధుడు) అని చెప్పబడును. చిత్తమును నియమించి దానిని ఆత్మయందు లగ్నము కావించినప్పుడు అది, గాలి వీచనిస్థలమును నుండు దీపమువలె ఉండు నని విజ్ఞులు చెప్పుదురు. అభ్యాసముచేత చిత్తము నిగ్రహింపబడి ఎప్పుడు ఉపశమమును పొందుచున్నదో, ఎప్పుడు పరిశుద్ధమైన యంతఃకరణముచేత ఆత్మస్వరూపమును చూచుచు ఆత్మయందే సంతోషమును పొందుచున్నాడో, ఇంద్రియములకు గోచరము కానిది బుద్ధిచేతనే గ్రహింపదగినది నిరతిశయమును అయిన సుఖమును ఎప్పుడు అనుభవించునో, ఎప్పుడు స్వరూపమునందు ఉండి చలింపడో, దేనిని పొందినతరువాత దానికంటె అధికముగా మఱియొక లాభ మున్న దని తలంపడో, పెద్దదుఃఖము (ఆయుదముయొక్క దెబ్బ మొదలగువానివలన కలుగునట్టిది) కలిగినప్పుడు కూడ దేనియం దుండి చలింపడో, దుఃఖసంయోగమునుండి వియోగమును పొందిన యా స్థితిని యోగ మను పేరు కలదానినిగా ఎఱుంగవలయును.

ఆ యోగమును నిర్వేదమును పొందని మనస్సుతో దృఢనిశ్చయముతో అ స్యింపవలెను"

శ్లో|| యదా వినియతం చిత్త మాత్మ న్యే వావతిష్ఠతే |
నిస్స్పృహా స్సర్వ కామేభ్యో యుక్త ఇ త్యుచ్యతే తదా || 18

శ్లో|| యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా |
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః || 19

శ్లో|| య త్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా |
యత్ర చై వాత్మ నాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి || 20

శ్లో|| సుఖ మాత్యంతికం య త్త ద్బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్ |
వేత్తి యత్ర న చై వాయం స్థిత శ్చలతి తత్త్వతః || 21

శ్లో|| యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాదికం తతః |
యస్మిన్ స్థితో న దుఃఖేన గురు ణాపి విచాల్యతే || 22

శ్లో|| తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ |
స నిశ్చయేన యోక్తవ్యో యోగో ౽ నిర్విణ్ణ చేతసా || 23

శ్రీ మహాభారతే - భీష్మ పర్వణి - అధ్యాయః - 30

చిత్తము ఎప్పుడు ఆత్మయందే నిలిచియుండునో అప్పుడే యోగసిద్ధి కలిగినట్లుగా గ్రహింపవలె అట్లు అయినచో ఆత్మ కుండవంటి యొకపదార్థమా ? దానియందు పోసినపాలవలె చిత్తము నిలుచునా యేమి ? చిత్తము ఆత్మకంటె అన్యముగా మఱియొక పదార్థమా ? కాదు కాకపోయినచో ఇట్లు చెప్పుటకు ఏమి యర్థము ? ఆత్మనుగూర్చి ధ్యానింపవలయు ననుటయే ఆవాక్యమునకు అర్థము. అట్లయినచో ఆత్మ ద్యానమునకు విషయ మగునా ? **(Object of meditation)**. ఇచ్చటనే భగవానుడు, "ఎట్టి విషయమును చింతింపరాదు" (నకించి దపి చింతయేత్) అని చెప్పుట గమనింపదగి యున్నది. ఆత్మయందు నామము రూపము మొదలుగా ఏవిశేషములు లేవు. అది చైతన్యమాత్రము. శ్రీరామాదులను ధ్యానించినట్లు దానిని ధ్యానించుటకు వీలు లేదు. ఇంద్రియములను నిగ్రహించిన ధ్యానయోగికి లౌకికవిషయములు చిత్తమున ప్రవేశింపవు. కాని ఈశ్వరునకు సంబంధించిన విష్ణువు శివుడు మొదలగు దేవతలయొక్క నామరూపములు, సృష్టిస్థితిలయాదుల కర్తృత్వము సర్వజ్ఞత్వము సర్వశక్తిమత్త్వము మొదలగు విశేషములు తోచుచుండును అట్లు తోచుచున్న ప్రతిభావమును, "ఇది ఆత్మకాదు , ఇది ఆత్మకాదు" (నేతి నేతి - న ఇతి) అని తొలగించుకొనుచు దానిపై ప్రసరింపకుండ మనస్సును నిలుపుటయే ఆత్మధ్యానము. అవిధముగా సకలవిశేషములను నిషేధించుచున్నప్పుడు, అన్నియు తొలగిపోయినతరువాత, నిషేధించుటకు ఏమియు లేక, గాఢనిద్రయందు వలె, చిత్తము కూడ తొలగిపోవును. అప్పుడు అన్నింటిని నిషేధించుచు వానికి సాక్షియై యున్న తానే ఆత్మస్వరూపుడై మిగులును. ఇదియే ఆత్మసంస్థితి లేక ఆత్మనిష్ఠ

ఇట్లు యోగము సిద్ధించినప్పుడు నిరతిశయమైన లేక ఆత్యంతికమైన సుఖము కలుగును. దీనినే ఆత్మానంద మని బ్రహ్మానంద మని చెప్పుదురు. దేనికంటె మించినది యుండదో అది నిరతిశయము. ఆత్మనిష్ఠవలన కలిగిన సుఖముకంటె మించినది, ఇంకను ఏదో సుఖమును లేక ఆనందమును, పొందవలసియున్న దను తలంపు కలిగినచో అప్పటికి కలిగిన సుఖము నిరతిశయము కా దనుట స్పష్టము. అట్టి యోగికి యోగసిద్ధి కలుగ లే దన్నమాట ! నిరతిశయమైన సుఖమును పొందినవాడు అంతకంటె అదికమైన యానందమేదో యున్నదని తలంపడు ; మహాదుఃఖము కలిగినప్పుడు కూడ అతడు ఆత్మనిష్ఠ నుండి చలింపడు

ఆత్మనిష్ఠునకు దుఃఖములు కూడ కలుగునా ? ఆత్మనిష్ఠసిద్ధించినంతనే శరీరము పోదు. ప్రారబ్ధము ననుసరించి అది యున్నంతవఱకు దానికి సంబంధించిన సుఖదుః ఖములు కలుగుచునే యుండును. అప్పు డతడు, "ఇవి యన్నియు కేవలము మనోవృత్తులే, ఇవి నాస్వరూపము కాదు . ఆనందమే నా స్వరూపము" అను దృఢనిశ్చయముతో తనస్వరూపమునుండి చలింపడు. బంధుమిత్రాదులవియోగమున దుఃఖము

కలుగుచున్నను, మహారాజునకు తాను మహారాజు నను భావము ఎట్లు పోదో, అట్లే ఆత్మనిష్ఠునకు కూడ, "నాస్వరూపము ఆనందమే" అను భావము పోదు. అందువలననే ఇట్టి దుఃఖములయొక్క సంయోగమునుండి వియోగమును పొందుటయే, అనగా వానికి దూరముగ నుండి వానిని చూచుచుండుటయే యోగ మని భగవానుడు నిర్దేశించెను.

ఈ యోగసిద్ధి కలుగువఱకు కర్మయోగదశయందు ధ్యానయోగాభ్యాసమునందు కూడ సాదకునకు సుఖదుఃఖములు కలుగుచునే యుండును. అందువలననే భగవానుడు "వానిని సహించుచుండుము" (తాన్ తితీక్షస్వ భారత) అని ముందుగానే హెచ్చరించి యున్నాడు. అట్లే కామక్రోధములో దుఃఖములో ఉప్పెనవలె వచ్చి ముంచుచున్నప్పుడు సాధకుడు, "ఈ యోగము ఇంకను సిద్ధింపలేదే! దీనిని సాధించుట నావలన కాదు" అని నిర్వేదమును పొంద రా దని, "గురువుయొక్క ఈశ్వరునియొక్క అనుగ్రహముచేత నేను ఎటైనను ఎప్పటికైనను దీనిని సాధింపగలను, మోక్షమునకు ఇంకొకమార్గము లేదు" అను నిశ్చయముతో యోగాభ్యాసమును కొనసాగించుచునే యుండవలయు నని ఇచ్చట భగవానుడు ఉద్బోధించుచున్నాడు.

# గీత

జ్ఞాను లందఱు వ్యవహారదూరులై యుండరు. అనేకులు జ్ఞానసిద్ధులయ్యును నైష్ఠిక బ్రహ్మచర్యముననో గృహస్థ జీవితముననో వానప్రస్థమునందో వర్ణాశ్రమధర్మములను పాటించుచు వర్తించుచుందురు. వారు ఏదశయందు ఎట్లు వర్తించుచున్నను వారిచిత్తవృత్తి ఏకరూపముననే యుండు నని భగవానుడు ఉద్ఘాటించుచున్నాడు" "యోగి ఎల్లయెడల సమదర్శనుడై సకల భూతములయందు తనస్వరూపమును తనయందు సకల భూతములను చూచుచుండును. ఎల్లయెడల నన్ను, నాయందు సర్వమును చూచువానికి నేను గోచరించుచునే యుండును ; నాకు అతడు గోచర మగుచునే యుండును. ఏకత్వము నవలంబించి సర్వభూతములయం దున్న నన్ను పొందుచున్నవాడు ఎన్ని ప్రకారముల వర్తించుచున్నను నాయందే యుండును. అర్జునా! సకల భూతములయందును సంభవించు సుఖముగాని దుఃఖము గాని తనకు సంభవించుదానితో సమానముగా చూచువాడు యోగులలో శ్రేష్ఠుడు".

శ్లో|| సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని |
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః || 29

శ్లో|| యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి |
త స్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి || 30

శ్లో|| సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః |
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే || 31

శ్లో|| ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున|
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః|| 32

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 30

## విజయప్రభ

బ్రహ్మ మొదలుకొని స్థావరములవఱకు అసంఖ్యాకములైన భూతము లున్నవి. లెక్కపెట్టుటకు వీలు లేనన్ని భేదములు కల భూతములయందు అన్నింటను ఏకరూపముగా నున్న తన స్వరూపమునే యోగి చూచును. అంతే కాదు. అతడు ఆ భూతము లన్నియు తనయందే ఉన్నట్లుగా కూడా తలంచును. ఒకవ్యక్తియందు సకలభూతములు ఎట్లు ఉండును ? స్వప్నమున తనమనస్సునందే సర్వవిశ్వము సకల భూతములు ఎట్లు గోచరించుచున్నవో అట్లే జాగ్రద్దశయందు కూడ అవి యన్నియు మనస్సునందే గోచరించుచున్నవి. తన మనస్సు ద్వారా ఎవనికి ఏది గోచరించుచున్నదో అదియే వాని ప్రపంచము. మనస్సు పనిచేయుచున్నప్పుడు అది వానికి గోచరించుచు, మనస్సు పనిచేయని నిద్రావస్థ యందు గోచరించుట లేదు. అది మనస్సు ఉన్నప్పుడు ఉండి, లేనప్పుడు వానికి లేకుండ పోవుచున్నది. కావున ప్రతివ్యక్తికి వాని మనస్సే వాని ప్రపంచము. కావున జ్ఞాని సకలభూతములు తనమనస్సునందు గోచరించుచున్న ప్రతిబింబమాత్రములుగా తనయందే ఉన్న వని తలంచును. అనేక భేదములతో గోచరించుచున్న యఖిలభూతములయందు అతడు సమమునే దర్శించును. నిర్విశేషమైన బ్రహ్మము లేక ఆత్మయే సమము.

సమదర్శనమును ఇట్లు యోగసిద్ధుడైన జీవుని విషయమున నిర్దేశించి వెంటనే భగవానుడు తనవిషయముగా, సకలభూతములయందు ఈశ్వరుడైన తన్ను, తనయందు సర్వభూతములను చూచువాడు, తనయందే వర్తించు నని, అనగా మోక్షమును పొందు నని చెప్పుట గమనింపదగియున్నది. అనగా ముక్తుడైన జీవుడు ఈశ్వరుడే అని ఆయన ఉద్ఘాటించుచున్నా డన్నమాట

ఎన్నివిధముల వర్తించినను జ్ఞాని భగవంతునియందే ఉండు నని చెప్పుట ఎందులకు ? జీవన్ముక్తుడైన జ్ఞాని అధర్మముగ వర్తించునా ? జ్ఞానులు ధర్మమార్గముననే వర్తించుచున్నను అజ్ఞులకు అది గోచరము కాదు వారు జ్ఞానులను అధర్మవర్తనులుగా నిరూపించుచు నిందించుచుందురు. అందువలన జీవన్ముక్తుల జ్ఞానము గాని ధర్మము గాని మాఱదు. వాలిచేత నిందింపబడిన శ్రీరాముడు, దుర్యోధనాదులచే నిందింపబడిన శ్రీకృష్ణుడు ఎల్లప్పుడే దార్మికులే బ్రహ్మనిష్ఠులే. లోకుల దృష్టిలో ఎన్నివిధములుగా నైన వర్తించుచున్నట్లు గోచరించుచున్నను జీవన్ముక్తులు ఎల్లప్పుడు బ్రహ్మనిష్ఠులే.

సకలభూతములయొక్క సుఖదుఃఖములను తన సుఖదుఃఖముల వంటివిగానే తలంచుచు ఏభూతమునకైనను హింస తలపెట్టనివాడు యోగులలో శ్రేష్ఠుడని చెప్పుటవలన, అది సకలమానవులు గ్రహింపదగిన పరమధర్మ మని స్పష్టమగుచున్నది. మహాభారతమున తిక్కన గారు దీని నిట్లు వర్ణించిరి.

కం॥ ఒరు లేయవి యొనరించిన
నరవర ! యప్రియము తనమనంబున కగు, దా
నొరులకు నవి సేయ కునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్॥

# గీత

సమదర్శనమునుగూర్చి విన్నంతనే భగవానుడు ఊహించినట్లే అర్జునునకు "ఇది సాధ్య మగునని కాదు" అను నిర్వేదము కలిగినది. కాని భగవానుడు చెప్పుచుండగా, "ఇది యసాధ్యము" అని యర్జునుడు అనలేక సందేహము నిట్లు ప్రకటించినాడు. "కృష్ణా! సమత్వపూర్వకముగా నీవు చెప్పిన యీ యోగము మనస్సున స్థిరముగా నిలుచు నని నాకు తోచుట లేదు. మనస్సు చంచల మగుటయే కాదు, ఇంద్రియములను శరీరమును మథించునట్టిది, బలము కలది, దృఢ మైనది. వాయువును వలె మనస్సును నిగ్రహించుట మిగుల దుష్కర మని తలంచుచున్నాను"

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన।
ఏత స్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్।
త స్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్॥ 34

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 30

# విజయప్రభ

సమదర్శనము జ్ఞానయోగసిద్ధికి లక్షణము. శత్రువులయందు మిత్రులయందు సర్పవ్యాఘ్రాదులయందు అన్నిభూతములయందును సమముగా బ్రహ్మమున్న దను భావన కలుగుటయే దుర్ఘటము. పలుమారు దానినిగూర్చి భావించుచుండుటవలన మనస్సునందు ఆభావము కొంచెము బలపడినట్లున్నను, శత్రువులవల్లనో సర్పాదులవల్లనో హాని సంభవించునప్పుడు ఆభావము నిలుచుట దుర్ఘటము. ఈ జ్ఞానయోగలక్షణము సంగతి ఎట్లున్నను దానికి సోపానమైన ధ్యానయోగమునందు ఇంద్రియములనుండి మనస్సును మరలించి విష్ణువునందో శివునియందో నిలుపుటయైన

సులభమా ? ఇంద్రియములను శరీరమును రాగద్వేషాదులతో మదించుచుండుయే మనస్సుయొక్క స్వభావము. అది మిగుల బలము కలది యగుటచే దానిని నివారించుట శక్యము కాదు. అది యత్యంతము దృఢమైనది యగుటచే దానిని చేదించుటయు సాధ్యము కాదు వాయువును మూట గట్టుటవలె మనస్సును నిలుపుట దుర్ఘట మనుట చేత అర్జునుడు ధ్యానయోగమునకు మొదటి మెట్టైన మనోనిగ్రహామే అసాధ్యమని నిర్వేదమును ప్రకటించినాడు.

తపస్సు చేసి ఈశ్వరునివలన పాశుపతాస్త్రమును పొందిన యర్జునునకు మనోనిగ్రహము దుష్కరమా ? తపస్సు వేఱు. ధ్యానయోగము వేఱు. పాశుపతాస్త్రమును సంపాదింపవలె నను పట్టుదలతో అర్జునుడు పెక్కు నియమములతో ఈశ్వరుని ధ్యానించి మెప్పించినాడు. అందు ప్రత్యక్షముగా ఫలమున్నది , ధ్యానించుటకు ఈశ్వరుని నామరూపము లున్నవి. అప్పు డతడు ధ్యానసిద్ధికొఱకు ప్రాణాయామమున కుంభకము గావించి మనస్సును ఈశ్వరునియందు నిలిపియుండును. ఇప్పుడు కృష్ణుడు చెప్పుచున్న ధ్యానయోగమునకు చిత్తసుద్ధి తప్ప ఫల మేదియును లేదు. మఱియును ప్రాణాయామమును అవలంబించి మనస్సును ఇంద్రియములను నిగ్రహింపు మని ఆయన చెప్పుట లేదు. అభ్యాసముచేత, విషయభోగములయందలి దోషములను విచారించుచు వివేకమువలన కలుగు వైరాగ్యముచేత, ఇంద్రియములను మనస్సును నిగ్రహింపు మని ఆయన చెప్పుచున్నాడు.ప్రాణబంధనముచేత మనస్సును నిలుపుట పామును పట్టుకొని బుట్టలో పెట్టుట వంటిది. మూత తెఱచినంతనే అది యథాప్రకారముగా విషయములతో విజృంభింపగలదు. వైరాగ్యముచేత మనస్సును నిగ్రహించుట పామునకు విషమును పిండి కోరలు పీకివేయుట వంటిది. అది పూర్వము వలె చరించుచున్నను అది ఎట్టి అపకారము చేయలేదు. తపస్సులు చేసి వరములు సంపాదించుకొనువారు ఆసమయమున బలవంతముగ ప్రాణమును కుంభింపజేసి మనస్సును నిలుపుకొందురు. తపస్సు ముగిసినంతనే మనస్సు మరల యధాపూర్వముగ విషయభోగములయందు ప్రవర్తించుచునే యుండును ఉపవాసము చేసినవానికి మఱునాడు, ఆకలి, భోజ్యపదార్థములయందు అభిలాషయు రెట్టింపు అగునట్లు, తపస్సు ముగించినవానికి భోగాభిలాష తీవ్రముగనే యుండును తపస్సు చేసినవానికి వరములు లభించునే కాని చిత్తవృత్తి యందు కొంచెము కూడ మార్పు కలుగదు ధర్మతత్త్వముల జ్ఞానము గాని, వివేకము గాని, విరక్తి గాని, కొంచెము కూడ పెరుగదు. తపస్సునకు పూర్వము రాగద్వేషములు ఎట్లున్నవో తరువాత కూడ అవి అట్లే యుండును. ఈ విషయము అర్జునునకు అనుభవసిద్ధమే. తపస్సువలన అతనికి పాశుపతాస్త్రము మాత్రమే లబించినది కాని చిత్తమున వివేకజ్ఞానవైరాగ్యములయందు వృద్ధి గాని, ప్రియాప్రియుల విషయమున రాగద్వేషములయందు క్షీణత గాని సంభవింప లేదు. అందువలననే అతడు కేవలము వివేకవైరాగ్యములతో మనస్సును నిగ్రహించుట, గాలిని మూట గట్టుటవలె, అసాధ్య మని నిర్వేదమును పొందుచున్నాడు. ఇది ఎంత కష్టమో ధ్యానయోగమును అభ్యసింపబూనిన వారి కందఱకును తెలియును

# గీత

అర్జునుని నిర్వేదమును నివారించుచు భగవానుడు ఇట్లు చెప్పెను. "అర్జునా ! నీవు చెప్పినట్లు మనస్సు చంచలమే , దానిని నిగ్రహించుట దుర్ఘటమే అయినను అభ్యాసముచేత వైరాగ్యముచేత దానిని పట్టుకొనవచ్చును. మనస్సును నిగ్రహింపనివానికి యోగమును పొందుట దుర్ఘటమే , అయినను అభ్యాసవైరాగ్యములచేత మనస్సును నిగ్రహించి ప్రయత్నించుచున్నవాడు దానిని ఉపాయముచేత పొందగలడని నా యభిప్రాయము"

శ్లో|| అసంశయం మహాబాహో ! మనో దుర్నిగ్రహం చలమ్ |
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే || 35

శ్లో|| అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః |
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః || 36

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 30

అభ్యాస మనగా ధ్యానమునకు విషయమైన విష్ణుశివాదులందు గాని ప్రణవమునందు గాని ఆ విషయముల కనుకూలములైన భావపరంపరలను పొందుచుండు వైరాగ్య మనగా ప్రత్యక్షములైన యీ లోకభోగములందు, అప్రత్యక్షములైన స్వర్గభోగాదులయందును దోషములను చూచుండుట చేత విరక్తి నొందుట.

భగవంతుడు ప్రోత్సహించుచున్నను అర్జునునకు ఈయోగమును సాధించుట ఈ జన్మలో సాధ్య మగునా అను సందేహము వీడ లేదు. ఉత్తమలోకప్రాప్తికి సాదనములైన యజ్ఞాదికర్మలను ఈ యోగమునకు ఆశపడి వదలుకొన్నచో, ఈయోగము ఈ జన్మలో సిదిపొందని యెడల సాధకునిగతి ఏ మగు నను సంశయముతో అర్జునుడు శ్రీకృష్ణునిట్లు ప్రశ్నించెను. "కృష్ణా! ఒకానొకడు యోగమున శ్రద్ధ కలవాడయ్యును చక్కగా ప్రయత్నింప లేక పోవచ్చును. అట్టివాడు (జీవితాంతమువఱకు) యోగసంసిద్ధిని పొంద లేక యోగమునుండి చలించిన మనస్సు కలవాడైనచో, (మరణించిన తరువాత) ఏగతిని పొందును ? బ్రహ్మమును పొందు మార్గమునందు వాడు విమూఢుడై, కర్మనిష్ఠనుండి యోగనిష్ఠ నుండి భ్రంశమును పొంది, ఎందును ఆశ్రయములేక, చిందరవందరలైన మేఘమువలె నశించునా ?"

శ్లో|| అయతి శ్శ్రద్ధ యోపేతః యోగా చ్చలిత మానసః |
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి || 37

శ్లో|| కచ్చి న్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి |
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి || 38

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 30

# విజయప్రభ

ఇచ్చట శ్రద్ధ యనగా, యోగము ఎప్పటికైనను తప్పక ఫలించు నను విశ్వాసము. మందు మంచిదే కావచ్చును కాని రోగము ప్రబల మైనచో, అది పనిచేయుటకు ముందే, రోగి మరణింపవచ్చును. అట్లే బ్రహ్మప్రాప్తికి యోగము సమర్థమైన సాధనమే. కాని దానిని అవలంబించియు ఒకానొకడు ఎన్నో కారణములవలన చక్కగా ప్రయత్నింప లేకపోవచ్చును. యోగమును నిరోధించు రాగద్వేషాది సంస్కారములు ప్రబలములై ఆయోగము ఫలింపక పోవచ్చును. అప్పుడు మరణించినచో వానిగతి ఏమగును ? యజ్ఞాది కర్మలను చేయకుండుటవలన స్వర్గము కలుగదు. యోగము సిద్ధింపకుండుటచే బ్రహ్మప్రాప్తి లేదు. కాబట్టి వాడు రెంటికిం జెడి నశింపక తప్పదు. మేఘము సముదాయముతో కూడి ఒకచోట నుండి మఱియొక చోటికైన పోవలె, లేక విడివడినచో వర్షముగా నైన రూపొందవలె ; అట్లు కాక అది విడివడి గాలికి లోనైనచో ముక్కలై నిష్ప్రయోజనముగా నశించును. సాధకుడు నశించుట యనగా అభ్యుదయమునకు, మోక్షమునకు దూర మగుట.

# గీత

ఆ సంశయమును భగవానుడు ఇట్లు తీర్చెను. "అర్జునా ! అట్టివానికి ఈలోకమున గాని పరలోకమున గాని వినాశము ఉండనే ఉండదు. శుభకార్యముల నొనరించువాడు ఎవడైనను దుర్గతిని పొందడు. యోగభ్రష్టుడు, పుణ్యకార్యములు చేసినవారు పొందునట్టి లోకములను పొంది అచ్చట పెక్కు సంవత్సరములు ఉండి, పవిత్రులు శ్రీమంతులును అయిన వారి యింటియందు జన్మించును ; లేక ధీమంతులైన యోగులకులమునందే జన్మింపవచ్చును ఈలోకమున ఇట్టి జన్మ దుర్లభతరము సుమా! పూర్వదేహముతో సంపాదించినబుద్ధిని అప్పుడు పొంది, దానితో మరల సంసిద్ధికొఱకై యత్నించును. పూర్వాభ్యాసమునకు వశుడై అతడు యోగమార్గమువైపునకే ఆకర్షింపబడును. యోగముయొక్క స్వరూపమును తెలిసికొనగోరి దానిని అభ్యసించువాడు కూడ వేదోక్తకర్మానుష్ఠాన పరుడైన వానిని మించిపోవుచున్నాడు. ప్రయత్నపూర్వకముగా యోగమును అభ్యసించువాడు పాపరహితుడై అనేకజన్మలయందు కొంచెము కొంచెముగా సంపాదించుచున్న సంస్కారముల సముదాయముచేత ఆత్మతత్త్వమును పొంది దానియందు సిద్ధుడై, ఆజ్ఞానముచేత మోక్షమును పొందుచున్నాడు.

తాపసులకంటె జ్ఞానులకంటె కర్మానుష్ఠానపరులకంటె యోగి అధికుడు. కావున, అర్జునా ! నీవు యోగి వగుము. శ్రద్ధకలవాడై నాయందే చిత్తమును నిలిపి సేవించువాడు యోగులలో అందఱికంటెను శ్రేష్ఠుడు"

శ్లో॥ పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
న హి కళ్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి॥ 40

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ 41

శ్లో॥ అదవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్।
ఏత ద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్॥ 42

శ్లో॥ తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన॥ 43

శ్లో॥ పూర్వాభ్యాసేన తే నైవ హ్రియతే హ్యవశోఽపి సః।
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే॥ 44

శ్లో॥ ప్రయత్నా ద్యతమాన స్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్॥ 45

శ్లో॥ తపస్విభ్యోఽదికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భ వార్జున॥ 46

శ్లో॥ యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా।
శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ 47

శ్రీమహాభారతే భీష్మపర్వణి - అధ్యాయః - 30

# విజయప్రభ

వేదమును అధ్యయనము గావించిన తరువాత కొందఱు స్వర్గాదిఫలములను కోరి యజ్ఞయాగాదులను అనుష్ఠించుచుందురు. మఱికొందఱు స్వర్గాదిఫలములకంటె బ్రహ్మానందము కొన్నివేలరెట్లు అధికమైన దని తైత్తిరీయములోని ఆనందవల్లి మొదలగువానివలన తెలిసికొని, యజ్ఞాదులను ఆదరింపక, బ్రహ్మానందమునకు సాధనమైన యోగము నవలంబింతురు. కాని వారు ఏ కారణముచేతనైనను యోగసిద్ధిని పొంద లేక మరణమును పొందవచ్చును. అట్టివారు యోగభ్రష్టు లగుదురు. అయినను అప్పటివఱకును యోగమార్గమునందు వారు కావించినకృషియే పుణ్యఫలమై వారిని, యజ్ఞాదులను అనుష్ఠించినవారు పొందునట్టిలోకములకు చేర్చును వారు యజ్ఞములను గావించినవారితోపాటు ఆ యా లోకములలో యోగసాధనపుణ్యవిశేషముచేత చిరకాలము భోగముల ననుభవించుచు నుందురు. అక్కడ ఆపుణ్యములో కొంచెము మిగిలి యుండగా, ఆపుణ్యశేషముతో భూమియందు మరల జన్మింతురు. ఆశేషమునందు

భోగార్థమైన సంస్కారమును అధికముగా కలిగినవారు, పవిత్రులు శ్రీమంతులును అయిన వారి కుటుంబములలో జన్మింతురు , దానియందు యోగపరమైన సంస్కారమును అధికముగా కలిగివారు ధీమంతులైన **యోగులకుటుంబములలోనే** జన్మింతురు పునర్జన్మమును పొందువారిలో అనేకులకు మనుష్య **జన్మ**ము సులభము కావచ్చును , వారిలో కూడ సుకృతము అధికముగా కలిగినవారు శ్రీమంతుల యిండ్లలో జన్మను పొందవచ్చును కాని పవిత్రులైన శ్రీమంతులకుటుంబములలో జన్మను పొందుట దుర్లభము. ధీమంతులైన యోగులయిండ్లయందు **జన్మ**మును పొందుట దుర్లభతరము, అనగా మిగుల దుర్లభము.

దీనినిబట్టి యోగసాధనపుణ్య విశేషమువలన, యజ్ఞాదులను ఆచరింపక పోయినను స్వర్గాదిలోకభోగములు కలుగు నని స్పష్ట మగుచున్నది. అంతే కాదు. కర్మనిష్ఠుల కంటె యోగసాధకులకు పునర్జన్మమునందు ఆధిక్యము కలుగుచున్నది. స్వర్గాదిలోకములనుండి **తిరిగి** వచ్చినవారు **మరల శ్రీమంతులయిండ్లలో**, అందులో పవిత్రములైన కుటుంబములలో జన్మింతు రని చెప్పుటకు వీలు లేదు. స్వర్గాదిభోగములను కలిగించిన పుణ్యవిశేషము **వ్యయమైన**యంతనే వారి పూర్వజన్మములందు పాపము అధికముగా నున్నచో **దానివలన వారు** పశుపక్ష్యాది హీనజన్మలను కూడ పొందుదురు. కాని యోగసాధనపరులు అట్టి దుర్గతిని పొందరు. వారు ధీమంతులైన యోగులయిండ్ల యందో, లేక, సాధనఫలము తక్కువగా నున్నచో పవిత్రులైన శ్రీమంతులకుటుంబములయందైనను జన్మింతురు. అనగా యోగమార్గమున సాధనము ఆరంభ మైనంతనే పూర్వజన్మకృతమైన పాపము నశించు నన్నమాట. సాధారణముగా పాపము కష్టదుఃఖానుభవముచేతనే తొలగును , లేక స్వర్గాదిఫలములను కోరకుండ, కేవలము ప్రాయశ్చిత్తదృష్టితో బ్రహ్మహత్యాదిమహాపాపనివారణమునే ఉద్దేశించి యజ్ఞాదికర్మములను అనుష్ఠించినచో తొలగిపోవును. మఱి యోగసాధనపరునకు పాపము నశించుచున్న దన్నచో, యోగసాధనము మహాపాపమును నివారించునట్టి వేదోక్తమైన కర్మానుష్ఠానముతో సమాన మన్నమాట.

యోగస్వరూపమును తెలిసికోవలయు నని ప్రయత్నించువాడు **శబ్ద బ్రహ్మ**మును అతిక్రమించుచున్నాడని భగవంతుడు చెప్పుట గమనింపదగియున్నది. **శబ్ద**రూపముగా, జ్ఞానరూపముగా బ్రహ్మము రెండు విధములుగా నున్నది. **అక్షరస్వర మంత్రాత్మ**కమైన వేదము శబ్ద బ్రహ్మము. అది అనుశాసించునట్టి విధినిషేధములు, ప్రకటించునట్టి యజ్ఞదాన తపోవిశేషములు, ప్రాయశ్చిత్తవిధానములు, వానియనుష్ఠానములు, తత్ఫలభోగములు, తత్త్వబోధక వాక్యములు, ఆ వాక్యశ్రవణము అనునిది యంతయు శబ్ద బ్రహ్మమునకు సంబంధించినదియే. వేదాంతవాక్యశ్రవణ**మునకు పిమ్మట** జరుగునట్టి ఉపాసనలు మనన నిధిధ్యాసనములు **జ్ఞానరూప బ్రహ్మ**మునకు సంబంధించినవి. కర్మయోగమువలన చిత్తశుద్ధిని సంపాదించి, సర్వకర్మసంన్యాసపూర్వకముగా ధ్యానయోగమును అవలంబించినంతనే

జ్ఞానబ్రహ్మమున ప్రవేశించినవా డగును. ధ్యానయోగస్వరూపమును తెలిసికొనగోరి, ఆయోగమును అవలంబించినవాడు శబ్దబ్రహ్మమును అతిక్రమించును. శబ్దబ్రహ్మము, జ్ఞానబ్రహ్మము అనునవి ఒక విద్యాసరణియందే **(course of education)** రెండు తరగతులవంటివి. క్రింది తరగతిలో ఉత్తీర్ణుడైనవాడు పైతరగతిలో ప్రవేశించినట్లే, కర్మానుష్ఠాన కర్మయోగములవలన చిత్తశుద్ధిని పొందినచో శబ్దబ్రహ్మమను తరగతిలో ఉత్తీర్ణు డగును. అతడు ఆతరగతిని వీడి ధ్యానయోగమును అవలంబించినంతనే జ్ఞానబ్రహ్మము అనుతరగతిలో ప్రవేశించినవా డగును. పై తరగతిలో ప్రవేశించినవాడు ఆతరగతిలో ఏకారణముచేతనైన ఉత్తీర్ణుడు కాలేకపోయినచో, మరల ఎన్ని పర్యాయములైనను పై తరగతిలోని పాఠ్యాంశములనే **(subjects)** మరల మరల పఠింపవలెకాని క్రింది తరగతిలోనికి పోవలసిన పని యుండదు. అట్లే శబ్ద బ్రహ్మ మను తరగతియందు ఉత్తీర్ణుడై జ్ఞానబ్రహ్మమునకు సంబంధించిన ధ్యానయోగమను తరగతియందు ప్రవేశించినవాడు, మొదటి తరగతిలో అవలంబించుచుండిన కర్మానుష్ఠానమును వీడి, తనసమయమును శక్తిని ధ్యానమునందే వినియోగింపవలె.

"తాపసులకంటె జ్ఞానులకంటె కర్మానుష్ఠాపరుల కంటె యోగి అధికుడు" అని భగవానుడు చెప్పుట వలన కర్మానుష్ఠానముతోపాటు తపస్సు, శ్రవణ మొనరించి శాస్త్రజ్ఞానమును సంపాదించుట, కర్మయోగములోని యంశములే యని స్పష్ట మగుచున్నది. కావున ఇచ్చుట జ్ఞాను లనగా శ్రవణమాత్రమున జ్ఞానమును పొందినవారు అని గ్రహింపవలె.

"నాయందే చిత్తమును నిలిపి నన్ను సేవించువాడు యోగులలో అందఱకంటెను శ్రేష్ఠుడు" అని భగవానుడు చెప్పుట గమనింపదగియున్నది. శ్రవణ మొనరించి శాస్త్రజ్ఞానమును సంపాదించివారు అందఱు నిర్విశేషము, చైతన్యమాత్రమును అయిన యాత్మస్వరూపమును ధ్యానించుటకు సమర్థులై యుండరు. అట్టివారు భగవంతుని ద్విభుజునిగానో చతుర్భుజునిగానో లేక విశ్వరూపునిగానో ధ్యానింపవచ్చును. ఆ ధ్యానాభ్యాసమువలన మనస్సునకు ధ్యానమునందు స్థిరత్వము కలిగిన తరువాత, భగవంతుడు తనకు యథార్థమైన స్వరూపమునుగా చెప్పిన ఆత్మస్వరూపమును ధ్యానింపవలె. విశ్వరూప ప్రదర్శనమునకు మందే ఆయన తనస్వరూపమును ఇట్లు నిర్దేశించెను. "నేను సర్వభూతములయొక్క హృదయములందు ఉన్న ఆత్మను ; భూతములకు నేనే ఆదిని మధ్యమును అంతమును".

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః |
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ || 20

శ్రీ మహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 34 (గీత. 10)

యోగులలో, పరమేశ్వరుని విష్ణువు శివుడు మొదలగు నామరూపములతో ధ్యానించువారికంటె, సర్వజ్ఞత్వము సర్వశక్తిమత్త్వము మొదలగు గుణములతో ధ్యానించువారు అధికులు ; వారికంటె, "బ్రహ్మాది స్తంబపర్యంతముగా సకలభూతములయందు ఉన్న ఆత్మను నేను, నాయందే సకలభూతములు ఉన్నవి" అని ఆత్మస్వరూపమును ధ్యానించువారు అధికులు , సర్వయోగులలో శ్రేష్ఠులు. కాని ఫలాపేక్ష లేకుండ చిత్తశుద్ధితో పరమేశ్వరుని నామరూపములతో ధ్యానించుచు ధ్యానయోగమున మొదటి మెట్టుపై నున్నవారు కూడ, ఫలాపేక్షతో కర్మలను తపస్సులను అనుష్ఠించువారికంటె, వేదాంతశాస్త్ర జ్ఞానమును మాత్రమే సంపాదించిన వారికంటె అధికులనుట స్పష్టము.

# III. సాధన కలశము

## 1. భగవత్సేవా కమండలువు

### (i) చతుర్విధ భక్తి చమసము

### గీత

" శ్రద్ధకలవాడై నాయందే చిత్తమును నిలిపి నన్ను సేవించువాడు యోగులలో అందఱకంటెను శ్రేష్ఠుడు" అని భగవానుడు చెప్పియున్నాడు తన యందు చిత్తమును నిలిపి తన్నే సేవింపవలయు నన్నచో తనస్వరూపము సాధకుడైన యోగికి తెలియవలె. అందువలన భగవంతుడు తన స్వరూపమును ఇట్లు నిరూపించుచున్నాడు "వేలకొలది మనుష్యులలో ఒకానొకడు సిద్ధికొఱకు యత్నించును. అట్లు యత్నించుచు సిద్ధులైనవారిలో కూడ ఒకానొకడే నన్ను యధార్థముగా తెలిసికొనుచున్నాడు. నాప్రకృతి రెండు విదములుగా నున్నది. పంచభూతములు మనస్సు బుద్ధి అహంకారము అను ఎనిమిది రూపములతో నుండునది అపరాప్రకృతి. జీవరూపమున నుండునది పరాప్రకృతి. ఈ పరాప్రకృతిచేతనే జగత్తు అంతయు ధరింపబడుచున్నది. సకలభూతములు ఈరెండు ప్రకృతులవలననే సంభవించుచున్న వని ఎఱుంగుము. ఈరెండు ప్రకృతుల మూలమున నేను సమస్తమైన జగత్తునకు ప్రభవము ప్రళయము అగుచున్నాను. నాకంటె పరమైనది మఱియొకటి ఏదియును లేదు. దారమునందు మణులవలె నాయందు జగత్తు అంతయు కూర్చబడియున్నది. సాత్త్వికములు రాజసములు తామసములు అను భావములచేత మోహితమైయున్న ఈ జగత్తు ఈ బావములకు అతీతముగా అవ్యయముగా ఉన్న నన్ను తెలిసికొనలేక పోవుచున్నది. గుణములచే ఏర్పడుచున్న యీనా దివ్యమైన మాయను దాటుట దుర్ఘటము. నన్నే ఎవరు శరణము పొందుచున్నారో వారు ఈ మాయను దాటుచున్నారు.

పుణ్యకర్మలను చేసినవారు నన్ను సేవింతురు. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని వారు నాల్గు విధములుగా ఉందురు. వీరు అందఱు ఉదారులే. కాని జ్ఞాని ఆత్మయే. అతడు యోగము నవలంబించి పరమగమ్యమైన నన్ను పొందుటకే పూనుకొనియుండును అనేకజన్మలయొక్క సంస్కారములవలన తుదకు జ్ఞానమును సంపాదించినవాడు "సర్వము వాసుదేవుడే" అని నన్ను తన స్వరూపమునుగా పొందుచున్నాడు. అట్టి మహాత్ముడు మిగుల దుర్లభుడు.

తమ స్వభావములకు అధీనులై జనులు, ఆయాకోరికలు తమ వివేకమును హరించుచుండగా, వానిని పొందుటకొఱకు ఇతరదేవతలను ఆ యా నియమములతో భజించుచున్నారు. ఏ యే భక్తుడు ఏ దేవతారూపమును శ్రద్ధతో అర్చింపగోరుచున్నాడో ఆ యా వ్యక్తులకు దృఢమైన శ్రద్ధను నేనే కలిగించుచున్నాను. ఆ శ్రద్ధతో వాడు ఆ దేవతను ఆరాధించుచు, ఆ దేవతామూర్తినుండి, నాచేతనే అభీష్టములను పొందుచున్నాడు. అల్పమైన ప్రజ్ఞ కలిగిన యాదేవతారాధకులకు కలుగుపలము శాశ్వతమైనది కాదు. దేవతలను ఆరాధించువారు ఆదేవతలనే పొందుదురు నా భక్తులు నన్నే పొందుదురు పుణ్యకర్మలు చేయుచు నుండగా ఎవరియొక్క పాపము అంతము నొందుచున్నదో వారు ద్వంద్వమోహనిర్ముక్తులై దృఢవ్రతులై నన్ను భజింతురు"

శ్లో|| మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః || 3

శ్లో|| భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ |
అహంకార ఇ తీయం మే భిన్నా ప్రకృతి రష్టధా || 4

శ్లో|| అప రేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ |
జీవభూతాం మహాబాహో య యేదం ధార్యతే జగత్ || 5

శ్లో|| ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ |
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళ యస్తథా || 6

శ్లో|| మత్తః పరతరం నాన్య త్కించి దస్తి దనంజయ |
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ || 7

శ్లో|| త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్ |
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్ || 13

శ్లో|| దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా |
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే || 14

శ్లో|| చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినో అర్జున|
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ|| 16

శ్లో|| ఉదారా స్సర్వ ఏ వైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్|
ఆస్థిత స్స హి యుక్తాత్మా మా మే వానుత్తమాం గతిమ్|| 18

శ్లో|| బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే|
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః|| 19

శ్లో|| కామైస్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తే ఽన్యదేవతాః|
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా|| 20

శ్లో|| యో యో యాం యాం తనుం శ్రద్ధ యార్చితు మిచ్ఛతి|
తస్య త స్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధ్యా మ్యహమ్|| 21

శ్లో|| స తయా శ్రద్ధయా యుక్త స్త స్యారాధాన మీహతే|
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్|| 22

శ్లో|| అంతవ త్తు ఫలం తేషాం త ద్భవ త్యల్ప మేధసామ్|
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాంతి మా మపి|| 23

శ్లో|| యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్|
తే ద్వంద్వ మోహవినిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః|| 28

శ్రీ మహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 31

## విజయప్రభ

భగవద్భక్తులు అన్యదేవతాభక్తులు అని భక్తులు రెండువిధములుగా ఉన్నారు భగవద్భక్తులు సకలఫలములకొఱకు భగవంతునిపైననే ఆధారపడి యుందురు. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని వీరు నాలుగువిధములుగా నుందురు.

శత్రువులు చుట్టుముట్టుట, బీకరములైన క్రూరమృగములు పైబడునుండుట మొదలైన పెద్దయాపదలలో, భయంకరములైన వ్యాధులు వచ్చిపడినప్పుడు తీవ్రములైన భయదుఃఖములను పొందినవాడు ఆర్తుడు. 'ఆ భయదుఃఖములను వారించుటకు 'ఈలోకములోని వారు కాని, ఇతర లోకములలోని దేవతలు కాని సమర్థులు కారు , పరమేశ్వరు డొక్కడే నన్ను రక్షింప గలడు' అని వారు భగవంతునే ఆశ్రయింతురు.' మొసలిచే ప్రాణసంకటము నొంది పరమేశ్వరుని శరణు పొందిన గజేంద్రుడు ఇట్టివాడే.

తెలిసికోవలయు నను ఇచ్ఛ జిజ్ఞాస. ఈ జగత్తు కంతకు మూలమైన తత్త్వమేది, పరమేశ్వరు డెవ్వడు అని తీవ్రమైన జిజ్ఞాస కలిగి అందులకై భగవంతునే ఆశ్రయించు భక్తుడు జిజ్ఞాసువు. చతుర్ముఖుడు చిరకాలము భగవంతునిగూర్చి తపస్సు చేసి, ఆయన ప్రత్యక్ష మైనప్పుడు ఆయనను చూచి "దేవా ! నీవే పరమేశ్వరుడవా, లేక నీకంటె నదికుడైన వాడు ఇంకెవడైన గలడా" అని ప్రశ్నించెను. అట్టివాడు జిజ్ఞాసువు.

ఈ లోకములో సంపన్నత మహారాజపదవులు మొదలగువానిని కోరి భగవంతుని ఆశ్రయించువాడు అర్థార్థి సవతి తల్లివలన అవమానమును పొంది మహాపదవిని కోరి భగవంతునిగూర్చి పెద్ద తపస్సు చేసిన ధ్రువుడు ఇట్టివాడు

వారము దినములలో మిగుల దయతో భగవంతుని లీలా విశేషములను పరీక్షిత్తునకు బోధించిన శుకుడు జ్ఞాని.

వీరందఱను ఉదారులే. మహాత్ములే. కాని జ్ఞాని మాత్రము తన యాత్మను సకలభూతములయందును అంతర్యామిగా నున్న భగవంతునిగా తెలిసికొనుచున్నాడు. అట్టివాడు భగవంతుని పొందుటకు ప్రయత్నింప నక్కఱ లేదు. కాని ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అను ముప్వరును భగవంతునే శరణమును పొంది ఆయననే స్మరించుచు అనేక జన్మములు గడచిన తరువాత, "ఈ జగత్తు అంతయు వాసుదేవుడే" అని శుకమహార్షి వలె తన్మయత్వముతో నుందురు.

సాధారణ జనులు అనేక కోరికలతో, భగవంతుని ఆశ్రయింపక, ఇతరదేవతలను ఆశ్రయించి, కోరికలను పొందుటకై పూజలు, జపములు మొదలుగా ఎన్నో విధములను అవలంబించి ఎంతో శ్రమపడుదురు. దానివలన తాత్కాలికములైన ఫలములను పొంది కొలదిగా సంతోషమును పొందుచుందురు. వారి కా భక్తిని ఆదేవతల పూజలయందు శ్రద్ధను భగవంతుడే కలిగించి వారు కోరుచున్న యాఫలములను కూడ ఒసంగుచున్నాడు. ఆపలములు త్వరలో ముగిసిపోవును. అల్పమైన తెలివిగలవారు మరల ఇతరపలముల కొఱకు ఇతర దేవతలను ఆశ్రయించుచుందురు. ఇట్లు వారికి సంసారము కొనసాగుచుండును.

ఇట్టి భక్తులలో ఎవరియొక్క పాపము పుణ్యకర్మలవల్ల అంతము నొందునో అట్టివారు సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి ముక్తులై ఇతర దేవతలను వీడి దృఢముగా భగవంతునే భజింతురు.

శ్రీరాముడు శ్రీకృష్ణుడు మొదలగువారిని పరమేశ్వరులనుగా (Supreme God) కాక మంత్రాధిష్ఠానదేవతలనుగా సీతావల్లభునిగానో ఆంజనేయవరదునిగానో, శ్రీకృష్ణుని యశోదానందనుని గానో, రాధావల్లభుని గానో పరిమితములైన యాకారములతో ధ్యానించువారు అన్యదేవతా భక్తులే యగుదురు. వారిచే

బావింపబడుచున్న ఆదేవతామూర్తుల రూపముల ద్వారమున కూడ పరమేశ్వరుడే వారి కోరికలను దీర్చుచుండును. పాశుపతాస్త్రము కొఱకు అర్జునుడు ఆరాధించిన ఈశ్వరుడు అన్యదేవతయే ఒకదేవుని విషయముననే ప్రసన్నాంజనేయుడు వీరాంజనేయుడు, మహాగణపతి, విఘ్నేశ్వరుడు మొదలుగా బిన్న దేవతామూర్తులను ధ్యానించువారు అన్యదేవతా భక్తులే యగుదురు.

## (ii) బ్రహ్మ లోకగమన చమసము

## గీత

పరమాత్మయైన తన్ను ఉపాసించువారికి, ఇతర దేవతలను ఉపాసించువారికిని కలుగు ఫలమునందు గల యంతరమును భగవంతుడు ఇట్లు వివరించుచున్నాడు. "మరణసమయమున నన్నే స్మరించుచు శరీరమును త్యజించువాడు నా భావమునే పొందుచున్నాడు. ఇందులో సందేహము లేదు. ఎవ డెవడు ఏ యే భావమును ఎల్లప్పుడు చింతించుచు, మృతినొందు నప్పుడు కూడ స్మరించుచు, దేహమును వీడునో వాడు ఆ భావమునే పొందును. కావున అర్జునా, నాయందు మనస్సును బుద్ధిని ఉంచి సర్వకాలములందును నన్ను స్మరించుచుండుము ; యుద్ధమును కూడ చేయుము. నన్నే పొందగలవు. సంశయము లేదు.

మనస్సును మఱియొక విషయము పైకి పోనీయక అభ్యాసముచేత దృఢమైన యోగముతో ధ్యానించుచు యోగి పరమపురుషుని పొందుచున్నాడు. మరణకాలము నందు భక్తితో యోగబలముచేత నిశ్చలమైన మనస్సుతో అతడు కనుబొమల మధ్య ప్రాణమును చక్కగా ప్రవేశపెట్టి ఇంద్రియములను అన్నింటిని నిగ్రహించి మనస్సును హృదయమున స్థిర మొనరించి ప్రాణమును మూర్ధమునకు చేర్చి నిలిపి నన్ను స్మరించుచు బ్రహ్మమునకు వాచకమైన ఓంకారమును ఉచ్చరించుచు శరీరమును వీడ్కొని పోవువాడు పరమమైన గతిని పొందుచున్నాడు

ఏకాగ్రమైన చిత్తముతో నిత్యము సతతముగా నన్ను స్మరించు యోగికి నేను సులభముగా పొందదగిన వాడను అగుదును. నన్ను చేరి పరమమైన సంసిద్ధిని పొందిన మహాత్ములు అశాశ్వతము దుఃఖములకు నిలయమును అయిన పునర్జన్మను పొందరు. బ్రహ్మ భువనముతో కూడ సకలలోకములలో ఏ లోకము నకు పోయినను మరల తిరిగి రావలసినయే యుండును. నన్ను పొందినప్పుడు మాత్రమే పునర్జన్మ యుండదు.

యోగులు ఏమార్గమునందు పోయినచో మరల తిరిగిరారో, ఏమార్గమునందు పోయినచో తిరిగివత్తురో చెప్పెదను. అగ్ని, జ్యోతిస్సు, అహస్సు, శుక్లపక్షము, ఆఱుమాసముల యుత్తరాయణము, కల మార్గమునందు పోయిన బ్రహ్మవేత్తలు బ్రహ్మమును పొందుదురు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, ఆఱుమాసముల

దక్షిణాయనము, గల మార్గమునందు పోయిన యోగి అచ్చట చాంద్రమసమైన జ్యోతిని పొంది తిరిగివచ్చును. శుక్లము, కృష్ణము అను ఈ రెండు మార్గములు జగత్తునందు శాశ్వతమైనవి. ఒకదానిచేత అనావృత్తి, మఱియొక దానిచేత ఆవృత్తి కలుగును. ఈ రెండు మార్గములను ఎఱింగిన యోగి ఎవ్వడును మోహమును పొందడు కావున అర్జునా! నీవు అన్ని వేళలయందును యోగయుక్తుడవై యుండుము. వేదములు యజ్ఞములు తపస్సులు దానములు అనువానియొక్క అధ్యయనానుష్ఠానములవలన ఏయే ఫలము కలుగు నని శాస్త్రము నిర్దేశించినదో ఆ ఫలసముదాయమును సర్వమును అతిక్రమించి, దీనిని తెలిసికొన్న యోగి పరమైన స్థానమును పొందుచున్నాడు".

శ్లో|| అంతకాలే చ మా మేవ స్మరన్ముక్త్వా కళేవరమ్ |
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః || 5

శ్లో|| యం యం వాపి స్మర న్భావం త్యజ త్యంతే కలేవరమ్ |
తం త మే వైతి కౌంతేయ సదా తద్భావ భావితః || 6

శ్లో|| తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ |
మ య్యర్పితమనో బుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః || 7

శ్లో|| అభ్యాసయోగ యుక్తేన చేతసా నాన్యగామినా |
పరమం పురుషం దివ్యం యాతి పా ర్థానుచింతయన్ || 8

శ్లో|| ప్రయాణకాలే మన సాచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ |
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష ముపైతి దివ్యమ్ || 10

శ్లో|| సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ |
మూర్ధ్న్యాధా యాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ || 12

శ్లో|| ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్ |
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ || 13

శ్లో|| అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః |
త స్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః || 14

శ్లో|| మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ |
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః || 15

శ్లో|| ఆ బ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినో ఽర్జున |
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే || 16

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ 23

శ్లో॥ అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ 24

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥ 25

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే।
ఏకయా యా త్యనావృత్తి మన్యయాఽవర్తతే పునః॥ 26

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భ వార్జున॥ 27

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 32

## విజయప్రభ

భగవానుడు ఈ సందర్భమున మూడు విషయములను వివరించుచున్నాడు మరణించుసమయమున తుదకు ఎవడు దేనిని భావించునో వాడు తరువాత ఆ భావమునే పొందును ; కావున భగవంతుని స్మరించుచు శరీరమును వీడు వాడు భగవంతునే పొందును. కాని అట్లు తుదిక్షణమున భగవంతుని స్మరణము కలుగ వలయు నన్నచో జీవితమున సదా ఆయననే ధ్యానించు చుండవలయును ఆ ధ్యానముయొక్క బలమువలన తుదిక్షణమునందు భగవంతునే స్మరించుచు శరీరమును వీడిన యోగి భగవంతునే పొంది పునర్జన్మమును పొందడు ; అనగా ముక్తు డగును. ఇది మొదటి విషయము.

ఓంకారమును బ్రహ్మమునుగా ఉపాసించిన యోగి యోగబలముచేత మనస్సును హృదయమునందు నిరోధించి, మనస్సుతో కూడ ప్రాణమును హృదయమునందు నిరోధించి, మనస్సుతో కూడ ప్రాణమును హృదయమునుండి కనుబొమలమధ్యకు అక్కడ నుండి మూర్ధమునకు చేర్చి అక్కడ నుండి మూర్ధమును ఛేదించుకొని పోయి పరమగతిని పొందుచున్నాడు. పరమగతి అనగా మోక్షము. కాని ప్రణవమును బ్రహ్మమునుగా ఉపాసించువారు బ్రహ్మలోకమునకు పోయి అక్కడ చిరకాలము ఉండి, ఆలోకము ప్రళయమునందు అంతము నొందునప్పుడు, బ్రహ్మదేవునితో కూడ ముక్తిని పొందుదు రని ఉపనిషత్తుల యందు చెప్పబడి యున్నది. ఇది రెండవ విషయము.

ఈ బ్రహ్మలోక గమనముయొక్క ప్రాశస్త్యమును వివరించుటకే భగవంతుడు, ఈలోకమునకు చేర్చు శుక్లగతిని గాక కృష్ణగతిని కూడ ప్రస్తావించినాడు. అగ్ని, జ్యోతిస్సు, అహస్సు మొదలుగా శుక్లమార్గమునందు, దూమము, రాత్రి మొదలుగా కృష్ణమార్గమునందు పేర్కొనబడిన శబ్దములు ఆ యా దేవతల నామములు. వీరిని ఆతివాహికదేవత లందురు. అతివహన మనగా యాత్రికులను ఒక మజిలీ నుండి మఱియొక మజిలీకి తీసికొనిపోవుట. ఈ దేవతలు తమస్థానమునకు చేరిన యోగులను అక్కడ నుండి పైస్థానమునకు చేర్చుచుందురు. అందువలన వీరు ఆతివాహికదేవత లని చెప్పబడుచున్నారు. వీరిలో అహస్సు రాత్రి మొదలుగా కాలములోని విభాగములను అభిమానించు దేవతలు అధికముగా నున్నారు. మామిడితోట అన్నప్పుడు దానియందు మామిడి చెట్లు కాక ఇతర వృక్షములు కూడ కొన్ని యుండవచ్చును. మామిడి చెట్లు అధికముగా నుండుటచే దానిని మామిడితోట అని చెప్పుచుందుము. అట్లే వీనియందు కూడ కాలము నభిమానించు దేవతలు అధికముగా నుండుటచే, అగ్నిజ్యోతిస్సు మొదలగువారు కాలాభిమానిదేవతలు కాకపోయినను, శుక్లమార్గమును ఉత్తరాయణమార్గమని, కృష్ణమార్గమును దక్షిణాయనమార్గమని పేర్కొనుచుందురు.

శుక్ల మనగా తెల్లనిది. కృష్ణ మనగా నల్లనిది. ప్రకాశవంతములైన విద్య, జ్ఞానము మొదలగునవి శుక్ల శబ్దము చేత సూచింపబడును. ప్రకాశహీనములైన అవిద్య, కర్మపరత్వము మొదలగునవి కృష్ణశబ్దముచేత సూచింపబడును. బ్రహ్మమును ఉపాసించువిధానములను బ్రహ్మవిద్య లందురు. అందువలన బ్రహ్మవిద్యోపాసకులైన యోగులు బ్రహ్మలోకమును చేరుటకు ఏర్పఱుపబడిన మార్గము శుక్లగతి అని చెప్పబడుచున్నది. కర్మపరత్వమునకు కారణము అవిద్య. అందువలన యజ్ఞయాగదానాదులచేత పుణ్యము నార్జించుకొన్న కర్మనిష్ఠులు ఇంద్రచంద్రాదిలోకములను చేరుటకు ఏర్పఱుపబడిన మార్గము కృష్ణగతి యని పేర్కొనబడినది

ఈ మార్గములందు కాలాభిమానదేవతలు అధికముగా నుండుటచే, బ్రహ్మోపాసకులు ఉత్తరాయణమునందే పగటికాలముననే మరణింతురని కాని, కర్మనిష్ఠులు దక్షిణాయనమునందే రాత్రి కాలముననే మరణింతురని కాని తలంచుటకు వీలు లేదు. ప్రారబ్ధముయొక్క అంతమున ఎవరి శరీరమైనను ఎప్పు డైనను పడిపోవచ్చును. ప్రారబ్ధము శరీరమును ఇచ్చిన తరువాత దానిని అవలంబించి కొందఱు ఉపాసనలు, మఱికొందఱు యజ్ఞయాగాదులను గావించుచుందురు. ఉపాసనలు గాని కర్మనిష్ఠలు గాని ప్రారబ్ధమును మార్పవు. అందువలన వీరిలో ఎవడు ఎప్పుడు మరణించినను ఉపాసకులు శుక్లమార్గమున బ్రహ్మలోకమునకు, కర్మనిష్ఠులు కృష్ణమార్గమున ఇంద్రలోకాదులకు తప్పక చేరుదురు.

అట్లయినచో అంపశయ్యపై భీష్ముడు బాధను భరించుచు పెక్కుదినములు ఉత్తరాయణము కొఱకు ఏల ప్రతీక్షించుచుండెను? ఆయన తండ్రి యొసంగిన స్వచ్ఛంద మరణము అను వరమును ప్రకాశింపజేయుటకు, ద్రౌపదీ వస్త్రావహరణమును చూచుచు దుర్యోధనాదులను శిక్షింపకుండుట మొదలగు అకృత్యములవలన కలిగిన పాపమునకు ప్రాయశ్చిత్తమును పొందుటకు, అంపశయ్యపై నుండి ఉత్తరాయణముయొక్క ప్రాశస్త్యమును నిరూపించెను. అనగా సంకల్పపూర్వకముగా శరీరమును త్యజింపదలంచువారు, మహాప్రస్థానము మొదలగువానిని ఉత్తరాయణమునందే ఆచరింపవలెనని ఆయన సూచించినాడు ఆయన ఉత్తరాయణమునందు మరణించినను బ్రహ్మలోకమునకు పోలేదు. ఆయన తనకు పూర్వస్థానమైన వసుత్వమునే పొందెను. ద్రోణాచార్యుడు దక్షిణాయనమునందు మరణించినను బ్రహ్మలోకమునకే పోయినట్లు మహాభారతమున చెప్పబడియున్నది. కావున మరణకాలమునకు ఈ మార్గములందు పయనించి, ఉపాసనయొక్క, యజ్ఞయాగాదులయొక్క ఫలములను పొందుటకు ఎట్టి సంబంధము లేదు

స్వర్గాదిలోకములనుండియే కాక బ్రహ్మలోకమునుండి కూడ మరలివచ్చుట సంభవింపవచ్చు ననుట మూడవ విషయము. "ఆ బ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినో ఽర్జున" అని భగవానుడు చెప్పిన సందర్భము శ్రీశంకరులవారు, "ఆ బ్రహ్మభువనాత్" అనగా "బ్రహ్మలోకముతో కూడ" అని వ్యాఖ్యానించినారు.

"ఆబ్రహ్మభువనాత్ సహబ్రహ్మభువనేన లోకాః సర్వే పునరావర్తినః పునరావర్తన స్వభావాః"

కాని ప్రణవమును బ్రహ్మమునుగా ఉపాసించి బ్రహ్మలోకమునకు పోయినవాడు పరమగతిని అనగా మోక్షమును పొందుచున్నాడు (స యాతి పరమాం గతిమ్) అని, శుక్లగతిచే బ్రహ్మలోకమునకు చేరినవాడు అనావృత్తిని పొందును (ఏకయా యా-త్యనావృత్తిమ్) అని భగవంతుడే చెప్పియున్నాడు. మఱి బ్రహ్మలోకము పునరావర్తి కదా! ఇది పూర్వాపర విరోధము కాదా!

ఈ విరోధమును పరిహరించుటకై కొందఱు ఇట్లందురు ప్రళయమునందు స్వర్గాదిలోకములతో పాటు బ్రహ్మలోకము కూడ నశించి మరల సృష్టింపబడుచుండును. కావున బ్రహ్మలోకము కూడ స్వర్గాదులవలె మరల తిరిగివచ్చు స్వభావము కలదే కాని బ్రహ్మలోకమునకు చేరినవారు మాత్రము ఆలోకాధిపతితో కూడ ముక్తి నొందుదురు , తిరిగిరారు

కాని యిక్కడ భగవంతుడు ఉపాసకులైన యోగులను గూర్చి చెప్పుచున్నాడు కాని లోకముల పునరావర్తనమునుగూర్చి చెప్పుటలేదు. ప్రళయమునందు సకలలోకములు పోయి సృష్ట్యారంభమున మరల వచ్చు ననుట సుప్రసిద్ధము. ఆవిషయమున ఇక్కడ

సంశయము లేదు. బ్రహ్మలోకమునకు చేరినవా రందఱు అచ్చటనే ముక్తిని పొందుదురా? లేక వారిలో కొందరు తిరిగి వచ్చుట కూడ సంభవించునా అన్నదే ఇచ్చట సంశయము బ్రహ్మలోకమునకు పోయినప్పటికిని కొందఱకు తిరిగి వచ్చుట తప్ప దని తన్ను పొందినవారికి మాత్రము పునర్జన్మ యుండ దని భగవంతుడు ఉద్ఘాటించుచున్నాడు.

ఈ సందర్భమున కృష్ణ శుక్ల మార్గములయొక్క విశేషములను గ్రహించుట ఆవశ్యకము. ఇష్టాపూర్తములను దానములను ఉపాసించువారు మరణించినప్పుడు ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము అనుదేవతలను చేరుదురు. వీరు సంవత్సరదేవతను చేరరు. దక్షిణాయనమాసదేవతనుండి వీరు పితృలోకమునకు అటనుండి ఆకాశమునకు అటనుండు చంద్రుని చేరుదురు. అచ్చట పుణ్యఫలమును అనుభవించి తిరిగి వత్తురు.

పంచాగ్నివిద్య నెఱింగిన గృహస్థులు, అరణ్యమునందుండి ఉపాసనలు గావించు వానప్రస్థులు, శ్రద్ధాళువులైన తాపసులు, పరివ్రాజకులు, నైష్ఠిక బ్రహ్మచారులు శరీరవియోగమును పొందినప్పుడు అర్చిస్సు, అహస్సు, శుక్లపక్షము, ఉత్తరాయణమాసములు, సంవత్సరము, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు అను దేవతలను చేరుదురు. అచ్చటికి బ్రహ్మలోకమునుండి వచ్చిన అమానవుడైన పురుషుడు, అనగా మనువు సృష్టిలోనివాడు కాదు, వారిని బ్రహ్మలోకమునకు చేర్చును.

విద్యుల్లోకమునకు చేరినవారి నందఱను ఈపురుషుడు బ్రహ్మలోకమునకు తీసికొనిపోడు. నామము మనస్సు, వాక్కు మొదలగు ప్రతీకలను అవలంబించి ఉపాసనలు గావించినవారు విద్యుల్లోకమునందే యుందురు. పంచాగ్ని విద్యోపాసకులను సగుణ బ్రహ్మోపాసకులను వానప్రస్థ పరివ్రాజక నైష్ఠిక బ్రహ్మచారులను ఆపురుషుడు బ్రహ్మలోకమునకు చేర్చును (బ్ర.సూ. 4-3-15)

బ్రహ్మలోకమునకు చేరినవా రందఱను అచ్చట తప్పక ముక్తి పొందుదు రని చెప్పుటకు వీలు లేదు. ఛాందోగ్యమున అక్షిపురుష విద్యయందు ఇట్లున్నది "అమానవుడైన పురుషుడు వీరిని బ్రహ్మమునకు చేర్చుచున్నాడు. ఇది దేవపథము, బ్రహ్మపథము. దీనిచేత (బ్రహ్మమును) పొందుచున్నవారు ఈ మానవమైన యావర్తమును పొందరు పొందరు".

**తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయ త్యేష దేవపథో బ్రహ్మపథః| ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే నా వర్తన్తే || (4 - 15 - 5)**

ఇచ్చట ఆనందగిరి టీకయందు ఇట్లున్నది. "ఇమమ్" (ఈమానవమైన యావర్తమును) అను విశేషమువలన ఈ కల్పమునందు అనావృత్తి, కల్పాంతరమునందు ఆవృత్తియు నుండు నని సూచింపబడుచున్నది"..

ఇమ మితి విశేషాణాత్ అనావృత్తి రస్మిన్ కల్పే, కల్పాంతరే తు అవృత్తి రితి సూచ్యతే|

ఈ విషయమునే బ్రహ్మసూత్ర శంకరభాష్యవ్యాఖ్యానమునందు శ్రీగోవిందానన్దులవారు ఇట్లు ఉద్ఘాటించిరి. "ఇమమ్" (ఈ మానవమైన యావర్తమును) అను విశేషణమువలన ఈ కల్పమునందు బ్రహ్మలోకమునకు చేరిన వారికి కల్పాంతరమునందు అవృత్తి కలుగు నని తోచుచున్నది. అయినప్పటికి ఈశ్వరోపాసనము లేకుండ పంచాగ్ని విద్య, అశ్వమేధము, దృఢబ్రహ్మచర్యము మొదలగు సాధనములచేత ఎవరు (బ్రహ్మలోకమును) చేరిరో వారికి, తత్త్వజ్ఞానము ఉండవలయు నను నియమము లేక పోవుటవలన, అవృత్తి కలుగును. ఎవరు దహరాదికమైన యీశ్వరోపాసనచేత చేరిరో వారికి సగుణవిద్యాఫలము క్షయము నొందినప్పుడు కూడ నిరవగ్రహమైన యీశ్వరానుగ్రహముచేత లబ్ధమైన ఆత్మజ్ఞానమువలన ముక్తి తప్పక లభించును. "మఱి ఇచ్చట సూత్రకారునిచేత సగుణబ్రహ్మవేత్తలకే అనావృత్తి క్రమము చెప్పబడినది ; నిర్గుణ బ్రహ్మవేత్తలకు చెప్పబడలేదు ; ఇందులకు హేతు వేమి" అని ఆశంకించి, వారినిగూర్చి ఆ శంకయే లేకుండుటవలన, (సమ్యగ్దర్శనముచేత తమస్సు విధ్వస్తమైన వారికి నిత్యసిద్ధనిర్వాణపరాయణులైన వారికి అనావృత్తి సిద్ధమే) సమ్యగిత్యాదిగా భాష్యకారుడు చెప్పుచున్నాడు. సగుణబ్రహ్మవేత్తలకు అవృత్తి కలుగువలసియుండగా సమ్యగ్దర్శనమును ఆశ్రయించుటచేతనే అనావృత్తి సాధింపబడుచున్నది. కావున స్వయముగా సమ్యగ్దర్శనులైన వారికి అవృత్తినిగూర్చి శంకయే లే దని చెప్పవలసిన దే మున్నది అని యర్థము"

"ఇమ మితి విశేషణాత్ అస్మిన్ కల్పే బ్రహ్మలోకం గతానాం కల్పాన్తరే అవృత్తిః భాతి| తథాపి ఈశ్వరోపాస్తిం వినా పంచాగ్ని విద్యాశ్వమేధ బ్రహ్మచర్యాది సాదనైః యే గతాః తేషాం తత్త్వజ్ఞాన నియమాభావాత్ అవృత్తిః స్యాత్| యే తు దహరాది ఈశ్వరోపాస్త్యా గతాః తేషాం సగుణ విద్యాఫలక్షయేఽపి నిరవగ్రహ ఈశ్వరానుగ్రహాలబ్ధ ఆత్మజ్ఞానాత్ ముక్తినియమః ఇ త్యభిప్రే త్యాహ. అంతవత్త్వేఽపి తు ఇతి| నన్వత్ర సూత్రకృతా సగుణ విదా మేవ అనావృత్తి క్రమః ఉక్తః న నిర్గుణవిదామ్| తత్ర కో హేతు రిత్యాశంక్య, తేషా మావృత్తి శంకాభావా ది త్యాహ - సమ్య గితి | తదాశ్రయణేన ఇతి సగుణవిదాం అవృత్తి ప్రాప్తౌ, సమ్యగ్దర్శనాశ్రయణేన ఏవ అనావృత్తిః సాధితా | అతః స్వతః సమ్యగ్దర్శినాం అవృత్తి శంకా నేతి కిము వాచ్య మి త్యర్థః | (బ్ర. సూ. 4 - 4- 22)

సమ్యగ్దర్శనములేక, బ్రహ్మలోకమునుండి తిరిగివచ్చువారు, శుక్లమార్గముననే తిరిగివత్తు రని గ్రహింపవలసియున్నది.

## (iii) భగవత్స్వరూప నిరూపణ చమనము

# గీత

శుక్లగతిని కృష్ణగతిని వివరించిన తరువాత భగవానుడు, ఆ గతులకు సంబంధము లేకుండ ఇక్కడనే ఇప్పుడే ముక్తిని కలిగించునట్టి ఆత్మజ్ఞానమును ప్రశంసించుచు ఇట్లు చెప్పెను. "నీకు నాయందు అసూయకలుగుట లేదు. కావున నీకు రాజవిద్య రాజగుహ్యము పవిత్రము ఉత్తమమును అయిన జ్ఞానమును విజ్ఞానసహితముగా బోధింతును వినుము. దీనిని తెలిసికొన్నచో నీవు సంసారమునుండి మోక్షమును పొందగలవు. దీనిని నీవు ప్రత్యక్షముగా తెలిసికొనగలవు. ఇది ధర్మమునకు దూరము కాదు. ఇది సుఖముగా సంపాదింపవీలయినది. అయినను సుఖసంపాద్యములైన కర్మఫలములవలె ఈ జ్ఞానముయొక్క ఫలము ఎప్పటికిని క్షీణించునది కాదు".

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే |
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసే ఒశుభాత్ ॥ 1

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ |
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥ 2

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

# విజయప్రభ

రాజవిద్య యనగా విద్యలలో రాజువంటిది. ఊర్ధ్వలోకమునకు రెండే మార్గములు ఉపనిషత్తులలో చెప్పబడినవి. యజ్ఞయాగదానాదులు చేసినవారు దక్షిణ మార్గమున స్వర్గాదిలోకములకు పోవుదురు. పంచాగ్ని విద్యను, సగుణబ్రహ్మవిద్యలను ఉపాసించినవారు ఉత్తరమార్గమున బ్రహ్మలోకమునకు పోవుదురు. ఈ మార్గమున బ్రహ్మలోకమునకు పైన ఏలోకములు చెప్పబడ లేదు. కావున ఉత్తమలోకములుగా పురాణములలో ప్రశంసింపబడిన వైకుంఠము, కైలాసము, సత్యలోకము, దేవీలోకము, గోలోకము మొదలగునవి యన్నియు బ్రహ్మలోకములోనే కొన్ని ప్రత్యేక నివేశనములని (colonies) గ్రహింపవలసియున్నది. అంతేకాని అవి బ్రహ్మలోకము కంటె భిన్నములైనవి కావు ; ఉన్నత మైనవి కావు.

గుహ్య మనగా రహస్యముగా నుంచవలసినది మంత్రోపాసనము మొదలైనవి గుహ్యములు. అట్టివానిలో రాజువంటిది రాజగుహ్యము. అనుభవముతో కూడినది (coupled with practical experience) విజ్ఞానము

వైకుంఠప్రాప్తి, కైలాసగమనము మొదలగునవి ప్రత్యక్షావగమములు కాదు అవగమము అనగా తెలియుట ఇతరులవలన వినుట శాస్త్రప్రమాణము చేత గ్రహించుట, ఊహించుట మొదలుగా తెలియుట అనేక విధములుగా నున్నది. ఆత్మజ్ఞానము అట్టిది కాదు. సుఖము దుఃఖము మొదలగునవి ఎట్లు ప్రత్యక్షముగా తెలియుచున్నవో అట్లే ఆత్మజ్ఞానము కూడ సాక్షాత్తుగా తెలియును "నేను సుఖపడుచున్నాను", "నేను దుఃఖపడుచున్నాను" అను విషయములలో ఎట్లు సందేహము కలుగుట లేదో, అట్లే ఆత్మజ్ఞానము కలిగినప్పుడు దానియందు సందేహమునకు అవకాశము ఉండదు.

తన్ను గూర్చి తాను తెలిసికొనుటయే కాబట్టి ఇందు కష్టపడవలసినది ఏదియు లేదు. దీనిని మిగుల సుఖముగా పొందవచ్చును. అల్పశ్రమతో చిన్నకార్యమునో యజ్ఞమునో చేసిన వానికి కొద్దిఫలము, పెద్దశ్రమతో పెద్ద వ్యాపారమునో యజ్ఞమునో చేసినవానికి గొప్పఫలము లభించుట ప్రసిద్ధముగా నున్నది పరిశ్రమకు తగిన ఫలము లబింపవలె ననుట యుక్తమే. కాని ఇది ఆసూత్రమునకు అపవాదము. ఇది ఎంత సులభముగా లబించినప్పటికి దీనివలన కలుగుఫలము వ్యయము నొంధదు ; అనగా క్షీణింపదు. కావున ఇది అవ్యయము.

## గీత

తాను ప్రశంసించిన శ్రేష్ఠమైన జ్ఞానమును భగవంతుడు ఇట్లు బోధించెను. "అవ్యక్తమైన రూపముతో నాచేత ఈ జగత్తు అంతయు వ్యాప్తమై యున్నది. సర్వభూతములు నాయందున్నవి. కాని నేను వానియందు లేను భూతములు నాయందు కూడ లేవు. నాయీశ్వర శక్తియొక్క యోగమును చూడుము. భూతభావనమైన నాయాత్మ భూతములను భరించుచుండియు భూతములయందు లేదు. అంతటను వ్యాపించి పెద్దదిగా ఉన్న వాయువు ఎల్లప్పుడు ఆకాశమునందు ఎట్లు ఉన్నదో అట్లే సకలభూతములు నాయందు ఉన్నవని ఎఱుంగుము"

శ్లో|| మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా |
మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః || 4

శ్లో|| న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్ |
భూతభృత్ న చ భూతస్థో మమాత్మా భూతభావనః || 5

శ్లో|| య థాకాశస్థితో వాయుః సర్వత్రగో మహాన్ |
తథా సర్వాణి భూతాని మత్స్థా నీ త్యుపధారయ || 6

"నా యాత్మ భూతభావన" మనగా అది భూతములను పుట్టించునది లేక వర్ధిల్ల జేయునది అని యర్థము. అట్లయినచో ఆత్మకు కర్తృత్వమున్నదా ? లేదు. దేనియందు భూతములు పుట్టినట్లుగా వర్తిల్లుచున్నట్లుగా గోచరించుచున్నవో అది యాత్మ అట్లయినచో "నా ఆత్మ" అని భగవాను డన్నప్పుడు, "మా యిల్లు" అన్నప్పుడు ఇల్లు మనకంటె భిన్నముగా ఎట్లున్నదో అట్లే, యీ యాత్మ ఆయనకంటె అన్యముగా నున్నదా ? లేదు. "నా యాత్మ" అనగా "నాస్వరూపము లేక నేను" అనియే యర్థము. ఇది భూతములను భరించుచున్నది (భూతభృత్) లేక ధరించుచున్నది. కాని ఆభూతములయందు ఇది లేదు (న చ భూతస్థః) మంటపమును భరించుచున్న స్తంభములు మంటపమునందు ఉండవు. మంటపమునందు కలుగుమార్పు లేవియు స్తంభములయందు సంభవింప నక్కఱ లేదు. పాలను ధరించుచున్న గిన్నె పాలయందు లేదు ఆపాలయందు ఎట్టిమార్పులు సంభవించినను అవి ఆపాలను ధరించుచున్న గిన్నె యందు సంభవింపవు. అట్లే భూతములయందు సంభవించునట్టి సృష్టిస్థితిలయాది విశేషములు ఏవియు, వానిని భరించుచున్న లేక ధరించుచున్న యాత్మయందు సంభవింపవు.

"సర్వభూతములు నాయం దున్నవి , నేను వానియందు లేను" అని భగవానుడు చెప్పిన విషయమును పైదృష్టాంతముల చేత గ్రహింపవచ్చును. కాని, "భూతములు నా యందు లేవు" అని భగవానుడు చెప్పుట (మత్స్థాని సర్వభూతాని. . న చ మత్స్థాని భూతాని) ఎట్లు కుదురును ? ఈ వాక్యములు పరస్పర విరుద్ధములు కావా ? కావు. ఎందువలన ? వెండి చెంబు, వెండి కంచము, వెండి గిన్నె మొదలగునవి వెండియందే ఉండును. కాని వెండి, కంచముయొక్క ఆకృతి యందు ఉండదు. చెంబు మొదలగునవి పుట్టుటకు పూర్వము, ఆరూపములు పోయిన పిమ్మట వెండి, ముద్దయే యుండును. ఆరూపములలో వెండి యున్నచో ఆరూపములు నశించునప్పుడు వెండి కూడ నశింపవలె. కాని అది అట్లు నశించుట లేదు. కావున ఆరూపములలో వెండి లేదు. అట్లే ఆత్మయందు సకలభూతములు సృష్టిస్థితిలయములను పొందుచున్నట్లు గోచరించుచు ఉన్నను, వానియందు ఆత్మ ఉండదు. అవి గోచరించుటకు పూర్వము, అవి నశించిన తరువాత, అది నిర్వికారముగా నిత్యముగా ఉన్నది. అనగా దానియందు భూతములు గోచరించుచు ఉన్నను, ఆ భూతముల ఆకృతులయందు ఆత్మ లేదు. ఆకాశమునందు అంతటను వ్యాపించుచు వాయువు ఎట్లున్నదో, అట్లే భూతము లన్నియు ఆత్మయందు ఉన్నవి వాయువునందలి వికారములు ఏవియు ఆకాశమునకు ఎట్లు సంబందించుట లేదో అట్లే భూతములయందు కలుగు వికారములు ఏవియు ఆత్మకు సంబంధింపవు. అది ఎల్లప్పుడు నిర్వికారముగానే యుండును.

# గీత

భూతములజగత్తునకు తనకు గల సంబంధమునుగూర్చి భగవంతు డిట్లు చెప్పుచున్నాడు. "నేను నా ప్రకృతిని వశపఱచుకొని, ప్రకృతికి వశమైయున్న యీ సమస్త భూతసముదాయమును మరల మరల సృష్టించుచున్నాను కాని ఆభూతములకు సంబంధించినకర్మలు, ఆకర్మలయందు సక్తుడను గాక ఉదాసీనుడనై యున్న నన్ను బంధింపవు నేను అధ్యక్షుడనుగా ప్రకృతి చరాచరమైన జగత్తును సృష్టించుచున్నది ఈకారణముచేతనే జగత్తు అనేకవిధముల పరివర్తనము నొందుచున్నది"

శ్లో|| ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః |
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్ || 8

శ్లో|| న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ |
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు || 9

శ్లో|| మ యాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్ | .
హేతు నానేన కాంతేయ జగ ద్విపరివర్తతే ||

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

# విజయప్రభ

భగవంతునకు ప్రకృతి లోబడియుండును. ఆయనయొక్క సంకల్పము ననుసరించి ఆ ప్రకృతి, తనకు లోబడియుండి అస్వతంత్రములైన, ప్రకృతి నియమములకు లోబడియున్న భూతములను మరల మరల సృష్టించుచుండును. అనగా సృష్టిస్థితిలయములు ఒకదాని వెంటనొకటిగా నిరంతరము జరుగుచుండు నన్నమాట. పెక్కు వైషమ్యములతో జగత్తును సృష్టించుచు, ఆవైషమ్యముల ననుసరించి పెక్కు దర్మబేదములతో దానికి స్థితిని తుదకు లయమును ఈశ్వరుడు చేయుచున్నప్పుడు ఆ మహాకార్యములయొక్క పలములు ఆయనను బంధింపవా ? బంధింపవు. ఎందువలన? ఆ కర్మలు ప్రకృతివలన జరుగుచున్నప్పుడు, వానియందు తాను ఆసక్తి నొందక ఉదాసీనుడై యుండుటవలన తన్ను ఆకర్మలు బంధించుట లే దని భగవానుడు సమాధానము చెప్పుచున్నాడు. పోటీలతో క్రీడలు జరుగుచున్నప్పుడు ఏ పక్షమునకు సంబందింపక ఊరక చూచుచున్నవానికి ఏ పక్షము గెలిచినను ఓడినను సుఖము దుఃఖము కలుగవు ; ఆ క్రీడ యంతము వినోదమాత్రముగానే యుండును. అట్లే ప్రకృతి కావించుచున్న జగత్క్రీడను ఉదాసీనముగా చూచుచున్న యీశ్వరునకు ఆ క్రీడలోని కర్మలయొక్క పలములయందు ఆసక్తి "నేను చేయుచున్నాను" అను నభిమానము లేకపోవుటవలన, ఆకర్మలు ఆయనను బందించుట లేదు. ఇది ఆయనవిషయము

మాత్రమే కాదు. లోకములో ఎవ డైనను తనవలన ఏ కర్మలు జరుగుచున్నను వానిఫలములయందు ఆసక్తి నొందక, "మనస్సు, ఇంద్రియములు శరీరము పనులు చేయుచున్నవి; నేనేమియు చేయుట లేదు" అని కర్తృత్వాభిమానమును వీడియుండునో అట్టివానిని కూడ ఆకర్మలు బంధింపవు.

"నేను సృష్టించుచున్నాను" (విసృజామి) అని చెప్పి వెంటనే, "నేను ఉదాసీనునివలె ఉన్నాను" అని భగవానుడు చెప్పుట పరస్పర విరుద్ధము కదా! ఆ విరోధమును పరిహరించుటకే, ప్రకృతికావించుచున్న సృష్టియందు తాను అధ్యక్షతచేత నిమిత్తమాత్రుడే కాని కర్త కా దని భగవంతుడు చెప్పుచున్నాడు. సూర్యుడు ఉదయించినంతనే ఆయన సన్నిధియందు లోకమున ఎన్నోకార్యములు జరుగుచున్నవి. ఆయనయొక్క అధ్యక్షత, లేక కాంతిప్రసారము, లేకున్నచో ఎన్నో కార్యములు జరుగవనుట సుప్రసిద్ధము. అంతమాత్రముచేత ఆయన ఆకార్యములకు కర్త యని గాని ప్రేరకు డని గాని చెప్పుటకు వీలు లేదు. ఉదయించుట ప్రకాశించుట ఆయనకు స్వభావము. ఆప్రకాశమువలన లోకములో జరుగుకార్యములు ఆయనకు సంబంధింపవు. అట్లే చైతన్యముతో ప్రకాశించుచుండుట పరమాత్మకు స్వభావము ; ఆప్రకాశమువలన ప్రకృతియందు జరుగుకార్యములు ఆయనకు సంబంధింపవు.

"ఈ కారణముచేతనే జగత్తు అనేకవిధముల పరివర్తనము నొందుచున్నది" అని భగవంతుడు చెప్పుచున్నాడు. ఈమాటనుబట్టి ప్రతివ్యక్తి యొక్క ప్రవృత్తి అంతయు ఇట్టిదే అని గ్రహింపవలసి యున్నది. ప్రతివ్యక్తికి వానిజగత్తు, వ్యవహారము సర్వము వాని జ్ఞానముపైననే ఆధారపడియున్నది. "నేను గ్రహించుచున్నాను" అన్న జ్ఞానముయొక్క వెలుగును పొందిన మనస్సు ఏ యే పదార్థములను వ్యక్తులను సంఘటనములను గ్రహించుచున్నదో అవియే ఒక్కొక్కనికి ఒక్కొక్క జగత్తుగా అగుచున్నది. ఎవని మనస్సు దేనిని గ్రహింపదో అది వాని జగత్తులో ఉండదు. మఱి వ్యక్తికి వెలుపల వస్తురూపమైన జగత్తు (objective world) ఉన్నది కదా ! ఉన్నది. లే దనుట లేదు. అది మనకు సత్యము కాదు , యదార్థము కాదు ; మనవ్యవహారమునకు ఆధారము కాదు. మన మనస్సుచే దేనిని ఎప్పుడు సత్యముగా యథార్థముగా గ్రహించుచున్నామో అదియే మనకు సత్యము యధార్థమును అయిన జగత్తు అయి మన సుఖదుఃఖములకు ఆధారమగుచున్నవి. సూర్యుడు చెప్పువఱకు కర్ణునకు తాను కుంతీపుత్రు డను విషయము తెలియ . తెలిసినప్పటి నుండి కర్ణుని జగత్తులో తాను కుంతీపుత్రుడు, పాండవులు తనకు సోదరులు అయినారు. అంతకు పూర్వము అతని జగత్తులో వారు సోదరులు కారు, శత్రువులు. అట్లే కుంతీదేవి చెప్పువఱకు పాండవులప్రపంచములో కర్ణుడు కేవలము కన్యాపుత్త్రుడు , ఎవరో దిక్కుమాలిక కన్య కని పాఱవైచినవాడు, సూతునిచే పెంచబడిన వాడు ; దుర్గార్గుడు వధ్యుడు. ఆమె కర్ణునిగూర్చి అతడు తనపుత్త్రు డని చెప్పినంతనే పాండవుల ప్రపంచములో ఆ కర్ణుడే జ్యేష్ఠసోదరు డైనాడు.

ఆష్లే ఒథెల్లో కథలో వానిభార్య డెస్డెమోనా మొదటి నుండి తుదివఱకు పతివ్రతయే, కాని అతనికి అయాగో అనువానివలన ఆమె జారిణీ అను అనుమానము కలిగెను. దానితో అతడు ఆమెను గొంతు నులిమి చంపెను. వెంటనే అయాగో భార్యవలన డెస్డెమోనా జారిణీ కాదని ఒథెల్లోకు తెలిసెను. అతడు పశ్చాత్తాపముతో ఆత్మహత్యకు పాల్పడెను. ఈ సందర్భమున అతడు ఆమెను ప్రేమించుచున్నప్పుడు, జారిణీనిగా తలంచి హత్యచేసినప్పుడు, తరువాత దోషరహితురాలినిగా గ్రహించినప్పుడు, మూడు కాలములయందును ఆమె పతివ్రతగానే యుండెను. కాని అతడు ఆమెనుగూర్చి ఎప్పుడు ఏవిధముగా గ్రహించుచున్నాడో అజ్ఞానమే వానికి యథార్థమై (Reality) వాని వ్యవహారమునకు కారణమైనది. అంతేకాని ఆమె మూడు కాలములందును పతివ్రతగానే యుండుట యన్నవాస్తవము అతనికి యథార్థము కాలేదు కావున ప్రతివ్యక్తికి అతడు గ్రహించుచున్న జగత్తే వానికి యథార్థము. ఈ జగత్తు యొక్క ఉనికి మనస్సుపైననే ఆధారపడియున్నది. "నేను" అను చైతన్యముతో మనస్సు మేల్కొనినంతనే యీ జగత్తు పుట్టుచున్నది ; ఇంద్రియములు సాధనములుగా మనస్సు పనిచేయుచున్నప్పుడు ఈ జగత్తుయొక్క వ్యవహారము జరుగుచున్నది. గాఢనిద్రలో గాని, గాఢసమాధిలో గాని మనస్సు లీనమైనప్పుడు ఇది కూడ లయము నొందుచున్నది. అనగా తనజగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు ప్రతివ్యక్తి తానే కారకుడైన యీశ్వరు డగుచున్నా డన్నమాట. అందువలన, తన మనస్సునందే సృష్టిస్థితిలయములను పొందుచున్న జగత్తును, చైతన్యమాత్రుడైన తనయందే, దృశ్యపరంపరామాత్రముగా ఎవడు చూచుచున్నాడో వాడు, నాటకమునందలి మనోహరదృశ్యములతోపాటు భయంకరదృశ్యములను కూడ రసాత్మకముగనే గ్రహించి ఆనందించు ప్రేక్షకుని వలె, నిరంతరము ఆనందమునే పొందుచుండును.

## గీత

ఈస్థితిని పొందగోరువారు తన్ను ఎట్లు ఆరాధింతురో చెప్పుచు భగవానుడు అర్జునుని కూడ ఆ పద్ధతినే అవలంబింపు మని బోధించుచున్నాడు. "మహాత్ములు యమనియమాదులతో దృఢవ్రతులై మనస్సును నాయందే నిలిపి భక్తితో నాకు నమస్కరించుచు నన్ను, కీర్తించుచు, ధ్యానించుచు నిరంతరము ఉపాసించుచుందురు. కొందఱు జ్ఞానయజ్ఞముచేత ఏకత్వముతో నన్ను పూజించుచు ఉపాసించుచున్నారు. మఱికొందఱు పృథక్త్వముతో బహువిధములుగా విశ్వతోముఖునిగా నన్ను ఉపాసించుచున్నారు"

శ్లో॥ సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః ।
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చా ప్యన్యే యజంతో మా ముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్ ॥ 15

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

# విజయప్రభ

ఇందు మూడు విధములైన యుపాసనలు చెప్పబడినవి. కొందఱు భగవంతుని యొక్క రూపమును ఎదుటగాని మనస్సులో గాని కల్పించుకొని దృఢసంకల్పముతో యమనియమాదుల నవలంబించి నమస్కరించుచు, అ॰ ా పూజించుచు ఆయనయొక్క యవతార చరిత్రములను భావించుచు పఠించుచు గానము చేయుచుందురు. కొందఱు ఇంద్రుడు ఆదిత్యుడు మొదలగు భేదములతో ఆ భగవంతుడే ఉన్నాడు అనుతలంపుతో, ఇంద్రుడే సర్వేశ్వరు డని, ఆదిత్యుడే పరమేశ్వరు డని, ఎవరియభిరుచిని బట్టి వారు ఒక్కొక్క దేవతామూర్తిని భగవంతునిగా ఉపాసించుచున్నారు మఱికొందఱు ఈ దేవతామూర్తులను పూజించుటను మాని సర్వాంతర్యామియు అద్వితీయమునైన పరబ్రహ్మమునే భగవంతునిగా భావించుచుండుటయే జ్ఞానయజ్ఞముగా ఉపాసించుచుందురు.

ఇంద్రాదిత్యాది దేవతలను, స్వర్గము ఆరోగ్యము మొదలగు పలములను గోరి ఉపాసించువారు కూడ భగవంతుని ఉపాసించినవారే అగుదురా ? మంత్రులను సేనాపతులను సేవించినచో మహారాజును సేవించినట్లు అగునా ? మంత్రులను సేనాపతులను సేవించువారికి వారియందు మంత్రులు సేనాపతులు అను బావనయే యుండును గాని మహారాజు అను భావన ఉండదు. ఇంద్రాదిత్యాది దేవతలను పూజించువారు అట్లు కాక భగవంతుడే ఇంద్రుని రూపముతో ఆదిత్యునిరూపముతో ఉన్నా డను భావముతో ఉపాసింతురు. "మాతృదేవో భవ ! పితృదేవో బవ" అను వేదముయొక్క అనుశాసనమునకు కూడ తల్లిరూపమున తండ్రిరూపమున బగవంతుడే ఉన్నాడు అను నిశ్చయముతో వారిని సేవించుచు భగవంతునే సేవించుచున్నట్లుగా బావింపవలయు ననియే తాత్పర్యము. సకలపదార్థములలో సర్వాంతర్యామియై భగవంతుడే వ్యాపించి యుండుటవలన, అన్ని రూపములు నామములు ఆయనవే అగుటవలన ఆయన విశ్వతోముఖుడు. కావున భగవంతుడు సర్వాంతర్యామి అను బావనతో భగవద్రూపమునుగా స్వీకరించి ఇష్టదేవతారూపముగా ఎవనిని ఆరాధించినను అది భగవదారాధనమే యగును.

ఈ యుపాసనాభేదములవలన ఫలములయందు కలుగు బేదములను కూడ గ్రహింపవలసియున్నది. ఇంద్రాదిత్యాదిదేవతలను భగవద్రూపులనుగా ఉపాసించుచు, ఫలములను కోరుచున్నచో అట్టివారు స్వర్గాదిలోకములకు పోయి ఆపుణ్యఫలమును

అనుభవించి తరిగివచ్చుచు పోవుచు అనేక జన్మలను పొందుచుందురు ఫలమును కోరక నిష్కామముగా భగవంతుని సేవించుచు నుండువారు చిత్తశుద్ధిని పొందుచు ధ్యానయోగమునకు జ్ఞానోపదేశమునకు అర్హులగుదురు. భగవంతుని అద్వితీయ పరబ్రహ్మమునుగా భావించుచు ఉపాసించువారు జ్ఞాననిష్ఠులై ముక్తు లగుదురు.

## గీత

జగద్వ్యవహారమును పూర్తిగా వర్జించి జగత్తు నందు అంతర్యామిగా నున్న భగవంతునే తప్ప అన్యమును గ్రహింపకుండ ఉపాసించుచుండు వారికి, ఈ లోకమున యోగక్షేమములు ఎట్లు జరుగును ? తల్లిదండ్రులను ఆశ్రయించియున్న పిల్లల యోగక్షేమములను తల్లిదండ్రులు చూతురు. బిడ్డలను ఆశ్రయించుకొనియున్న తల్లిదండ్రుల యోగక్షేమములను బిడ్డలు చూతురు. సంపన్నులనో దేవతలనో భజించువారి యోగక్షేమములను ఆసంపన్నులో ఆయాదేవతలో చూతురు. ఇట్టి యాశ్రయముల నన్నింటిని వదలి భగవంతునే భజించువారి యోగక్షేమములను ఎవరు చూతురు "ఇతరులను ఎవ్వరిని ఆశ్రయింపక నాయందే మనస్సును ఉంచి నిత్యము నన్నే చింతించుచు ఎవరు ఉపాసించుచున్నారో వారియోగక్షేమములను నేను వహించుచున్నాను" అను భగవంతుడు ఉద్ఘాటించుచున్నాడు.

శ్లో|| అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే|
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్ || 22

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - భగవద్గీతాయామ్ - అధ్యా. 9

## విజయప్రభ

భగవంతుని యీవాక్యమునందు నమ్మకము కుదురుట సులభము కాదు. దృఢమైన నమ్మక మున్నచో భగవంతుని రక్షణము సంభవించుట నిశ్చితమే. శ్రీరామతీర్థస్వామియొక్క శిష్యులు కొందఱు, "మనప్రయత్నముల నన్నింటిని వదలి దేవుడా నీవే దిక్కు" అని యూరకున్నచో ఆదేవుడే వచ్చి మన యాకలిదప్పులను తీర్చునా" అని ప్రశ్నించిరి. "మనకు అంతటి దృఢవిశ్వాస మున్నచో భగవంతుడు కూడ మనయందు శ్రద్ధ కలిగియే యుండును" అని ఆయన దృఢముగా చెప్పి మీకు ఈవిషయమును నిరూపింతు ననెను. అట్లయినచో వెంటనే నిరూపింపు డని వారు ఆయనను ప్రార్థించిరి. ఆయన ఇట్లనెను. "అట్లే నిరూపింతును. మనము రేపు యాత్రకు బయలుదేరుదము , మీ రందఱు భగవంతుడు గావించిన వాగ్దానమును దృఢముగా నమ్ముచున్నారు గదా !" వారందఱు, "ఔను ! మేము దృఢముగా నమ్ముచున్నాము" అనిరి. ఆయన, "అట్లయినచో ఇంక మనకు డబ్బుతో పని యే మున్నది. అన్నింటికిని ఆ

భగవంతుడే యున్నాడు, కాబట్టి మీ రెవ్వరును డబ్బు తీసుకొని రావద్దు" అని చెప్పెను అట్లే అని అంగీకరించి వారి మఱునాడు ఆయన చెప్పిన సమయమునకు బయలుదేరిరి. కొంతదూరము పోయిన తరువాత త్రోవలో నున్న నదికి వరదలు వచ్చిన వని రైలులో పోక తప్ప దని తెలిసినది అందువలన వారు గత్యంతరము లేక భార మంతయు భగవంతునిపై వైచి టిక్కెట్లు లేకుండనే రైలులో ఎక్కిరి రైలు ఆనదిపై పోవుచుండగా రామతీర్థస్వామి శిష్యుల సంచులను జేబులను పరీక్షించెను. వారిలో కొందరు రహస్యముగా కొంత డబ్బును దాచి తెచ్చికొనియుండిరి. దానినంతయు ఆయన ప్రోవుచేసి చేతిరుమాలులో కట్టి "భగవంతుని శరణుపొందినవారికి డబ్బుతో నేమి పని?" అని నదిలో "కృష్ణార్పణ" మని విసరివైచెను ఇంతలో టిక్కెట్ కలెక్టరు వచ్చి వీరి దగ్గర టిక్కెట్లు లే వని తెలిసికొని మర్యాదగా ప్రక్క స్టేషనులో దిగిపొం డని చెప్పెను. అట్లే వీరు ప్రక్క స్టేషనులో దిగిరి అప్పటికి మధ్యాహ్నకాల మయ్యెను. అందఱు ఆకలితో అలమటించుచుండిరి. "మనయాకలి దప్పికలను భగవంతుడే కదా తీర్పవలె. కాబట్టి ఆయననే భజింతము" అనిరామతీర్థుడు స్టేషను యొక్క ఆవరణములోనే ఒక చెట్టుక్రింద వారినందఱను కూర్చుండు డని సంకీర్తనమును ఆరంభించెను. ఓపిక ఉన్నను లేకున్నను వారు కూడ భజన చేయుచుండిరి

కొంతసేపైన తరువాత ఒకడు పెద్దగంపలో ఆహారపదార్థములను పానీయములను గైకొని వడివడిగా అచ్చటికి వచ్చెను రామతీర్థుడు "ఎవరయ్యా! నీవు ; ఎందులకు ఇక్కడికి వచ్చితివి?" అని అతని నడిగెను. అతడు వినయముతో ఆయనకు నమస్కరించి, "మా శ్రేష్ఠిగారు తీర్థయాత్ర చేయుచు ఇక్కడికి వచ్చినారు. ఇచ్చట దేవాలయమున స్వామికి అర్చన చేయించి వెలుపలి మండపమున స్వామిని ధ్యానించుచు విశ్రమించినారు. ఆధ్యానమునందు స్వామి వారికి గోచరించి, "రైల్వే స్టేషనులో నాభక్తులు భజన చేయుచున్నారు , నీవు వెంటనే వారికి ఆహారపానీయములు సమకూర్పు" మని ఆదేశించెను, వెంటనే వారు లేచి తాము వచ్చుటకు ఆలస్య మగునేమో అని ఈ పదార్థములను ఇచ్చి ముందుగా నన్ను తఱిమినట్లుగా పంపిరి, నేను వారి భృత్యుడను , భగవంతుడు చెప్పినభక్తులు మీరే యని అనుకొనుచున్నాను ; దయచేసి మీరు వీనిని స్వీకరింపుడు , మా యజమాని కూడ పరువెత్తినట్లుగా వచ్చుచున్నాడు , ఇంక మీరు వీనిని ఉపయోగింపుడు" అని బ్రతిమిలాడ జొచ్చెను. ఆయజమాని కూడ వచ్చి వారిని అట్లే ప్రార్థించెను. అప్పుడు వారు తృప్తిగా భుజించి, ఆ శ్రేష్ఠియొక్క సాహాయ్యమున స్వగ్రామమునకు క్షేమముగా చేరిరి. కావున మనకు భగవంతునియందు దృఢవిశ్వాస మున్నచో మనయోగక్షేమములను ఆయన ఎప్పుడును విస్మరింప డనుట స్పష్టము.

మఱియును ఇతరదేవతలను ఆరాధించుటకంటె సర్వేశ్వరుని ఆరాధించుట ఎంతో సులభము. ఇంద్రాదిత్యాదిదేవతలను ఆరాధించునప్పుడు ఆయాదేవతలకు ప్రీతికరములైన సమయములలో పదార్థములతో నియమములతో ఎంతో శ్రమపడవలసియుండును. ఫలాపేక్ష లేకుండ భగవంతుని ఆరాధించునప్పుడు భక్తిపూర్వకముగా మనము ఒక్కపండు నిచ్చినను, అదియు లేకున్నచో పుష్పమునో, తులసీదళమువంటి పత్రమునో, జలమునో శుచిగా ఇచ్చినచో ఆయన స్వీకరించును. ఆయన సులభమైన మఱియొక ఉపాసనావిదానమును కూడ నిర్దేశించుచున్నాడు. దీనికొక పూజావిధానమే లేదు. "నీవు ఏ పనిని చేయుచున్నను, దేనిని తినుచున్నను, దేనిని హోమము చేయుచున్నను, దేనిని దానము చేయుచున్నను, ఏదేని తపస్సు చేయుచున్నను వానిని అన్నింటిని నాకు అర్పింపుము. నీవు కావించుచున్న కర్మలు శుభము లైనను, అశుభములే అయినను ఫలరూపములైన యాకర్మయొక్క బంధములనుండి నీవు విముక్తుడవు కాగలవు. సర్వకర్మ ఫలార్పణ రూపమైన యీ సన్న్యాసయోగమును పొందినవాడు విముక్తుడై నన్ను పొందగలడు"

శ్లో|| పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి |
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః || 26

శ్లో|| యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ |
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ || 27

శ్లో|| శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః |
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి || 28

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యా 33

ఆయన ఈ యుపదేశమునే భంగ్యంతరమున ఇట్లు చెప్పుచున్నాడు "నాయందు మనస్సు కలవాడవు, నా భక్తుడవు, నన్ను గూర్చి యజ్ఞములు చేయువాడవు అగుము. నాకు నమస్కరింపుము. ఈవిధముగా చిత్తసమాధానము నొంది నన్నే పరమగతినిగా పొంది నన్ను చేరగలవు"

శ్లో|| మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు |
మా మే వైష్యసి యుక్త్వై వ మాత్మానం మత్పరాయణః || 34

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

ఈయభిప్రాయమునే భగవానుడు, "సర్వధర్మములను పరిత్యజించి నన్ను ఒక్కనినే శరణము పొందుము" అని తుది మాటనుగా చెప్పి యుపదేశమును ముగించినాడు. కావున ఇది ఈయుపదేశమున కంతకును సారాంశ మనుట స్పష్టము.

ఈ సందర్భముననే ఆయన ఒక హెచ్చరికను చేయుచున్నాడు. "అనిత్యము అసుఖము అయినలోకమును దీనిని పొంది నన్ను భజింపుము" (అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్ 33 - 33) ఇట్లనుట వలన ఈలోకము అశాశ్వత మని, సుఖరహిత మని, ఇందులకు విరుద్ధముగా తనస్వరూపము శాశ్వతమైన దని సుఖాత్మక మని, కావున తన్ను పొందు మని ఆయన స్పష్ట మొనర్చుచున్నాడు. ప్రతివ్యక్తి తాను సుఖముగా శాశ్వతముగా నుండవలె నని అభిలషించుచున్నాడు. ఇక్కడ లబించుచున్న దానికంటె అదికమైన సుఖము చిరకాలము లబించు నని తోచినంతనే, వేదములను విశ్వసించువాడు, యజ్ఞాదులను చేసి స్వర్గాదిలోకములకు పోవలయు నని, ఈశరీరమును వదలుకొనుటకు సైతము సిద్ధపడుచున్నాడు. కావున ఎవ డైనను భగవంతుని బజింపవలయు నన్నచో ఈలోకము, ఈ మనుష్యశరీరము చాల క్షణిక మని, ఇక్కడ అప్పుడప్పుడు లభించు సుఖముల కంటె, పిడుగులవలె పైబడు దుఃఖములే అధిక మని, బగవంతుని స్వరూపము శాశ్వతమైన దని, స్వర్గాదులయందు లభించు సుఖముకంటె చాల అధిక మని అపరిమిత మని ముందుగా నమ్మవలసియున్నది. ఆ నమ్మకము లేకున్నచో భగవంతుని ఆశ్రయించుట కుదురదు. సకలభోగసంపన్నమైన మహాభవనము లబించు నని రూఢిగా తెలిసికొన్నచో ఎవ్వ డైనను చిన్నయింటిని సులబముగా వదలుకొని ఆబవనమునకు చేరుటకు కష్టపడి యైనను ప్రయత్నించును. ఈలోకమునందలి యైశ్వర్యసంపదలను తృణప్రాయముగా తలంచుచు ఎట్టిపరిస్థితియం దైనను బగవంతునే భజించుచుండిన త్యాగరాజు, రామదాసు, తుకారము, తులసీదాసు, కబీరు మొదలగు మహాభక్తుల దృష్టాంతములవలన ఈలోకము అశాశ్వత మని, సుఖరహిత మని బగవంతుని స్వరూపము శాశ్వతము సుఖాత్మకము అని గ్రహింపవలె.

## (iv) విశ్వరూప దర్శనము

## గీత

ఆట పాటలయందు ఆసక్తుడై యున్న విద్యార్థికి, విద్యావిజ్ఞానములవలన పెద్ద యుద్యోగము కీర్తి సంపద మహాభోగములు లభించు నని దృఢముగా తోచిననే తప్ప వాడు ఆటపాటలను వదలి విద్యాసముపార్జనకై పూనుకొనడు అట్లే బగవంతుని స్వరూపము అమృతానందమే అను విశ్వాసము రూఢముగా ఏర్పడిననే తప్ప ఆయనను భజించుట కుదరదు. అందువలన భగవానుడు, "నేను సర్వజగత్తునకు ప్రభవస్థానము ; నా వలననే సర్వము ప్రవర్తించుచున్నది అని తెలిసికొని పండితులు అట్టిభావనతో నన్ను బజించుచున్నారు. అట్లు ప్రీతిపూర్వకముగా సతతము నన్ను భజించువారికి

నేనుబుద్ధియోగము నొసంగుచున్నాను, దానితో వారు నన్ను చేరుచున్నారు," అని చెప్పి అర్జుననీయందు భగవంతుని స్వరూపమును తెలిసికోవలయు నను కుతూహలమును కలిగించెను. అప్పుడు అర్జునుడు, "ఋషులు దేవర్షియైన నారదుడు. అసితుడైన దేవలుడు వ్యాసుడు నిన్ను పరబ్రహ్మముగా చెప్పుచున్నారు అది సత్యమే అని తలంచుచున్నాను, నీ ప్రబావమును దానవులు దేవతలు గ్రహింపలేకున్నారు నీస్వరూప మేమో నీకే తెలియును. ఏమాహాత్మ్యవిశేషములచేత ఈలోకములను వ్యాపించియున్నావో, ఏ యే బావములయందు నిన్ను చింతించుచు నేను తెలిసికొనగలనో ఆ విభూతి విశేషములను నీ యైశ్వర్య యోగమును విపులముగా చెప్పుము" అని యడిగెను

అర్జునుని కుతూహలమును గమనించి భగవానుడు ఆ యా జాతులలో వర్గములలో అగ్రగణ్యములై ప్రధానములై విశేషములను, "ఆదిత్యులలో నేను విష్ణువును" అని మొదలు పెట్టి పెక్కింటిని చెప్పి తుదకు ఇట్లనెను. "లోకమున ఏది ఏది మహాత్మ్యమహితమో, శ్రీమంతమో, బలోత్సాహసమన్వితమో అది యంతయు నాతేజము యొక్క అంశమువలననే సంభవించుచున్న దని యెఱుంగుము లేదా, ఇన్ని విశేషము లెందులకు ? ఈ సర్వజగత్తును నాయందలి యొక్క యంశము చేత నిలిపియున్నాను".

శ్లో|| యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా|
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజో ఽంశ సంభవమ్|| 41

శ్లో|| అధవా బహు నైతేన కిం జ్ఞాతేన తవార్జున|
విష్టభ్యా మహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్|| 42

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యా. - 34

ఈ బూతము లన్నియు భగవంతునియొక్క ఒకపాదమే (పాదో ఽస్య విశ్వా బూతాని - పురుషసూక్తము) అని వేదము చెప్పినట్లు బగవంతుని యందలి యొక్క పాదమే, అనగా నాల్గవవంతే, విశ్వముగా గోచరించుచున్న దని, అభివ్యక్తము కాకుండ, (unmanifest) ఆయన స్వరూపము ఇంకను మూడువంతులు ఉన్న దని స్పష్ట మగుచున్నది.

ఈ మహిమాతిశయమును విని అర్జునుడు, "నేను చూడగలుగుదు నేని విభూతి మహితమైన నీ పరమేశ్వరరూపమును చూపుము" అని కృష్ణుని ప్రార్థించెను. కౌరవుల సభలో ఆయన విశ్వరూపమును ప్రదర్శించె నని అర్జునుడు వినియుండుట వలన తాను కూడ ఆరూపమును చూడ వలయు నని అభిలషించియుండును.

భగవంతుడు పార్థుని ప్రార్థనమును మన్నించి, "చరాచరమైన సమస్త జగత్తును, నీవు చూడదలచుకొన్నది యేదియైనను, ఇక్కడ నాదేహమునందు చూడుము" అని దివ్యదృష్టి నొసంగెను. అట్టి దివ్యదృష్టినే వ్యాసభగవానునివలన పొందిన సంజయుడు చెప్పినట్లుగా, ఒక్కసారిగా వేయిమంది సూర్యులు పైకివచ్చినచో ఎంత కాంతి యుండునో అంతకాంతి భగవంతుని దేహమునుండి బయలుదేరి భూనభోంతరముల యందు వ్యాపించెను. దానియందు అర్జునుడు వేయి బాహువులతో వందలకొలది శీర్షములతో నేత్రములలో ఉదరములలో అన్ని వైపులకు వ్యాపించియున్న మహోన్నతమైన భగవంతుని రూపమును చూచెను. శీర్షములపై కిరీటములు, హస్తములలో గదాచక్రాద్యాయుధములు కన్పించుచుండెను. చంద్రసూర్యులు ఆయనకు నేత్రములవలె నుండిరి. దంష్ట్రలచే భయంకరములు గానున్న వక్త్రములయందు అగుట జ్వలించుచుండెను. ఆదేహమునందే బ్రహ్మాదిదేవతలను, మహర్షులను సర్పములు మొదలుగా సర్వభూతములను, ఆ యాలోకముల విభాగములతో, విస్పష్టముగా జగత్తు అంతయు అర్జునునకు ఒక్కచోటనే కన్పింపజొచ్చెను. అద్భుతము ఉగ్రమునైన ఆ విశ్వరూపమును చూచుచు మూడులోకములు కంపము నొందజొచ్చెను. వసురుద్రాదిత్య గంధర్వయక్షరాక్షసాదుల సంఘములు విస్మితములై ఆయనను చూచుచుండగా, దేవతలు కొందఱు భీతులై ప్రాంజలులై ప్రార్థించుచుండిరి. మహర్షి సిద్ధసంఘములు "స్వస్తి, స్వస్తి" అని పలుకుచు పుష్కలములైన స్తోత్రములతో స్తుతించుచుండిరి. ఆరూపమును చూచుచున్న యర్జునుడు ధైర్యహీనుడై శాంతిని సుఖమును పొందలేక దిక్కుతకోచక దీను డయ్యెను.

"నీవు చూడదలచుకొన్నది యేది యైనను ఇందు చూడుము" అని భగవంతుడు ముందే చెప్పియుండెను" మేము జయింతుమో లేక దుర్యోధనాదులే మమ్ము జయింతురో (యద్వా జయేమ యది వా నో జయేయుః) అని శంకించుచుండిన యర్జునుడు ఆసమయమున యుద్ధముయొక్క పర్యవసానమును తెలిసికొన దలంచుట సహజము. అందువలన అతని యభిప్రాయమును గ్రహించి భగవానుడు ఆ పర్యవసానదృశ్యమును ప్రముఖముగా ప్రదర్శించెను. దుర్యోధనాదులు, భూభారమును తగ్గించుటకై మనుష్యలోకమున అవతరించిన దివ్యులైన భీష్మద్రోణకర్ణాదులు, పాండవుల పక్షము నందున్న మహాయోధులతో కూడ భూపాలసంఘములతో సత్వరముగా దంష్ట్రలతో భయంకరములైయున్న భగవంతుని వక్త్రములలో ప్రవేశించుచుండిరి. కొందఱు ముద్దలుగా నైన శీర్షములతో దంతములయందు చిక్కుకొనుచుండిరి. మిడుతలు గుంపులు గుంపులుగా జ్వలించుచున్న యగ్ని యందు వేగముతో వచ్చి దూకునట్లు, వరదలతో ఉరువడించుచున్న నదులు సముద్రములో పోయిపడునట్లు , మహావీరు లందఱు సైన్యవాహినులతో భగవంతుని వక్త్రములయందు జొఱబడుచుండిరి. ఆయన వారి నందఱను మ్రింగుచు చప్పరించుచుండెను.

దీని నంతను చూచుచున్న యర్జునునకు భగవంతుని వక్త్రములయందు ప్రవేశించుచున్న వారిలో తాను తన సోదరులు కొందఱు లేకుండుచే జయము తమదే అగు నని తెలియుచున్నను, ఇంతమందిని మ్రింగుచున్న యీాయన ఎవరు అను సందేహాము ప్రబలమయ్యెను., అందువలన అర్జునుడు భయముతో భక్తితో ప్రణమిల్లుచు, "పరమేశ్వరా ! ప్రసన్నుడ వగుము ఇంత యుగ్రరూపుడవైన నీవు ఎవరు ? ఏమి చేయ బూనుకొంటివి ?" అని అడిగెను.

భగవంతు డిట్లనెను. "నేను కాలుడను, లోకక్షయకరుడనై ప్రవృద్ధి నొందుచున్నాను. ఇచ్చట ఈ లోకుల నందఱను హరించుటకు పూనుకొనియున్నాను. నీవు లేకున్నను, ఈ సైన్యములలో యిరువైపుల యందును సన్నద్ధులై నిలిచియున్న యోధు లెవ్వరును ఇంక ఉండరు. వీ రందఱు ఇంతకుముందే నాచే నిహతు లైనారు. కావున నీవు నిమిత్తమాత్రముగా శత్రువులను జయించి సమృద్ధమైన రాజ్యమును పొందుము. లెమ్ము ; యశస్సును పొందుము. నాచెతనే చంపబడిన యీా భీష్మాదులను సంహరించుటకు వ్యధ యెందులకు ? వీరి నందఱను వధింపుము. నీవే విజేత వగుదువు"

భగవంతుడు ఇట్లు చెప్పినను, ఆ యుగ్రరూపమును చూచుచున్న యర్జునునకు భయము పోలేదు. అతడు వణకుచు అంజలించుచు మాటిమాటికి నమస్కరించుచు భీతిచేత మాట తొట్రుపడుచుండగా భగవంతుని అనేక విధముల ప్రశంసించుచు ప్రార్థించుచు ఇట్లనెను. "ఆదిదేవా! పరమేశ్వరా! అనంతరూప ! ఎదురుగా వెనుక వైపున అన్ని వైపులను నీకు నమస్కరించుచున్నాను నీ యీా మహిమ నెఱుంగక, "కృష్ణా! యాదవ ! మిత్రమా !" అని నిన్ను లెక్కపెట్టక పొరపాటున గాని స్నేహాముచే గాని, పరిహాసము కొఱకు గాని, విహారశయ్యాసనభోజనాదులయందు నీ సమక్షమున గాని పరోక్షమున గాని మన్నన లేకుండ చేసిన చేష్టలను పలికిన మాటలను క్షమింపుము. చరాచరమైన యీా లోకమునకు నీవు తండ్రివి, నీ ప్రభావము సాటి లేనిది. కావున దేహామును వంచి ప్రణమిల్లి ప్రార్థించుచున్నాను పుత్త్రుని తప్పులను తండ్రివలె, స్నేహితుని యపరాధములను మిత్రునివలె ; ప్రియురాలినేరములను ప్రియునివలె నాదోషములను సహింపుము అపూర్వమైన నీయీారూపమును చూచుచు హర్షముతోపాటు భీతిచేత వ్యధను కూడ పొందుచున్నాను. నన్ను అనుగ్రహించి చతుర్భుజములతో ప్రసన్నమైన రూపమును పొందుము"

భగవంతు డిట్లనెను. "అర్జునా ! నీయందు ప్రసన్నుడనగుటచేతనే, నీచేత తప్ప ఇంతరు లెవ్వరిచేతను చూడబడని యీా విశ్వరూపమును ఈశ్వరత్వ సామర్థ్యముచేత నీకు చూపితిని. వేదాధ్యయన యజ్ఞదాన తపస్సంపన్నులైన వారికి కూడ ఈరూపమును చూచుట శక్యము కాదు. భయము నొందకుము. నీవు కోరుచున్న రూపమునే చూడుము".

ఇట్లనుచు భగవంతుడు సౌమ్యమైన పూర్వరూపమును పొంది అర్జునుని ఓదార్చెను అతడు స్వస్థచిత్తుడైన తరువాత ఆయన మరల ఇట్లనెను. "అర్జునా ! నీవు

చూచిన యీ విశ్వరూపము ఎంతగా తపోదానయజ్ఞాదులను గావించినను దర్శించుటకు శక్యము కాదు అనన్యమైన భక్తిచేతనే నన్ను ఈ విధముగా తెలిసికొనుటకు, సాక్షాత్కరించుకొనుటకు, తత్త్వస్వరూపముతో నన్ను పొందుటకు శక్య మగును. నాకొఱకు కార్యములను చేయుచు, నన్నే పరమగతినిగా తలంచుచు నాకు భక్తుడై, సంగరహితుడై సర్వభూతములందును వైరమును వీడిన వాడు నన్ను పొందును"

## విజయప్రభ

ఇందు గ్రహింపవలసినయంశములు అనేకములు కలవు శ్రీకృష్ణుడు దివ్యదృష్టి నొసంగినా డనగా అర్జునుని నేత్రేంద్రియమునకు విశేషమైన శక్తిని తాత్కాలికముగా నొసంగి తరువాత దానిని ఉపసంహరించినా డని గ్రహింపవలసియున్నది.

"నన్ను అనుగ్రహించి చతుర్భుజములతో ప్రసన్నమైన రూపమును పొందుము" అని శ్రీకృష్ణుని అర్జునుడు ప్రార్థించుట మొదటి విషయము. ఆయన అర్జునునకు ఎల్లప్పుడును నాలుగు భూజములతోనే కన్పించుచున్నాడా అని సందేహాము కలుగును. శ్రీకృష్ణనిర్యాణము తరువాత అర్జునుడు వ్యాసునియొద్దకు పోయి దుఃఖించుచు ఇట్లనెను. "అయ్యా ! అప్రమేయాత్ముడు శంఖచక్రగదాధరుడు చతుర్భుజుడు పీతవాసుడు అయిన పురుషుడు ఇంతకు ముందు నారథమునకు ముందు పోవుచు శత్రుసైన్యములను నిర్దహించుచున్నట్లు కన్పించెడివాడు. ఆ పురుష డిప్పుడు కన్పించుట లే దేమి?" అని యడిగెను దీనిని బట్టి యుద్ధములయందు పూర్వము శ్రీకృష్ణుడు చతుర్భుజుడై అర్జునుని రథమునకు ముందు రక్షకుడుగా కన్పించుచుండె నన్నమాట. ఇప్పుడు కూడ అట్లే చతుర్భుజుడవుగా రథముముందు కన్పించుచుండు మని అర్జునుడు ప్రార్థించుచున్నాడు.

దీనినిబట్టి రథమునందు సారథిగా, ఆహారవిహారసమయములందు, శ్రీకృష్ణుడు అర్జునునితోపాటు లోకులకు కూడ రెండు భుజములతోనే కన్పించుచుండె ననుట స్పష్టము. రథమునకు ముందు చతుర్భుజుడుగా అర్జునునకు మాత్రము కన్పించుచుండె నన్నమాట. అప్పు డాయన శత్రుసైన్యములను దహించుచున్నట్లు కన్పించుచుండుట కూడ అర్జునునకు దృశ్యమాత్రముగానే గోచరించుచు అతనికి ఉత్సాహమును కలిగించుచుండెనే కాని సైన్యములకు కన్పించుట లేదు అట్లు కన్పించినచో సైన్యములయందు హాహాకారములు బయలుదేరి యుండును. అనేక బాహువులతో నేత్రములతో భయంకరమైన రూపముతో సైన్యమునకు ముందు కూడ కన్పింపక నాలుగు భుజములతో తనకు కన్పించుచుండు మని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రార్థించుచున్నాడు. రెండు బాహువులు కలిగిన శ్రీకృష్ణునిరూపముకంటె నాలుగు బాహువులరూపమే అర్జునునకు మనోహరముగా నుండె నని గ్రహింపవలసియున్నది.

కృష్ణార్జునులు ఇరువురు రథముపై కూర్చుండియే మాటాడుకొనుచున్నారు. రథమునకు వెనుకభాగమున అర్జునుడు విషాదముతో కూర్చుండె నని (రథోపస్థ ఉపావిశత్)ముందే చెప్పబడియున్నది. సారథియైన కృష్ణుడు కూడ కూర్చుండియే యుండెను. విశ్వరూపమును చూపునప్పుడు ఆయన లేచినిలుచుండి సంరబమునొందినట్లు చెప్పబడలేదు కావున ఆయన ప్రశాంతముగ కూర్చుండియే సంకల్పమాత్రమున ఆరూపమును సృష్టించెననుట స్పష్టము చలనచిత్ర యాంత్రికుడు (Cinema Operator) మీట నొక్కినంతనే చిత్రప్రసారము జరుగునట్లు భగవానుడు సంకల్పము గావించినంతనే అనాయాసముగా ఆయనయందే విశ్వరూప చిత్రప్రసారము జరిగెను.

వివిధదేశముల యాకృతులను, వానియందు ప్రముఖములైన నదీనదసముద్ర పర్వతారణ్య విశేషములను, నగరములను ప్రభుత్వాధినేతలను రేఖలతో ప్రపంచ చిత్రపటమును ప్రదర్శించుట ఎట్టిదో విశ్వరూప ప్రదర్శనము కూడ అట్టిదే. దీనియందు వివిధలోకములతో, లోకపాలకులతో ఆ లోకములలో నివసించు దేవదానవ యక్షరాక్షసాది సంఘములతో విశ్వముయొక్క ఆకృతి సంక్షేపముగా ప్రదర్శింపబడుటయే కాక, అది యంతయు భగవంతునియందే ఉన్నట్లు చూపబడెను దీనివలన భగవంతుడు విశ్వమయుడు, విశ్వ మంతయు ఆయనయందే యున్నది , ఆయనకంటె బిన్నమైన పదార్థము (Matter) పరమాణువు కూడ లే దను విషయము స్పష్టముగ గోచరించును.

కం|| హరిమయము విశ్వ మంతయు
హరి విశ్వమయుండు సందియము పని లే దా
హరిమయము కాని ద్రవ్యము
పరమాణువు లేదు లోకపావన వింటే ఆంధ్రభాగవతము

విశ్వరూపమున అర్జునుడు బయంకరదృశ్యములను చూచుచు భీతుడు ప్రవ్యథితుడును అయ్యె నన్నచో భగవత్స్వరూపము కేవలము ప్రసన్నమైన దయామూర్తియే కా దని మహోగ్రమూర్తియు అగునని సృష్టిలోని మహాభయంకరములైన సర్ప వ్యాఘ్రసింహాదులు, అమిత్రక్రూరులైన యసురరాక్షసాదులు కూడ భగవద్రూపములే యని, సృష్టివలె, స్థితివలె, ప్రళయ మొనర్చుట కూడ ఆయన లీలయే అని గ్రహింపవలసియున్నది. నాటకమునందు శృంగార దృశ్యములతోపాటు కరుణాత్మకములు భయానకములును అయిన దృశ్యములను కూడ చూచుచు అన్నింటియందును రసమునే ఆస్వాదించుచు తన్మయత్వమును పొందుప్రేక్షకునివలె భగవత్స్వరూప తత్త్వమును ఎఱింగిన జ్ఞాని సకలవిశ్వమును వివిధరసాత్మకమైన మహానాటకమువలెనే చూచుచు ఆనందించుచుండును.

బీష్మాదులు ముందే నిహతులై యున్నారనుట వలన, వా రందఱు, పోగాలము దాపురించి, కాలవశమున తేజోహీనులై మృతప్రాయులై యున్నా రని గ్రహింపవలె.

"అర్జునా నీవు నిమిత్తమాత్రుడవే అగుము" నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్" శ్లో. 33) అని భగవానుడు నిర్దేశించుటవలన, "కాలవశమున భీష్మాదులను జయింప గలుగునప్పుడు నీవు ఎట్లు నిమిత్తమాత్రుడవో, దైవము ప్రతికూలమై నీవు ఓడింపబడునప్పుడు కూడ నీవు నిమిత్తమాత్రుడవే, కావున జయమునకు ప్రహర్షమును, పరాజయమునకు విషాదమును పొంద నక్కఱలే" దని భగవానుడు సూచించుచున్నాడు.

"ఉగ్రమైన యీరూపమును ఉపసంహరింపుము ; సౌమ్యమైన రూపముతో కన్పింపుము" అని అర్జునుడు ప్రార్థించె నన్నచో జ్ఞానులు తప్ప సామాన్యులు సృష్టిలోని భయంకర దృశ్యములయందు కూడ ఆనందమే యైన భగవత్స్వరూపమును గ్రహింప లే రని స్పష్ట మగుచున్నది. భృగుమహర్షి తపస్సు చేసి జగత్కారణమైన బ్రహ్మము ఆనందమే అని తెలిసికొనెను. (ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ - తైత్తిరీయము)

"నే నిప్పుడు ప్రసన్నుడనై నీకు చూపిన యీరూపమును ఇతరు డెవడును చూచియుండ లేదు". (త్వ దన్యేన న దృష్టపూర్వమ్ - శ్లో. 47) అని భగవానుడు చెప్పుట గమనింపదగియున్నది. మఱి ఆయన ఇంతకుపూర్వము కౌరవసభలో విశ్వరూపమును చూపియుండలేదా ? నిజమే కాని ఆరూపమునకు దీనికిని భేదము చాల కలదు. దానికంటెను ఇది అనేకవిధముల ఉజ్జ్వలము, సమగ్రము. అందువలన ఇట్టి విశ్వరూపమును ఇతరు లెవ్వరును చూచియుండ లేదనుట యథార్థమే.

"సకల భూతములయందు ఎవడు వైరభావరహితుడై యుండునో వాడు నన్ను పొందును" అని భగవానుడు చెప్పుటవలన భగవద్భక్తుడు తనకు అపకారకములైన భూతములయందు కూడ భగవత్స్వరూపమునే భావించుచు, వ్యవహారమునందు ధర్మమును మాత్రమే అవలంబించి శిష్టరక్షణము దుష్టశిక్షణము చేయుచుండవలయు నని స్పష్టమగుచున్నది.

అర్జునునకు ధ్యానయోగమునందు ప్రబలమైన యాధారముగా ఉపయోగపడుటకు విశ్వరూపమును ప్రదర్శించినను, అది మహోజ్జ్వలమైన దృశ్యమాత్రమే కాని తన యథార్థమైన రూపము కా దని తన తత్త్వమును భగవానుడే ముందే స్పష్టముగా నిరూపించియున్నాడు. తన విభూతి విశేషములను చెప్పుటకు ప్రారంభించినప్పుడు మొదటనే ఆయన తనస్వరూపమును ఇట్లు నిరూపించెను. "సకల భూతములయొక్క హృదయములందున్న ఆత్మను నేను. భూతములకు ఆది, మధ్యము అంతము నేనే".

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః |
అహ మాది శ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ || 20

అధ్యాయః - 34

తాత్కాలికముగా మనము ధ్యానయోగమునకు ఆలంబముగా భగవంతుని విశ్వరూపమును భావించుచున్నను, క్రమముగా వేదాంతవాక్యములను పెద్దలవలన గ్రహించి విచారించుచు భగవత్స్వరూపమును నిర్విశేషము అద్వితీయమునైన బ్రహ్మముగానే గ్రహింపవలయు ననుట స్పష్టము.

# గీత

"సకల భూతములయొక్క హృదయములందున్న ఆత్మను నేను. భూతములకు ఆది మధ్యము అంతము నేనే". (34 - 20) అని చెప్పుటకు పూర్వము భగవంతుడు అనేకవిధములుగా తన స్వరూపమును నిరూపించి యున్నాడు. "యోగమును పొందిన మనస్సుతో ఎల్లయెడల సమమునే దర్శించుచున్న వాడు, తన్ను సర్వభూతములందు ఉన్నవానినిగా, తనయందు సకలభూతములు ఉన్నట్లుగా చూచును".

శ్లో|| సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని|
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రా సమదర్శనః || 30 - 29

"నాకు రెండు ప్రకృతులున్నవి. పంచభూతములు మనస్సు బుద్ధి, అహంకారము అని ఎనిమిది విధములుగా నున్నది అపరప్రకృతి. దీనికంటె అన్యముగా జీవరూపమై ఈ జగత్తు నంతను ధరించుచున్నది పరప్రకృతి".

శ్లో|| భూమి రాపో౽నలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ|
అహంకార ఇ తీయం మే భిన్నా ప్రకృతి రష్టధా || 31 - 4

శ్లో|| అప రేయ మితి స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్|
జీవభూతాం మహాబాహో య యేదం ధార్యతే జగత్|| 31 - 5

"ఈ జగత్తు అంతయు అవ్యక్తమూర్తిని అయిన నాచేత వ్యాప్తమై యున్నది"

శ్లో|| మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా || 33 - 4

తరువాత కూడ పదమూడవ యధ్యాయమునందు తనస్వరూపమును ఇట్లు ఆయన నిరూపించినాడు. "కౌంతేయ! ఈ శరీరము క్షేత్ర మని చెప్ప బడుచున్నది. దీనిని తెలిసికొనినవానిని క్షేత్రజ్ఞుడు అని తత్త్వవేత్తలు చెప్పుదురు. సర్వక్షేత్రములందు నేనే క్షేత్రజ్ఞుడనై యున్నా నని యెఱుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే జ్ఞాన మనుట నా మతము".

శ్లో|| ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మి త్యభిధీయత్|
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః || 37 - 2

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ। 37-3.

"ప్రకృతిని పురుషుని కూడ ఇద్దఱిని అనాదియైన వారినిగా ఎఱుంగుము. వికారములను గుణములను ప్రకృతినుండి సంభవించిన వానినిగా నెఱుంగుము".

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ వి ద్ధ్యనాదీ ఉభా వపి।
వికారాం శ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్॥ 37-20

## విజయప్రభ

పై వాక్యములను బట్టి అచేతనమైన యొక పదార్థమే, సకలభూతములుగా, ఎనిమిది విధములైన ప్రకృతిగా, జగత్తుగా, క్షేత్రముగా ప్రకృతిగా చెప్పబడుచున్న దని స్పష్ట మగుచున్నది. అట్లే ఒక్క చైతన్యమే సకలభూతముల హృదయములందు ఉన్న ఆత్మగా, జగత్తును ధరించుచున్న జీవభూతమైన పరాప్రకృతిగా జగత్తునంతయు వ్యాపించియున్న అవ్యక్తమూర్తిగా, క్షేత్రజ్ఞుడుగా పురుషుడుగా చెప్పబడుచున్న దని వ్యక్తమగుచున్నది.

"సర్వభూతములయొక్క హృదయములందు ఆత్మగా ఉన్నవాడను నేనే" అని చెప్పినప్పుడు ఆ భూతములు ఆయనకంటె భిన్నముగా నున్నవా ? లేవు. ఆయనయే ఆభూతములకు ఆది మధ్యము అంతమై ఉన్నాడు. ఆది మధ్యాంతములు కలిగిన భూతశరీరము లన్నియు ఆయనయే. భూతముల హృదయములందు వ్యాపించియున్న చేతనమైన యాత్మయే అచేతనములుగా గోచరించుచున్న భూతశరీరములయందు కూడ వ్యాపించియున్న దన్నమాట. కావున సర్వభూత హృదయాంతర్యామి, జగదంతర్యామియైన యాత్మయైన పరమేశ్వరు డొక్కడే అని గ్రహింపవలసి యున్నది.

# 2. శరణాగతి కమండలువు

## (i) భక్తిలక్షణ చమసము

## గీత

ధ్యానమునకు ఆధారముగా భగవంతుడు విశ్వరూపమును ప్రదర్శించినను ఆయన అంతకుపూర్వము నిర్గుణబ్రహ్మోపాసనమునుగూర్చి చెప్పియుండెను. అందువలన అర్జునుడు విశ్వరూపోపాసనము మేలా లేక నిర్గుణమైన యక్షర బ్రహ్మోపాసనము మేలా అను సందేహము నొంది ఈయుపాసకులలో ఎవరు ఉత్తమ యోగులో చెప్పు మని భగవానుని అడిగెను

ఆయన ఇట్లనెను. "పరమమైన శ్రద్ధతో నాయందు మనస్సును నిలిపి నిత్యము నన్ను ఉపాసించువారు యోగులలో ఉత్తములు. నిర్గుణమై అచింత్యమై సర్వవ్యాపకమై అచలమైన అక్షర పరబ్రహ్మమును, ఇంద్రియనిగ్రహముతో ఎల్లయెడల సమబుద్ధితో, సర్వభూతహితమునందు నిరతులై, ఉపాసించువారు నన్నే పొందుదురు నన్ను భజించువారికి కలుగుక్లేశము అదికమేయైనను అక్షరోపాసకుల క్లేశము అధికతరము. దేహాభిమానము కలవారికి నిర్గుణమైన యక్షర పరబ్రహ్మమునుగూర్చి ధ్యానము చేయగల్గుట కష్టసాధ్యము కదా! సర్వకర్మలను నాయందు అర్పించి అన్యమును భావింపక విశ్వరూపాత్మకుడనైన నన్నే ధ్యానించుచు ఉపాసించువారిని శీఘ్రముగానే మృత్యుసంసార సాగరమునుండి ఉద్ధరింపజేయుదును. కావున నీవు మనస్సును బుద్ధిని నాయందే నిలుపుము. ఇకపైన నీవు నాయందే ఉండగలవు, సంశయము లేదు. నాయందు చిత్తమును నిలుప లేకున్నచో అభ్యాసయోగమున నన్ను పొందవలయునని కోరుచుండుము. అభ్యాసమునందు కూడ నీకు సామర్థ్యము కలుగకున్నచో నాకు సంబంధించిన కర్మలను చేయుటయే పరమలక్ష్యముగా కలిగియుండుము. అట్లు నాకొఱకు కర్మలను చేయుచున్నను సిద్ధిని పొందగలవు. అందులకు కూడ నీకు శక్తి చాలకున్నచో నీవు చేయుచున్న కర్మల ఫలముల నన్నింటిని నియతముగా నాకు అర్పించుచు త్యజించుచుండుము. అభ్యాసముకంటె జ్ఞానము మేలు. జ్ఞానముకంటె ధ్యానము అధికము. ధ్యానము కంటె కర్మఫలత్యాగము శ్రేయస్కరము. త్యాగమునకు అనంతరమున శాంతి లభించును"

శ్లో|| మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే|
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః|| 2

శ్లో|| యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే|
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్|| 3

శ్లో|| సంనియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః|
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః|| 4

క్లేశో ఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్|
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే|| 5

శ్లో|| యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః|
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే|| 6

శ్లో|| తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్|
భవామి న చిరా త్పార్థ మ య్యావేశిత చేతసామ్|| 7

శ్లో|| మ య్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ |
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః || 8

శ్లో|| అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ |
అభ్యాసయోగేన తతో మా మి చ్ఛాప్తుం ధనంజయ || 9

శ్లో|| అభ్యాసేఽ ప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ |
మ దర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి || 10

శ్లో|| అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః |
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ || 11

శ్లో|| శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ధ్యానం విశిష్యతే |
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనన్తరమ్ || 12

భీష్మపర్వ - అధ్యాయః - 36

## విజయప్రభ

బగవంతుడు ఇంతకుముందు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని భక్తులను నాల్గువిధములుగా పేర్కొనియున్నాడు (31-16). ఇప్పుడు అర్జునుని ప్రశ్నను అనుసరించి ఆయన వారిని రెండు విభాగములుగా నిరూపించుచున్నాడు. భగవంతుని చతుర్భుజునిగానో విశ్వరూపునిగానో దివ్యమైన రూపము, సకల సద్గుణములు కలవానినిగా నిరంతరము భావించుచు ధ్యానించుచునుండు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అను ముప్వురును ఒక విభాగ మగుదురు. అక్షరోపాసకుడైన జ్ఞాని యొకవిభాగము. మొదటివిభాగములోనివారే కొందఱు ఆరంభదశలో కర్మయోగులుగా తరువాత ధ్యానయోగులుగా అగుచుందురు. అర్జునుడు ఈ విభాగమునకు చెందును. అందువలన అతడు భగవంతుని స్వరూపమును ధ్యానింపబూనువారు యోగవిత్తములా, లేక అవ్యక్తమైన యక్షర పరబ్రహ్మమును ధ్యానింపబూనువారా అని యడుగుచున్నాడు.

యోగములవిశేషములను, అనగా తారతమ్యమును, ఎఱింగినవాడు యోగవిత్. యోగవిత్తులలో శ్రేష్ఠుడు యోగవిత్తముడు. నదిని దాటుటకు ఎన్నో మార్గము లున్నప్పుడు, ఆ మార్గములలో అన్నింటికన్న ఏది మేలైనదో తెలిసికొని ఆ మార్గమున నదిని తరించువాడు మార్గవిత్తముడు. అట్లు విచారింపక అప్పటికి సులభముగా తోచుచున్న మార్గమును అవలంబించినవాడు కష్టనష్టములకో కాలహరణమునకో గురికావచ్చును. కావున చక్కగా విచారించి శ్రమసాధ్య మైనను మేలైన మార్గమునే అవలంబింపవలె. భగవంతుని రూపధ్యానము సులభమే యైనను, అంతకంటె అక్షరోపాసనము గమ్యమునకు త్వరగా చేర్చునది యగుచో దానినే అవలంబించుట మేలు కదా అని యర్జునుని యభిప్రాయము.

అర్జునుడు అధ్యాత్మవిద్యయందు అప్పుడే ప్రవేశించుచున్నాడు. అందువలన అతనికి ప్రారంభమున భగవంతుని రూపధ్యానమే సులభము యుక్తము. అందువలన అతనికి ఆయోగమునందు శ్రద్ధ కలుగుటకై, "నాయందు పరమమైన శ్రద్ధతో మనస్సును ఉంచి ఉపాసించువారు యుక్తతము లనియే నాయభిప్రాము", అని భగవంతుడు చెప్పుచున్నాడు యోగమును పొందినవారు యుక్తులు. వారిలో శ్రేష్ఠులు యుక్తతములు. అర్హత ననుసరించి ఎవనికి ఏది తగునో అదియే వానికి ఉత్తమము. విద్యాభ్యాసమున మొదటికక్ష్యలో (First standard) ఉన్నవానికి ఆకక్ష్యకు విహితమైన పద్ధతిని అవలంబించుటయే ఉత్తమము. అట్లే రెండవ కక్ష్యలో (second standard) ఉన్నవానికి దానికి సంబంధించిన పద్ధతియే ఉత్తమమగును. అంతమాత్రమున రెండు కక్ష్యలు సమానము లని తలంపరాదు. అందువలన భగవంతుడు, "అక్షరోపాసకుల సంగతి నీకు ఎందులకు ? వారి విషయము తరువాత విచారింతము. వారి సంగతి ఎట్లున్నను నీకు మాత్రము నారూపధ్యానమే యుక్తతమము" అని దృఢముగా చెప్పుచున్నాడు.

అంతేగాక అర్జునుని వంటి యారంభకునకు అక్షరోపాసనమును అవలంబించుట ఎంత కష్టమో భగవానుడు నిరూపించుచున్నాడు. అక్షర పరబ్రహ్మము అనిర్దేశ్యము , చతుర్భుజుడైన విష్ణువు అని గాని త్రినేత్రుడైన శివు డని కాని నిర్దేశించుటకు వీలు కానిది. అది అవ్యక్తము ; ఇంద్రియమలకు గోచరింపదు. ఇంద్రియములకు గోచరింపనిదానినిగూర్చి చింతించుట, అనగా ఆలోచించుట, అశక్యము. అందువలన అది అచింత్యము. అయినను కొందఱు ఇంద్రియములను నిగ్రహించి ఎల్లయెడల సమబుద్ధి కలవారై, సర్వభూతములయొక్క హితమునందు ఆసక్తి కలవారై సర్వవ్యాపకమై అచలమైయున్న యక్షరపరబ్రహ్మమును ఉపాసించుచు భగవంతుని పొందుదురు. నామరూపములచేత ఎన్నో భేదములతో గోచరించుచున్న వివిదపదార్థములందు, వానికి అన్నింటికి ఆధారమై సమముగా, అనగా ఏకరూపముగా, ఉన్న బ్రహ్మమును, గ్రహించువారు సమబుద్ధులు. నగలలో ఎన్ని భేదములు గోచరించుచున్నను, వానిని అమ్ముచు కొనుచు నుండు వర్తకుడు, ఆభేదములయందలి విశేషములను ఇతరులకు ఎంతగా వర్ణించి చెప్పుచున్నను, తాను మాత్రము ఆ నగల కన్నింటికి ఆధారమై ఏకరూపముగా నున్న బంగారమునందే శ్రద్ధ కలిగి యుండును. అట్లే అక్షరోపాసకుడు కూడ వివిధవ్యక్తులతో అనేక పదార్థములతో వ్యవహరించుచున్నను, వాని కన్నింటికి ఏకరూపముగా ఆధారమై యున్న బ్రహ్మము ఒక్కటియే సత్యమైన వస్తువు అను నిశ్చయముతో నుండును. అదియే సమబుద్ధి. ఇంద్రియములను నిగ్రహించిననే తప్ప ఈ సమబుద్ధి కలుగదు. ఇంద్రియవశుడైన వానికి రాగద్వేషములు తప్పవు. "వీడు మిత్రుడు, వాడు శత్రువు, ఇది ఉపకారకము, అది భయంకరము" అను భావములు కలవానికి సమబుద్ధి కలుగదు. తనయందున్న బ్రహ్మమే సకల భూతములయందున్న దను నిశ్చయమును దృఢముగా పొందినవాడు ఆయాభూతములకు హితమును కలిగించుటయందే ఆసక్తి కలిగియుండును. రోగులయొక్క ప్రియమునందు కంటె

హితమునందే దృష్టి కలిగిన వైద్యుడు వారికి అప్రియమైనను శస్త్రచికిత్సను చేసి ఆరోగ్యమును కలిగించునట్లు, అక్షరోపాసకుడు కూడ భూతములయొక్క హితమునే కోరుచు, వానిని దండింపవలసినప్పుడు దండించుచు వానికి శ్రేయస్సునే కలిగించును. ఇట్టివారు తప్పక భగవంతుని పొందుదురు.

కాని అవ్యక్తము అచింత్యమును అయిన బ్రహ్మమును ఉపాసించుట చాల కష్టము. భగవంతుని రూపమును ధ్యానించుచు ఉపాసించుట మాత్రము సులభమా ? ఫలములను కోరకుండ వానిని ఈశ్వరార్పణము గావించుచు విహితములైన కర్మలను అనుష్ఠించుట అను కర్మయోగము క్లేశమే. ఫలములనే కాక కర్మలను కూడ వదలి సకలయోగక్షేమములకు భగవంతుడే దిక్కు అని భావించుచు ఎల్లవేళల ఆయననే ధ్యానించుచుండుట అధికమైన క్లేశము. కాని అచింత్యమైన బ్రహ్మమును ఉపాసింపబూనుకొన్నచో అధికతరమైన క్లేశము కలుగును. ఎందువలన ? నదిని తరించువానికి తెప్పవలె ధ్యానయోగులకు భగవంతుని నామరూపములు ఆశ్రయముగా నుండును. అక్షరోపాసకులకు అట్టియాశ్రయ ముండదు. వారి సాధనము బాహుబలముతో నదిని దాటుటవలె కష్టతరము.

ఇది ఎందువలన కష్టతరమో నిరూపించుచు భగవానుడు, "అవ్యక్తమును అక్షర బ్రహ్మమును ఉపాసించు ఈగతిని (మార్గము) దేహవంతులు దుఃఖముతో గదా పొందుచున్నారు" అని హేతువును చెప్పుచున్నాడు. ఇక్కడ దేహవంతులు అనుమాటకు ఏమి యర్థము ? సాధకులలో ఎవరైన దేహము లేకుండ నుందురా ? ఉండరు. అట్టియెడల దేహమవంతు లని నిర్దేశించుట ఎందులకు ? దేహవంతు లనగా దేహాభిమానము కలవా రని యర్థము. ఇల్లు కలవా రందఱు ఇంటియందు అభిమానము కలిగియుండరు. పేదవానికి తనయింటియందు ఎంత యభిమానము ఉండునో, సంపన్నుడైన వానికి ఎన్నో యిండ్లు ఉన్నప్పుడు ఆయిండ్లయందు అంత అభిమానము ఉండదు. అట్లే ఆనందరూపమైన యాత్మతత్త్వమును గుర్తించినవానికి, ఇతరులకు ఉన్నట్లుగా, దేహమునందు అభిమానము ఉండదు. అట్టివాడు దేహమును కలిగి యున్నప్పటికి దేహము లేని వాడుగనే యుండును. అట్టి విదేహుడు మిత్రుడు శత్రువు పుత్రుడు మొదలుగా ఇతరుల దేహములందు కూడ అభిమానమును, అనగా రాగద్వేషములను, పొందడు. అప్పుడు వానికి సర్వభూతములయందు సమబుద్ధి, వానియొక్క హితమునందు ఆసక్తి కలుగును. తమదేహమునందు అభిమానము వదలనివారికి పుత్రమిత్రశత్రు మృగాదులయందు రాగద్వేషములు తప్పవు అట్టివారు అవ్యక్తమైన యీ యక్షరోపాసనమును అవలంబించినచో దుఃఖము పొందక తప్పదు.

దేహాభిమానమును వీడలేనివారికి భగవంతుని ధ్యానించుచుండుటయే ఉత్తమమైన మార్గము. "నాకు వేఱు శరణము లేదు; నాకు నీవే శరణము" అని, ఇతరులను ఎవ్వరిని ఆశ్రయింపక బగవంతు నొక్కనినే ఆశ్రయించి, సకలకర్మలను కర్మఫలములను

ఆయనకే అర్పించుచు, ఆయననే ధ్యానించుచు ఉపాసించువారిని ఆయనయే మృత్యుయుక్తమైన సంసారసాగరమునుండి ఉద్ధరించును. ఆయన యైనను ఎట్లు ఉద్ధరించును? తన్ను చేరుటకు సాధనమైన బుద్ధి యోగమును ఆయన వారికొసంగును. అనగా వారికి తగిన సమయమున ఆయన సద్గురువుగా లభించి ఆత్మ జ్ఞానమున కలిగించును. ఆజ్ఞానముచేత వారు దేహాభిమానరహితులై భగవంతుని యథార్థస్వరూపమైన బ్రహ్మమును పొందుదురు. జ్ఞానులు స్వయముగా తరించుచుండుగా, భక్తులు ఈశ్వరానుగ్రహముచేత జ్ఞానమును పొంది తరింతురు.

అర్జును డప్పటికి దేహాభిమానము కలవాడే అగుటచేత, తాను చూపిన విశ్వరూపమునందే మనస్సును నిలిపి ఉపాసింపు మని భగవంతు డుపదేశించుచున్నాడు. అట్లు స్థిరముగా మనస్సున నిలుపుట సాధ్యము కానిచో అభ్యాసయోగముతో తన్ను పొందుటకు కోరుచు నుండు మని, ఆయన చెప్పుచున్నాడు లౌకిక వ్యవహారములచేత ఆకర్షింపబడి మనస్సు మాటిమాటికి భగవంతుని రూపము నుండి చలించుచున్నప్పుడు, "దానిని మరల మరల మరలించి తెచ్చి భగవంతునియందు నిలుపుచుండుటయే అభ్యాసయోగము. ఇది కూడ సాధ్యము కానిచో భగవంతునకు సంబంధించిన యజ్ఞము, పూజ, సంకీర్తనము మొదలగు కార్యములను జరుపుచుండవలె ఇట్లు చేయుచున్నచో చిత్తశుద్ధి సిద్ధించును. ఇది కూడ శక్యము కానిచో, అనగా యజ్ఞాదికర్మలను చేయలేకున్నచో, జీవనార్థము చేయుచున్న ప్రభుత్వ సేవ, వాణిజ్యము, పితృమాతృ పరిచర్య మొదలగు ఆ సర్వకర్మలయొక్క ఫలములను "భగవానుడా నీకొఱకు యజ్ఞములు గాని పూజలు గాని ఏమియు చేయలేకున్నాను, నిన్ను సంతతము స్మరింప లేకున్నాను; జీవనముకొఱకు నేను చేయుచున్న యీకర్మలను వీని ఫలములను నీకర్పించుచున్నాను; ఇది యంతయు నీదే, నాదేమియును లేదు; దీనిని స్వీకరించి నన్ను తరింపజేయుము" అని ప్రతిదినము ప్రార్థించుచు అర్పించుచుండవలె.

విశ్వరూపధ్యానాదులయందు అశక్తుడైన వానికి కనీసముగా తుది యుపాయముగా చెప్పిన యీసర్వకర్మఫలత్యాగము కూడ శ్రేయస్కరమే అని వానికి శ్రద్ధ కలిగించుటకై భగవానుడు దానిని ఇట్లు ప్రశంసించుచున్నాడు. చలించుచున్న మనస్సును మాటిమాటికి మరలించి భగవంతుని రూపమునందు నిలుపుటకు చేయు నభ్యాసము కంటె తాను ధ్యానించుచున్న దేవునియొక్క సత్యపరత్వము, సాధురక్షణము, దుష్టశిక్షణము మొదలైన గుణవిశేషములను తెలిసికొనుట మేలు. ఆ జ్ఞానముకంటె, ధ్యానము మేలు. అనగా ఆ జ్ఞానముతో కూడిన ధ్యానము మేలు. దానికంటె సర్వకర్మ ఫలత్యాగము మేలు. ఫలములను ఈశ్వరునకు అర్పించుచు చిత్తమును నిగ్రహించి ధర్మమునకు అవిరుద్ధముగా వర్తించుచుండుట కర్మయోగమే. ఈ యోగము నవలంబించుచు భగవంతుని ఎప్పుడో ఒకప్పుడు స్మరించువాడు కూడ భగవంతునియనుగ్రహమునకు పాత్రుడై చిత్తశుద్ధి నొంది జ్ఞానమును కూడ పొంది సంసారమునుండి ముక్తుడై పరమశాంతిని పొందును.

వ్యవహారమునందు మునుగుచు తేలుచు ఎప్పుడో ఒకప్పుడు భగవంతుని స్మరించుచున్నంతమాత్రమున ఇంత ఫలము కలుగునా అని సందేహింప నక్కఱ లేదు. ఈ విషయమున ఒక కథను పెద్దలు చెప్పుదురు. నారదమహర్షి యొకప్పుడు తానే మహాభక్తుడు అనుగర్వముతో విష్ణుదేవుని యొద్దకు పోయి ప్రసంగవశము, "నాకంటె భక్తుడు మఱియొక డున్నాడా" అని యడిగెను. వెంటనే ఆయన "ఉన్నాడు" అనెను. నారదుడు విస్మితుడై, "ఎవ డతడు" అని ప్రశ్నించెను. భూలోకమున ఉన్న యొక కృషీవలుని భగవంతుడు ప్రశంసించెను. "వాని భక్తి ఎంతటిదో నేను పరిశీలింతును" అని మహర్షి ఆకృషీవలునియొద్దకు వచ్చెను. ఆకృషీవలుని వర్తనమును ఆ ప్రాంతముననే ఉండి మహర్షి పెక్కుదినములు నిశితముగ పరిశీలించుచుండెను. ఆ కృషీవలుడు తన పనిని తాను చేసికొనుచు కుటుంబమును సంరక్షించుకొనుచు నుండెనేకాని పూజలు గాని భజనలు గాని సంకీర్తనములు కాని ఏమియు చేయుట లేదు. అతనియందు ఆయనకు భక్తునిలక్షణము లేవియు గోచరింపలేదు.

ఆయన వడివడిగా వైకుంఠమునకు పోయి, "స్వామీ! నీవు చెప్పిన యాకృషీవలుడు పెద్ద సంసారి ; అతనికి పొలముపనులు, ఇల్లు, ఇల్లాలు, పిల్లలు తప్ప ఏమియు తెలియదు, అతడు నిన్ను స్మరించుటయే లేదు, అంతటి యజ్ఞాని సంసారి అసలు భక్తు డగునా ? నిరంతరము నిన్ను కీర్తించుచున్న నాకంటె అతడు నీదృష్టిలో భక్తు డెట్లయ్యెను?" అని ఆక్రోశించెను.

భగవంతుడు నెమ్మదిగా "మహర్షీ ! తొందఱ పడకుము , ఒక్కపని చేయుదువా" అనెను. "మహాభక్తుడనైన నేను నీవు చెప్పినపని చేయకుందునా ? నన్ను అడగవలెనా? ఏమి చేయ మందువో ఆజ్ఞాపింపుము ; నీకొఱకు ప్రాణత్యాగమైనను చేయకుందునా" అని మహర్షి అనెను. విష్ణుదేవుడు నవ్వుచు, "అంత పని అక్కఱ లేదు. చిన్న పని చేయుము. ఇదియొక వ్రతము. ఇది తీర్థములతో నింపిన కలశము. దీనిని తలపై పెట్టుకొని మూడు పర్యాయములు ఈభవనమునకు ప్రదక్షిణము చేసి రమ్ము" అనెను. నారదుడు "ఇంతే కదా" అని కలశమును తీర్థముతో నింపుకొని తలపై పెట్టుకొని బయలుదేరెను. "ఇందులో ఒక్క నియమము కలదు ; ఎచ్చటను ఈ కలశమునుండి తీర్థజలము ఒక్క బిందువైనను క్రిందపడరాదు" అని విష్ణుదేవుడు హెచ్చరించెను. "సరే" అని నారదుడు బయలుదేరెను.

ఆయన ఆకలశమును మిగుల జాగరూకతతో రెండు చేతులతో పట్టుకొని నెమ్మదిగా మూడు ప్రదక్షిణములు చేసి ఆకలశమును మెల్లగా విష్ణుదేవుని ముందు ఉంచెను. విష్ణుదేవుడు నవ్వుచు, "తీర్థము చిందకుండ ప్రదక్షిణములు చక్కగానే చేసినావు. మఱి నీవు మహాభక్తుడవు కదా ; ఈ ప్రదక్షిణములలో నన్ను ఎన్ని మాఱులు స్మరించితివి" అని అడిగెను. "ఇది యేమి ప్రశ్న ! నీరు చిందకూడ దని నియమించితివి కదా ! నా చిత్తమంతయు కలశము పైననే లగ్నమై యుండినది. నిన్ను స్మరించుటకు

అవకాశ మెక్కడిది ?" అని నారదుడు అనెను. "కలశములోని నీరు చిందు నేమో అను భయముచేత దానిని గట్టిగా పట్టుకొని దానినే ధ్యానించుచు నన్ను నీవు ఒక్క పర్యాయము కూడ స్మరింపలేక పోయితివి కదా ! ఆకృషీవలుని సంగతి ఆలోచింపుము. ఎన్నో బాధ్యతలతో కూడిన సంసారభారమును వహించుచుండియు అతడు భోజనమునకు ముందు తరువాత, నిద్రకు ముందు నిద్రలేచిన తరువాత నన్ను విస్మరింపక భక్తితో స్మరించుచున్నాడు. అతడు భక్తుడు కా డని ఎట్లనుకొందును ! అతనిని అనుగ్రహింపకుండ ఎట్లుందును" అని విష్ణుదేవు డనెను.

కావున భగవంతుని నిరంతరము స్మరింపలేకున్నను సకల కర్మఫలములను ఆయనకు అర్పించుచు కర్తవ్యములను నిర్వహించుచుండుట కర్మయోగమే యగును. దీనివలన ఈశ్వరానుగ్రహముచేత చిత్తశుద్ధి సిద్ధించును.

# అమృతధర్మము

## గీత

కర్మయోగమున ధ్యానయోగమున ఉత్తీర్ణులై జ్ఞానయోగ కక్ష్యయందు ప్రవేశించినవారు సాధింపవలసిన లక్షణములను భగవంతుడు ఉపదేశించుచున్నాడు. జ్ఞానయోగ సిద్ధులకు ఏవి సహజలక్షణము లగునో అవి సాధకులకు అభ్యసింపదగిన గుణము లగును.

"ఏ భూతమునందును ద్వేషము లేనివాడు సకలభూతములయందు మైత్రి, దుఃఖితులయందు కరుణ కలవాడు, దేనియందును మమకారము, లేనివాడు, అహంకారము లేనివాడు, సుఖమునందు రాగము కాని దుఃఖము నందు ద్వేషము కాని పొందనివాడు, తనకు కావలసినది లభించినప్పుడు లభింపనప్పుడు కూడ సంతోషముతో నుండువాడు, సమాహితమైన చిత్తము కలవాడు, ఇంద్రియములను నిగ్రహించినవాడు, "నేను ఆత్మస్వరూపుడను" అను దృఢనిశ్చయము కలవాడు, మనస్సును బుద్ధిని నాయందు నిలిపినవాడును అగు భక్తుడు నాకు ప్రియుడు. ఎవనివలన లోకము ఉద్వేగమును పొందదో, లోకమువలన ఎవడు ఉద్వేగమును పొందడో, హర్షము అమర్షము భయము ఉద్వేగము అనుభావములనుండి ఎవడు ముక్తుడో అట్టివాడు నాకు ఇష్టుడు. దేహేంద్రియాదులకు సంబంధించిన విషయములందు కూడ అపేక్షలేనివాడు, శుచియైనవాడు, దక్షుడు, ఉదాసీనుడు, ఏ పరిస్థితియందును వ్యథ లేనివాడు, ఈ లోకమున గాని పరలోకములయందు గాని ఫలము నపేక్షించుచు ఏకార్యమును ఆరంభింపని వాడు నాకు ప్రియుడు. ఇష్టము ప్రాప్తించినప్పుడు హర్షమును, అనిష్టము కలిగినప్పుడు దానియందు ద్వేషమును పొందనివాడు, శుభమును అశుభమును పరిత్యజించిన వాడు, భక్తిచేత మన్నింపదగినవాడు శత్రువునందు మిత్రునియందు

నిందయందు స్తుతియందు మానావమానములయందు శీతోష్ణసుఖదుఃఖ
సమముగ నుండువాడు, దేనియందును సంగము లేనివాడు, మౌని, "ఇది నా
యే ప్రదేశమును అభిమానింపనివాడు, పరమార్థమున స్థిరమైన బుద్ధ కలవా
భక్తుడు నాకు ప్రియుడు.

ధర్మమైన యీ యమృతమును ఉపాసించువారు శ్రద్ధాళువులైన జ
అత్యంతము ప్రియులు".

శ్లో|| యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః |
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః ||

శ్లో|| అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః |
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః ||

శ్లో|| యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి |
శుభాశుభపరిత్యాగీ భక్తిమా న్య స్స మే ప్రియః ||

శ్లో|| సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః |
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగ వివర్జితః ||

శ్లో|| తుల్య నిందా స్తుతి ర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్ |
అనికేత స్స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః ||

శ్లో|| యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే |
శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః ||

భీష్మపర్వము - అధ్యా. 36

## విజయప్రభ

భయంకరుడో లేక అనిష్టుడో అయిన వ్యక్తిగాని పదార్థవ
తటస్థపడినప్పుడు, "ఈ సామీప్యము (Proximity) ఎప్పుడు తొలగిపోవు
మనస్సునందు కలుగు తొందర ఉద్వేగము. ప్రియుడు గాని ప్రియురాలు గాని, ప్రి
గాని లభించినప్పుడు బాష్పములతో, గగుర్పాటుతో మనస్సునకు కలుగు ఉత
వికాసము హర్షము అప్రియమును సహింపలేకపోవుట అమర్షము. చెమట పట్టుచ
కంపించుటతో కలుగు మనస్సుయొక్క సంచలనము భయము. ఆకస్మిక
సంభవించు సన్నివేశములందు తత్క్షణమే "ఈసంఘటనమునకు ఇది మూ
ఇప్పుడు ఇట్లు వర్తింపవలె" అని గ్రహించి వర్తింప గలిగినవాడు దక్షుడు. రెండు పక్ష
వివాదమునో పోరాటమునో జరుపునప్పుడు ఏ పక్షమును అవలంబింపక చూచుచ

నుండువాడు ఉదాసీనుడు. శరీరమునందు మనస్సునందు మాలిన్యము లేనివాడు శుచి.

ధర్మమునుండి తొలగనిది ధర్మ్యము ; అనగా ధర్మసంగతము. మోక్షమునకు నేరుగా మార్గమైన జ్ఞానయోగమే ఇచ్చట దర్మము. ఈ మోక్షధర్మ మార్గమునందు పై లక్షణము లన్నియు సాదకుని ముందునకు నడిపించును. మృతి కలది మృతము. జననము లేకుండ మరణము ఉండదు. కావున జననమరణరూపమైన సంసారము మృతము మృతము కానిది అమృతము. అదియే మోక్షము. అమృతము అను గమ్యమునకు చేర్చునట్టి పై లక్షణ సముదాయము కూడ అమృతమే అగును. ఈ ధర్మ్యామృతమును ఉపాసించుట అనగా నింతరము భావించుచు అభ్యసించుచుండుట.

## (ii) బుద్ధిప్రాశస్త్య చమసము

క్రింది తరగతిలో ఉత్తీర్ణుడై పై తరగతిలోనికి వచ్చిన వానికి ఆ తరగతి యందు ఉత్తీర్ణుడు అగుటకు తగిన పాఠ్యాంశములను (**Lessons of the class**) బోధించుచుందురు. అట్లే కర్మయోగ ధ్యానయోగములనుండి ఉత్తీర్ణుడైనవాడు సాధింపవలసిన లక్షణములను ధర్మ్యామృత మని భగవానుడు నిర్దేశించెను. తత్త్వజ్ఞానము లేకుండ వానిని పొందుట సాధ్యము కాదు. వానిని పొందకున్నచో మోక్షము లభ్యము కాదు. కావుననే భగవంతుడు, "దేని చేత నన్ను పొందుదురో అట్టి బుద్ధియోగమును నాయందు అనన్యమైన భక్తి కలవారికి ఒసంగుదును" అని చెప్పియుండెను. (దదామి బుద్ధి యోగం తం యేన మా ముపయాన్తి తే). ఆ బుద్ధి యోగమును అనగా జ్ఞానయోగమును ఇప్పుడు ఆయన క్షేత్రక్షేత్రజ్ఞ దర్శనము, గుణత్రయ వివేచనము, క్షరాక్షరపురుషోత్తమ నిర్ణయము అను వివిధ ప్రకారములతో బోధించుచున్నాడు.

నిశితముగ పరిశీలించినచో పదార్థము లన్నియు "నేను, నాకు గోచరించుచున్న జగత్తు" అను రెండువిధములే అని నిశ్చిత మగును. ఈ జంటనే దృక్కు దృశ్యము, జ్ఞాత జ్ఞేయము (**Knower and known**), ఆత్మ అనాత్మ, క్షేత్రజ్ఞుడు క్షేత్రము (**subject and object**), చిత్తు అచిత్తు, పురుషుడు ప్రకృతి, పురుషోత్తముడు క్షరాక్షరములు, త్రిగుణాతీతుడు త్రైగుణ్యము అని అనేకులు అనేక విధములుగా పేర్కొనుచుందురు.

వీనిలో ఏయొక్క జంటను విమర్శించి గ్రహించినను తక్కినవి సులభముగనే బోధపడును. భగవంతుడు క్షేత్రమునుగూర్చి వివరించుచు, "అర్జునా! ఈ శరీరము క్షేత్ర మని చెప్పబడుచున్నది" అని ఆరంభించి సృష్టికి ఆరంభమునందుండు సూక్ష్మములైన పృథివి, అపస్సు, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతములు, పంచీకరణము చేత స్థూలములై గోచరించుచున్న భూతములు, వాని వలన ఏర్పడిన గిరివననదీ జంతు శరీరాదులు, వానిని మనము గ్రహించుటకు సాధనములైన పది యింద్రియములు మనస్సు బుద్ధి ఇచ్చ ద్వేషము సుఖము దుఃఖము మొదలైన యంతఃకరణ ధర్మములు - మనచే గ్రహింపబడుచున్న సర్వము - క్షేత్రమే యగు నని నిర్దేశించెను.

"ఈశరీరము క్షేత్ర మని చెప్పబడుచున్నది" అని మొదట భగవానుడు తన శరీరమునో లేక అర్జునునిశరీరమునో చూపి చెప్పుట గమనింపదగియున్నది. క్షేత్ర శబ్దమునకు క్షతమునుండి రక్షించునది, క్షీణించునది, స్రవించునది, పొలమువంటిది అను నర్థములు కలవు. క్షత మనగా కొట్టబడినది లేక హింసిపబడినది. ఇతరుని శరీరము ఏకారణముచే నైన ఎవనిచే నైన కొట్టబడినప్పుడు లేక హింసింపబడినప్పుడు, ఆ శరీరమును దెబ్బల నుండి కాని హింస నుండి కాని రక్షించుటకు మన శరీరమును ఉపయోగించినప్పుడు అది క్షేత్రమగును (క్షత త్రాణాత్). వ్యాధులచే ముసలితనముచే క్షీణించునది కావున క్షేత్ర మని చెప్పబడుచున్నది. చిల్లుల కుండలో నుండి నీరు స్రవించునట్లు, మనము భోగములను అనుభవించునప్పుడు లేక సామాన్యముగ వ్యవహారించుచున్నప్పుడు కూడ మనశక్తి, శరీరములోని యింద్రియద్వారముల నుండి స్రవించుచునే యుండును. ఈ కారణము చేత కూడ శరీరమును క్షేత్రమని చెప్పవచ్చును. మనము నాటిన విత్తనముల నుండి, కాలవశమున, పొలమునందు పంట లభించునట్లు, మనము వెనుక జేసిన పుణ్యాపాపకృత్యములు బీజములుగా సుఖములు దుఃఖములు శరీరమునందు లభించుచున్నవి. కావున పొలమువలె శరీరము క్షేత్ర మని చెప్ప దగియున్నది.

శరీరము యొక్క ఈ లక్షణములను గమనించుచు "ఈ శరీరమును ఎన్ని మార్పులు కలుగుచున్నను వీనితోపాటు "నేను" అను జ్ఞానము మార్పు నొందుట లేదు , కావున మార్పు నొందుచున్న యీ శరీరము "నేను" కాదు" అని తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు. ఇట్లే ప్రతిక్షేత్రము నందును "నేను" అని ప్రతిజీవుడు వ్యవహారించుచున్నాడు. శరీరములు మాఱుచున్నను వానియందున్న "నేను" అనుస్ఫురణకు మార్పు ఏమియు కలుగుట లేదు. కావున అన్ని శరీరములలో ఆయా యనుభవములకు సాక్షిగా నున్న "నేను" అను స్ఫురణము, నాయందు ఉన్న "నేను" స్ఫురణము ఒకటిగానే యున్నది. కావున అన్నిశరీరములలో "నేనే" ఉన్నా నన్నమాట.

## గీత

ఈ యభిప్రాయమునే భగవంతుడు, "సకలక్షేత్రములయందు క్షేత్రజ్ఞుని నన్నుగా ఎఱుంగుము ; క్షేత్రక్షేత్రజ్ఞులను గ్రహించు జ్ఞానమే జ్ఞాన మని నాయభిప్రాయము" అని ఉద్ఘాటించినాడు.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత |
క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ || 2

(శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయ - 37)

"సకల క్షేత్రములయందు క్షేత్రజ్ఞుని నన్నుగా ఎఱుంగుము" అనగా సకలక్షేత్రములయందున నేను "నేను" అను స్ఫురణతకో ఉన్నాను అనియే అర్థము. భగవంతుడు తన్నుగూర్చి "నేను" (అహమ్) అని చెప్పినప్పుడు ఆ "నేను" యొక్క స్వరూప మేమి? తనస్వరూపము ఇంతకు ముందే భగవంతుడు, "సకల భూతములయొక్క హృదయములంయందున్న యాత్మను నేనే ; భూతములయొక్క ఆది మధ్యము అంతము కూడ నేనే " అని నిరూపించియున్నాడు (భగవద్గీత - అధ్యా. 34 - శ్లో. 20)

"ఈ శరీరము ఎన్నిమార్పులు పొందుచున్నను "నేను" మాఱుట లేదు , కావున ఈ శరీరము "నేను" కాదు అని గ్రహించు ప్రతివ్యక్తి జీవాత్మ లేకక్షేత్రజ్ఞుడు అగును. అతడే ఇంకను విచారించి "ఇతరుల శరీరములయందు ఉన్న "నేను" అను స్ఫురణము నాయందు ఉన్న "నేను" అను స్ఫురణము ఒకటిగానే యున్నది, కావున అన్ని శరీరములలో "నేనే" ఉన్నాను" అని గ్రహించునప్పుడు ఈశ్వరుడు లేక పరమాత్మయగునని భగవంతుడు చెప్పినదానివలన స్పష్ట మగుచున్నది. కావున సకల శరీరములయందు "నేను" అను స్ఫురణతో సకలమును గ్రహించుచు దృక్కుగా ఉన్నయాత్మ, ఆ దృక్కుచే గ్రహింపబడుచున్న సకలమైన దృశ్యము, అన్నవి రెండే పదార్థము లనివ్యక్త మగుచున్నది.

ఈ రెండింటియొక్క సంబంధమును కూడ పైవాక్యమున భగవానుడు నిరూపించినాడు భూతములయొక్క ఆది మధ్యము అంతము కూడ నేనే అని ఆయన ఉద్ఘాటించినాడు. చరాచరములైన సకల పదార్థములు భూతములే. అందువలన క్షేత్రముగా ఆయన పేర్కొన్న పంచమహాభూతములు పర్వతారణ్య సముద్రాదులు అంతఃకరణము ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాదులు మొదలుగా సర్వము - "భూతములు" అను శబ్దముచేత గ్రహింపవలసియున్నది. ఇది యంతయు దృశ్యమే "నేను" అను "దృక్కు" ఈ దృశ్యమునకు ఆది మధ్యము అంతము కూడ అగుచున్నది. ఈ విషయమునే భగవానుడు, "సర్వముయొక్క పుట్టుక స్థానము నేనే , నానుండియే సర్వము ప్రవర్తించుచున్నది అని పరమార్థభావమును గ్రహించిన బుధులు నన్ను బజించుచున్నారు" అని వివరించెను.

శ్లో|| అహం సర్వస్య ప్రబవో మత్త స్సర్వం ప్రవర్తతే |
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః || 8

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయ - 34

సర్వమునకు సృష్టిస్థితి భగవంతుని వలననే కలుగుచున్న వన్నప్పుడు లయము కూడ ఆయనవలననే జరుగుననుట స్పష్టము. "సకలముయొక్క ఆది మధ్యాంతములు నేనే" అన్న మాటకు ఏమర్థము ? అద్దమునందు ప్రతిబింబములవలె, మనస్సునందు కలలో ఎన్నో దృశ్యములు గోచరించును. అవి యన్నియు మనస్సులోనే పుట్టి అచ్చటనే

వర్తించి అక్కడనే లయించుచున్నవి. అద్దమునందు ప్రతిబింబములు కూడ ఇట్లే దాని యందే పుట్టి, ఉండి, తొలగిపోవుచున్నవి కల పోయినతరువాత మనస్సు, ప్రతిబింబము తొలగిన తరవాత అద్దము, అంతకు పూర్వము ఎట్లున్నవో అట్లే ఉండును ప్రతిబింబములకు అద్దముకంటె అన్యముగా ఉనికి (Existence) లేదు అవి దానితో సమానమైన సత్య పదార్థములు (Realities) కావు అట్లే స్వప్న దృశ్యములు కూడ మనస్సుతో సమానమైన సత్యపదార్థములు కావు. ఇట్లే జాగ్రత్తందు కూడ దృక్కుచే గ్రహింపబడుచున్న దృశ్య మంతయు దృక్కు నందే ప్రతిబింబించి, వర్తించి, తొలగిపోవుచున్నది. కావున దృక్కు రూపులమైన, మనము మనచే గ్రహింపబడుచున్న చరాచరమైన సకల ప్రపంచముయొక్క ఆది మధ్యము, అంతము కూడ నగుచున్నాము. ఈ ప్రపంచము ఎన్ని విధముల మాఱుచున్నను దీనికి ఆధారమై సత్యమై అందఱియందును ఏకరూపముగ నున్న "నేను" అను స్ఫురణము మాఱుట లేదు. గాఢనిద్ర నుండి మేల్కొన్నవాడు నిద్రకు పూర్వము ఎట్లో అట్లే ఈ స్ఫురణతో లేచుచున్నాడు. జాగ్రత్తులో స్వప్నములో నిద్రలో మార్పు నొందని ఈ స్ఫురణము సత్యము. "నేను హాయిగా నిద్రించితిని ; నాకు ఏమియు తెలియ లేదు" అని మేల్కొన్నవాడు తన యనుభవమును చెప్పుచుండుట వలన ఆస్ఫురణము ఆనందజ్ఞాన మనుట స్పష్టము. బంగారు వస్తువు నందు అంతటను బంగారమే ఉండునట్లు "నేను" అను స్ఫురణమునకు సహజముగ ఆనందమైన జ్ఞానము స్వరూపము.

నిద్రలో హాయిని పొందుచున్నాము కాబట్టి అందు ఉండిన "నేను" అను స్ఫురణము ఆనందఘనము కావచ్చును ; కాని "నాకు ఏమియు తెలియలేదు" అని అజ్ఞానమును మనము ప్రకటించునప్పుడు అది జ్ఞానఘన మని ఎట్లు చెప్పవచ్చును. నిద్రకు పూర్వము ఆ స్ఫురణము సర్వమును గ్రహించుచున్నది, అట్లే మేల్కొన్న తరువాత కూడ గ్రహించుచున్నది. నిద్రలో దాని జ్ఞానస్వరూపము మాఱ లే దనుట స్పష్టము. అట్లు మార్పు నొందినచో మేల్కొన్న తరువాత దానియందు మార్పు కన్పింపవలె. అట్టి మార్పు కన్పించుట లేదు. అందువలన నిద్రలో అది జ్ఞానమనముగనే. యున్నదని గ్రహింపవలె. అది జ్ఞానరూపముననే యున్నను జగత్తునందువలె స్వప్నమునందువలె అప్పుడు దృశ్యములైన పదార్థములు ఏవియు లేకుండుటచే తెలిసికొనుట లేక గ్రహించుట అనునది సంభవింప లేదు. అంతమాత్రమున దాని జ్ఞానరూపమునకు భంగ మేమియును లేదు. రంగస్థలమున పెద్దదీపమును వెలిగించి దాని కాంతిలో నాటకమును ప్రదర్శించుచున్నప్పుడు, ఆ దీపపు కాంతి ఆనాటకదృశ్యమును ప్రకాశింపజేయుచుండును. నాటకము ముగిసి అందఱును లేచిపోయిన తరువాత కూడ ఆదీపము అంతకు పూర్వము ఎట్లున్నదో అట్లే ప్రకాశించుచుండును నాటకదృశ్యము లేనంతమాత్రమున ఆ దీపముయొక్క ప్రకాశమునకు ఏమియు లోప ముండదు. అట్లే నిద్రలో ప్రకాశమును పొందవలసిన పదార్థములు ఏమియు నుండవు అంతమాత్రమున ఆత్మచైతన్యముయొక్క జ్ఞానమునకు ఏమియును హాని లేదు. యాచకులు లేనంత మాత్రమున దాతయొక్క దాతృత్వమునకు

లోపము ఏమియు నుండదు. విద్యార్థులు లేనంతమాత్రమున విద్వాంసునియందున్న విద్యకు గాని బోధనసామర్థ్యమునకు గాని లోపము కలుగదు. కావున నిద్రలో కూడ "నేను" అను స్ఫురణము జ్ఞానమనమే. కాని నిద్రయందు ఆత్మజ్ఞానము కలుగుటలేదు, ఎందువలన ? అప్పుడు తమోరూపమైన నిద్ర మనస్సును ఆవరించుచున్నది. దానియొక్క ప్రతిబింబముతో మనస్సు నిండి పోవుచున్నది. ఆప్రతిబింబముయొక్క ఆక్రమణమువలన నల్లగుడ్డచే కప్పబడిన అద్దమువలె, అది యితర ప్రతిబింబములను గ్రహింపజాలదు. కాని దాని ప్రకాశ శక్తికి లోపము లేదు. అయినను నిద్రయొక్క ప్రతిబింబమును స్వీకరించుచున్న మనస్సు ఆత్మస్వరూపమును గ్రహించుటకు సమర్థము కాదు. కావున జాగ్రత్తులోనే ఏ విషయమునుకూడ మనస్సుపై ప్రతిబింబింపకుండ చేసినచో, అది శుద్ధమై చిద్రూపమున ప్రకాశించును అదియే జ్ఞానసమాది ఈ విధముగా మనచే గ్రహింపబడుచున్న ప్రపంచమునకు సకల వ్యవహారములకు ఆదారమై యున్న మన యాత్మచైతన్యము సత్యము జ్ఞానానంద ఘనము అని గ్రహింపవలసియున్నది. అనిత్యమై అసత్యమైన శరీరమునందు ప్రపంచమునందును సత్యత్వ భ్రాంతిని వీడి సర్వాంతర్యామియై సత్యమై జ్ఞానానందమనమైన యాత్మస్వరూపమునందు ఉండుటయే మోక్షము అదియే పరమపదము , అదియే అమృతత్వము. అదియే జ్ఞేయము, అనగా తెలిసికొనదగినది

శరీరాభిమానముతో ప్రపంచవ్యవహారమును సత్యముగా తలంచుచున్న యర్జునునివంటివారు దీనిని తెలిసికొని మోక్షమును పొందుటకు సాధనముగా భగవంతుడు అమానిత్వమ్ము అదంభిత్వము అహింసక్షాంతి ఆర్జవము ఆచార్యోపాసనము మొదలగు లక్షణములను విధించుచున్నాడు ఇవి జ్ఞానసాదనములగుటచే ఈ లక్షణసముదాయము జ్ఞానమని చెప్పబడుచున్నది.

ఈ లక్షణ సముదాయమును అభ్యసించుటకు సహాయకముగా భగవానుడు సత్త్వము రజస్సు తమస్సు అనుగుణములయొక్క వివేకమును కూడ బోదించుచున్నాడు ఈ మూడుగుణములు జీవుని మూడు విధముల సంసార విషయములందు ఆసక్తుని గావించుచు నిబంధించుచున్నవి. ప్రతివ్యక్తియందు ఈ మూడింటిలో ఒకటి ప్రదానమై, తక్కినవి రెండును అప్రధానములుగ నుండును. ఈ గుణములప్రాధాన్యమును బట్టి కొందఱు సాత్త్వికులుగా మఱికొందరు రాజసులుగా, అనేకులు తామసులుగా నుందురు. సత్త్వము నిర్మలము ప్రకాశకము. ఇది వ్యక్తి స్వబావమునందు ప్రబలముగా నున్నప్పుడు సుఖమునందు జ్ఞానసంపాదనమునందు ఆసక్తిని కలిగించుచు శాస్త్రాభ్యాస జపధ్యానాది వ్యవహారములయందు నిమగ్నుని గావించును. రజస్సు రాగాత్మకము. దీనివలన తృష్ణ ఆసంగము కలుగును లభింపని దానియందు అది కావలయు నను నభిలాష తృష్ణ . లభించినదానియందు ప్రీతి ఆసంగము. దనము ఐశ్వర్యము కీర్తి దేవలోకభోగములు మొదలగు వానియందు ఆసక్తిని కలిగించుచు, ఇది ప్రబలమైనప్పుడు ఐహికములైన కార్యములయందో లేక గృహారామక్షేత్రాదులందో నిమగ్నుని కావించును. తమస్సు అజ్ఞానమువలన కలుగును.

ఇది అవివేకమును కలిగించును. ఇది ప్రబలమైనప్పుడు ప్రమాదము ఆలస్యము నిద్ర అను దోషములతో బంధించును. ఎప్పటికప్పుడు కర్తవ్యమును చేయకుండుట ప్రమాదము , అనగా లౌకికములలో గాని వైదికములైన కార్యములలో గాని ఏ సమయమునకు ఏది చేయవలయునో దానిని చేయకుండుట సోమరితనముతో వెంటనే చేయవలసిన పనిని ఎప్పుడో చేయబూనుకొనుట ఆలస్యము ఆకాలమున నిద్రించుచుండుట నిద్రాదోషము.

ఈ గుణములయొక్క ప్రభావములను గుర్తింపకుండ అమానిత్వము అదంభిత్వము మొదలుగా మోక్షసాధనములను అభ్యసించుట దుర్ఘటము. "నేను ఇంతవాడను" అని తన్ను గూర్చి గొప్పగా భావించుకొనుచుండుట మానిత్వము. అట్లు తలంపకుండుట అమానిత్వము. తనకు లేని గుణములను ప్రకటించుచు ఇతరులను వంచించుట దంభము. అది లేకుండుట అదంభిత్వము. ఇట్టిగుణములను అభ్యసింపవలయు నన్నచో సాత్త్వికులను గుర్తించి వారి సాహచర్యమును సంపాదించుకొని సద్గురువులను సేవించుచు సాత్త్వికత్వమును పెంపొందించుకొనుటకు ప్రయత్నింపవలె. కర్తవ్యమున పొరపాటు సంభవించినప్పుడు, "ఓహో ! ఇది తమస్సుయొక్క ప్రభావమువలన కదా కలిగినది" అని తెలిసికొని మరల అట్టి పొరపాటు జరుగకుండు నట్లు ప్రయత్నింపవలె. లోభము కలిగినప్పుడు, "ఇది రజోగుణమువలన కలుగుచున్నది" అని గుర్తించి దానిని తొలగించుకొనుటకు యత్నింపవలె. పరద్రవ్యమునందు అభిలాష లోభమే. యోగ్యులకు ఏదేని ఈయవలసినప్పుడు కలుగు సంకుచిత బుద్ధియు లోభమే. గురూపదేశమువలన తత్త్వము తెలిసినను శాస్త్రజ్ఞానమును సంపాదింపవలయు నని యభిలాష కలుగుచున్నచో, "ఇది సత్త్వగుణమువలన కలుగుచున్నది ; ఈయభిలాష కూడ బంధమే యగును" అని గుర్తించి దానిని తొలగించుకొనుటకు యత్నింపవలె ఈ వివేకమువలన ఇట్టి ప్రయత్నమువలన అమానిత్వము మొదలగువానిని సాధించుట సులభ మగును. ఆ లక్షణములను సాధించినవాడు గుణముల ప్రభావమునుండి బయల్పడి వానికి అతీతు డగును. త్రిగుణాతీతుడే స్థితప్రజ్ఞుడై ముక్తి నొందును.

గుణములవలన వివిధవిషయములందు కలుగుచున్న సంగముచేతనే జీవులహృదయములందు సంసారము మహావృక్షమువలె పెంపొందుచున్నది. కావున దేనియందును అభిలాష నొందకుండుట అను దృఢమైన అసంగశస్త్రము చేతనే దీనిని ఛేదింపవలె. అట్లు ఛేదించిన వాడు క్షరమునకు అక్షరమునకు కూడ అతీతుడై పురుషోత్తము డగును ; అనగా పరమాత్మయే యగును. సకలభూతములు క్షరము. వానిని ప్రదర్శించుచు సంసారమును పెంపొందించుచున్న మాయ అక్షరము. ఈ రెండింటిని పురుషులనుగా కొందఱు పేర్కొందురు. ఈ రెండును ఎవనియందు భాసించుచున్నవో అట్టి పరమాత్మను పురుషోత్తము డని యందురు.

# (iii) ప్రోత్సాహ చమసము

## గీత

తన్ను పరమాత్మనుగా తెలిసికొన్నవాడు పరమపదమైన మోక్షమును పొందుచున్నాడు ఎట్టివారు ఆ పురుషోత్తముని తెలిసికొని ఆ పదమును పొందగలరు? "మానమోహములు లేనివారు, సంగదోషమును జయించినవారు, ఆధ్యాత్మ విషయమును గూర్చి ఎల్లప్పుడు ఆలోచించుచుండువారు, లేశముగానైన కామములు లేనివారు, సుఖదుఃఖము లను ద్వంద్వములనుండు వెలువడినవారు, మూఢులు కాని వారు అవ్యయమైన యాపదమును పొందుదురు"

శ్లో॥ నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైః గచ్ఛంత్యమూఢాః పద మవ్యయం తత్॥ 5

(శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యా. 39)

## విజయప్రభ

"నేను గొప్ప రాజును, మహావీరుడను" అను మొదలుగా తనయున్నతినిగూర్చి కొలతపెట్టుకొని భావించుచుండుట మానము రాజ్యము కీర్తి సంపదలు, భోగములు మొదలగువాని వలన కలుగు సుఖమే పొందదగినది అని తలంచుచు ఆత్మనుగూర్చి విచారింపకుండుట మోహము. ఈ రెండింటిని వీడినవారు కూడ పురాణశ్రవణాదులతో కాలక్షేపము చేయుచుందురే కాని ఆత్మతత్త్వమునుగూర్చి నిత్యము శ్రవణమననాదులయందు నిమగ్నులు కారు. అట్లు ఆలోచించువారు కూడ పరోపకారము లోకసంగ్రహము మొదలగువానియందు అభిలాషను కలిగియుందురు. ఈ యభిలాషవలన వానియందు సంగము కలుగును. దీనిని కూడ జయింపవలె. ఇట్టి కోరికలను కూడ లేశమాత్రముగనైన పొందని వారు కూడ సుఖములు దుఃఖములు అన్నియు "అంతఃకరణమునకు సంబంధించినవే కాని నాకు లేవు" అని దృఢముగా బావింప కలిగియుండరు. ఇట్టివారిలో కూడ అనేకులు అమూఢులుగా నుండరు మోహమును పొందినవారు మూఢులు. మోహమునుండు విముక్తులైన వారు అమూడులు. అద్యాత్మ విచారమున అత్యున్నత స్థాయికి చేరినవారు కూడ తమకు ఇష్టదేవతలుగా నుండిన విష్ణువు, శివుడు, పరమేశ్వరి మొదలగు దేవతలు తమకు మోక్షము నొసంగుదు రను తలంపుతో నుందురు. సర్వాంతర్యామియైన యాత్మనే తమ స్వరూపముగా గ్రహింపవలసియుండగా, అదియే మోక్షమై యుండగా అందులకు భిన్నముగా ఇట్లు భావించుట మోహమే అగును. ఈ మోహమును కూడ **అతిక్రమించినవారే, అవ్యయమైన అనగా నిత్యము సత్యమును అయిన, పరమాత్మపదమును పొందుదురు.**

వీనిలో మానమోహములను వీడుట అను మొదటి మెట్టుపైకి ఎక్కి స్థిరముగా నిలుచుటయే అర్జునుని వంటివానికి మిగుల దుర్ఘటముగా తోచుట సహజము అతడు ఇంతకు పూర్వమే, "సర్వభూత సమభావపూర్వకముగా నీవు చెప్పిన యీ యోగము నాకు స్థిరముగా నిలుచు నని తోచుట లేదు; ఇంద్రియములను మథించునట్టి మనస్సు చాల బలము కలది మిగుల దృఢమైనది, అమిత చంచలమైనది ; వాయువును మూటగట్టుటవలె, ఈమనస్సును నిగ్రహించి ఆ యోగమున నిలుచుట మిగుల దుష్కర మనియే తలంచుచున్నాను" అని నైరాశ్యమును ప్రకటించియున్నాడు (శ్లో.33, 34, అధ్యా. 6, భగవద్గీత) ఇప్పుడు ఈసోపానపరంపరను గూర్చి విన్నంతనే అతడు ఇంకను నిరుత్సాహమును పొందుట సహజము. భగవానుడు అర్జునుని చిత్తవృత్తిని గమనించుచు, అతనిని ప్రోత్సహించుటకై, ఉన్నతములైన సోపానముల సంగతిని వదలి సామాన్యులైన సాధకులు సాధారణ జీవితములో సులభముగా అభ్యసింపదగిన లక్షణములను బోధించుటకు పూనుకొనినాడు. పెద్దకొండ మీద నున్న దేవాలయము వలె, మోక్షము కూడ దుర్గమముగా దూరముగా ఎత్తుగా నుండవచ్చును. అంతమాత్రమున ఎవ్వరును నిరుత్సాహము నొంద నక్కఱ లేదు. సద్గురువును ఆశ్రయించి ఆయన చూపిన మార్గమును తప్పకుండ ఒక్కొక్క మెట్టును ఎక్కుచు పైకి పోవుచున్నవాడు త్వరలోనే మోక్షమను గమ్యమునకు చేరుకొనగలడు. ఈ దృష్టితో భగవానుడు, "ఆత్మ అనాత్మ, ప్రకృతి, పురుషుడు, క్షరము అక్షరము" మొదలగు వానినిగూర్చిన తత్త్వవిచారమును విరమించి సాధారణమై దైనందిన జీవితమున నేర్చుకో దగినయంశములను ఉపదేశించుచు అర్జునుని ప్రోత్సహించుచున్నాడు.

మనుష్యులకు జన్మసిద్ధముగా నుండు గుణము లన్నియు ప్రధానముగా దైవము ఆసురము అని రెండు విధములుగా ఉండును. దైవీగుణసంపదతో జన్మించివానికి అభయము, ఆర్జవము, అహింస, సత్యపరత్వము, తేజస్సు, క్షమ, మొదలగు లక్షణము లుండును. దంభము దర్పము క్రోధము మొదలగు లక్షణములు ఆసురగుణములతో జన్మించినవానియందు ఉండును. దైవీగుణములు మోక్షమునకు మార్గము ఏర్పఱచును. ఆసురగుణములు సంసారమున బంధించును.

సాధారణముగా మనుష్యులలో ఈ రెండు విధములైన గుణములు కొన్ని ఎక్కువగా కొన్ని తక్కువగా కలసియే యుండును. ఎవ్వడైనను నూటికి నూఱుపాళ్ళు దుర్మార్గుడుగా లేక సన్మార్గుడుగ సాధారణముగా నుండరు. ఎవనియందు తపస్సు ఆర్జవము మొదలైన గుణములు అధికముగా నుండునో వాడు దైవీగుణసంపదతో జన్మించినవాడని, ఎవనియందు దంభము దర్పము మొదలగు గుణములు అదికముగా నుండునో వాడు ఆసురీగుణసంపదతో జన్మించినవా డని గ్రహింపవలె. బాగుపడ దలచుకొన్నవాడు తనయందు ఉన్న దైవీగుణములను పెంపొందించుకొనుచు ఆసురగుణములను తొలగించుకొనుటకు ప్రయత్నింపవలె. ఇందులకు దుర్జన సహవాసమును వదలి సజ్జనసాంగత్యమును గురుజనసేవను సంపాదించుకొనుట ఆవశ్యకము.

దేవత్వ మనగా నేమి, అసురత్వ మనగా నేమి యను విషయమున బృహదారణ్యకోపనిషత్తునందు ఇట్లు వివరణము కలదు. "శాస్త్రమువలన కలిగిన జ్ఞానముచేత కర్మను భావించువారు, ద్యోతనమువలన దేవతలు అగుచున్నారు కొందఱు సహజమైన ప్రేరణముచేత, ప్రత్యక్షము చేత, అనుమానము చేత కన్పించుచున్న ప్రయోజనముకొఱకు కర్మముయొక్క జ్ఞానమును భావించువారు అసురులు అగుచున్నారు"

యజ్ఞాదికర్మలు మొదలుకొని దంతధావనము మొదలుగా ప్రతిపనిని ఎట్లు చేయవలయునో ఎట్లు చేయరాదో మనకు శాస్త్రములు విధించుచున్నవి. పెద్దలవలన ఆ విషయములను తెలిసికొని ఆ జ్ఞానము ననుసరించి కర్మలను భావించుచు జరుపుకొనువారియందు ఒక విధమైన కాంతి కలుగును. దానిచే వారు ప్రకాశింతురు. దేవత లనగా ప్రకాశించువా రనియే యర్థము.

కొందఱు ఇందులకు భిన్నముగా వర్తింతురు. తమకు సహజముగా స్ఫురించుటచేత (Instinct) గాని, ప్రత్యక్షమువలన గాని, అనుమానముచేత గాని దృష్టమైన ప్రయోజనముకొఱకు సాధనమైన యొకకార్యమును నిశ్చయించి దానియొక్క జ్ఞానము ననుసరించి వర్తించుచు అసురు లగుదురు. కన్నులు మొదలైన యింద్రియములు అక్షములు. వాని ద్వారమున మనము గ్రహించు విషయము ప్రత్యక్షము. ప్రత్యక్షమును బట్టి మనము ఊహించునది అనుమానము. ఒకసభలో విద్వాంసులకు సమ్మానము చేయునప్పుడు, ఒకడు నా కిది చాల దని చెప్పుట ప్రత్యక్షము. మఱియొకడు పైకిచెప్పక అప్రసన్నముగా నిట్టూర్చుచున్నచో, ప్రత్యక్షము లగుచున్న వానిముఖలక్షణములను బట్టి అతడు అసంతృప్తితో నున్నా డని యూహించుట అనుమానము. వారి కిద్దఱకును సంతోషమును కలిగించుట యజమానికి ప్రయోజన మగును. అప్పుడు వారి కిద్దఱకును సంతోషమును కలిగించుటకై, వారికంటె శాస్త్రములను అధికముగా చదివిన విద్వాంసులతో సమానముగా గాని అధికముగాగాని వారికి సమ్మానము చేయవచ్చును. దానివలన యజమానికి, వారికి సంతోషమును కలిగించుట, వారు ఆయనను పొగడుట, మఱియును ఏదో యొక సాయమును ఆయనకు చేయుట అను ప్రయోజనములు సిద్ధించును. ఇది దృష్టము. అనగా కన్పించునది.

కాని మఱియొక యజమాని ఈ దృష్టములైన ప్రయోజనములను తలంపక, ఈ విషయమున శాస్త్రమును తెలిసికొని, దాని ననుసరించి ఆఱు శాస్త్రములలో విద్వాంసుడైన వానికి అఱువది రూప్యములు, అయిదింట పండితుడైన వానికి ఏబది, మూడింటియందు నిష్ణాతుడైన వానికి ముప్పది ఇచ్చును. చిన్న పండితుని, పెద్ద విద్వాంసునిని సమానముగా సమ్మానించుట శాస్త్ర విరుద్ధము. సభలో ఉన్నవారి నందఱను సమానముగా సమ్మానించుట పెద్దదోషము. పోటీలలో ప్రథమ బహుమతిగాని, సభలో అగ్రతాంబూలము గాని ఇతరులకు కూడ ఈయవచ్చు ననుట ఎంత అక్రమమో ఇదియును అంతే. శాస్త్రదృష్టి కలవాడు శాస్త్రము ననుసరించి అర్హతనుబట్టి

హెచ్చుతగ్గులను పాటించును. తాత్కాలికముగా కొందఱికి అసంతృప్తి కలిగినను అతడు లెక్కపెట్టడు. అతనికి తాత్కాలికమైన కొందఱి సంతోషము కంటె, శాస్త్రదృష్టితో అర్హుడైన వానిని అర్హతను బట్టి యథావిధిగా అర్చించుటవలన కలుగు సుకృతఫలమునే అభిలషించును. దానివలన ప్రత్యక్షముగా మేలు కలుగక పోగా, ఒక్కొక్కప్పుడు కొందఱితో విరోధము కూడ సంభవింపవచ్చును.

ధర్మరాజు రాజసూయ సభయందు అగ్రపూజ యొసంగుట ఇట్టిదే. ఆసభలో శ్రీకృష్ణుడే పూజ్యుడని భీష్ముడు ఆలోచించి చేసిన నిశ్చయమును పాటించి యుధిష్ఠిరుడట్లు చేసెను. శిశుపాలుడు దానిని ఆక్షేపించి యుద్ధమునకే సిద్ధపడెను. ధర్మరాజునకు శిశుపాలుని సంతృప్తిపఱచుటకంటె పూజ్యుడైన భీష్ముని మాటను పాటించుట కర్తవ్యమయ్యెను. అందువలన ఎంత ఆపద కైనను సిద్ధపడెనే కాని శిశుపాలుని ప్రీతికొఱకు భీష్ముని మాటను త్రోసిపుచ్చలేదు.

ప్రత్యక్షప్రయోజనమును లెక్కపెట్టక శాస్త్రవిధిని పాటించుట అత్యంత ప్రయత్నసాధ్యము. అట్టివారు దేవత లగుదురు. వాలివధ సందర్భమున శ్రీరాముడు, "మేము మావశమునందు లేము" (శాస్త్రవశమం దున్నాము) - ("న వయం స్వవశే స్థితా") - (శ్లో.35, సర్గ18 కిష్కింధాకాండ) అని వాలితో చెప్పినాడు. అందువలననే మహాత్ములు, "మేము శాస్త్రమునకు దాసులము" (శాస్త్రస్య దాసా వయమ్) అని చెప్పుచు, "శాస్త్రవచనమువలన ప్రవర్తింపవలె, వచనమువలన నివృత్తి నొందవలె" - ("వచనాత్ ప్రవృత్తిః వచనాత్ నివృత్తిః") యని యుద్ఘోషించుచుందురు.

ఈ విభాగమును నిరూపించుచు భగవానుడు, "అర్జునా! నీవు దైవీగుణ సంపదతో జన్మించితివి; దుఃఖింపకుము" (మా శుచః; సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ! - శ్లో. 5. అధ్యాయ 40) అని ఓదార్చుట గమనింపదగియున్నది. "మోక్షమును సంపాదించుట నావలన అగునా?" అని సందేహించుచు నిర్వేదముతో నున్న యర్జునుని భగవంతు డిట్లు ప్రోత్సహించుచున్నాడు "నీవు నైరాశ్యమును పొందకుము, నీయందు సద్గుణములే యధికముగా నున్నవి; దుర్గుణములు చాల తక్కువగా నున్నవి. నీవు మోక్షమును పొందుట సులభమే, దీనికై నీవు ఎక్కువ శ్రమపడ నక్కఱ లేదు. దుర్గుణములను తొలగించుకొనుచు నెమ్మదిగా క్రమముగా సద్గుణములను పెంపొందించుకొనుచు నుండిన చాలును. ధ్యానమో జ్ఞానమో దానిపాటి కదియే సిద్ధించును".

## గీత

ఇట్లు ఓదార్చుచు భగవంతుడు వర్జింపదగిన యాసురలక్షణములను పెక్కింటిని వివరముగా పేర్కొనినాడు. ఇన్ని గుణములతో ఏమి పని అని అయన, "తమస్సునకు, అనగా దుఃఖమునకు అజ్ఞానమునకు, ద్వారములైన కామము క్రోధము లోభము అను మూడు గుణములను పరిత్యజించినవాడు తనకు శ్రేయస్సును సంపాదించుకొనుచు

మోక్షమును పొందును" కాని కామక్రోధలోభములను వీడినంతమాత్రమున, దర్మాధర్మములతో సంకీర్ణములైన జీవితము యొక్క మలుపుల యందు ఎట్లు వర్తించుట శ్రేయస్కరమో ఎట్లు తెలియగలదు ? ఇందులకు సమాధానముగా భగవంతు డిట్లు ఉద్ఘాటించుచున్నాడు. "ఎవడు శాస్త్రవిధిని వదలి తనయభిలాష ననుసరించి వర్తించునో అట్టివాడు సిద్ధిని, అనగా పురుషార్థయోగ్యతను పొందడు , సుఖమును మోక్షమును పొందడు. కావున ఇది కార్యము, ఇది అకార్యము, అను ఏర్పాటునందు నీకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రవిధానమునందు చెప్పబడిన కర్తవ్యమును తెలిసికొని నీవు ఆచరింపవలసియున్నది".

శ్లో|| ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః |
ఆచర త్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్ || 22

శ్లో|| య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః |
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ || 23

శ్లో|| తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ |
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి || 24

(శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయ - 40)

భగవానుడు శాస్త్రవిధినే ప్రమాణముగా నిర్దేశించుట గమనింపదగియున్నది. ఎవడు ఎంత మహాత్ముడైనను, అతడు శాస్త్రవిధి ననుసరించి చెప్పినట్టి వాక్యమే ప్రమాణ మగును కాని, శాస్త్రమును వీడి తనబుద్ధికి తోచినట్లుగా చెప్పునది ప్రమాణము కా దనుట స్పష్టము. ఈ విషయమున వ్యక్తులను సర్వజ్ఞులనుగా భావించి వారి వాక్యములను ప్రమాణముగా భావించుట తగదు. కపిలుడు సర్వజ్ఞు డైనచో, కణాదుడు కా డని ఎట్లు చెప్పవచ్చును. వీరిద్దఱు సర్వజ్ఞులైనచో వారికి అభిప్రాయ భేదము ఎట్లు సంభవించును? అటులనే గౌతమబుద్ధుడు మొదలగువారు సర్వజ్ఞులనుటకు వీలు లేదు. కావున వ్యక్తుల సర్వజ్ఞత్వము ధర్మమున ప్రమాణ మగుట కుదరదు.

## (iv) శాస్త్రప్రామాణ్య చమసము

ఈ సందర్భమున శాస్త్రమునకు జీవితమునకు గల సంబంధమును వివరముగా గ్రహించుట ఆవశ్యకము. శాస్త్రమును వీడినచో మనుష్యునకు మోక్షము లేకపోగా సుఖము యొక్కసిద్ధి కూడ కలుగ వని భగవానుడు చెప్పుచున్నాడు. సిద్ధి అనగా పురుషార్థములయొక్క సిద్ధి. మనుష్యుల కోరిక లన్నియు ధర్మము అర్థము కామము మోక్షము అను నాలుగు వర్గములుగా (groups) విభజింపబడినవి. ఈ నాలుగింటిలో దేనియం దైనను చేరని కోరిక ఏదియు నుండదు. పురుషులచేత అర్థింపబడునవి పురుషార్థములు. మనుష్యు లందఱు పురుషులు కారు. పుంస్త్వము కలిగినవా రందఱు కూడ పురుషులు కారు. పుంస్త్వము వేఱు పురుషత్వము వేఱు.

దాంపత్యయోగ్యతామాత్రమే పుంస్త్వము. అర్థి, సమర్థుడు, విద్వాంసుడు, సంపన్నుడు, దక్షుడును అయిన వాడే పురుష డగును. ఏదేని ఒక విషయమును సాధింపవలయు నను దృఢమైన సంకల్పము కలవాడు అర్థి. సంకల్పించిన దానిని సాధించుటకు శరీరేంద్రియ మనోబుద్ధులందు శక్తి కలవాడు సమర్థుడు. సామర్థ్యములతోపాటు ధనము పరిజనము మొదలుగా సాధనములను పుష్కలముగా కలిగినవాడు సంపన్నుడు ఈ సంపన్నతతోపాటు సాధింపవలసిన విషయమున చక్కని పరిజ్ఞానము కలవాడు విద్వాంసుడు. ప్రయత్నము చేయుచున్నప్పుడు కలుగు సమస్యలకు అప్పటికప్పుడే పరిష్కారములను నిశ్చయించుకొని ఆసమస్యలను అధిగమించి కార్యమును సాధింపగలవాడు దక్షుడు. ఈలక్షణములు కలవాడే పురుషుడు. వీని ప్రయత్నమే పురుషకారము లేక పౌరుషము. స్త్రీలయందు కూడ ఈలక్షణము లున్నచో వారిని పురుషులతో సమానులుగానే భావింపవలె.

కృషిచేసి పొలమునందు పుష్కలముగా పంటను సంపాదించుకొనదలచిన పురుషుడు కృషియొక్క శాస్త్రమును చక్కగా తెలిసికొని, దానియొక్క విధుల ననుసరించి కృషిని కొనసాగించినచో పుష్కలముగా పంటను సంపాదించుకొనును. అదియే వానికి పురుషార్థసిద్ధి. ఆవిధముగా సిద్ధిని పొందినవాడు, శాస్త్రవిధిని అవలంబించుటకు అలవాటుపడి విధేయుడై ధర్మమును కామమును మోక్షమును కూడ క్రమముగా సంపాదించుకొనగలడు. శాస్త్రవిధిని లెక్కపెట్టక తనకు తోచినట్లుగా వర్తించువాడు దేనియందును సిద్ధిని పొందలేక నిరాశకు నిర్వేదమునకు లోనై పరదారధనాదుల నపేక్షించుచు హీనజన్మలు పొందుచు మోక్షమునకు దూరు డగును.

ఇట్లు శాస్త్ర ప్రామాణ్యమునుగూర్చి విన్నంతనే అర్జునునకు సందేహము కలిగెను. అనేకులకు శాస్త్రవిధి తెలియక పోవచ్చును. వారికి తెలిసికోవలయు నని తలంపు ఉన్నను బోధించువారు లభింపక పోవచ్చును. అట్టియెడల వారు తాము పెద్దలవలన విన్న యాచారముల ననుసరించి కృషి, వాణిజ్యము, దేవతాపూజనము మొదలగువానిని శ్రద్ధతో చేయుచుందురు. అప్పుడు వారిశ్రద్ధ సాత్త్వికమా, రాజసమా తామసికమా అని అర్జునుడు భగవానుని ప్రశ్నించినాడు. అతడు కార్యసిద్ధిని ప్రశ్నింపలేదు. అది దైవాధీనము. చక్కగా తెలిసి ఎంతో జాగరుకతతో కార్యములు నిర్వహించుచున్నను దైవము ప్రతికూలమైనచో అవి సిద్ధింపవు. ఏమియు తెలియక పోయినను దైవము అనుకూలించినచో ఎవడో ఒకడు సాయపడి అట్టివానికి కార్యము సిద్ధించునట్లు చేయును. కావున సిద్ధి విషయము ముఖ్యము కాదు. ఏవేని కొన్ని కార్యములు సిద్ధించినను సిద్ధింపక పోయినను వ్యక్తియొక్క శ్రద్ధయే ముఖ్యము. అది సాత్త్వికమైనచో వానికి సద్బుద్ధి కలిగి సత్వవర్తనము కలవాడై మోక్షమను నొందుటకు అవకాశము కలుగును రాజసమైనచో అట్టియవకాశము తక్కువగా నుండును. తామస మైనచో అట్టియవకాశమే యుండదు. అందువలన అధ్యాత్మయోగసాధకుని దృష్టితో అర్జునుడు శ్రద్ధను గూర్చి ప్రశ్నించినాడు.

ప్రారబ్ధమువలన శరీరము వచ్చినట్లే ప్రతివ్యక్తికి వివిధవాసనలతో కూడిన చిత్తము కూడ వచ్చుచున్నది. దాని ననుసరించియే శ్రద్ధ ఏర్పడును. ఆ శ్రద్ధ ననుసరించియే వ్యక్తిత్వము రూపొందును. వ్యక్తుల వర్తనములను బట్టి వారి శ్రద్ధను మనము గ్రహింపవచ్చును. ఇంద్రాది దేవతలను పూజించువారు సాత్త్వికశ్రద్ధ కలవారని, యక్షులను రక్షస్సులను అర్చించువారు రాజస శ్రద్ధ కలవారని, భూతప్రేతములను భజించువారు తామస శ్రద్ధ కలవారని మనము గ్రహింపవచ్చును. అట్లే తపస్సు యజ్ఞము దానము, ఆహారము మొదలగువాని యందలి విశేషములను బట్టి కూడ మనుష్యులలో సాత్త్వికులను రాజసులను తామసులను గుర్తింపవచ్చు నని వివరించి భగవంతు డిట్లు ముగించెను.

శాస్త్ర వచనములందు, వాని ననుసరించి గురువులు చెప్పు వాక్యములందు, "ఇవి యథార్థములు, తప్పక ఆచరింపదగినవి" అను దృఢమైన విశ్వాసము శ్రద్ధ. సాత్త్వికులు, రాజసులు తామసులు ఆయాదేవతలకు సంబంధించిన శాస్త్రవిహితములైన పూజాకల్పములయందు వానిని బోధించిన గురువుల వాక్యములయందు దృఢమైన విశ్వాసమును కలిగి యుండవలయును. ఆ విశ్వాసము ననుసరించి వారికి ఫలములు లభించును.

## గీత

భగవానుడు ఇట్లు చెప్పెను.

" `ఓమ్, తత్, సత్' అను మూడు శబ్దములతో బ్రహ్మము నిర్దేశింపబడుచున్నది. ఈ నిర్దేశము చేత పూర్వము బ్రాహ్మణులు వేదములు యజ్ఞములు నిర్మింపబడెను. కావున వేదపరాయణులు వేదవిధులచేత చెప్పబడిన యజ్ఞదానతపస్సు లను క్రియలను ఓంకారోచ్చారణ పూర్వకముగా ప్రవర్తింపజేయుచున్నారు మోక్షమును కాంక్షించువారు ఫలమును అభిలషింపకుండ వివిధములైన యజ్ఞదానతపః క్రియలను "తత్" అని ఉచ్చరించుచు నిర్వహించుచున్నారు. ఉనికిని (Existence) మంచితనమును, ప్రశస్తమైన కార్యమును "సత్" అను శబ్దముచే చెప్పుచున్నారు. యజ్ఞదానతపస్సులయందు ఉండుటను లేక వానికి సంబంధించిన కార్యము నైనను "సత్" అనియే చెప్పుచున్నారు. అశ్రద్ధతో చేయబడిన హోమము దానము తపస్సు స్తుతినమస్కారాదాలు "అసత్" అని చెప్పబడుచున్నవి. అసత్కర్మ పరలోకమునందే కాక ఈలోకమునందు కూడ ఫలము నొసంగదు"

## (v) సన్న్యాసత్యాగ వివేక చమసము

ఇట్లు చెప్పి భగవానుడు, "నీవు మోక్షమును కాంక్షించుచున్నచో ఫలమును అపేక్షింపక యుద్ధము మొదలైన కార్యములను శాస్త్రవిధి ననుసరించి "ఓం తత్సత్" అనుచు శ్రద్ధగా చేయుము. సాత్త్వికులతోడి సహవాసమును సాత్త్వికమైన యాహారమును

గైకొనుచు సాత్త్వికవర్తనముతో నిర్మలత్వమును పొందుము" అని స్ఫురింపజేసెను. ఈ విషయము స్ఫురించినంతనే అర్జునుడు, శ్రీకృష్ణుడు తత్త్వవిచారవిషయమును వదలి ప్రాథమికమైన సాత్త్విక వర్తనమునుగూర్చి చెప్పుచు బోధను ముగించుచున్నాడని గ్రహించెను అప్పుడతడు, "సంన్యాసముయొక్క తత్త్వమును, త్యాగముయొక్క తత్త్వమును విడివిడిగా స్పష్టముగా తెలిసికొనగోరుచున్నాను" అని ప్రార్థించెను.

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ పృథ క్కేశినిమూదన॥

శ్రీమహాబారత్ - బీష్మపర్వణి - అధ్యాయ - 42

# విజయప్రభ

భగవానుడు చెప్పి ముగించిన శ్రద్ధా విశేషములకు అర్జునుడు అడుగుచున్న సంన్యాస త్యాగముల తత్త్వ నిరూపణమునకు సంబంధము లే దని కొందరు తలంపవచ్చును. సంబంధము లేనిమాట నిజమే. అర్జునుడు ఇట్లు అడుగుటకు హేతువులను మనము ఇట్లు ఊహింపవచ్చును గురువు శిష్యులకు పాఠములను చెప్పి ముగించినప్పుడు, ఆనాటి పాఠములోని విషయములనే కాక వెనుకటిపాఠములలోని విషయములలో కూడ తమకు బోధపడనియంశములను గురువును అడిగి శిష్యులు తెలిసికొనుచునే యుందురు. అవి ఆనాటి విషయమునకు సంబంధింపక పోయినను దయాశాలియైన గురువు వెనుక బోధించిన విషయములనే మరల మరల క్రొత్త యుదాహరణములతో, విసుగును పొందక, బోధించుచునే యుండును. అప్పుడు శిష్యుని ప్రశ్నకు అప్పుడు చెప్పుచున్న విషయమునకు సంబంధము లేకుండుటయు సహజమే. అందువలన భగవానుడు వెనుక ప్రస్తావించిన సన్న్యసము త్యాగము అను శబ్దములయొక్క తత్త్వమును గూర్చి మరల బోధింపు మని అర్జునుడు అడుగుట అసహజము కాదు.

ఈ సందర్భమున శ్రీకృష్ణ బగవానుడు కర్మసన్న్యాసాధికారము అర్జునునకు లేదని స్పష్టముగా చెప్పకుండుట గమనింపదగియున్నది. క్షత్త్రియులకు సన్న్యాసాశ్రమమునందు అధికారము లేదు. కాని కర్మసన్న్యాసమునందు అధికారము లేక పోలేదు. సన్న్యాసాశ్రమ దీక్ష వేఱు. కర్మసన్న్యాసము వేఱు. క్షత్త్రియులకు వానప్రస్థమునందు అధికారము ఉన్నది. వానప్రస్థదీక్షను స్వీకరించిన క్షత్త్రియులు రాజ్యపాలనము యుద్ధము మొదలగు కర్మలను విడిచిపెట్టవలె. అప్పుడు వారికి అగ్నిహోత్రములు ఆతిథ్యము మొదలగుగా కొన్ని కర్తవ్యములు ఉండును. మహాప్రస్థానదీక్షను స్వీకరించినప్పుడు అన్నపానములతోపాటు వానిని కూడ విసర్జింపవలె. అందువలన శ్రీరాముడు మొదలగువారు సన్న్యాసమును గైకొనలేదు, కాని తుదకు సర్వకర్మ సన్న్యాసమును గావించియే యున్నారు. అయినను ఎవరైనను తమ యిష్టము

వచ్చినట్లుగా బాధ్యతలను వీడి వానప్రస్థము నైనను స్వీకరించుటకు వీలు లేదు రాజ్యపాలనము కుటుంబబాధ్యతలు కుమారులకు అప్పగించి క్షత్రియులు వానప్రస్థమును స్వీకరింపవలె. ధృతరాష్ట్రుడు వానప్రస్థమును స్వీకరించిన సందర్భమున ఈ విషయము వివరముగా వర్ణింపబడియున్నది కావన తమకు న్యాయయుక్తముగా రావలసిన రాజ్యముకొఱకు ధర్మరాజు క్షత్రియోచితముగా యుద్ధమునకు సన్నద్ధుడై యుండగా, తమ్ముడుగా తనబాధ్యతను వీడి అర్జునుడు వాన ప్రస్థుడను అగుదు ననుట ధర్మ సమ్మతము కాదు. పరీక్షిత్తునకు పట్టాభిషేకము చేసి అతనికి రాజ్యపాలనము కుటుంబబాధ్యతను అప్పగించి ధర్మరాజు మహాప్రస్థానము గావింపబూనినప్పుడు జ్యేష్ఠ సోదరునివెంట అర్జునుడు కూడ సర్వకర్మ సంన్యాసము గావించి బయలుదేరుట ఉచితమే యైనది. అందువలన భగవానుడు అర్జునునకు సర్వకర్మ సంన్యాసమునందు అధికారము లేదు అని చెప్పక, అధర్మమును నిగ్రహించి ధర్మమును స్థాపించుటకు కర్తవ్యముగా యుద్ధము సిద్ధమై యుండగా, క్షత్రియధర్మమును వీడి అప్పుడు సర్వకర్మ సంన్యాసమును గావించుట తప్పు అనియే చెప్పుచున్నాడు

ఆసమయమున అర్జునుడు స్వధర్మమైన యుద్ధముకంటె కర్మ సంన్యాసముతో పాటు భిక్షాన్నమును భుజించుట కూడ మేలే అని భావించుచున్నాడు. (శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే - అధ్యా. 26-5) భిక్షావృత్తి సంన్యాసులకు మాత్రమే విహితము కాని వానప్రస్థులకు నిషిద్ధము క్షత్రియులకు వానప్రస్థమునందు కాని మహాప్రస్థాన సమయమున గాని భిక్షాన్నభోజనము నిషిద్ధమే కావున క్షత్రియునకు ఏ పరిస్థితియందును భిక్షాన్నభోజనము తగదు

స్వధర్మమును వీడుట తప్పు అని దృఢముగా బోధించినతరువాత దేనిని అర్జునుడు చాల గొప్ప ధర్మమునుగా భావించుచున్నాడో ఆ కర్మసంన్యాసము, జ్ఞానమునకు సంబంధింపనిచో, ప్రశస్తము కా దని అనెక విధముల బోధించినాడు. సన్న్యాసాధికారము గల బ్రహ్మణులయందు కూడ వారు గావించు కర్మసన్న్యాసము జ్ఞానసంపాదనమునకు సాధనమైనప్పుడే ప్రశస్త మగును కర్మ సంన్యాసమును గావించి యతిధర్మమును స్వీకరించిన బ్రాహ్మణుడు వెంటనే సద్గురువు నాశ్రయించి శ్రవణమనన నిదిధ్యాసనములను కావింపవలె. లేకున్నచో అతడు కావించిన కర్మ సంన్యాసము పతనహేతువే యగును. "కర్మలను ఆరంభింపకుండుటవలన, సంన్యాసమాత్రమున ఎవడును నైష్కర్మ్యరూపమైన జ్ఞానసిద్ధిని పొందుట లేదు (27-4). జ్ఞానముచేత సంకలసంశయములను పోగొట్టుకొని, దేహేంద్రియాదులు చేయుచున్న కర్మలతో జ్ఞానమాత్రుడ నైన నాకు ఎట్టి సంబంధము లేదు" అను బుద్ధి నిశ్చయరూపమైన యోగముచేత కర్మలను త్యజించినవాడు కర్మలను చేయుచున్నను ఆకర్మలు వానిని బంధింపవు (28-41) అని భగవానుడు స్పష్టముగా బోధించెను. ఇట్లు బోధించుచు ఆయన, "సంశయమును వీడి యోగమును అవలంబించి లెమ్ము" (28-42) అని యుద్ధాటించెను.

అప్పుడే అర్జునుడు, "కర్మసంన్యాసమును యోగమును చెప్పుచున్నావు ఈ రెండింటిలో ఏది శ్రేయస్కరమో చెప్పుము" అని అడిగెను (29-1) అప్పుడు భగవానుడు, "సన్న్యాసము కర్మయోగము రెండును మోక్షప్రదములే. అయినను కర్మసంన్యాసము కంటె కర్మయోగమే మేలు" అని సమాధానము చెప్పెను. వానప్రస్థమునందు యత్యాశ్రమమునందు అధికారము కలవారు కూడ కర్మసంన్యాసము గావించి జ్ఞానమును సంపాదించుటకు ప్రయత్నించుట కంటె కర్మయోగము నవలంబించి విహిత కర్మలను ఫలములను కోరకుండ ఈశ్వరార్పణ బుద్ధితో చేయుచుండుటయే మేలు. క్షత్రియుడు రాజ్యపాలనాదికమును సమర్థుడైన పుత్రునకో తమ్మునకో అప్పగించి కర్మలను సన్న్యసించి జ్ఞానమును సంపాదించుటకై వానప్రస్థమును స్వీకరింపవచ్చును. అట్లే బ్రాహ్మణుడు యత్యాశ్రమమును స్వీకరింపవచ్చును. కర్మలను సన్న్యసించినతరువాత వానప్రస్థమున గాని సంన్యాసాశ్రమమున గాని బ్రహ్మచర్యాదినియమములను పాటించుట చాలకష్టము వానియందు నియమభంగము సంభవించినచో జ్ఞానసంపాదనము అసంభవమగుటయే కాక పతనము కూడ సంభవించును. అందువలన వానప్రస్థమునకు సంన్యాసమునకు అవకాశము కలిగినవారు కూడ తొందఱపడి వానియందు ప్రవేశింపక కర్మయోగము నవలంబించి విహితకర్మలను చేయుచు చిత్తశుద్ధిని సంపాదించుకొనుట మేలు. కర్మయోగమున చిత్తశుద్ధిని సంపాదించుకొనని వానికి కర్మసంన్యాసమును నిలుపుకొన గలుగుట దుర్ఘటము. చిత్తశుద్ధిని పొందినవానికి జ్ఞానయోగము, దానివలన మోక్షము అత్యంతము సులభము లగును. ఈ విషయమున భగవానుడు ఇట్లు హెచ్చరిక గావించుచున్నాడు. "యోగమువలన కాకుండ మఱియొక విధముగా సన్న్యాసమును పొందుట చాల కష్టసాధ్యము. యోగమును పొందియున్న ముని బ్రహ్మమును త్వరలోనే పొందగలడు"

శ్లో|| సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః |
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి || 29-6

భగవంతుడు త్యాగశబ్దమును ప్రయోగించిన వాక్యములను గమనించినచో ఆశబ్దమును ఆయన అనేక పర్యాయములు, ధనభోగభార్యాపుత్రాది వ్యవహారమును విడిచిపెట్టుట అనుసర్థమునందు కాక, కర్తవ్యములైన కర్మలను చేయుచు వానిఫలములను విడిచిపెట్టుట అనునర్థమున ఉపయోగించె నని విశద మగును. "మేధావులై బుద్ధి యోగము కలవారు కర్మలవలన కలుగుఫలమును వదలి...." (కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ... 26-51), "నిత్యతృప్తుడు నిరాశ్రయుడును అయినవాడు కర్మఫలములయందు ఆసక్తిని వీడి..." (త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః - 28 - 20), "సక్తిని వీడి కర్మలను బ్రహ్మమునందు ఉంచి (బ్రహ్మార్పణముగా) ఎవడు చేయునో.... (బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః - 29-10), "ధ్యానముకంటె కర్మఫలత్యాగము (శ్రేయస్కరము), త్యాగమునకు అనంతరమున శాంతి... (ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాత్ శాన్తి రనంతరమ్... 36-12)

కాని, "కొందఱు (మహాత్ములు) అమృతత్వమును కర్మచేతకాదు, సంతానముచేత కాదు, ధనము చేత కాదు త్యాగముచేత పొందిరి" (మం॥ న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః | కై. - 12 , నారా 12-3) అను వేదమంత్రమున త్యాగశబ్దము కర్మలను బిడ్డలను దనమును వదలిపెట్టుటనే బోధించుచున్నది. ఇట్లే మఱియొక వేదమంత్రమున, "కావున ఈ తపస్సులలో న్యాసమును అదికమైన దానినిగా చెప్పుచున్నారు. (తస్మాత్ న్యాస మేషాం తపసా మతిరిక్త మవాహుః. . నారా - 79) న్యాస శబ్దము కూడ వివిధములైన తపోరూపకర్మానుష్ఠానములను విడిచిపెట్టుటనే బోదించుచున్నది భగవానుడు ఈ శబ్దములకు ఈయర్థములను కాదనలేదు. కాని పైమంత్రములయర్థమును నిశితముగ పరిశీలించినచో, కర్మప్రజాధనములను తపస్సులను త్యజించుట అనగా కేవలము భౌతికముగా వానిని విడిచిపెట్టుట కాక మనస్సునందు వానికి సంబంధించిన యాసక్తిని త్యజించుట యనియే చెప్పవలసియున్నది. భార్యాపుత్రులను వీడి వనమున కేగినవాడు అక్కడ బార్యాపుత్రులనుగూర్చి తలంచుచున్నచో అది త్యాగము కాదు, సన్న్యాసము కాదు. కావున వేదమంత్రములయొక్క ఈ తాత్పర్యమునే భగవానుడు సన్న్యాస శబ్దమునందు త్యాగశబ్దమునందును ఉద్దేశించినాడు స్వధర్మవిహితములైన కర్మలను చేయుచు వానిఫలములను కోరక, భార్యాపుత్ర మిత్రాదులందు రాగద్వేషములు లేక, తామరాకునందలి నీటిబొట్టువలె, దేనియందును ఆసక్తి నొందక ప్రారబ్ధమువలన ప్రాప్తించుచున్న కార్యములను నిర్వహించువాడు సన్న్యాసియు యోగియు అగును. ఆత్మజ్ఞానము లేకుండ అగ్నిహోత్రములను, తపోదానాది క్రియలను వదలినంతమాత్రమున ఎవడైనను సంన్యాసి కాడు, యోగియును కానేరడు.

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః |
న సన్న్యాసీ చ యోగీచ, న నిరగ్ని ర్న చాక్రియః ॥ 30 - 1

భగవానుని యీయభిప్రాయము అర్జునునకు విశదముగా తెలియుట లేదు. అతడు ఇట్లు ఆలోచించుచున్నాడు. "సన్న్యాసాశ్రమమును గైకొన్నవారు గృహక్షేత్ర భార్యాపుత్రాదులను వీడి కాషాయవస్త్రములను ధరించి దండకమండలువులను గైకొని భిక్షాటనము చేయుచున్నారు. వానప్రస్థదీక్షను గైకొన్నవారు కూడ రాజ్యపాలనాది వ్యవహారములను త్యజించి వనములకు పోవుచున్నారు. మఱి అట్లుగాక సకల వ్యవహారములు చేయుచు, విరక్తులై కర్మఫలములను అభిలషింపకుండ నున్నంతమాత్రమున గృహస్థులు సన్న్యాసు లగుదురా లేక త్యాగు లగుదురా ? వీరికి మోక్షము కాని బ్రహ్మలోకము గాని లభించునా ? అసలు, సన్న్యాస మనగా నేమి ? త్యాగ మనగా నేమి ? ఇవి రెండు పదార్థములా ? లేక ఒకదానికే రెండు నామవాచకములా ?" ఇట్లు ఆలోచించుచు అర్జునుడు ఆ రెండు శబ్దములయొక్క తత్త్వమును బోధింపు మని శ్రీకృష్ణుని ప్రార్థించెను.

# గీత

ఆయన యిట్లనెను. "కామ్యములైన కర్మలను చేయకుండుట సన్న్యాస మని కొందఱు, సకలకర్మలఫలములను త్యజించుట త్యాగ మని కొందరు, సకలకర్మల ఫలములను త్యజించుట త్యాగమని కొందఱు, కర్మయే దోషము, కావున త్యజింపవలె నని మఱికొందఱు, యజ్ఞము దానము తపస్సు త్యజింపరాని వని యితరులు చెప్పుచున్నారు. ఈ విషయమున నా నిశ్చయమును వినుము. త్యాగము మూడు విధములుగా చెప్పబడుచున్నది. యజ్ఞము దానము తపస్సు మాత్రము త్యజింపదగినవి కావు. అవి చేయవలసినవే. అవి బుద్ధిమంతులకు పావనములు. వీనిని కూడ ఫలములనే కాక వీనియందు సంగమును కూడ వీడి తప్పక చేయవలసినదే యనుట ఉత్తమమైన నా నిశ్చయము" ఇట్లు చెప్పి భగవానుడు తామస రాజస సాత్త్విక త్యాగ భేదములను వివరించెను.

శ్లో|| కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః |
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః || 2

శ్లో|| త్యాజ్యం దోషవ ది త్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః |
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్య మితి చాపరే || 3

శ్లో|| నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ |
త్యాగో హి పురుష వ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః || 4

శ్లో|| యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్ |
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ || 5

శ్లో|| ఏత న్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ |
కర్తవ్యా నీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్ || 6

అధ్యాయ - 42

# విజయప్రభ

లోకములో సంన్యాసమునుగూర్చి త్యాగమునుగూర్చి పండితులలో నాలుగు విధములైన యభిప్రాయము లున్నవి. పుత్త్రులు స్వర్గము మొదలగు ఫలములను సంపాదింప గోరినవారు చేయదగినవిగా వేదములయందు నిర్దేశింపబడిన పుత్త్రకామేష్టి సోమయాగము మొదలగునవి కామ్యకర్మలు ఈ కర్మలను చేయుటకు అధికారము సామర్థ్యము కలిగినవారు వీనిని చేయకుండుట సన్న్యాస మని కొందఱి యభిప్రాయము న్యాస మనగా ఉంచుట. వేదములయందు విధింపబడిన కర్మలు నిత్యములు నైమిత్తికములు కామ్యములు అని మూడు విధములు. వానిలో తనకు సంబంధించిన కర్మలను పరిశీలించుచు, ఫలమును అపేక్షింపని వాడు, నిత్య నైమిత్తికములను

కర్తవ్యములనుగా గ్రహించుచు, కామ్యకర్మలను స్వీకరింపక, ప్రక్కన నుంచుట న్యాసము. అవి ఏవి యైనను ఎప్పటి కైనను తనకు అక్కఱ లే దని దృఢముగా నిశ్చయించుకొనుట సన్న్యాసము. ఇది మొదటివారి యభిప్రాయము

కామ్యకర్మలను వీడి, నిత్యనైమిత్తికములను నిర్వహించుచున్నను ఆకర్మలయొక్క ఫలముల నన్నింటిని పరిత్యజించుటయే త్యాగ మని రెండవ వారి యభిప్రాయము.

కర్మ యేది యైనను, ఏదేని యొక దోషమును కలిగియే యుండును, కావున కామక్రోధాది దోషములను ఎట్లు త్యజించుచున్నామో అట్లే సకలకర్మలను పరిత్యజింపవలె ననునది మూడవ వారి యభిప్రాయము.

నిత్యనైమిత్తికములుగా విహితములైన పంచయజ్ఞములు దానములు తపస్సు మాత్రము వదలరా దని నాల్గవవారి యభిప్రాయము.

యజ్ఞదాన తపస్సులను ఫలములను అపేక్షింపక, ఆ కార్యములయందు సంగము కూడ లేకుండ తప్పకుండ అనుష్ఠింపవలయు నని తన యుత్తమమైన నిశ్చయమునుగా భగవంతుడు ఉద్ఘాటించెను.

త్యాగమునకు సన్న్యాసమునకు భేదమును భగవంతుడు నిరూపింపకుండుట గమనింప దగియున్నది. ఆయన ఆ రెండింటిని పర్యాయపదములనుగానే ఉపయోగించుచున్నాడు. దేహధారి, అనగా దేహాభిమానము కలవాడు, నిశ్శేషముగా కర్మలను త్యజించుట అశక్య మని, కర్మలను చేయుచు వాని ఫలములను త్యజించినవాడు త్యాగియే యగు నని ఉద్ఘాటించుచు ఆయన, "అనిష్టము ఇష్టము మిశ్రము అని మూడు విధములుగా నున్న కర్మ ఫలము అత్యాగులైనవారికి మరణించిన తరువాత సంభవించు" నని, సన్న్యాసులైన వారికి మాత్రము సంభవింప దని నిర్దేశించెను. (42 శ్లో. 12) దీనిని బట్టి త్యాగి యన్నను సన్న్యాసి యన్నను ఒకడే అని త్యాగ మన్నను సన్న్యాస మన్నను ఒకటే యని స్పష్ట మగుచున్నది.

ఇచ్చట సన్న్యాస త్యాగశబ్దములను కర్మయోగమున ప్రవేశించుచున్న యర్జునుని వంటి వారిని ఉద్దేశించియే అర్థవివరణము భగవానుడు కావించుచున్నా డని గ్రహింపవలసియున్నది. ఇక్కడి సన్న్యాస శబ్దార్థమునకు సన్న్యాసాశ్రమదీక్షకు సంబంధము లేదు. ఆ దీక్షలో అంగమైన నిత్యనైమిత్తికాది కర్మ పరిత్యాగమునకు ఇచ్చటి త్యాగశబ్దార్థమునకును సంబంధము లే దనుట స్పష్టము. కర్మయోగమున ధ్యానయోగమున సిద్ధిని పొంది జ్ఞానయోగమున ప్రవేశించిన వారికి కూడ ఇక్కడి సంన్యాస త్యాగ శబ్దార్థములు ఉపదేశింపబడుట లే దని కూడ గ్రహింప వలసి యున్నది

## (vi) స్వధర్మ ప్రాశస్త్య చమసము

అర్జునుడు అడిగిన సన్న్యాస త్యాగశబ్దార్థములను వివరించిన తరువాత కర్మయోగమును అవలంబించినవానికి స్వధర్మముగా యుద్ధమువంటి క్రూరకర్మను

గావించినను పాప మేదియు రా దని భగవానుడు ఇట్లు ఉద్ఘాటించుచున్నాడు. ఎవనికి "నేను చేయుచున్నాను" అను అహంకారము లేదో, కర్మఫలమును గూర్చి భావన లేదో అట్టివాడు ఈలోకములను సంహరించినను, చంపినవాడు కానేరడు, ఆ కర్మఫలముచేత బంధింపబడడు. **(42 శ్లో. 17)**

పిదప భగవానుడు కర్మయోగసాధకునకు ఆవశ్యకములైన యనేకవిషయములను బోధించినాడు. సాత్త్వికరాజస తామస భేదముల ననుసరించి జ్ఞానము, కర్మ, కర్త మూడు విధములుగా ఎట్లుండునో ఆయన నిరూపించినాడు. అట్లే ఆయన బుద్ధి ధృతి సుఖము అను వానియందలి మూడు విధములైన భేదములను నిరూపించెను.

## గీత

పిదప స్వభావము నుండి ఉద్భవించుచున్న గుణములచేత బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులకు కర్మలు ఎట్లు విభజింపబడియున్నవో వివరించినాడు

శ్లో|| బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప |
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః || 41

అధ్యాయ - 42

## విజయప్రభ

దీనినిబట్టి శ్రుతిస్మృతులచే తనవర్ణమునకు విహితములైన కర్మలను స్వధర్మములనుగా స్వీకరించి కర్మయోగి నిష్కామముగా అనుష్ఠించినప్పుడే వానికి చిత్తశుద్ధి అను కర్మయోగసిద్ధి కలుగుననుట స్పష్టము. అట్లు గాక వర్ణధర్మములను వీడి తనకు ధర్మమునుగా తోచిన దానిని ఎంత శ్రద్ధతో అనుష్ఠించినను అది ఫలప్రదము కాదని గ్రహింపవలసియున్నది.

శ్రీకృష్ణుడు అర్జునునకు వర్ణధర్మములను బోధింపవలయునా ? ఇట్టి ప్రాదమిక విషయములు **(Elementary things)** అర్జునునకు తెలియవా ? కామమో క్రోధమో శోకమో మనస్సును ఆక్రమించినప్పుడు పరమసత్యములుగా ఎల్లరు భావించు ధర్మములు కూడ, సుడిగాలికి చెట్లకొమ్మలవలె, విఱిగి ఎగిరిపోవుట సహజము. కామావేశమున పరస్త్రీని బలాత్కరించుట, క్రోధవేగమున గురువులను ధిక్కరించుట అనేకులలో సంభవించుచున్నది వారికి ధర్మములు తెలియ వని చెప్పుటకు వీలులేదు. మనస్సు సంక్షుభిత మైనప్పుడు ఆ ధర్మములు నిర్జీవములై అడుగునబడి లేనివానితో సమాన మగును అప్పుడు పెద్దలు సమయోచితముగా ఉపదేశించుచు ఆ ధర్మములను ఉజ్జీవింపజేయవలె. అర్జునుని విషయమున ఈ పరిస్థితియే సంభవించినది. గురువులు బంధువులు నశింతు రను తలంపు కలిగినంతనే వారివిషయమున జాలి కలిగి అది తీవ్రమై అర్జునుని మనస్సును ఆవేశించినది (తం తథా కృపయావిష్టమ్ - 26 అధ్యా. శ్లో 1). దానితో అతని మనస్సు క్షుభితమై అంతవఱకును నిస్సందేహముగా తెలిసియున్న

వర్ణధర్మములు నిస్తేజములై అడుగున పడిపోయినవి. అందువలన అప్పు డతనికి స్వధర్మమైన యుద్ధము అధర్మముగా పరధర్మమైన భిక్షాటనము కర్తవ్యముగా తోచినది. అందువలన భగవానుడు అర్జునునకు చక్కగా తెలిసియుండిన వర్ణధర్మములను మరల ఉపదేశించెను

# గీత

ఏ పరిస్థితియందైనను, మనదృష్టికి ఎంత అక్రమముగా అన్యాయముగా తోచుచున్నను, శాస్త్రవిహితమైన స్వధర్మమును విడనాడరాదని ఆయన యిట్లు ఉద్బోధించుచున్నాడు. "చక్కగా అనుష్ఠింపబడిన పరధర్మముకంటె స్వధర్మము విగుణమైనను శ్రేయస్కరము. స్వభావ నియతమైన కర్మను చేయువాడు కిల్బిషమును పొందడు. అర్జునా ! దోషయుక్తమైన దైనప్పటికి సహజమైన కర్మను త్యజింప రాదు నిప్పును పొగవలె, సకలారంభములను దోషము ఆవరించుచునే యున్నది"

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47

శ్లో॥ సహజం కర్మ కౌంతేయ సదోష మపి న త్యజేత్।
సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్ని రి వావృతాః ॥ 48

అధ్యాయ - 42

# విజయప్రభ

భవ మనగా పుట్టుక. భవమువలన కలిగిన ఉనికి (existence) భావము. పుట్టుక వలన ప్రతివ్యక్తికి దేశజాతి కులకుటుంబములతో పాటు మనశ్శరీరేంద్రియములు లభించుచున్నవి. ఇవి నిష్కారణముగా ఏర్పడవు పూర్వజన్మ కర్మఫలముగానే ఇవి ఒక్కొక్కనికి లభించుచున్నవి. పుట్టుకను నియమించుచున్న పూర్వజన్మకర్మయే ప్రతివ్యక్తికి స్వభావమును రూపొందించుచున్నది అది తల్లిదండ్రులవలన వారి కుటుంబమువలన అభివ్యక్త మగుచున్నది. ఈవిధముగా బ్రాహ్మణదంపతులకు జన్మించిన వాడు బ్రాహ్మణుడు, క్షత్రియదంపతులకు జన్మించినవాడు క్షత్రియుడు అగుచున్నాడు. ఇట్లు జన్మమువలన ఒక్కొక్కనికి బ్రాహ్మణత్వము మొదలగు స్వభావములు (characteristics of existence) ఏర్పడుచున్నవి.

ఈ స్వభావభేదముల ననుసరించి శ్రుతిస్మృతులు వర్ణధర్మములను నియమించుచున్నవి. అట్లు నియమింపబడిన ధర్మకర్మ స్వభావము నియతమగును. అట్టి కర్మ యజ్ఞము వంటిది కాని, యుద్ధము వంటిది కాని, హింసాత్మకముగా దోషమయముగా కన్పింపవచ్చును. అంత మాత్రమున దానిని వీడి మఱియొకరి ధర్మమును స్వీకరింప రాదు. ఎందువలన? కట్టెలతో నిప్పును పుట్టింపగానే దానితో పాటే పొగ బయలుదేరి దానిని ఎట్లు ఆవరించుచున్నదో, అట్లే ఏ కార్యమును ఆరంభించినను మనకు తెలిసియో

తెలియకయో ఏదేని ఒకదోషము దానిని ఆవరించియే యుండును. సకలకార్యములు తత్ఫలములు త్రిగుణాత్మకములు. సృష్టియంతయు త్రిగుణాత్మకము. కావునకేవలము పరిశుద్ధమైన కార్య మేదియు నుండదు. దోషయుక్తత్వము సకలకర్మలకు సమానమైనప్పుడు ఎవనికి ఏది పుట్టుక చేత వర్ణాశ్రమదర్మముగా విహిత మగుచున్న దో అట్టి స్వదర్మమే వానికి శ్రేయస్కర మగును. అట్లు కాక తండ్రి తాత ముత్తాత మొదలుగా తన పూర్వులచే అవలంబింపబడిన దర్మమును వీడి, చాల గొప్ప దను వ్యామోహముతో పరధర్మమును అవలంబించినచో అది అవినయమునకు అవిధేయతకు **(indiscipline)** మూలమగును ఆ పద్ధతియందు కొనసాగువాడు సదాచారములను అతిక్రమించుటకు అలవాటు పడి దంబాహంకారములు నొంది సజ్జనులకు సద్గతికి దూరుడగును

మోక్షమును పొంద గోరువాడు మొదట పొందవలసినది ఈశ్వరానుగ్రహము, దానివలన చిత్తశుద్ధి. ఏ వర్తనమును అవలంబించినచో ఐహికము ఆముష్మికమును అయిన యభ్యుదయము శ్రేయస్సు కలుగునో ఆవర్తన విదానమును ఈశ్వరుడు వర్ణాశ్రమ ధర్మరూపమైన శాస్త్రముచే విధించుచున్నాడు. శ్రుతిస్మృతులు భగవంతుని యాజ్ఞలు. తనయాజ్ఞలను అనుష్ఠింపక తన్ను కీర్తించుచు ఎన్ని విధముల పూజించినను ఈశ్వరుడు అనుగ్రహించడు. యజమాని విధించి యుండిన కార్యమును నిర్వహింపక భృత్యుడు ఆయన విగ్రహమును ఏర్పఱచుకొని ఎంత భక్తితో సంకీర్తనము గావించుచు పూజించుచున్నను, యజమాని సంతోషింపకపోగా తాను చెప్పిన పని చేయ లేదని ఆగ్రహమునే పొందును. కావున ఈశ్వరానుగ్రహమును పొందుటకు ఆయనచే విధింపబడిన వర్ణాశ్రమధర్మములను అనుష్ఠించుచుండుటయే సాధనము అదియే ముఖ్యమైన ఈశ్వరార్చనము.

## గీత

ఈ విషయమునే భగవానుడు ఇట్లు ఉద్ఘాటించినాడు. "తనకు విహితమైన కర్మమునందు అభిరతి కలవాడు సంసిద్ధిని పొందును. స్వకర్మనిరతుడు సిద్ధిని ఎట్లు పొందునో వినుము. సమస్తప్రాణులకు ఎవనినుండి ప్రవృత్తి కలుగుచున్నదో, ఎవని చేత ఈ జగత్తు అంతయు వ్యాప్తమై యున్నదో అట్టి యీశ్వరుని స్వకర్మానుష్ఠానముచేత అర్చించి మానవుడు సిద్ధిని పొందును".

శ్లో|| స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః |
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు || 45

శ్లో|| యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్ |
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః || 46

అధ్యాయ - 42

**కావున కర్మయోగము నవలంబించి ఈశ్వరాను గ్రహమును చిత్తశుద్ధిరూపమైన సిద్ధిని పొందుగోరువాడు స్వధర్మకర్మానుష్ఠానమే ముఖ్యమైన ఈశ్వరార్చన మని గ్రహింపవలసి యున్నది**

## (vii) వర్ణధర్మములు - వంశపరంపరాప్రాప్తములు

## విజయప్రభ

ఈ సందర్భమున వర్ణదర్మములు వృత్తులపై (profession) ఆధారపడి యుండ వని గ్రహింప వలసియున్నది. వర్ణదర్మములు జన్మసిద్ధములు జీవనము కొఱకు అవలంబింపబడు నవి వృత్తులు. ఆపదలయందు కొందఱు తమ వర్ణములకు అనుగుణములు కాని వృత్తులను అవలంబింపవచ్చును. అంతమాత్రమున జన్మసిద్ధములైన వర్ణములు మాఱవు. అపవాదములు (Exceptions) ఆగంతుకములు (accidental) అయిన వృత్తులవలన పుట్టుకతో వచ్చిన వర్ణములు మాఱవు. క్షత్రియులను మించి యుద్ధములు చేసిన పరశురాముడు, ద్రోణుడు, అశ్వత్థామ, క్షత్రియులు కాలేదు. బ్రాహ్మణులను మించి ధర్మతత్త్వోపదేశములు గావించిన భీష్ముడు, కృష్ణుడు, విదురుడు బ్రాహ్మణులు కాలేదు. రాజ్యములను పాలించిన రెడ్లు కాకతీయులు శూద్రులుగానే యుండిరి. వారు వర్ణధర్మములను కాపాడుచు, అందులకై విజాతీయులతో ప్రాణములొడ్డి పోరాడుచు, వేదశాస్త్ర పరిరక్షణమునకై ఎన్నో అగ్రహారాది దానములను కావించిరి. వర్ణధర్మ విధానము కేవలముగా సాంఘిక సామాజిక వ్యవస్థ (socio-economic structure) కాదు. అది పరమగమ్యమైన బ్రాహ్మీస్థితికి చేర్చు మార్గమున జీవునకు నిరాయాసముగా నిశ్చితముగా ఒకస్థాయి నుండి మఱియొక స్థాయికి గొనిపోవునట్టి పద్ధతి.

జీవులకర్మ ఫలములు అనేక విధములుగా విచిత్రములుగా నుండును అందువలన మహాభక్తులు యోగులు ఒకానొక దుష్కర్మ ఫలముగా నిమ్న కులములయందు జన్మింపవచ్చును. ఆకర్మానుభవము పూర్తి యైనంతనే ఆ జన్మమునందే ముక్తిని పొందవచ్చును. మహాశివభక్తుడైన నందనారు, ఆముక్తమాల్యదయందు వర్ణింపబడిన గొప్ప విష్ణుభక్తుడు మాలదాసరి యిట్టివారే వారు పరమేశ్వరుని యాజ్ఞారూపములైన శ్రుతిస్మృతులవలన పెద్దలు ఏర్పఱచిన సామాజిక నియమనిషేధములను యథాతథముగా పాటించిరే కాని, వానిని అతిక్రమించుటకు ప్రయత్నింపలేదు , పై వర్ణములలో ఉన్న యనేకులకన్న మేము అధికుల మని స్ఫురింపజేయ లేదు. అట్లు చేసినచో ఈశ్వరునిచే ఉద్దేశింపబడిన వర్ణవిధానము సంకరమై సమాజమున అవ్యవస్థ ఏర్పడును వారిని గుణవిశేషములచేత పై వర్ణమునందు ప్రవేశపెట్టవలయు నన్నచో ఎన్ని గుణము లున్నచో పై వర్ణమున చేర్చవచ్చునో, ఎన్ని గుణములు తగ్గినచో పై వర్ణమువానిని క్రింది వర్ణమునకు దింపవచ్చునో ఎవడు ఎట్లు నిశ్చయింపగలడు? కావున ఇప్పటి గుణకర్మములను బట్టి వర్ణములను ఏర్పఱచుట అసాధ్యము అందువలన జన్మచేతనే వర్ణవిభాగము నిశ్చయింపబడినది ఇది సృష్టియందు సహజము. గుఱ్ఱము ఎంత హీనస్థితికి వచ్చినను కుక్క అగుట లేదు. దుష్టమైన గుఱ్ఱము నీచమైన గుఱ్ఱము పనికిమాలిన గుఱ్ఱము అని చెప్పుచుందురే కాని కుక్కనుగా వ్యవహరింపరు. అట్లే కుక్క ఎంత అభివృద్ధి నొందినను బలిష్ఠమైన కుక్క, అందముగా నున్న కుక్క, విశ్వాసము గల కుక్క అనియే వ్యవహరింతురు గాని గుఱ్ఱమునుగా గ్రహింపరు. ఇంతే కాదు.

గుఱ్ఱములలో కుక్కలలో అవాంతర జాతుల విషయమున కూడ జన్మమునకే విలువ నిచ్చుచున్నారు ; తాత్కాలికములై గుణకర్మవిశేషములకు ప్రాముఖ్యము నొసంగుట లేదు పందెపు గుఱ్ఱమును కొనదలచినవాడు ఉత్తమజాతి గుఱ్ఱములలో కూడ కుటుంబపరంపరను (Pedigree) తాతముత్తాతలవఱకు పరిశీలించి యెన్నికచేయునేకాని, బండిని లాగుచున్న సామాన్యములైన గుఱ్ఱములలో ఏదైనను ఎంత వేగమును శక్తిని ప్రకటించినను దానిని స్వీకరింపడు. ఆల్సేషియన్ జాతి కుక్కను కోరినవాడు వీథికుక్కలలో ఒకానొకటి చాల అందముగా బలిష్ఠముగ తేజస్విగా ఉన్నను స్వీకరించుటకు ఇష్టపడడు. కావున జంతువుల అవాంతర జాతులలో కూడ ఇప్పటి గుణకర్మలను బట్టి అవి హెచ్చినచో బండిని లాగు గుఱ్ఱము వందెపు గుఱ్ఱము అగుట లేదు , వీధి కుక్క ఆల్సేషియన్ జాతిది అగుట లేదు ; తగ్గినచో వందెపు గుఱ్ఱము బండిని లాగునది అగుట లేదు, ఆల్సేషియన్ జాతిది వీథికుక్కగా వరిగణింపబడుట లేదు. కావున ఇప్పటి గుణకర్మల హెచ్చుతగ్గులచేత జన్మసిద్ధమైన జాతి మారకుండుట సృష్టి లక్షణమని, ఇట్లే సర్వసమానత్వము సృష్టిలక్షణము కా దని, హెచ్చుతగ్గులు సృష్టికి సహజ మని గ్రహింప వలసి యున్నది.

సమాజమున వర్ణములు కులములు ఏర్పడుట సృష్టియొక్క పరిణామ క్రమమునకు సహజఫల మని పాశ్చాత్య శాస్త్రజ్ఞులు ఉద్ఘాటించుచుండుట గమనింపదగియున్నది.

"కీటకములు మనుష్యులు అను సంఘటితములైన రెండు సముదాయములయందే యథార్థమైన కుల విభజనము (communalism) కన్పించుచున్నది, ఒక్కొక్క దానియందు ఇది దీర్ఘము ముఖ్యమును అయిన పరిణామక్రమముయొక్క చరమఫలముగానే కన్పించుచున్నది.

వాని (కీటకములయొక్క) సాంఘిక సంఘటనముతోపాటు భౌతికమైన భిన్నత్వము ప్రస్ఫుటముగా గోచరించుచున్నది ; దానినిబట్టి కనీసము నాలుగు స్పష్టములైన వర్ణములను సాధారణముగా గుర్తించుటకు వీలగుచున్నది.

ఆ నాలుగు వర్ణములు ఇవి.

మొదటిది శ్రామికులు, ఇవి చిన్నవి, గ్రుడ్డివి, ఱెక్కలు లేనివి, కాంతిహీనమైన రంగు కలవి, పెంపొందని లైంగికములైన అవయవములు కలవి, కాని చక్కగా రూపొందిన దౌడలు కలవి.

రెండవది యోధులు. ఇవి కూడ గ్రుడ్డివే, ఱెక్కలు లేనివే, లైంగికముగా పెంపొందనివే కత్తెరయొక్క ఆకారమున పెంపొందిన దౌడలు, పెద్దతల, రంగులో అధికమైన నల్లదనము, తక్కినవానికంటె వీనికి విశిష్టతను కలిగించుచున్నవి.

మూడవదానియందు, కొఱతను పూరించునట్టి మగవి ఆడవియైన కీటకము లుండును. ఇవి కూడ గ్రుడ్డివై ఱెక్కలు లేనివై యుండును. ఇవి పరిమితములై జననేంద్రియ

శక్తులను కలిగియుండును. ఈ విశేషమును తప్పించినచో ఇవి ఇంచుమించుగా పెద్ద శ్రామికులవలెనే యుండును. ప్రధానములైన మగ ఆడ కీటకములు ఏ కారణముచేతనైన సంతతిని సృష్టింపలేని పరిస్థితియందు ఆ కొఱతను నింపుచుండుటయే (supplement) వీనికి విధి

యధార్థములు కాక ప్రధానములు అయిన మగ ఆడ కీటకములు నాల్గవ వర్ణము ఇవి రంగులో యధికమైన నల్లదనము, ఱెక్కలు, నేత్రేంద్రియములు కలిగి తక్కిన వర్ణములలోని వానికంటె ప్రస్ఫుటముగా భేదమును పొందుచున్నవి. బహిః ప్రపంచముతో సంబంధము వీనికి మాత్రమే యుండును.

"True communalism is found in but two groups of organisms, the insects and mankind , in each instance the final culmination of a long and important evolutionary line.....

Their social organisation was carried with it a remarkable physical differenciation so that atleast four distinct castes are generally recognisable .

The four castes are -

First, the workers ; small blind wingless, pale in colour, with undeveloped sexual organs,but with fairly well-formed jaws

The second are the soldiers. These are also blind and wingless and sexually undeveloped. Their chief distinction from all other castes lies in the greatly developed scissors shaped Jaws which, together with the enlarged head, are darker in colour .

The third caste consists of the complemental males and females, also blind and wingless, but with limited powers of procreation , otherwise they look not unlike the larger workers. Their duty is to supplement the production of the young in the event of failure on the part of the chief sexed individuals.

The fourth caste are the true or chief males and females. These differ markedly from the other castes in their darker colour and in being possessed of both wings and organs of vision, as they alone are concerned with the external world. . ."

(Pages 218, 219 Organic Evolution - By Richard Swann Lull, New York, The Macmilon Co. 1949)

కావున మనష్యజాతిలోని వర్ణభేదములు సృష్టిపరిణామక్రమమున సహజముగా ఏర్పడినవే కాని, ఎవరో కొందఱు స్వార్థముతో ఏర్పఱచినవి కావు. పరిణామ క్రమమునకు చరమఫలము, సమాజ సంఘటనమునకు వ్యక్తుల సమ్యగ్జీవనమునకు అత్యంతము ఆవశ్యకమైన వర్ణవ్యవస్థను వేదము గుర్తించి దానియొక్క సుస్థితికి ఆవశ్యకములైన వర్తనవిధానములను నియమములను విధించినది. ధర్మశాస్త్రకర్తలు ఆ విశేషములను వివరించినారు.

తాత్కాలికములై వృత్తులవలన ఆనువంశికమలైన (hereditory) జీవకణగతములైన జాతిలక్షణములు మార్పునొందవని ఆధునిక జన్యుశాస్త్రము ఎట్లు నిరూపించుచున్నదో గమనింపుడు.

1 "స్వయముగా కష్టపడి సంపాదించినవి అయినను కాకపోయినను (పరిస్థితుల ప్రభవముచే పెంపొందినవి యైనను) అభివృద్ధి నొందింపబడిన లక్షణములు ఆనువంశికముగా సంతతికి ఎప్పుడును సంక్రమింపవు. వ్యక్తియొక్క స్వభావములో ఏర్పడు మార్పులవలన ఆనువంశికమైన జీవకణము మార్పు నొందదు

2 వీర్యకణములు పెరుగుచున్న యారంభదశలో పరిసరములవలన కలుగు ప్రచోదనము చాల అరుదుగా అకణములయొక్క ఆనువంశికమైన నిర్మాణమునందు మార్పులు కలిగింపవచ్చును. కాని స్థూలములైన శరీరములోని కణములయందు (somatic cells, excluding germ cells) కలుగు మార్పు లన్నియు వీర్యకణముల యొక్క ఆనువంశిక నిర్మాణము నందు (hereditary constitution) అట్టిమార్పులను కలిగింపవు.

3 వీర్య కణములలో, ఆనువంశికములు కానివి, శరీరములోని కణములవలె మార్పులను పొందవచ్చును. వానికి పోషణము జరుగకున్నచో అవి పెరుగుదల లేని (stunted) వ్యక్తులను పుట్టింపవచ్చును. వాని ప్రభావము రెండు మూడు తరముల వఱకు ఉండవచ్చును. వానిపై దట్టమైన మరకలు పడవచ్చును. వానివలన పుట్టునట్టి తరమునందు కూడ అవి ఆవిధముగానే మరకలను పొందవచ్చును. మద్యసేవనమువలన అవి విషయుక్తములు కావచ్చును ; లేదా ఉష్ణతాపముయొక్క తారతమ్యమువలన మార్పు నొందవచ్చును. అట్టి ప్రభావము ఆనువంశికము కాకుండ పైతరమునకు మాత్రము ప్రసరింపవచ్చును. అట్టివి యన్నియు "బహిఃప్రేరణము" (external induction) అనియే గ్రహింపబడుచున్నవి. మధ్యలో సంపాదింపబడిన లక్షణములు ఆనువంశికముగా సంక్రమించిన వేమో అని ఊహింపబడినప్పుడు, అవి కూడ ఈ "బహిఃప్రేరణము" యొక్క తెగకే చెందును.

4 పరిసరముల ప్రభావము వ్యక్తియొక్క అభివృద్ధియందు గాఢముగ మార్పులను కలిగింపవచ్చును ; కాని అది సాధారణముగా ఆనువంశికమైన లక్షణమును మార్చదు.

1 "Developed characters, whether `acquired' or not, are never transmitted by heredity and the hereditary constitution of the germ is not changed by changes in character.

2. Possibly environmental stimuli acting upon germ cells at an early stage in their development may rarely cause changes in hereditary constitution, but changes produced in somatic cells do not cause corresponding changes in the hereditary constitution of the germ cells

3 Germ cells like somatic cells may undergo modifications which are not hereditary, if starved they may produce stunted individuals and this effect may last for two or three generation , they may be stained with fat stains and the generation to which they give rise be similaryly stained , they may be poisoned with alcohol or modified by the temperature and such influence be carried over to the next generation without becoming hereditary All such cases are known as "induction" and many instances of the supposed inheritance of acquired characters come under this category.

4 **Environment may profoundly modify individual development but it does not generally modify heredity.**

**(Chap. XXXX, P. 414, Para III - Evolution, Genetics and Eugenics - By HORATIO HACKETT NEWMAN)**

దీనినిబట్టి తాత్కాలికములైన వృత్తులవలన అనాదిగా తరతరములుగా వచ్చుచున్న అనువంశికములై జన్యులక్షణములు (Characters of hereditary genes) మారవనుట స్పష్టము. శాతవాహనులు బ్రాహ్మణులు. వారు రాజులై అనేక శతాబ్దములు పాలించిరి. వారి పూర్వులవలెనే వారి తరువాత ఆవంశమువారు సాధారణ బ్రాహ్మణులేయై యుందురు. మధ్యలో వచ్చిన రాచరికము వలనే వారి బ్రాహ్మణత్వము పోలేదు. పీష్వాల విషయము ఝాన్సీ రాజవంశము సంగతి ఇట్టిదే. ఆపదవుల వలన వారు క్షత్రియులు కాలేదు. ఆవంశములవారు మరల సామాన్య బ్రాహ్మణులే అయినారు. కాకతీయులు కాపులు, రెడ్డిరాజులు రెడ్లు. వారు రాజులుగా చక్రవర్తులుగా పాలించుచున్న కాలమున కూడ తమతాతల వలన ముత్తాతల వలన సంక్రమించిన శూద్రవర్ణత్వమును వారు నిరాకరింప లేదు. వారికి పూర్వులు కృషీవలులై శూద్రుగా ఎట్లు ఉండిరో, చక్రవర్తిత్వము రాచరికములు పోయినతరువాత, ఆవంశములవారు మరల భూస్వాములైన శూద్రులే అయినారు. కావున అధికారపదవులవలన వృత్తివిశేషములవలన వర్ణములు మారవు.

జన్మించిన తరువాత, వ్యక్తులయందు గోచరించు గుణములను బట్టి మంచి బోధకత్వము కలవాడు బ్రాహ్మణు డగు నని, యుద్ధకౌశలము కలవాడు క్షత్రియు డగు నని నిశ్చయించుట అత్యంతము అసంగతము. అట్లు భావించుట వారి తల్లిదండ్రులను అవమానించుట, తాతలను ముత్తాతలను ధిక్కరించుటయే యగును. తల్లిదండ్రుల వలన వర్ణమును నిర్ణయింపకున్నచో వివిధములైన జాతకర్మ, ఉపనయనాది సంస్కారములను సకాలముగా జరుపుటకు వీలుండదు.

మఱియొక విషయము కూడ గమనింపదగియున్నది. ఒక్కొక్క వంశమునందు అయిదారు తరములవారు సామాన్యులై యుండగా, తరువాత ఒకతరములో ఒకడు ఆ వంశలక్షణములతో మహోజ్జ్వల శక్తి సంపన్నుడై జన్మింపవచ్చును. శ్రీ శంకర భగవత్పాదుల వారు, భగవద్రామానుజులవారు, శ్రీ మధ్వాచార్యులవారు మొదలగు వారు జన్మించుటకు పూర్వము ఆవంశములలో అంత శక్తి సంపన్నులు

పూర్వతరములలో వందలయేండ్లుగా ఎవరు ప్రసిద్ధులు కాలేదు. కాని ఆవంశములలో వేలకొలది యేండ్లుగా పురుషుల వైపున స్త్రీలవైపున వంశపరిశుద్ధత (purity of heredity) కాపాడబడి యున్నదని గ్రహింపవలసియున్నది. వివాహ సంబంధములలో తాత్కాలికములైన వ్యక్తులయొక్క అందచందములు సంపదలు సామర్థ్యములు కాక వంశములయొక్క పవిత్రతను ప్రధానముగా గ్రహించుట సంప్రదాయసిద్ధముగా నున్నది

గుణసంపత్తివలన వర్ణము ఎట్లు మారదో, అట్లే దోషములు ప్రాబల్యమువలన కూడ మారదు. చెడిన బ్రాహ్మణుని విషయమున కూడ దుష్టబ్రాహ్మణుడు అని చెప్పుదురే కాని క్షత్రియుడని చెప్పరు. అట్లే క్షత్రియుడు ఎంత గొప్పవాడైనను ధర్మపరుడైన క్షత్రియుడు, మహాయోగియైన క్షత్రియుడు విజ్ఞానశాలియైన క్షత్రియు డనియే చెప్పుదురు. కావున ఎన్ని విశేషములు (Adjectives) మాఱినను విశేష్యమైన (noun) జన్మసిద్ధమైన జాతి మాఱదు. కావున సృష్టికి సహజములైన వర్ణధర్మములకు అగంతుకములైన వృత్తి కర్మలకు గల యీ భేదమును నిరూపించుచు భగవానుడు అర్జునునకు "నీవు క్షత్రియుడవు , జన్మసిద్ధమైన నీ క్షత్రియత్వము ఏ పరిస్థితియందును మాఱదు , నీకు స్వధర్మమైన యుద్ధమును అనుష్ఠింపుము" అని మాటిమాటికి బోధించెను. అందువలన కర్మయోగమును అభ్యసింపబూనిన వాడు తనకు స్వీయమైన వర్ణధర్మకర్మలనే ఫలాభిసంధి రహితముగా అనుష్ఠించుచు చిత్త శుద్ధిని సాదింపవలె.

## (viii) శరణాగతి ధర్మ చమనము

ఈశ్వరానుగ్రహ పూర్వకమైన చిత్త శుద్ధియే కర్మయోగమునకు సిద్ధి. దానివలన ఆత్మానాత్మవివేకము దమము శమము మొదలగు గుణములు కలుగును. అందువలన ఆ సిద్ధి జ్ఞానయోగమున ప్రవేశించుటకు అర్హతను కలిగించును. ఆ సిద్ధిని పొందినవాడు జ్ఞానయోగమున ప్రవేశించి బ్రహ్మమును ఎట్లు పొందవలయునో సంగ్రహముగా (సమాసేనైవ) భగవానుడు చెప్పినాడు.

కర్మయోగమున ప్రవేశించుచున్న యర్జునునకు జ్ఞానయోగమును గూర్చి చెప్పుట ఆవశ్యకము కాదు. అయినను విద్యాభ్యాసమువలన తుదకు కలుగు వైభవమునుగూర్చి ప్రశంసించినచో విద్యార్థికి విద్యాసముపార్జనమున శ్రద్ధ బలపడునట్లు, అర్జునునకు కూడ కర్మయోగమున శ్రద్ధ రూఢమగుటకొఱకు తుది గమ్యమైన బ్రహ్మప్రాప్తినిగూర్చి భగవానుడు చెప్పుచున్నాడు. "అహంకారము దర్పము కామము క్రోదము మొదలగు వానిని వీడి మమత్వరహితుడైన వాడు బ్రహ్మమును పొందుటకు సమర్థు డగును. బ్రహ్మమును పొందినవాడు ప్రసన్నాత్ముడై ఏది సంభవించినను శోకింపడు. హర్షము నొందడు. సర్వభూతములయందలి సుఖమును దుఃఖమును తన సుఖముతో తన దుః ఖముతో సమానముగా గ్రహించుచు అతడు పరమేశ్వరునియందు పరమమైన భక్తిని పొందును. ఆ భక్తిచేత అతడు భగవంతుడు యథార్థముగా ఎంతవాడో ఎవడో తెలిసికొని ఆయనను పొందుచున్నాడు. అనగా జ్ఞానయోగమును అభ్యసించువాడు భగవంతునిగూర్చి ధ్యానించుచు భగవత్స్వరూపమును గ్రహించును. భగవంతుడే

తనస్వరూపమును ఇట్లు నిరూపించి యున్నాడు. "అర్జునా! సకల భూతములయొక్క హృదయములందు ఉన్న ఆత్మను నేను, భూతములయొక్క ఆది అంతము మధ్యము నేనే" అని, "సర్వక్షేత్రములయందున్న క్షేత్రజ్ఞుని నన్నుగా ఎఱుంగుము" (గీ. 13-2) అనియు ఆయన చెప్పియే యున్నాడు. ఈ విధముగా జ్ఞాని తన్ను సర్వాత్మకమైన బ్రహ్మమునుగా పరమేశ్వరునిగా తెలిసికొని ముక్తుడై ఆనందాత్ము డగును.

## గీత

ఈ విషయమును సంగ్రహముగా చెప్పి ముగించి భగవానుడు అర్జునునకు కర్మయోగాభ్యాసమున ఆవశ్యకమైన భక్తిని బోధించినాడు. "భగవంతుడు ఒక్కడే నాకు దిక్కు, ఆయన నాయంతఃకరణము నందు దేనిని ప్రేరేపించుచున్నాడో దానిని చేయుచున్నాను , నాకు ఈ కర్మలతో వీనిఫలములతో ఎట్టి సంబంధము లేదు" అను దృఢనిశ్చయము కలిగి యుండుటయే ఈశ్వర శరణాగతి. ఇదియే భక్తి. ఇట్టి భక్తుడు సకల కర్మలను, అనగా శాస్త్ర విధి తెలియక నిషిద్ధ కర్మలను చేయుచుండినను, భగవంతుడు అనుగ్రహించి వానిని క్రమముగా బ్రహ్మమునకు చేర్చును.

నిరాకారుడు నిర్గుణుడు సర్వవ్యాపకుడు అయిన యా పరమాత్మను భావించుట ఎట్లు, భజించుట ఎట్లు, అని అర్జునుడు కాని ఆస్థితియందున్న యితరులు కాని నిర్వేదమును పొందవచ్చును. అట్టి అసహాయ స్థితికి (helpless state) అవకాశము లేకుండ శ్రీకృష్ణుడు ప్రత్యక్షముగా కన్పించుచున్న తన్నే పరమేశ్వరునిగా భావించి కర్మలను కర్మఫలములను తనకే అర్పించుచు కర్మయోగమును అనుష్ఠించుచు ఆమోక్షమార్గమున ముందుకు పొమ్మని అర్జునుని ఇతరులను వెన్నుతట్టి ప్రోత్సహించినట్లు ప్రబోధించుచున్నాడు. "నాయందు మనస్సు నిలిపినచో నీవు నాయనుగ్రహమువలన సకల కష్టములను దాటగలవు. అట్లుకాక నీవు అహంకారముతో నామాటను వినకున్నచో వినాశము నొందుదువు. అహంకారమును అవలంబించి, 'నేను యుద్ధము చేయను' అని నీవు అనుకొనుచున్న నిశ్చయము మిథ్య నీ ప్రకృతియే నిన్ను నియోగించును అజ్ఞానమువలన ఏ పనిని నీవు చేయుటకు ఇష్టపడుట లేదో దానిని, నీకు స్వభావసిద్ధమైన కర్మచేత నిబద్ధుడవై దానికి వశుడవై చేయుదువు"

శ్లో|| మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి |
అథ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి || 58

శ్లో|| య దహంకరా మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే |
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి || 59

శ్లో|| స్వభావ జేన కౌన్తేయ నిబద్ధ స్స్వేన కర్మణా |
కర్తుం నేచ్ఛసి య న్మోహాత్ కరిష్య స్యవశోఽపి తత్ || 60

గీత - అధ్యాయ 18

# విజయప్రభ

ఈ సందర్భమున అనెక విషయములు వ్యక్త మగుచున్నవి. ప్రతి వ్యక్తికి జీవిత సన్నివేశములు (situations of life) ప్రారబ్ధముచేతనే ఏర్పడుచున్నను, ఆ సన్నివేశములలో తన వర్తనవిదానమును నిశ్చయించుటకు ఆచరించుటకు స్వాతంత్ర్యము (freedom) కలదు. కుంతికి జన్మించుట ధర్మరాజునకు తమ్ముడగుట, దుర్యోధనాదులతో వైరము యుద్ధము, ప్రారబ్ధవశముననే అర్జునునకు ఏర్పడినవి. అయినను యుద్ధము ఆరంభమగుచున్న యీ సన్నివేశమున, ఆయుద్ధమున పాల్గొనుటకు గాని మరలి పోవుటకు గాని అతనికి స్వాతంత్ర్య మున్నది ఈ స్వాతంత్ర్యమువలననే అతడు "నాకు కర్తవ్యమైన ధర్మము విషయమున నామనస్సు మూఢమై యున్నది యుద్ధమును వదలి భిక్షావృత్తితో జీవించుట శ్రేయస్కరమా లేక యుద్ధమును చేయుట మేలా, ఏది ధర్మకర్తవ్యమో నిశ్చయింపుము" అని అర్జునుడు కృష్ణుని ప్రశ్నింపగలిగెను. దీనినిబట్టి సన్నివేశమునకు, అప్పుడు ప్రకోపించు కామక్రోధాదులకు దైన్యమునకు ప్రారబ్ధమే (destiny) కారణమైనను ఆసన్నివేశమున మనచిత్తవృత్తి ననుసరించి కార్యమును నిశ్చయించుకొను స్వాతంత్ర్యము (free will) కూడ కలదనుట స్పష్టము. ప్రారబ్ధము ప్రబలమై ఎన్ని సంకల్పవికల్పములను కలిగించుచున్నను తుది నిర్ణయము జీవునిదే. ఈ యవకాశమువలననే జీవుడు స్వతంత్రుడగుచున్నాడు. అనగా ఏ సన్నివేశమందైనను ధర్మమార్గమున వర్తించుటకు గాని, అధర్మమును అవలంబించుటకు గాని వానికి అవకాశ మున్నదన్న మాట. ఈ యవకాశమువలననే "నేను చేయుచున్నాను" అను నహంకారముతో జీవుడు కర్తయై మంచి పనులను చేసినప్పుడు సుఖశాంతులను శ్రేయస్సును, చెడ్డపనులను చేసినప్పుడు తాత్కాలిక సుఖభోగములను తరువాత పశ్చాతాప దుఃఖములను పొందుచు దుర్గతుల నొందుచున్నాడు. ఈయవకాశము ఉండుట వలననే జీవుని అపమార్గమునుండి మరలించి సన్మార్గమున ప్రవర్తింపజేయుటకు శాస్త్రములు వాని ననుసరించి పెద్దల యుపదేశములును సంభవము లగుచున్నవి.

వ్యక్తులకు స్వాతంత్ర్యము కలిగినప్పుడు ఆ యా సన్నివేశములలో తమ కర్తవ్యమును శాస్త్రమును అనుసరించి, లేక శాస్త్రము ననుసరించి బోధించు పెద్దలు యుపదేశములవలన నిశ్చయించుకోవలె. అంతే కాని తమ యంతఃకరణమునందు ఎప్పటికప్పుడు ఎన్నో విధముల పరిభ్రమించుచుండు ఆవేశములతో ఆలోచనలతో కర్తవ్యమును నిశ్చయింపరాదు." కావున ఇది చేయదగినది, ఇది చేయరానిది అను ఏర్పాటునందు నీకు శాస్త్రము ప్రమాణము. శాస్త్రవిధానమునందు చెప్పబడిన దానిని తెలిసికొని ఈలోకమున నీవు కర్మను చేయదగియున్నావు". (భీష్మపర్వ 40-24) అని భగవంతుడు ఇంతకు ముందే ప్రబోధించియున్నాడు. కావున సత్పురుషులు శాస్త్రమునకు వశులై యుందురే కాని ఏ సందర్భమునందును యధేచ్ఛగా వర్తింపరు.

యుద్ధరంగమునుండి వెనుకకు మరలిపోయిన క్షత్రియుని లోకులు పిఱికివానినిగా భావింతురు. శత్రువులు ఇతరులు కూడ పరిహసించి నిందింతురు. కావున యుద్ధమును వీడిపోవుట యుక్తము కా దని శ్రీకృష్ణుడు మొదట లోకవృత్తము ననుసరించి చెప్పి జీవనిత్యత్వమును ఆత్మతత్త్వమును కర్మ ధ్యానభక్తి జ్ఞాన విశేషములను ఉపదేశించెను. ఇప్పుడు తత్త్వబోధమును విరమించి ఆయన మరల లోకవృత్తమునే అవలంబించి స్వధర్మమైన యుద్ధమును త్యజించుట విపత్తునే కలిగించు నని రెండు విధముల నిరూపించుచున్నాడు. తాను చెప్పినట్లు వినక యుద్ధమును వీడిపోయినచో శత్రువుల నిందవలన ఇతరుల పరిహాసమువలన వనములో అర్జునునకు బ్రతుకు దుర్భరమగు నని, పాపులను దండింపక వదలుటవలన జన్మాంతరమున దుర్గతులు కలుగు నని స్ఫురింపజేయుచు "నీవు వినాశము నొందుదువు" అని బెదిరించినాడు. రెండవ పద్ధతిలో అర్జునుడు అడవిపాలకు పోవుట కూడ అసంభవమే యని నిరూపించుచున్నాడు. అర్జునుని యందు పొంగుచున్న కృపయొక్క ఆవేశము ఎంత సేపు నిలుచును ? యుద్ధ భూమినుండి మరలి శత్రువులకు వెన్ను చూపుచు నాలుగు అడుగులు వేసినంతనే, దుర్యోధనాదులు అమితసంతోషముతో చేతులు తట్టుచు, "ఓహో! చూడుడు, చూడుడు మహావీరుడు పలాయనము చిత్తగించుచున్నాడు" అని కేకలు పెట్టుచు వెంటబడినచో అతడు ప్రశాంతముగా ఒక్క అడుగైనను ముందుకు వేయగలడా ? అతని యందు క్షత్రియ సహజమైన శౌర్యము ప్రజ్వలింపదా ? స్వభావసిద్ధమై పొంగివచ్చుచున్న యా శౌర్యమును అతడు నిగ్రహింపగలడా ? అది యతనికి అసాధ్యము. ఆ శౌర్యము చేత అతడు నిబద్ధుడై, దానికి వశుడై, దానిచే నియోగింపబడి, ఇష్టము ఉన్నను లేకున్నను యజమానికి లోబడిన దాసుడు ఎట్లు అతడు చెప్పినట్లు చేయునో, అట్లే అర్జునుడు కూడ వెంటనే వెనుదిరిగి శత్రువులను ఎదుర్కొనకుండ ఉండజాలడు. అందువలన తాత్కాలికమైన కృపావేశముతో, "నేను యుద్ధము చేయను" (న యోత్స్యే) అని అతడు గావించిన వ్యవసాయము, అనగా నిశ్చయము, పది నిమిషములు కూడ నిలువదు. కావున ఆ నిశ్చయము మిథ్య ; అతడు శూరాగ్రేసరు డనుట సత్యము. ఈ పద్ధతియందు అతడు యుద్ధమును త్యజించుట భిక్షావృత్తిని స్వీకరించుట జరుగనే జరుగదు. అట్టియెడల దుర్బలమైన యీచిత్తవృత్తి ఇతరులకు తెలియకముందే స్వధర్మమును అవలంబించి అతడు యుద్ధమునకు పూనుట మేలు.

అయినను శ్రీకృష్ణుడు నియంతవలె, "నేను చెప్పినట్లు వినకున్నచో నీవు వినాశము నొందుదువు" అని శపించుచున్నట్లు శాసించుచు అర్జునుని స్వాతంత్ర్యమును అణగద్రొక్కవచ్చునా ? ఆయన అర్జునుని అట్లు బెదిరించుట యుక్తమే. "నేను నీకు శిష్యుడను ప్రపన్నుడనైన నన్ను శాసింపుము" అని అర్జునుడు ఆయనను శరణుపొందెను. శరణాగతునకు ప్రీతిని కలిగించుటకంటె హితమును కఠినముగా నైన బోధించుటయే సత్పురుషులకు కర్తవ్యము. సమాజములోని యక్రమములను దౌర్జన్యములను నిర్మూలించి మానవసేవ చెయవలయు నను ఆవేశముతో ఒకానొక విద్యార్థి

విద్యాభ్యాసమును మానుకొని విప్లవకారులలోనో సన్యాసులసంఘములోనో చేరుటకు నిశ్చయించి గురువు నొద్దకు వచ్చి సలహాను అడిగినచో ఆయన ఏమి చెప్పవలె? ఎవడైనను విద్యార్థి దశలో విద్యాభ్యాసమును వీడినచో వాడు జీవితములో విద్యను సంపాదించి విజ్ఞానశాలి యగుట దుర్ఘటము. నాలుగేండ్లో అయిదేండ్లో దీక్షవహించి ఏకాగ్రతతో విద్యనభ్యసించి విజ్ఞానశాలియై పక్వమైన బుద్ధితో ఎవడైనను ఏ యుద్యమమునందు ప్రవేశించినను అతడు అనుకొన్నదానిని ఉత్తమస్థాయిలో సాదింప గలగినట్లు అపక్వమైన బుద్ధితో సాధింపలేడు. అందువలన శిష్యుని హితమును కోరిన గురువు కఠినముగానైన మందలించి విద్యాభ్యాసమునకు భంగకరమైన యతని ప్రవృత్తిని నివారింపవలె. ఒకానొకడు దారి తెలియక ముండ్లపొదలవైపు పోవుచున్నచో, దారి తెలిసిన యేబాటసారియైన వానిపై వస్త్రమును పట్టి లాగియైనను వెనుకకు మరలింపవలె గదా ! అట్టియెడల ప్రియుడు, శిష్యుడను అయిన యర్జునుని విషయమున శ్రీకృష్ణుడు కఠినముగ మందలించుట సహజమే, కాని అయుక్తము కాదు.

# గీత

అయినను అర్జునునకు మనస్సునందు న్యూనతవలన క్లేశము (discomfort due to inferiority) కలుగకుండుటకై ఆయన వెంటనే ఇట్లనెను ఈవిధముగా నీకు అత్యంతము రహస్యమైన జ్ఞానమును బోధించితిని. దీనిని సర్వము నీవు విమర్శించుకొని నీ యిచ్ఛ ఎట్లుండునో అట్లే చేయుము. కాని నేను మరల చెప్పుచున్న అత్యంతము రహస్యమైన తుది మాటను వినుము నీవు నాకు మిగుల ప్రియుడవగుటచే హితమును చెప్పుచున్నాను".

శ్లో|| ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాత్ గుహ్యాతరం మయా |
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు || 63

శ్లో|| సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః |
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్ || 64

పర్వ - అధ్యాయ 42

ఆయన ఆతుదిమాటను ఇట్లు చెప్పినాడు. "మనస్సును నాయందు నిలుపుము నాకు భక్తుడవగుము నన్ను గూర్చి యజ్ఞమును చేయుము. నాకు నమస్కరింపుము ప్రియుడ వగుటచే నీకు ప్రతినచేసి, చెప్పుచున్నాను ఇది సత్యము. నీవు నన్నే పొందగలవు. సకల ధర్మములను పరిత్యజించి నన్ను ఒక్కనినే శరణము పొందుము నిన్ను సర్వపాపముల నుండి నేను ముక్తుడను గావింపగలను దుఃఖింపకుము"

శ్లో|| మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు |
మా మే వైష్యసిసత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే || 65

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ 66

భీష్మపర్వము - అధ్యాయ - 42

# విజయప్రభ

శరణమును పొందుటయొక్క పద్ధతియే "మన్మనా భవ" అని మొదలగుచున్న శ్లోకమునందు (శ్లో 65) వివరింపబడినది "సకల ధర్మములను పరిత్యజించి" (సర్వధర్మాన్ పరిత్యజ్య) అని అన్నప్పుడు భగవంతుని శరణము పొందుట అను ఒక్క ధర్మము తప్ప తక్కిన ధర్మములను అన్నింటిని విడిచిపెట్టవలయు ననుట స్పష్టము అట్లయినచో అర్జునునకు స్వధర్మమైన యుద్ధము కూడ త్యజింప దగినదే అగును కావున అర్జునుడు శ్రీకృష్ణునిశరణము పొంది మహాభక్తుడై యుద్ధమును వదలి అడవులకు పోయినచో శ్రీకృష్ణుడు ఇప్పుడు చేసిన ప్రతిజ్ఞ ప్రకారము స్వధర్మత్యాగమువలన కలుగుపాపమునుండి రక్షింపవలె. అట్టియెడల ఆయన ఉపదేశముయొక్క ఆరంబము నుండి, "క్షత్రియుడ వగు నీకు యుద్ధము స్వధర్మము, కావున యుద్ధము చేయుము , స్వదర్మమున మరణమును పొందినను మేలే యగును స్వధర్మానుష్ఠానమున సిద్ధి కలుగును" అని అనేక పర్యాయములు ఏల బోధించెను ? ఇది పూర్వాపరవిరోదము కాదా?

సామాన్యము అని విశేషము అని ధర్మములు రెండు విధములు. పితృవాక్యపాలనము, గురుసేవ, పతిభక్తి మొదలుగా ధర్మార్థకామములకు సంబంధించిన కుటుంబ సమాజధర్మము లన్నియు సామాన్యములు. సన్న్యాసము, పరమేశ్వర శరణాగతి విశేష ధర్మములు. విశేష ధర్మములను అవలంబించిన వాడు సామాన్య దర్మములకు అతీతు డగును. శాస్త్రవిధి ననుసరించి సన్న్యసించిన యతికి గృహస్థు డైన తండ్రి, గురువు కూడ నమస్కరించు ననుట సుప్రసిద్ధము. సామాన్య ధర్మములకు యతి ఎట్లు అతీతు డగుచున్నాడో అట్లే శరణాగతుడు కూడ సకలధర్మములకు అతీతు డగునని ఇక్కడ భగవంతుడు చెప్పుచున్నాడు. కమండలుకాషాయవస్త్ర ధారణాదులచేత సన్న్యాసి సాంసారిక సామాజికదర్మములకు అతీతుడుగా జనులచే సులభముగా గుర్తింపబడుచున్నాడు. శరణాగతధర్మమును అవలంబించివానిని అట్లు గుర్తించుట సులభము కాదు. ఆ ధర్మమును బహిరంగ లక్షణములంచేత నిశ్చయించుటకు వీలు లేదు. కాని సౌశీల్యమూ భూతదయ మొదలగు లక్షణములచేత అట్టివారిని కొంతవఱకు గుర్తింపవచ్చు.

"విష్ణువును భజింప వద్దు" అని తండ్రి చెప్పుచున్న మాటను పాటింపక ప్రహ్లాదుడు విష్ణుదేవునే నిరంతరము స్మరించుచుండెను. అన్నచే పరిత్యజింపబడిన విభీషణుడు లంకను భార్యాపుత్రాదులను త్యజించి శ్రీరాముడుగా అవతరించిన విష్ణుదేవుని శరణము పొందెను శ్రీకృష్ణుని భజించుచు మీరాబాయి భర్తను బంధువులను త్యజించెను వీరు ధర్మములను త్యజించినను జనులు వీరిని మహాభాక్తులనుగా మహాత్ములనుగా పూజించుచునే యున్నారు. కాని ధర్మత్యాగమువలన సమకాలమునందు వీరు పొందిన తిరస్కృతి, నింద, అవమానము దండనము సామాన్యములు కావు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని వధించుటకు ఎన్నో ప్రయత్నములను కావించెను అయినను ప్రహ్లాదుడు తండ్రిని నిందింపలేదు , బంధువులను శరణుకోర లేదు ; పారిపోవుటకు ప్రయత్నింపలేదు. "నీవు లంకలో కన్పించినచో నిన్ను సంహరింతును , పొమ్మ" అని రావణుడు శాసించినప్పుడు, విభీషణుడు, అన్నను నిందింపక, "అన్నా ! నీకు హితమును చెప్పితిని. నీవు వినలేదు. ఇంక నీయిష్టము. నీకు స్వస్తి అగును గాక ! నేను పోవుచున్నాను" అని ప్రశాంతముగనే లంకను వదలివచ్చెను. మీరాబాయిని కూడ ఆనాడు భర్త బంధువులు సమాజములో అనేకులు అనేకవిధములుగా తిరస్కరించి నిందించి అవమానించి యుందురు. అయినను ఆమె వారిని తిరస్కరింపలేదు, నిందింప లేదు. ఇట్లు వీరు దూషణ భూషణములకు మానావమానములకు సుఖదుఃఖములకు వికృతి నొందక, శరీరాభిమాన రహితులై స్థితప్రజ్ఞులుగా త్రిగుణాతీతులుగా వర్తించుచుండి రనుట స్పష్టము. స్థితప్రజ్ఞులైన వీరు భగవంతునే శరణము పొందినప్పుడు ఆయన వీరు గావించిన ధర్మత్యాగమువలన కలుగు పాపములనుండి వీరిని ముక్తులను గావించెను.

మఱి ఇట్టి శరణాగతధర్మమును అవలంబించుటకు అర్జునుడు అర్హుడై యున్నాడా? అతడు కర్మ యోగమునందు కూడ ఇంకను ప్రవేశింపలేదు. అతడు అహంకార మమకారములతో, "భీష్మద్రోణాదులను నేను చంపుచున్నాను. వీ రందఱు నావారు, నాకు పూజ్యులు వీరిని సంహరించిన తరువాత కలుగు దుఃఖము దుర్భరము, కావున యుద్ధమును విరమించుకొని భిక్షావృత్తితోనైన జీవింతును" అని తలంచుచు శోకముచే పీడింపబడుచున్నాడు. ఇట్టివాడు ప్రహ్లాదాదులవలె శరణాగతధర్మమునకు అర్హుడు కాడు. ఫలములను భగవంతునకు అర్పించుచు స్వధర్మమును అనుష్ఠించుచు చిత్తశుద్ధిని పొందుటయే ఇట్టివానికి కర్తవ్యము.

మఱి ఇట్టివానికి భగవానుడు శరణాగతదర్మమును గూర్చి చెప్పుట ఎందులకు? యుద్ధము స్వదర్మమే అయినను దానివలన మహాపాపము కలుగు నని అర్జునుడు భ్రమించి దుఃఖించుచున్నాడు. ఆదుఃఖమును పోగొట్టి ధైర్యమును స్వధర్మనిష్ఠను కలిగించుటకై భగవానుడు ఇట్లు చెప్పినాడు. కర్మయోగమునందు విశ్వాసమును కలిగించుటకే, "యుద్ధము దర్మమో కాదో, ఆవిచారమును వదలుము ; యుద్ధము నీకు స్వధర్మము కావున దానిని నిర్వహింపుము , నన్ను శరణమును పొందుము. నీవు

యుద్ధమువలన ఏ యే పాపములు కలుగు నని శంకించుచున్నావో ఆపాపములు ఏవియు నిన్ను అంటకుండ నేను రక్షింతును. కావున ఫలాపేక్షలేకుండు యుద్ధము చేయుము" అను పద్ధతియందు ఆయన బోధించుచున్నాడు

# గీత

ఇచ్చట "సర్వధర్మములను పరిత్యజించి" అనగా మనస్సునందే కర్మపలమును కర్మాచరణమును, అందులకు మూలమైన ధర్మాదర్మములను గూర్చిన విచారణమును పరిత్యజించుట యనియే యర్థము. అసలు ధర్మాచరణమునే పరిత్యజించుట కాదు ఈ విషయమును బగవంతుడు ముందే స్పష్టమొనర్చి యున్నాడు "నన్ను ఆశ్రయించిన వాడు సర్వకర్మములను సర్వదా చేయుచున్న వాడయ్యును నా ప్రసాదమువలన శాశ్వతమైన పదమును పొందుచున్నాడు. మనస్సుచేత సర్వకర్మలను నాయందు సన్న్యసించి మత్పరుడవై బుద్ధియోగమును అవలంబించి నాయందే చిత్తము కలవాడ వగుము"

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥ 56

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ । 57

- అధ్యా॥ 42

# విజయప్రభ

ఈసందర్భమున సర్వకర్మ సన్న్యాసము పరివ్రాజకులకే విహితము కాని యితరులకు కా దని స్పష్టముగా గ్రహింప వలసియున్నది. స్థితప్రజ్ఞులై శరణాగత ధర్మమును అవలంబించిన ప్రహ్లాదాదులు కూడ సర్వకర్మ సన్న్యాసము కావింపలేదు. ప్రహ్లాదుడు గృహస్థుడై రాజ్యపాలనము కావించినాడు. విబీషణుడు కూడ రాజ్యపాలనము కావించెను మీరాబాయి కుటుంబమును వీడినను సన్న్యసింపలేదు వీ రందఱును శరణాగతి ధర్మమునకు ప్రతికూలముగా నున్న సాంసారికదర్మములను మాత్రమే పరిత్యజించిరి, కాని సర్వకర్మ సన్న్యాసమును గావింపలేదు. కావున క్షత్రియులు మొదలగు వారు స్థితప్రజ్ఞ లైనను శరణాగతిధర్మనిష్ఠు లైనను ప్రహ్లాద విబీషణాంబరీషాదులవలె వర్ణాశ్రమదర్మములను పాలించుచు నుండవలసినదే కాని పరివ్రాజకు లగుట తగ దని గ్రహింప వలసియున్నది

# గీత

భగవంతుడు సంవాదమును ముగించి యిట్లనెను. "అర్జునా ! మన యీ సంవాదమును భక్తుడు కానివానికి, శుశ్రూష చేయనివానికి, నాయందు అసూయకలవానికి ఎప్పుడును చెప్పరాదు. పరమమైన యీ రహస్యమును నాయందలి భక్త్యతిశయముతో నా భక్తులకు బోధించువాడు నన్నే పొందగలడు. సంశయము లేదు. అంతకంటెను నాకు ప్రియతరుడు మఱియొక డుండుడు. ధర్మసమ్మతమైన యీ సంవాదమును అధ్యయనము చేయుట జ్ఞానయజ్ఞ మగును. ఈ యజ్ఞమును చేయువాడు నాకు ఇష్టుడగును. అసూయలేనివాడై శ్రద్ధాళువై దీనిని వినువాడు పాపముక్తుడై పుణ్య కర్మలు చేసినవారికి కలుగులోకములను పొందును. అర్జునా ! నీవు ఏకాగ్రమైన మనస్సుతో దీనిని వింటివా ? అజ్ఞానమువలన నీకు గలిగిన సమ్మోహము నశించినదా?"

అర్జునుడు ఇట్లనెను. "అచ్యుతా ! నీయనుగ్రహమువలన నామోహము నశించినది. స్మృతి కలిగినది. సంశయము పోయినది. నీవు చెప్పినట్లు చేయుదును".

# విజయప్రభ

అసూయకలవానికి ఈ జ్ఞానమును బోధింపవలదని భగవంతు డనుట గమనింపదగియున్నది. ఇందు సకల ధర్మములను వీడి తన్ను శరణమును పొందు మని భగవంతుడు చెప్పుచున్నాడు. ఈ మాటను దుర్యోధనునివంటివారు ఎవరైన విన్నచో, శ్రీకృష్ణుడు స్వార్థపరుడై తనభక్తులసంఖ్యను పెంచుకొనుటకై మాయమాటలను చెప్పి జనులను మోసగించుచున్నాడనియే భావింతురు, ప్రచారము కూడ చేయుదురు. దీనివలన సామాన్యులైన భక్తులు సంశయగ్రస్తు లగుటు సంభవించును. ఈ కారణముచేతనే ఈయుపదేశము పరమగుహ్య మని అత్యంతము రహస్య మని భగవానుడు అనేక పర్యాయములు ఉద్ఘాటించియున్నాడు.

ఈ సంవాదమును అధ్యయనము చేయుట జ్ఞానయజ్ఞ మని భగవానుడు నిర్దేశించుట గుర్తింపవలసియున్నది. ఏకాంతమునందు జరిగిన యీసంవాదము సంజయునివలన వ్యాసభగవానునివలన లోకమున ప్రచారము నొందు నని ఆయన సూచించుచున్నాడు. దీనిని అధ్యయనము చెయుట అనగా నియమపూర్వకముగా గురువునొద్ద చిత్తశుద్ధితో శ్రవణము చేయుట. అట్లుగాక సొంతముగా చదువుకొన్నను, సభలలో పండితులయుపన్యాసములవలన గ్రహించుటకు యత్నించినను అది అధ్యయనము కానేరదు ; అందువలన అది జ్ఞానయజ్ఞము కాదు. కావున నియమపూర్వకముగా అధ్యయనము గావించినప్పుడే అది జ్ఞానయజ్ఞమై ఫలప్రద మగును, లేకున్నచో అది లోకవిజ్ఞానమాత్రమే యగును.

దీనిని శ్రద్ధగా అధ్యయనము చేసినవాడు ఏకారణముచేత నైన మోక్షమును పొందలేకపోయినచో స్వర్గాదిలోకములనైన పొందగలడు. కావున సోమయాగాదులన చేయుట ఎంతో దుర్ఘటమైన యీకాలమున ఈశ్వరానుగ్రహమును కోరినవారు ఈ గ్రంధమును అధ్యయనము కావించుట చాల మేలని గ్రహింపవలసియున్నది.

అర్జునునకు సమ్మోహము పోయి స్మృతి లబించిన దనగా ఏమి యర్థము ' పూర్వము తెలిసియున్న విషయమును జ్ఞప్తికి తెచ్చుకొనుట స్మృతి. ఇప్పుడే విన్న విషయము ఇప్పుడే స్మృతి యగునా ? సంవాదముయొక్క ఆరంభమున భగవానుడ స్థిత ప్రజ్ఞలక్షణములను వర్ణించుచు జ్ఞానమార్గమును ఉపదేశించెను తరువాత ఎన్నో విషయములను ఆయన బోధించెను ఇప్పుడు ముగింపునందు మొదట బోధించి జ్ఞానవిషయము స్మృతికి వచ్చిన దని అర్జునుడ చెప్పె నని గ్రహింపవచ్చును. మఱి యొ విధముగ కూడ దీనిని గ్రహింపవచ్చును. యుద్ధరంగమునకు వచ్చునప్పుడ సంగ్రామము తనకు స్వధర్మమని అర్జునునకు రూఢిగా తెలిసియుండెను అయినన కృపయొక్క ఆవేశమువలన కలిగిన సమ్మోహనమువలన అది విస్మృత మయ్యెన ఇప్పుడు ఆసమ్మోహము నశించుటవలన విస్మృతమైన స్వధర్మము స్మృతికి వచ్చెన

ఈ సంవాదమును చెప్పి సంజయుడు ధృతరాష్ట్రునితో ఇట్లనెను. "మహారాజా వ్యాసునియనుగ్రహము వలన పరమరహస్యమైన యీ యోగమును యోగేశ్వరుడై శ్రీకృష్ణుడు చెప్పుచుండగా స్వయముగా వింటిని. దీనిని స్మరించి స్మరించి మాటిమాటి హర్షమును పొందుచున్నాను. అద్భుతమైన యా విష్ణుదేవుని రూపమును కూడ స్మరిం స్మరించి మిగుల విస్మయమును పొందుచు మరల మరల హర్షమును పొందుచున్నాన యోగేశ్వరుడైన కృష్ణుడు, ధనుర్ధరుడైన పార్థుడు ఎక్కడ ఉందురో అక్కడ నిశ్చితమా నీతి, విజయము, సంపద, శోభ కలుగు నని నాయభిప్రాయము"

ఇది యంతయు విన్న ధృతరాష్ట్రుడు ఆలోచించుచు ఊరకుండెన విశ్వరూపప్రదర్శనమున దుర్యోధనాదులు నశింతు రని పాండవులకు జయము తః దని వినియుండియు, భీష్ముడు శరతల్పమున పడిపోయె నని తెలిసికొనియుండియ అతడు పశ్చాత్తాపమును పొందలేదు , జయమునందలి యాశను కూడ వీడలేద దీనినిబట్టి యతనికి గల సమ్మోహము ఎంత దృఢమైనచో వ్యక్త మగుచున్నది.



# ఇతర గ్రంథములు

## ముద్రితములు

నాటకములు · భువన విజయము, ఎఱ్ఱాప్రెగ్గడ, నన్నయ్యభట్టు

కథల సంపుటి · కథాతరంగిణి

శ్రీరామాయణ తరంగిణి - ఏడు భాగములు

శ్రీ రామాయణ దర్శనము, శ్రీరామహృదయము . . మొదలైనవి

శ్రీవాసుదేవ కథాసుధ - I శ్రీవ్యాసకాండాది చతుష్టయము

శ్రీ వాసుదేవ కథాసుధ - II మథురా ద్వారకా కాండములు

శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై (606 603) ప్రకాశనములు

1 శ్రీ రమణ జీవిత స్మరణోపదేశములు
2 శ్రీ భగవద్గీతాసారము
3 పరాపూజ - ఆత్మబోధము
4 శివానందలహర్యాది గ్రంథసంగ్రహములు
5 ఆత్మసాక్షాత్కారము
6 దేవికాలోత్తరము
7. శ్రీత్రిపురారహస్యజ్ఞానఖండసారము
8. శ్రీరమణ కథామణిమాల

## అముద్రితములు

శ్రీ వాసుదేవ కథాసుధ - చతుర్థ భాగము

నాటకములు - తిక్కన సోమయాజి, శ్రీనాథుడు, జనాటవిలో జవరాలు

ఝాన్సీ లక్ష్మీదేవి - 18 సర్గల గేయ కావ్యము

నాయకోదయము - స్వాతంత్ర్యోద్యమ సంఘటనాత్మకమైన పద్యకావ్యము

నలచరిత్రము - చంపూ కావ్యము

శ్రీరామాయణము - చంపూ కావ్యము



# శ్రీ వాసుదేవ కథాసుధ

మూడవ భాగము - ఉద్యోగ శ్రీ భగవద్గీతా కాండములు

రచయిత : పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

జననము · 13-10-1924

## విద్యాభ్యాసము

| | | |
|---|---|---|
| 1934-40 | | పురపాలకోన్నత పాఠశాల, నర్సరావుపేట |
| అధ్యాపకులు | : | శ్రీలంక సీతారామశాస్త్రి గారు, శ్రీనాయని సుబ్బారావు గారు |
| 1940-42 | . | ఇంటర్మీడియట్ - ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు |
| 1942-45 | · | బి.ఏ ఆనర్సు - ఆంధ్ర విశ్వవిద్యాలయము, గుంటూరు. |
| అధ్యాపకులు | : | శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారు, శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రి గారు, శ్రీ గంటిజోగి సోమయాజులు గారు, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు, శ్రీ గొర్తి వేంకటరావు గారు |

1945 వేసవిలో సంస్కృత వ్యాకరణము - బెజవాడ

| | | |
|---|---|---|
| అధ్యాపకులు | | కింకవీంద్రఘటాపంచానన, శతవాధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు |
| 1945-47 | . | సంస్కృత వ్యాకరణము, అలంకార శాస్త్రము |
| అధ్యాపకులు | . | శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి గారు, బందరు. |
| 1943-50 | · | తత్త్వజ్ఞసేవ - పరమహంస పరివ్రాజకాచార్యవర్య, శ్రీశ్రీశ్రీ విమలానంద భారతీస్వామివారు, ప్రథమ పీఠాధిపతులు, శ్రీ సిద్ధేశ్వరీ పీఠము, కుర్తాళము. |
| 1955-59 | · | ప్రస్థానత్రయభాష్యాధ్యయనము |
| అధ్యాపకులు | : | శ్రీ చావలి లక్ష్మీకాంత శాస్త్రి గారు, నెల్లూరు. |

## అధ్యాపనము

| | | |
|---|---|---|
| 1985-90 | : | ప్రస్థానత్రయభాష్యప్రవచనము<br>శ్రీ చతుర్వేదుల రామచంద్రయ్యగారి గీతామందిరమున, నెల్లూరు. |
| 1992-94 | : | శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు, పరమహంస పరివ్రాజకాచార్యవర్య, శ్రీశ్రీశ్రీ శివచిదానందభారతీ స్వామి వారి సన్నిధియందు భాష్యప్రవచనము - కుర్తాళము, తిరునెల్వేలి జిల్లా. |
| 1945-47 | : | హిందూ కాలేజి, బందరు. |
| 1947-84 | · | నెల్లూరు వేంకటగిరి రాజ కళాశాల, ఆంధ్రసంస్కృత భాషాధ్యాపనము |
| 1961-84 | | ప్రాచ్యభాషావిభాగాధిపత్యము - Head of the Department of Oriental Languages, V.R. College, Nellore. |